శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

శ్రీమతే రామానుజాయ నమః



విద్వత్తల్లజులు, ఉ.వే. శ్రీమాన్ శాంతలూరి జయజయరామానుజాచార్యస్వామివారు
అనుగ్రహించిన

# శ్రీగోపికాగీతావ్యాఖ్యానము

- ఆంధ్రానువాద సహితము

అనువక్త - శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు

ప్రచురణము :

శ్రీవేంకటాచార్య వైదిక సంస్థాన్, 11-203, ప్రహ్లాదపురం

విశాఖపట్నం - 27, ఫోన్ : 0891-2708605

**శ్రీగోపికాగీతావ్యాఖ్యానము** - ఆంధ్రానువాద సహితము

వ్యాఖ్యాత - ఉ.వే. శ్రీమాన్ శాంతలూరి జయజయ రామానుజాచార్య స్వామివారు

అనువక్త - శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు

ప్రథమ ముద్రణము : అక్టోబరు, 2010

ఆవిష్కరణ సందర్భము : ఉభయవేదాంత పండిత సభలు

వేదిక : టి.టి.డి. కల్యాణ మండపము, ఎం.వి.పి. కాలనీ విశాఖపట్టణం.

ప్రతులు : 500

వెల : రూ. 125/-



ఈ పవిత్ర గ్రంథం భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠురాలైన
శ్రీమతి చెలికాని రాజ్యలక్ష్మి గారు, వారి కుమార్తె శ్రీమతి అవనిజగారు
భక్తిశ్రద్ధలతో సమర్పించిన ద్రవ్యంతో ముద్రింపబడింది.

ప్రతులకు : శ్రీవేంకటాచార్య వైదిక సంస్థాన్,
11-203, ప్రహ్లాదపురం, విశాఖపట్నం - 27,
ఫోన్ : 0891-2708605

డి.టి.పి. : శ్రీమతి జయలక్ష్మి, శ్రీ చంద్రశేఖర్

ముద్రణ : సి.యన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి

**మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, శాస్త్రరత్నాకర**
**డా॥ ఉ.వే. శ్రీమాన్ శ్రీ న.చ. రఘునాథాచార్యస్వామివారు**
**అధ్యక్షులు, సత్సంప్రదాయ పరిరక్షణ సభ,**
**16-4-523, శివనగర్, వరంగల్.**

# పిబత భాగవతం రసమ్

భాగవతగోష్ఠికి ఇదే దాసుని విజ్ఞప్తి. ఇపుడే **"భాగవతం రసం పిబత"** అనే సూక్తి సార్థకమైనది. ఎందుకంటే **"విద్యావతాం భాగవతే పరీక్షా"** అన్నట్లు సంస్కృతభాగవతము మహావిద్వాంసులకుగూడా వైదుష్యపరీక్షా నికషోపలము. దానిని అధ్యయనంచేసి అర్థము నవగాహనం చేసుకొనగలిగినవాడే పండితుడుగా పరిగణింపబడే వాడట. సామాన్యసంస్కృతసాహిత్యవేత్తలకు అది నిజంగానే కొఱకరాని కొయ్య. కాఠిన్యం భాషలోనేకాక, తత్త్వార్థనిరూపణంలోనూ రసాస్వాదులకు పైకి సాగకుండా అడ్డుపడుతుంది. కనుకనే ఎన్నో వ్యాఖ్యానాలవతరించటం పూర్వమే జరిగినా, అన్వితార్థప్రకాశిక లాంటి అర్వాచీనవ్యాఖ్యానాలుగూడా దానిపై అవతరింపక తప్పలేదు. అంత కఠినమైనా దానిని విడిచిపెట్టలేము. విడువబోము. కారణం! అది ఆనందమయపరబ్రహ్మ ప్రతిపాదకమైన, భక్తిరస ఘనమైన, అమృతప్రదమైన అమృత పూర్ణపాత్రం గనుక.

ఉత్తరభారతంలోను, దక్షిణభారతంలోను భాగవత సప్తాహప్రవచనాలు వందలకొలది వేలకొలది జరుగు తుంటవి. అవి భక్తిరసపిపాసువులకు చలివేంద్రాలు. మా మిత్రులు శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్యులవారివలె భాగవతామృతవర్షివంటి బిరుదాంచితులైన మహాప్రవక్తలు ప్రవచనం చేస్తూ, వేలసంఖ్యలో శ్రోతలను ఉర్రూతలూగి స్తుంటారు. కనుక ఆ మహాపురాణం సామాన్యులకు శ్రవణార్హమే తప్ప స్వయంగా అధ్యయనార్హం కాలేదు. అందలి సంస్కృతభాష వైదికభాషాచ్ఛాయలో సాగినది గదా! ఇక ప్రాచీన వ్యాఖ్యానములున్నా అవన్నీ శాస్త్రార్థగర్భితములే.

శ్రీవైష్ణవసంప్రదాయానికి చెందిన ప్రాచీనాచార్యులైన శ్రీపరాశరభట్టర్ - నంబిళ్ళై - నంజీయర్ - పెరియ వాచ్చాన్‌బిళ్ళైవంటివారు ఎవరున్నూ సమగ్రంగాకాని, తనిశ్లోకివలె కొంత కొంత భాగానికిగాని ఏల వ్యాఖ్యలు ప్రసాదించి యుండలేదో తెలియదు. శ్రుతప్రకాశికాచార్యులనే శ్రీసుదర్శనభట్టరువారు శుకపక్షీయమనే పేరుతో భాగవతంలోని దశమస్కంధానికిమాత్రం వ్యాఖ్యను వ్రాసినారని తెలుస్తున్నది. ఆ వ్యాఖ్య తత్కర్తృకమేనన్నది అనిశ్చితమేగాని, సర్వసమ్మతం కాదు. వీరరాఘవీయవ్యాఖ్యానంమాత్రం అత్యన్తార్వాచీనమనేది నిర్వివాదాంశము. తన పద్యాలలో మందారమకరందాలను, పరిపక్వమాకందఫలరసాలను ఒలికించే పోతనామాత్యుడు తన ఆన్ధ్రమహాభాగవతరచనను లలితమధురమైన భాషలో సాగించినాడని, తత్రాపి - అద్వైతసిద్ధాన్తచ్ఛాయలోగాక విశిష్టాద్వైతసిద్ధాన్తధోరణినే స్పష్టముగా అవలంబించినాడని వివరంగా మా ఆన్ధ్రభాగవతవ్యాసావళిలో తెలిపి యున్నాము.

శ్రీరామాయణంలో సుందరకాండవలె, భారతంలో భగవద్గీతవలె, భాగవతంలోనూ గోపికాగీతలు, శ్రుతిగీతలు మొదలైన ఘట్టములు ప్రాధాన్యమును పొందియున్నవి. శ్రుతిగీతలకంటేగూడా గోపికాగీతాలకు శ్రీవైష్ణవగోష్ఠిలో ప్రాచుర్యం ఏర్పడింది. మార్గళి అనబడే ధనుర్మాసోత్సవం నెలరోజులలోను శ్రీవైష్ణవగృహాలలో మన ఆన్ధ్రప్రదేశము నందు శ్రీఆండాళమ్మవారి దివ్యప్రబన్ధంతోబాటు ఈ సంస్కృతగోపికా గీతలను, పోతనగారి ఆన్ధ్రగోపికాగీతలను ప్రాతఃకాలంలో అనుసంధించేవారు. ఇది భక్తమహాజనగోష్ఠులలో గోపికాగీతలకు వచ్చిన

ప్రాచుర్యాతిశయము. ఇకపైన ఇప్పటినుండి శ్రీవైష్ణవభక్తజనుల భవనాలలో ఈ గోపికాగీతలు మరింతగా నిరంతరప్రచారమును పొందగలనని మనం ఆశించవచ్చును. ఇది వాస్తవం - పరమవాస్తవం. ఇపుడు పాఠకుల చేతిలోనున్న ఈ సవ్యాఖ్యాన గోపికాగీతావతరణమే అస్మదాదుల ఆకాంక్షను సఫలం చేస్తున్నది.

దీనికి తమిళభాషలో ప్రామాణికవ్యాఖ్యను పెరియవాచ్చాన్పిళ్ళైస్వామివారి తనిశ్లోకివ్యాఖ్యానచ్ఛాయలో ప్రసాదించినవారు **మహావిద్వాంసులు శ్రీ ఉ.వే. శాంతలూరి జయజయ రామానుజాచార్యస్వామివారు.** ఈ వ్యాఖ్యానం బహుముఖంగాను, కూలంకషంగాను ప్రామాణికమధురతరసిద్ధాన్తార్థగర్భితంగాను సాగుటనుబట్టి వ్యాఖ్యానకర్తయగు స్వామివారు ఉభయవేదాన్తములలోను తలస్పర్శిపాండిత్యప్రతిభాసంపన్నులని సువ్యక్తమయినది. ఉపనిషదాదిసంస్కృతప్రమాణాలను, ఆళ్వారుల దివ్యసూక్తులను సమస్థాయిలో ఉదాహరిస్తూ భక్తిరసపరమార్థాన్ని భక్తుల హృదయాలలో ప్రవేశపెట్టిన రామానుజాచార్యవిద్వన్మణి ఆన్ధ్రప్రదేశంలో సుమారు 110 సంవత్సరాలకు పూర్వం అవతరించియుంటారని తెలుస్తున్నది. ఈ వ్యాఖ్యానగ్రంథం శ్రీవైష్ణవభక్తులు చేసుకున్న మహాభాగ్య పరిపాకమే అనుట నిర్వివాదాంశం.

ఇది తమిళభాషలో సాగిన వ్యాఖ్యానమా! మాకు అర్థం కాదే! అని పాఠకులు సంకోచించనవసరం లేదు. దాని క్రిందనే తేటతెనుగులో ఆన్ధ్రానువాదమున్నూ ప్రకటింపబడినది. తమిళసంప్రదాయాలను, ఆళ్వారుల దివ్యసూక్తులను సంపూర్ణముగా అవగాహించిన, ప్రతిభావంతులైన **శ్రీమాన్ ఈయుణ్ణి శింగరాచార్యులవారు** యథాతథంగా దీనిని అనువదించి మనకు అందిస్తున్నారు. ఇది మనకు అపేక్షితమైన పరిణామము. వివిధరుచులను ఆస్వాదించుటకు కావలసిన వస్తుసామగ్రి అంతా ఉన్నా, పాచకవ్యక్తి అసమర్థుడైతే పాకక్రియలో భోగ్యతను సంపాదించగల ప్రావీణ్యం కలవాడు కాకపోతే, అంతా నిష్ఫలమేగదా! ఆ ప్రావీణ్యం **భాగవతామృతవర్షియైన శ్రీమాన్ శాంతలూరు గోపాలకృష్ణమాచార్యస్వామివారిలో** నున్నది. స్వయంగావారు భాగవతప్రవచనకర్తయే గాక, వ్యాఖ్యానకర్తయైన రామానుజాచార్యులవారి శాంతలూరు వంశంలోనే అవతరించటం, స్వపితృపాదులస్మృతికై ఏర్పడిన శ్రీ వెంకటాచార్యవైదికసంస్థాన పక్షంలోనే దీనిని ప్రచురించటం. ఈ ఉభయవేదాన్తసభాగోష్ఠిలోనే దీనిని ఆవిష్కరించటం - ఇట్లా ఈ సంవిధానమంతా గోపాలకృష్ణచాతుర్యమే గదా!

ఇపుడిట్లు ఈ భాగవతరసాయనం గోపికాగీతలద్వారా అనుకూలసర్వవిధసంవిధానములతో సమకూరి నందులకు ఆన్ధ్రప్రాంతీయులైన రసపిపాసువులందరూ సానందముగా ఆస్వాదించవలసినదిగా ఆహ్వానిస్తున్నాము. స్వస్తి.

ఇట్లు,
భాగవత విధేయుడు
**శ్రీ న.చ. రఘునాథాచార్యః**
మహామహోపాధ్యాయుడు.

16-4-523, శివనగర్
వరంగల్-506002

ఉభయవేదాన్తవాచస్పతి,
ద్రావిడవేదవిశిష్టపండిత, పండితరత్న
**కె. వేంకటాచార్యస్వామివారు,**
ఎం.ఏ.,

స్థానాచార్య,
శ్రీఆదికేశవ ఎంబెరుమానార్‌స్వామివార్ల కోవెల,
నరసాపురం, ప.గో.జిల్లా
ఫోన్ : 08814-275311

---

స్వస్తి శ్రీ ర్దిశతాత్

కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్ ।
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్ ॥

# శ్రీగోపికా గీతములు - వాని భోగ్యత

భగవానుని స్వరూపరూపగుణాదుల నిరతిశయభోగ్యత్వం వేదోపబృంహణాలైన ఇతిహాసపురాణాలవల్ల తెలియదగినవి. **"ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్"** అనిగదా ప్రమాణం. వేదాలనే కల్పవృక్షం యొక్క మధురఫలం శ్రీభాగవతం. ఈ ఫలం శుకముఖమునుండి (శుకమహర్షిద్వారా) జాలువారింది. అమృతం కంటె భోగ్యమైనదీ రసం. ఈ రసాన్ని పానం చేయండి. ఇది వేదవ్యాసభగవానుని హితవచనం. శ్రీభాగవతంలోని దశమ - ఏకాదశ స్కంధాలలో శ్రీకృష్ణుని వైభవాన్ని తెలిపే ఘట్టాలు అనేకములు. వానిలో **"గోపికా గీతములు"** విశిష్టమైనవి.

సంసారమగ్నుడై, విషయలోలుడైయుండే చేతనుడు ఆకస్మిక భగవత్ కటాక్షానికి పాత్రుడై, పరమాత్మరూప గుణచేష్టితాల్ని అనుభవించే భాగ్యవంతుడగును. అంతమాత్రమేగాక, భగవంతుని క్షణమాత్రవిశ్లేషాన్నికూడా సహింపలేక **"హే భగవన్! నన్ను కటాక్షింపుము - నీ సంశ్లేషసుఖాన్ని ప్రసాదింపుము"** అని స్వామిని శరణు వేడును. అనన్యోపాయసాధ్యుడైన స్వామిని దర్శించుట - సేవ చేయుట - ఆనందించుట స్వామి అనుగ్రహంతో లభింపవలసినవిగదా! గోపికాగీతాలు ఈమర్మాన్నే తెలుపును. అదికూడ పరగత స్వీకారమైనపుడే. అనగా - స్వామి తనంతటతానే అనుగ్రహించినపుడు శ్లాఘ్యతమగును. సంసారమగ్నలైన గోపికలను తన రూపసౌందర్య సంభాషణాదులద్వారా ఆకర్షించినవాడు శ్రీకృష్ణభగవానుడు. వేణుగానంద్వారా గోపికలను తన దగ్గఱకు రప్పించుకొని, వారితో క్రీడించినవాడు భగవానుడు. పై భగవత్ సంశ్లేషఫలితంగా వారి ఆనందం ఉన్మస్తకమయినది. వెంటనే స్వామివారిని యథాపూర్వస్థితికి తెచ్చుటకై అంతర్ధానమైనాడు. అంతట గోపికలు శ్రీకృష్ణుడు తమకు జేసిన అనేకములైన ఉపకారములను స్మరించుచు **"రురుదుః సుస్వరాజన్! కృష్ణదర్శనలాలసాః"** అను రీతిలో స్వామి దర్శనానికై ఆక్రోశించిరి. వెంటనే **"తాసా మావిరభూత్ శౌరిః"** అన్నట్లు స్వామి పీతాంబరధారియై, సుమమాలా లంకృతుడై వారికి దర్శన మిచ్చినాడు. ఇట్టి గోపీభావనతోనే స్వామి నమ్మాళ్వార్లు, పెరియాళ్వార్లు శ్రీ ఆండాళ్ శ్రీసూక్తుల ననుగ్రహించుట ప్రసిద్ధవిషయం. శ్రీనమ్మాళ్వార్ - శ్రీఆండాళ్ దివ్యమంగళవిగ్రహాలే వారి గోపీభావనను తెలుపుతాయి.

పై కథాభాగమంతా వేదార్థగర్భితం. ఇచట శ్రీకృష్ణుడనగా నాచార్యుడు. స్వామి గీతాచార్యుడుగదా! పైగా రామానుజుడు (బలరాముని సోదరుడు) దయామయుడైన ఆచార్యుడు. (శ్రీకృష్ణుడు) వేణుస్వరమనే తిరుమంత్రంతో (అష్టాక్షరి), కలవరమైన ద్వయంతో గోపికలనే జీవులకు **"సర్వపాపేభ్యో మోక్షయిష్యామి"** అని అభయమిచ్చి, వారిని సంసారబంధంనుండి విముక్తి గావించును. ఇది ఏతత్ వ్యాఖ్యాతయొక్క సుందరసమన్వయం. ఇంతటి వైభవం గల "శ్రీగోపికాగీతము"లకు మణిప్రవాళపద్ధతిలో సువిశదసుందరవ్యాఖ్యానాన్ని **ఉభయవేదాన్త తల్లజులైన శ్రీమాన్ జయ జయ రామానుజాచార్యస్వామివారు** కృపజేశారు.

ప్రసన్నజనకూటస్థులైన స్వామి నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్మొళ్ళి దివ్యప్రబన్ధానికి సూక్తి మహిమార్ణవులైన నంబిళ్ళైగారు కృపజేసిన ఈడు వ్యాఖ్యానం ప్రశస్తమైనది. నంబిళ్ళైస్వామివారి కాలక్షేపశ్రీసూక్తులనే వారి శిష్యులైన వడక్కుతిరువీధిపిళ్ళైగారు ఈడు వ్యాఖ్యానంగా నవతరింపజేసినారు. పై వ్యాఖ్యానంలో తిరువాయ్మొళ్ళి వైభవంతోబాటు, ఆళ్వార్ల శ్రీసూక్తి వైభవాన్ని, అందలి మాధుర్యాన్ని తెలిపే మూడు శ్రియఃపతులు కూర్చబడ్డాయి (అవతారికలు). పై పద్ధతిలోనే వ్యాఖ్యాతలైన శ్రీరామానుజాచార్యస్వామివారు గోపికా గీతాలకు మూడు శ్రియఃపతులను గూర్చినారు. ఈ గీతాలు అవతరించుటకు భగవానుని కృషియే కారణమని తెలుపుచు, భక్తులను పరమాత్మ ఆకర్షించు ప్రకారాన్ని విశదీకరించారు. **"తన్నుడైయ దివ్యమంగళవిగ్రహ సౌందర్యత్తాలుమ్, వేణునినాదత్తాలుమ్ గోపగోపీజనంగళై తన్ వశమాక్కిక్కొణ్డాన్"** అని అనుగ్రహించారు. ఇది సాధ్యమా? అనే సందేహాన్ని తొలగించుచు, స్వామి ముఖారవిందసౌందర్యం, వేణుగానమాధుర్యం ఎంతటివారినైనా స్వామి పాదారవిన్దాలను ఆశ్రయింపజేస్తుందని **"మైయలేత్తి మయక్క ఉన్ ముకమ్ మాయ మన్దిరన్దాన్ కొలో!"** అను గోదాదేవి శ్రీసూక్తిని, **"ఊదు మత్తీఙ్గుళలుక్కే ఉయ్యేనాన్"** అను నమ్మాళ్వార్ల శ్రీసూక్తిని ఉదహరించినారు.

వేదాల నాదమనగా తిరుమంత్రమని (అర్థం). అది తదేకశేషత్వానికి సూచకమని వివరించారు. శ్రీకృష్ణుని వేణునాదశ్రవణమాత్రంచేతనే గోపికలు స్వామి సన్నిధికి చేరి తదేకప్రియలైనారుగదా! ఇట్లే **"జనాకలం వామదృశాం మనోహరమ్"** అనుచోట **"కలమ్"** అనగా ద్వయమంత్ర మనియు - **"కం లాతీతి కలః కలం సర్వేశ్వరనై గ్రహిక్కత్తక్క వత్తై ఎన్గపడి - సర్వేశ్వరనై గ్రహిక్కత్తక్కదు న్యాసవిద్యైయితే"** అని పరమరస్యంగా ననుగ్రహించారు. ఇక, పూతన - కాళియుడు - వర్షమారుతములు - మొదలగువానికి స్వాపదేశంగా ప్రకృతి - అహంకారం- క్రోధ లోభములు, ఇట్లే - వృషభ వ్యోమాసురులు అనగా - మదమాత్సర్యములని అనుగ్రహించుట పరమభోగ్యంగా నున్నది. **"విశ్వతో భయాత్ ఋషభ! వయం రక్షితా ముహుః"** (3 శ్లోకం) అను శ్లోకంలోని **"విశ్వతో భయాత్"** అనుదానికి అనుదానికి **"అసంఖ్యాతఙ్గళాన సప్తవ్యసనాది స్వరూపవిరోధిగళాన ప్రకృతివిషయఙ్గళై"** అనే స్వాపదేశాన్ని కూర్చుట మిక్కిలి మనోహరం. ఇంతియేగాక **"విశ్వతో భయాత్"** అనేదానికి **"ఉన్నుడైయ విగ్రహసౌన్దర్యత్తాలే వరుకిఱ భయత్తాలే నిన్నుమ్ రక్షిత్తాయ్"** అని కూర్చిరి. **"సౌన్దర్యమన్తరాయమ్"** అను పిళ్ళైలోకాచార్యస్వామివారి సూక్తి ప్రకారం ద్వయమంత్రంలో నుత్తరవాక్యంలో తెలుపబడిన భగవత్ కైంకర్యానికి స్వామి సౌందర్యంకూడ అంతరాయమే గదా!

ఈ వ్యాఖ్యలో విషయవివరణానికై సంస్కృతద్రావిడప్రమాణాలు పుంఖానుపుంఖములుగా కూర్చబడినవి. ఇది విశేషజ్ఞులను మిక్కిలి ఆకర్షించువిషయం గదా! **"అప్యహం జీవితం జహ్యామ్", "తే వయం భవతా రక్ష్యాః"**

మున్నగు శ్లోకరత్నాలను వివరించిన తీరు బహుమనోహరం. ఇట్లే, నారాయణపదవివరణసందర్భంగా చేసిన **"ఇన్ద అనుప్రవేశత్వమ్ శొన్నపోతే సర్వాత్మాక్కళైయుమ్ తనక్కు శరీరమాగక్కొణ్డు అవతరిక్కు ధారకనాయ్, పోషకనాయ్, భోగ్యనాయ్, స్వామియాయ్, నియన్తావాయ్, రక్షకనాయ్, శేషియాయ్, పితావాయ్, భర్తావాయ్ ఇరున్ద పడియై శొల్లిన్ఱాయ్ఱ్ఱు"** అను వివరణం హృదయ రంజకం. స్థాలీపులాకన్యాయంగా నీ వ్యాఖ్యలోని కొన్ని విశేషాల్ని ఉదహరించుట జరిగింది. శ్రీస్వామివారివ్యాఖ్య ఈడువ్యాఖ్యవలె ప్రమాణబహుళమై, పెరియజీయర్ వ్యాఖ్యవలె ప్రసాదమాధుర్య గుణములతో అలరారు చున్నది. ఆస్తికుల సౌభాగ్యవశంచేత నిట్టి పరమవిలక్షణవ్యాఖ్యలు అవతరిస్తాయి.

శ్రీభాగవతామృతవర్షి, సుధామయపేశల శ్రీసూక్తి నిధియగు ఉ.వే. శ్రీమాన్ శాంతలూరి గోపాలకృష్ణమా చార్య స్వామివారు తమ ప్రవచనాలద్వారా ఆస్తికులకు భాగవతామృతాన్ని పంచిపెట్టుచున్నారు. వీరు తమ పెదతండ్రిగారైన శ్రీమాన్ జయ జయ రామానుజాచార్యస్వామివారనుగ్రహించిన గోపికా గీతవ్యాఖ్యను ప్రకాశింపజేయుట ముదావహం. సంప్రదాయసాహితీవ్రతులు, వ్యాఖ్యాచతురులైన పండితరత్న, వేదాన్తవాచస్పతి, డా॥ ఉ.వే. శ్రీమాన్ ఇ.ఏ. శింగరాచార్యస్వామి పై వ్యాఖ్యకు ఆంధ్రీకర్తలగుట ఆస్తికుల భాగ్యవిశేషం. వీరిరువురి సన్నిధిలో సంప్రదాయ రసికులు కృతజ్ఞులు కాగలరని విశ్వసించుచున్నాను.

ఇట్లు, విజ్ఞాపయితా

నరసాపురం, భాగవత విధేయుడు

4-10-10 **కె. వేంకటాచార్యులు**

భాగవతామృతవర్షి
**ఉ.వే. శ్రీమాన్ సాతులూరు గోపాలకృష్ణమాచార్యస్వామివారు**
సౌమ్యకుటి, ప్రహ్లాదపురం, సింహాచలం

---

శ్రీలక్ష్మీహయవదనపరబ్రహ్మణే నమః    శ్రీమతే రామానుజాయ నమః    శ్రీసింహాద్రినాథాయ నమః

# మున్నుడి

శ్రీగోపికాగీతావ్యాఖ్యానకర్త ఉ.వే. శ్రీమాన్ **శాంతలూరు జయజయ రామానుజాచార్యస్వామివారు** మా పెదతండ్రిగారు. వీరు సుమారుగ **1897-98** సంవత్సరములమధ్య కోరుకొండ (తూ.గో. జిల్లా) గ్రామంలో జనించినారు. **1945**వ సంవత్సరములో పిన్నవయసుననే తిరునాడలంకరించిరి. వీరు ఆ నాటి ఉభయవేదాన్త పండితులలో ప్రసిద్దులగు శ్రీమాన్ కృష్ణమాచార్య, వెంకటమ్మ దంపతులకు జనించినారు. శ్రీకృష్ణమాచార్యస్వామి వారు ఉభయవేదాంతములను మాత్రమేకాక స్వశాఖయగు కృష్ణయజుర్వేదమునుకూడ అధికరించిన విద్వాంసులు. వారికి ఐదుగురు కుమారులు. ఐదుగురు ఉభయవేదాంతవిద్వాంసులే. ఈ గ్రన్థమును ప్రచురించిన శ్రీవేంకటాచార్యవైదికసంస్థాన్ ఆవిర్భామునకు స్ఫూర్తియగు మా జనకులు, ఆచార్యులు అయిన ఉ.వే. ప్ర. శ్రీమాన్ **శాంతలూరి వేంకటాచార్యస్వామివారు** ఆ ఐదుగురియందు చివరివారు. ఈ గ్రన్థకర్తయగు శ్రీమాన్ **జయజయ రామానుజాచార్యస్వామివారు** నాల్గవవారు. వీరు తమ తండ్రిగారివద్ద రహస్యగ్రన్థములను, ఆంధ్ర ద్రావిడసంస్కృతసాహిత్య గ్రన్థములను, రహస్యగ్రన్థములను అధికరించి, తమ పెద్దన్నగారు **"శ్రీవాల్మీకి హృదయాభిజ్ఞ** ఉ.వే. ప్రవర్తక శ్రీమాన్ **శాంతలూరి శోభనాద్రాచార్యస్వామివారి**వద్ద ద్రావిడవేదాంతమును, ఆనాడు ప్రసిద్ధ ఉభయవేదాంత విద్వాంసులుగా ఖ్యాతిగాంచిన ఉ.వే. ప్ర. శ్రీమాన్ **గొట్టుముక్కల వేంకటాచార్యస్వామివారి** వద్ద సంస్కృతవేదాంతమును అధికరించిరి. సంగీతసభలలో ప్రసిద్ధోపన్యాసకులుగ, పండితులుగ ఆనాడు ఖ్యాతిగాంచిన మహనీయులు.

ఆ కాలములో కాంచీపురములో వేంచేసి యుండిన మహావిద్వాంసులు **"మహామహోపాధ్యాయ", "పద్మవిభూషణాది"** బిరుదాంకృతులైన ఉ.వే. ప్ర. శ్రీమాన్ **ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు** **1944** స్వభానునామ సంవత్సరమున తూ.గో. జి. కోరుకొండ క్షేత్రమునందు జరిగిన ఉభయవేదాన్తపండిత సభలకు అధ్యక్షస్థానమును వహించుట జరిగినది. ఆ సందర్భములలో పండితసభలో శ్రీమాన్ **జయజయ రామానుజాచార్య స్వామివారి** మధురగానయుక్త ద్రావిడవేదాన్తోపన్యాసమును అచ్చెరువుతో విని పరమానంద భరితులై, శ్రీస్వామి వారి వైదుష్యమును తమ రామానుజ పత్రికలో ప్రకటించుచు, వీరిని **"ఆంధ్రదేశీయాழ்వార్"** అని ప్రస్తుతించిరి. (దీని ప్రతికృతి గ్రంథములో కూర్పబడినది) ఇదియే శ్రీస్వామివారి పాండిత్యమునకు నికషోపలము. శ్రీస్వామివారు గోపికాగీతములకు ద్రావిడభాషలో అత్యద్భుతమైన వ్యాఖ్యానమును అనుగ్రహించినారు. శ్రీవైష్ణవసంప్రదాయానుసారము దివ్యప్రబన్ధ వాసనావాసితాన్తఃకరణులగు శ్రీస్వామివారి స్వాపదేశపూర్వకమగు ఈ వ్యాఖ్యానమును తిలకించిన ఆనాటి పండితులలో ప్రసిద్దులగు **"ఉపన్యాసకేసరి", "సుబోధకసుధీమణి"**, ఉ.వే. శ్రీమాన్ కోయిల్ కందాడై శ్రీరంగాచార్య స్వామివారు ఇది వేఱొక తిరుప్పావై వ్యాఖ్యానమునువలెనున్నదని కీర్తించిరి. ఈ వ్యాఖ్యానగ్రన్థమును ప్రచురించ దలచి తెలుగువారికికూడ అందుబాటులో నుండునట్లుగ ఆంధ్రానువాదముతో ముద్రించదలచినది సంస్థానము.

ఎన్నో అపురూపములైన ద్రావిడగ్రన్థములను ఆంధ్రభాషలోనికి అనుగ్రహించుచూ, ఆంధ్రులను తరింప జేయుచున్న **"వ్యాఖ్యాన చక్రవర్తి"** అనబడదగిన విద్వాంసులు, ఉ.వే. ప్ర. శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామి ప్రార్థించినంతనే అనేకగ్రన్థ నిర్మాణ వ్యాపృతులైయున్నప్పటికీ, శ్రీస్వామివారు మా ప్రార్థనను అంగీకరించి శ్రమ కోర్చి ఈ గ్రన్థమును ఆంధ్రభాషలోనికి అనువదించిరి. కేవల అనువాదముమాత్రమేకాక, అందు వారొసంగిన ప్రమాణములకు ఆకరనిర్దేశమునుకూడ చాల శ్రమకోర్చి స్వామివారు నిర్వహించినారు. అంతమాత్రమే కాక ఈ గ్రన్థముద్రణమునుకూడ తిరుపతిలో తామే నిర్వహించిన స్వామివారికి **"తలైయల్లాల్ కైమ్మాఱిలేనే"** అనుట కంటే ఏమి చేయగలము? ఈ గ్రన్థమును తిలకించి తప్పక ప్రచురించాలని ఆదేశించి, మంగళాశాసనమును గ్రహించిన మా ఆచార్యులు. **"మహామహోపాధ్యాయ", "కవిశాబ్దిక కేసరి",** ఉ.వే. ప్ర. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్య **స్వామివారికి,** వారి అనుగ్రహమునకు శతసహస్రమోవాకములు. తమ అమూల్యమైన మంగళాశాసనము ననుగ్రహించిన **"ద్రావిడామ్నాయ కామధేనువు"** అనదగిన ఉ.వే. ప్ర. శ్రీమాన్ **కిడాంబి వేంకటాచార్యస్వామివారికి** అనేక స్వరూప ప్రయుక్త నమోవాకములు.

**"శ్రీ వేంకటాచార్యవైదికసంస్థాన్"** యొక్క ప్రధానమైన సభ్యులలో **శ్రీచెలికాని రాజ్యలక్ష్మిగారు.** అత్యన్తము ఆచార్యనిష్ఠ కలిగిన కుటుంబము వారిది. వారివలెనే వారి కుమార్తెలుకూడ. **శ్రీరాజ్యలక్ష్మిగారు** తమ కుమార్తె **శ్రీమతి అవనిజతో** కలసి ఈ గ్రన్థముద్రణవ్యయమును తామే వహించినారు. వారికి అనేక మంగళాశాసనములను చేయుచున్నాము. **తే 29 అక్టోబరు నుండి 31 అక్టోబరు 2010** వరకు విశాఖపట్టణములోని ఎం.వి.పి. కాలనీలోగల **టి.టి.డి. కల్యాణమండపములో** నిర్వహింపబడుచున్న **ఉభయవేదాన్త** పండితసభలలో తమ కరకమలములతో ఈ గ్రన్థము నావిష్కరించిన **"మహామహోపాధ్యాయ", "శాస్త్రరత్నాకర", "కవిశాబ్దికకేసరి"** ఉ.వే. ప్ర. శ్రీమాన్ **నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యస్వామి వారికి** కృతజ్ఞతాపూర్వక నమోవాకములతో మరొక్కమాఱు సేవిస్తున్నది- **శ్రీ వేంకటాచార్యవైదిక సంస్థాన్.**

ఇట్లు

శ్రీవైష్ణవదాసః

**సా॥ గో॥ కృష్ణమాచార్య**

# గోపికాచార్యహృదయం

కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే ।
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే ॥

శ్రీరామచంద్రుడు వనవాసం చేయడంకోసం దండకారణ్యంలో ప్రవేశించినపుడు అక్కడ ఉండే మహర్షులు అతని రాకనుగూర్చి విని అతనికి ఎదురువెళ్ళి స్వాగతాన్ని పల్కి ఆ స్వామిని దర్శించారు. లోకోత్తరమైన, పుంసాం దృష్టిచిత్తాపహారకమైన శ్రీరాముని సౌందర్యాన్ని దర్శించి, ఆ జితేంద్రియులైన మహర్షులు సైతం అబ్బురపడ్డారు. **"రూపసంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతామ్, దదృశుః విస్మితాకారా రామస్య వనవాసినః"** అని అంటూ ఈ విషయాన్ని వాల్మీకి మహర్షి తెలిపాడు. శ్రీరామచంద్రుని రూపౌదార్యగుణాలకు మహర్షులు విస్మితులు కావడమే కాదు; మనస్సులో స్త్రీ భావాన్ని పొంది, ఆ స్వామి దివ్యమంగళవిగ్రహసంశ్లేషాన్ని అభిలషించారుకూడా. అయితే, ఏకపత్నీవ్రతుడైన శ్రీరాముని సంశ్లేషాన్ని పొందడం ఆ అవతారసమయంలో వారికి వీలు కాలేదు. మహర్షుల అభీష్టాన్ని గ్రహించిన భగవానుడు వారి ఆశను తీర్చడంకోసం తాను శ్రీకృష్ణుడై అవతరించినపుడు వారిని రేపల్లెలోని గోపికలుగా జన్మింపజేసి, తన దివ్యరూపసందర్శనంతోపాటు, దివ్యమంగళ విగ్రహసంశ్లేషాన్ని ప్రసాదించి, వారికి మనోరథపూర్తిని కల్గించాడు. ఇది ఐతిహాసికమైన విషయం. అథర్వణ వేదానికి చెందిన కృష్ణోపనిషత్తులో **"శ్రీమహావిష్ణుం సచ్చిదానంద లక్షణం రామచంద్రం దృష్ట్వా సర్వాంగసుందరం మునయో విస్మితా బభూవుః. తం హోచుః నోఽవద్యమవతారాన్ వై గణ్యంతే ఆలింగామో భవంతమితి. భవాంతరే కృష్ణావతారే యూయం గోపికా భూత్వా మామాలింగథ"** అని ఈ విషయం తెలుపబడింది. గర్గసంహితలో కూడా ఈ విషయ ప్రస్తావన కన్పిస్తున్నది. **"దండకారణ్యవాసికళాన మునివర్ ఇరామపిరానతు సౌందర్యత్తిల్ ఈడుపట్టు ప్పెణ్మై విరుమ్బి మర్రొరు పిఱవియిల్ ఆయర్మజ్ఞైయరాయ్ క్కణ్ణనై క్కూడినార్ - ఎన్ఱ ఐతిహ్యము ముణ్డు"** అని అంటూ తిరువిరుత్త వ్యాఖ్యానావతారికలో **కాంచీ మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణాస్వామి** వారు ఈ అంశాన్ని తెలిపారు.

రేపల్లెలోని గోపికలు శ్రీకృష్ణభగవానుని జగన్మోహనకరమైన దివ్యమంగళవిగ్రహసౌందర్యంలోను, ఆ స్వామి వేణుగానంలోను లగ్నమైన మనస్సును కలవారై, అతని సంశ్లేషంలో గొప్ప ఆనందాన్ని పొందారు. తమకంటే అదృష్టవంతులు ఇంకొకరు లేరనే గర్వం, తమ అందానికి శ్రీకృష్ణుడు వశమయ్యాడనే అభిమానం వారికి కల్గింది. ఈ సంగతిని గుర్తించిన భగవానుడు వారి గర్వాన్ని, దురభిమానాన్ని తీర్చి కటాక్షించడంకోసం తాత్కాలికంగా అక్కడనుండి అదృశ్యుడయ్యాడు. అపుడు భగవద్విరహానికి చాలా ఆర్తిని చెందిన గోపికలు తమ మనస్సులోని దుఃఖాన్ని వ్యక్తం చేస్తూ, స్వామిని శరణాగతి చేస్తూ పల్కిన సూక్తులే గోపికాగీతలు. వేదద్రష్టలైన మహర్షులు గోపికలుగా అవతరించినపుడు, వారు (గోపికలు) పలికే సూక్తులు వేదార్థాలను అనుసరించడంలో, అనుసంధించడంలో ఆశ్చర్యం లేదుకదా!

దివ్యసూరులుగా ప్రసిద్ధిచెందిన ఆళ్వార్లు భగవానుని నిర్హేతుకకృపవల్ల **"మయర్వఱ మది నలమ్"** అనే రీతిలోని భ్రమ - విప్రలంభ - విస్మృత్యాది దోషరహితమైన, భక్తిరూపంగా పరిణమించిన జ్ఞానాన్ని పొందారు. భగవత్సంశ్లేష - విశ్లేషాలను మానసికంగా అనుభవించిన దివ్యసూరులు తమ అనుభవపరీవాహరూపాలుగా దివ్యప్రబంధాలను వెలయించారు. భగవానుని దివ్యమంగళవిగ్రహం **"మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ ప్రియతరం**

**రూపం యదత్యద్భుతమ్"** అనే రీతిలో భగవానుని స్వరూపం కంటే మిక్కిలి ప్రియమైనది, అద్భుతమైనది కావడం వల్ల భక్తుల చిత్తాన్ని సులభంగా ఆకర్షిస్తుంది. కనుక, దివ్యసూరులుకూడా మహర్షులవలె, గోపికలవలెనే శ్రీకృష్ణుని దివ్యమంగళ విగ్రహసౌందర్యంలో అత్యంతాభినివేశాన్ని పొంది, తమ హృదయాలలో నాయికాభావాన్ని ఆరోపించుకుని, అనురాగరంజితం చేసికొన్నారు. గోపికలు పల్కినట్లే శృంగారసభంగిమలో పల్కుతూ, అద్భుతాలైన వైదిక తత్త్వార్థాలను ఆవిష్కరించారు. ఆళ్వార్లలో ముఖ్యులైన నమ్మాళ్వార్లకు, శ్రీవిష్ణుపురాణంలో ప్రస్తావింపబడ్డ **"చింతయంతి"** అనే గోపికకు మధ్యగల భావసామ్యాన్ని నంబిళ్ళై ఈడుముదల్ శ్రియఃపతిలో, **"వితియినాల్" (1-4-3)** అనే తిరువాయ్‌మొళ్ళి పాశుర వ్యాఖ్యలోను ప్రస్తుతించారు. పెరియవాచ్చాన్ పిళ్ళై ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో, అళగియ మణవాళచ్చీయర్ పన్నీరాయిరప్పడి వ్యాఖ్యలో కూడ ఈ సామ్యం ప్రస్తావింపబడింది. శ్రీవైష్ణవ సంప్రదాయంలో నమ్మాళ్వార్లకు **"దీర్ఘచింతయంతి"** అనికూడా పేరు. అందువల్ల భగవద్విశ్లేషంచేత ఆర్తలైన గోపికలు పల్కిన వచనాలకు, భగవద్విశ్లేషంవల్ల ఆర్తులైన ఆళ్వార్లు పల్కిన సూక్తులకు మధ్య భావసామ్యాలు, తత్త్వావిష్కరణంలో సామ్యాలు ఉండడంలో ఆశ్చర్యం లేదుకదా! ఈ దృష్టిలో, నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళ్ళికి నంబిళ్ళై అనుగ్రహించిన ఈడువ్యాఖ్యానశైలిని అనుకరిస్తూ ప్రస్తుత గోపికాగీతావ్యాఖ్యానం రచింపబడింది. ఆళ్వార్లు, ఆణ్డాళ్ సైతం తమ దివ్యప్రబంధాలలో గోపికల భావాలను అనుసరిస్తూ పల్కి, భగవానుని శరణాగతి చేసి పురుషార్థాన్ని పొందారు. గోదాదేవి తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళ్ళి ప్రబంధాలు తనను ఒక గోపికగా భావించి పల్కినవే కదా! అదేవిధంగా నమ్మాళ్వార్లు, కులశేఖరాళ్వార్లు, తిరుమజ్జై ఆళ్వార్లు, పెరియాళ్వార్లు తమ కృతులలో గోపికాభావనతో భగవానుని ఆరాధించి, తమ భక్తిని పవిత్ర ప్రణయరూపంగా వ్యక్తం చేయడాన్ని గమనించవచ్చు. **"ఆణ్డాళుమ్, ఆళ్వార్‌కళ్ ఎల్లారుమ్ ఇవర్‌కళ్‌పడియే అనుకరిత్తు పురుషార్థమ్ పెఱవేణ్డుమ్బడి యిఱే ఇవరుడైయ ఏఱ్ఱ మిరుప్పతు"** అని అంటూ ప్రకృతగోపికాగీతా వ్యాఖ్యాతలైన ఉ.వే. **శ్రీమాన్ జయజయ రామానుజాచార్యులవారు** గోపికల సూక్తులకు, దివ్యసూరుల సూక్తులకు మధ్య గల సామ్యాన్ని స్పష్టంగా తెలిపారుకూడా.

ఈ విధమైన గోపికల, దివ్యసూరుల అనుభవాల ఆవిష్కరణలోని సామ్యాలను పురస్కరించుకొని విద్వత్తల్లజులు, గత శతాబ్దిలో విఖ్యాతి చెందిన **ఉభయవేదాంత పండితవరులు, ఉ.వే. శ్రీమాన్ శాంతలూరి జయజయ రామానుజాచార్య స్వామివారు** నమ్బిళ్ళై ఈడు వ్యాఖ్యానాన్ని తలపించే, ఒక్కొక్క సందర్భంలో మఱపించే అద్భుత రస్యరహస్యార్థపూర్ణమైన, సుమధురవాగ్గుంభితమైన వ్యాఖ్యానాన్ని మణిప్రవాళశైలిలో వెలయించారు. అడుగడుగునా పుంఖానుపుంఖాలుగా శ్రుతులనుండి, ఉపబృంహణాల నుండి, ఆళ్వార్ల దివ్యప్రబంధాలనుండి, పూర్వాచార్యుల రహస్యగ్రంథాల, స్తోత్రాలనుండి పలు ప్రమాణాలను ఆయా సందర్భాలకు, ప్రయోగాలకు తగిన రీతిలో ఉట్టంకించే వీరి అగాథమైన వైదుష్యం, శ్లోకంలోని పదాలను ముందు, వెనుకలుగా పలురీతులలో అన్వయించి, రస్యార్థాన్ని చెప్పే అపారప్రతిభ ఎటువంటి విద్వాంసులకైనా ఆశ్చర్యాన్ని కల్గించకమానవు. ఈ గోపికాగీతావ్యాఖ్యలో సుమారు వేయి ప్రమాణాలు ఉట్టంకింపబడడం ఈ వ్యాఖ్యలోని ప్రమాణప్రయోగ బాహుళ్యాన్ని సూచిస్తుంది. ప్రాంతీయభాష కాకపోయినా ద్రావిడభాషపై ఈ వ్యాఖ్యాతకు గల పట్టును వీరు చేసే జాతీయాల ప్రయోగాలు వ్యక్తం చేస్తున్నాయి. పూర్వాచార్యులు దివ్యప్రబంధాలకు కృపజేసిన మణిప్రవాళవ్యాఖ్యలను అనవరతం భక్తితో ఉపాసించిన ఈ వ్యాఖ్యాత శైలి పూర్వాచార్యవ్యాఖ్యానశైలితో తులతూగడంలో ఆశ్చర్యం లేదు. ఈ గోపికాగీతావ్యాఖ్యలో అద్భుతాలైన విన్నపించవలసిన పలు అంశాలు ఉన్నా, వాటిలో కొన్నిటిని మాత్రం సంగ్రహంగా, స్థాలీపులాకన్యాయంలో నివేదిస్తాను.

1) నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళి దివ్యప్రబంధానికి ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యానం అనుగ్రహిస్తూ నంబిళ్ళై ప్రారంభంలో మూడు అవతారికలను, శ్రియఃపతి, ఇరణ్డామ్ శ్రియఃపతి మూన్డామ్ శ్రియఃపతి అనే పేరుతో అనుగ్రహించారు. అందులో ముదల్ శ్రియఃపతి - తిరువాయ్‌మొళి ప్రబంధానికి సంబంధించిన ప్రబంధ వైలక్షణ్య - వక్తృ వైలక్షణ్య - ప్రతిపాద్య (విషయ) వైలక్షణ్యాలను వివరించగా, ఇరణ్డామ్ శ్రియఃపతి తిరువాయ్‌మొళి ద్వయార్థప్రతిపాదకమని తెలిపింది. ఇక, చివరిది అయిన మూన్డామ్ శ్రియఃపతి నమ్మాళ్వార్ల నాల్గు ప్రబంధాల ప్రమేయకథన పూర్వకంగా, ఆ ప్రబంధచతుష్టయంలోని ఆళ్వార్ల భక్తిదశావిశేషాలను తెలిపింది.

ప్రస్తుతగోపికాగీతా వ్యాఖ్యానారంభంలోకూడా మూడు శ్రియఃపతులరూపంలో మూడు అవతారికలు వేఱు వేఱు తత్త్వాలను ఆవిష్కరిస్తూ రచింపబడ్డాయి. ముదల్ శ్రియఃపతిలో - శ్రీకృష్ణభగవానుని రూపసౌందర్యానికి, వేణురవానికి, గానానికి వశలైన గోపికలు ఆ స్వామి అనుగ్రహంవల్ల సంసారభయనివర్తకమైన బ్రహ్మానందానుభవాన్ని పొందారు. వారి ఉన్మస్తకమైన ఆనందాన్ని చూచిన భగవానుడు వారి క్షేమంకోసం వారిని విశ్లేషించి అంతర్ధానం అయ్యాడు. అపుడు గోపికలు బృందావనంలో అతనిని ఎంత వెదకినా కన్పించనందువల్ల, స్వప్రయత్నంనుండి విరమించి న్యాసవిద్యద్వారా శ్రీకృష్ణుని పాదాలలో పరగతస్వీకారాత్మకమైన శరణాగతిని చేయడాన్ని ఈ గోపికాగీతలు తెల్పుతున్నవని- ఈ అవతారికలో వివరింపబడింది. ఇందువల్ల ముదల్ శ్రియః పతిలో గోపికలు అనుష్ఠించిన, ప్రథమపర్వనిష్ఠకు సంబంధించిన, పరగతస్వీకారాత్మక శరణాగతి వివరింపబడింది. ఈ క్రమాన్నే ఆళ్వార్లు, ఆణ్డాళ్‌కూడా అనుసరించారనికూడా చివరలో సూచింపబడింది. తరువాత వ్యాఖ్యానంలో పలు చోట్ల ఈ అంశం ఆ యా ప్రయోగాలను వ్యాఖ్యానించేటపుడు వివరింపబడిందికూడా. అయిదవ శ్లోకంలోని- **"శిరసి ధేహి నః"** అనే ప్రయోగాన్ని- **"య మేవైష వృణుతే తేన లభ్యః - ఎన్గిఱపడియే అవన్ అభిమానిత్తు త్తరుకైయిటే ఇవళుక్కు వేణ్డువతు"** అని వివరించడం దీనికొక తార్కాణం. ఇదే రీతిలో **"తాసా మావిరభూత్"** అనే శ్లోకవ్యాఖ్యానావతారికలోకూడా- **"ఇత్తాల్ నాయ మాత్మా - ఎన్గిఱ శ్రుత్యర్థమ్ ప్రకాశితమ్"** అనే వివరణంకూడా స్మరణీయం.

ఇక్కడ ఒక అంశం ప్రస్తావనార్హం. గోపికలు అనుష్ఠించి, ప్రదర్శించిన ఈ పరగతస్వీకారాత్మకమైన న్యాస విద్య వేదాభిమతమైనది. శ్రీవచనభూషణ దివ్యగ్రంథంలో శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ఈ విషయాన్ని **"ఇవ్వర్థత్తై వేదపురుషన్ అపేక్షిత్తాన్"** అని సూత్రీకరించగా, విశదవాక్శిఖామణులైన శ్రీమణవాళమహామునులు **"కీళ్ ప్రబలమాక చ్చొల్లప్పట్ట పరగతస్వీకారత్తై వేదపురుషన్ ఇత్తై అపేక్షిత్తానెన్గతు - నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, య మేవైష వృణుతే తేన లభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్" ఎన్ఱు కఠవల్లియిలుమ్, ముణ్డకోపనిషత్తిలుమ్ శొల్లుకైయాలే ఆదరిత్తాన్ ఎన్గై. అసకృత్‌కీర్తన మపేక్షాకార్యమిఱే"** అని వివరించారు.

ఇక, రెండవ అవతారిక అయిన ఇరణ్డామ్ శ్రియఃపతి స్వాపదేశార్థవివరణాత్మకంగా, చరమపర్వనిష్ఠాత్మకమైన పరగత స్వీకారపరంగా రచింపబడింది. జగత్తు కంసుని వశంలో ఉండడం - జగత్తు అహంకారవశంలో ఉండడమని, భగవానుడు శ్రీకృష్ణుడుగా అవతరించడం - సౌలభ్యగుణానికి పరాకాష్ఠ అయిన ఆచార్యవేషంతో అవతరించడమని, గోపికలంటే - ముముక్షుచేతనులని, అతడు పూతనాదులను నశింపజేయడం - ప్రకృతిని, దాని కార్యాలైన అహంకార మమకారాదులను, కామ క్రోధాదులను నశింపచేయడమని, శ్రీకృష్ణుని వేణుస్వరం - అర్థపంచకాన్ని

ప్రతిపాదించే అష్టాక్షరీమంత్రార్థమని, అతడు "జగౌ కలమ్" అన్నట్లు మధురంగా గానం చేయడం - ద్వయమంత్రార్థాన్ని ప్రసాదించడమేనని - ఈవిధంగా భగవానునివల్ల అష్టాక్షరి ద్వయమంత్రార్థాలను పొందిన ముముక్షువులైన గోపికలు స్వరూపజ్ఞానాన్ని కలవారైనందువల్ల వారికి ప్రాప్యత్వర అతిశయించి, తమకు అతని కైంకర్యాన్ని, అభయప్రదానాన్ని తమకు అనుగ్రహించమని ప్రార్థించారని, అపుడు స్వామి వారితో రాసక్రీడ ఆడడం - వారికి సకలవిధకైంకర్యాలను ప్రసాదించి, వారిని ఆనందాబ్ధిలో ఓలలాడించడమని, అపుడు ఆ గోపికలకు సౌభగమదం, ప్రీత్యహంకారం కల్గడం - ముముక్షువులకు తమ జ్ఞానాధిక్యంవల్ల భగవానుడు తమకు వశుడయ్యాడనే అహంబుద్ధిని పొందడమేనని, గోపికల ఆ మనోమాలిన్యాన్ని తీర్చడంకోసం భగవానుడు అంతర్ధానం కావడం - ముముక్షువుల అహం బుద్ధిని తీర్చడంకోసం పరమాత్మ అంతర్ధానం కావడమేనని, గోపికలు బృందావనంలో శ్రీకృష్ణుని పాదముద్రలను అనుసరించి కొమ్మ కొమ్మను చెట్టు చెట్టును, పుట్ట పుట్టను శ్రీకృష్ణునికోసం అన్వేషించడం- భగవానుని పొందే మార్గంకోసం ఉపనిషత్ శాఖలలో మార్గాన్ని అన్వేషించడమేనని, అయినా శ్రీకృష్ణుడు గోపికలలో కన్పించక పోవడం - ఉపనిషత్తులలో భగవత్ప్రాప్తి సాధనాలుగా చెప్పబడ్డ కర్మజ్ఞాన భక్తులనే ఉపాయాలను, అనుష్ఠించినా సహాయాంతరాన్ని సాధనాంతరాన్ని సహించని సిద్ధోపాయరూపుడైన భగవానుడు లభించక పోవడమేనని, అపుడు అనన్యగతికలైన గోపికలు శ్రీకృష్ణుని శరణు వేడడం - ముముక్షువులు **"నిన్నరుళే పురిన్దిరున్దేన్"** అనే రీతిలో భగవదనుగ్రహం ఒక్కటే సాధనమని, తమ సాధనానుష్ఠానాలు ఏవీ ఉపాయాలు కావనీ గుర్తించి అనన్యగతిత్వాన్ని పొంది పరగతస్వీకారాత్మకంగా **"నాయ మాత్మా"** శ్రుతిలో చెప్పబడ్డ రీతిలో భగవానుని ఆశ్రయించి, అతనిని పొందడమేనని తెలుపబడింది.

ఈ విధంగా ఈ అవతారిక ఆచార్యవిషయకమైన, చరమపర్వనిష్ఠాత్మకమైన పరగతస్వీకారపరంగా నిర్వహింపబడింది. **"సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నా నుద్ధరతే లోకాత్ కారుణ్యాత్ శాస్త్రపాణినా"**, **"తిరుమామకళ్ కొழுనన్ తానే కురువాకి"**, **"పేతకవాడై పిరానార్ పిరమకురువాకి వన్దు"** ఇత్యాది ఉభయవేదాంతాల సూక్తులను అనుసరిస్తూ ఈ అవతారిక అనుగ్రహింపబడిందనే విషయం స్పష్టం. ఈ విధంగా మొదటి రెండు అవతారికలలోను **"ఏవం సంసృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కాऽప్యుపజాయతే"** అని, **"నిర్హేతుకకటాక్షేణ మదీయేన మహామతే, ఆచార్యవిషయీకారాత్ ప్రాప్నువంతి పరాం గతిమ్"** అని గల ప్రమాణాల అర్థం అనుసంధింపబడింది.

ఇక మూడవ అవతారిక అయిన మూన్ఱామ్ శ్రియః కూడా ఆచార్యపరంగానే నిర్వహింపబడింది. భగవానుడు జీవుల అజ్ఞానాన్ని తీర్చి రక్షించడానికి వేఱొకరు సమర్థులు కానందువల్ల తాను ఆచార్యుడై అవతరించి మంత్ర మంత్రార్థాలను జీవులకు ఉపదేశించి, వారిని జ్ఞానపరీక్ష చేయడంకోసం, అహంకారాన్ని తీర్చి రక్షించడంకోసం తనను అంతర్ధానం చేసికొన్నప్పుడు, ముముక్షు జీవులు ఆచార్యవిశ్లేషాన్ని సహించలేక, ఆచార్యులే ప్రాప్యం - ప్రాపకమని నమ్మినవారు కనుక, ఆచార్యరూపుడైన భగవానుని శరణు పొంది, ఆచార్యుని పొంది ఆనందించడాన్ని గోపికా గీత తెలుపుతున్నదని ఈ అవతారికాసారం. ఈ వివరణం **"పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్, ఆచార్యవత్తయా ముక్తౌ"**, **పేఱొన్ఱు మత్తిల్లై నిన్ శరణన్ఱి అప్పేఱళిత్తఱ్కు ఆఱొన్ఱు మిల్లై మత్తు చ్చరణన్ఱి"**, **"ఆచార్యాదిహ దేవతాం సమధికా మన్యాం న మన్యామహే"**, **"ఈశ్వరసంబంధమ్ బంధమోక్షజ్గళ్ ఇరణ్డుక్కుమ్ పొతువాయిరుక్కుమ్, ఆచార్యసంబంధమ్ మోక్షత్తుక్కే హేతువాయిరుక్కుమ్"** ఇత్యాది సూక్తులను అనుసరించి చేయబడింది.

ఈ రీతిలో వ్యాఖ్యానారంభంలో మూడు విభిన్ననిర్వాహాలతో మూడు అవతారికలను తెలుపడంలోనే కాక, ఇంకా పలు రీతులలో గోపికాగీతా వ్యాఖ్యాత నమ్పిళ్ళై ఈడుముప్పత్తాఱాయిరప్పడివ్యాఖ్యను అనుసరించారు. ఈ విషయం కొన్ని ఉదాహరణలను సంగ్రహంగా ప్రస్తావించడంద్వారా ముచ్చటింపబడుతున్నది.

నమ్పిళ్ళై ఈడువ్యాఖ్యలో శ్రీరామాయణం, శ్రీభారతం, శ్రీవిష్ణుపురాణాది ఉపబృంహణాలనుండి, ఆళ్వార్ల ప్రబంధాలనుండి, పూర్వాచార్యుల స్తోత్రాలనుండి పలు ప్రమాణాలను ఉట్టకించడమేకాక, అవసరం అనుకున్న సందర్భంలో వాటిలో కొన్నిటిని సందర్భానుగుణంగా సమన్వయిస్తూ వ్యాఖ్యానించారు. ఈ క్రమాన్నే గోపికాగీతావ్యాఖ్యాతకూడా అనుసరించారు. భగవానునకు ఉపయోగపడని ఆత్మ - ఆత్మీయాలు నాకు అక్కర లేదని భక్తులు తలచేటట్లే, భక్తులకు ఉపయోగపడని ఆత్మ-ఆత్మీయాలను భగవానుడు వ్యర్థమని తలుస్తాడనే విషయానికి ప్రమాణంగా శ్రీరామాయణంలోని **"అప్యహం జీవితం జహ్యాం త్వాం సీతే! సలక్ష్మణామ్"** ఇత్యాది శ్లోకాన్ని ఉదాహరించి వ్యాఖ్యానించడం దీనికొక ఉదాహరణం. ఈ శ్లోకం తనిశ్లోకిలోగాని, దివ్యప్రబంధవ్యాఖ్యలలో గాని ఎక్కడా వ్యాఖ్యానింపబడకపోవడం, ప్రకృతవ్యాఖ్యాతచేతనే తమదైన శైలిలో సందర్భోచితంగా, అద్భుతంగా వ్యాఖ్యానింప బడడం గమనార్హం. ఇదే రీతిలో తిరువాయ్మొழிలోని **"పామరు మూవులకుమ్ పడైత్త"** ఇత్యాది పాశురాన్ని, ఉపదేశరత్తినమాలైలోని **"ఆశారియన్ శెయ్ద వుపకారమానవతు"** అనే పాశురాన్ని, పాదుకాసహస్రంలోని **"ప్రపద్యే పాదుకాం దేవీమ్"** అనే శ్లోకాన్ని విలక్షణ శైలిలో వ్యాఖ్యానించడంకూడా గమనించదగినది. వీనిని అన్నిటినీ వ్యాఖ్యాత సందర్భానుగుణమైన రీతిలో అద్భుతంగా వ్యాఖ్యానించారు. శ్రీరామాయణంలోని **"పద్మకేసరసం సృష్టః"** అనే శ్లోకాన్ని ఉదాహరించి వ్యాఖ్యానించేటపుడు తనిశ్లోకిలోని పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యను ఇంచుమించు యథాతథంగా అనుసరించడం, అన్వయించడం ఇంకొక అంశం. పలు సందర్భాలలో పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యాన పంక్తులు యథాతథంగా స్వీకరింపబడడంకూడా గమనార్హం.

నమ్పిళ్ళై తిరువాయ్మొழி ప్రబంధప్రమేయాన్ని ద్వయమంత్రార్థంతో సమన్వయిస్తూ రెండవ శ్రియఃపతిలో వివరించారు. గోపికాగీతలనుకూడా శ్రీమాన్ రామానుజాచార్యులవారు ద్వయార్థంతో సమన్వయించారు. నాల్గవశ్లోక వ్యాఖ్యకు అవతారికను అనుగ్రహిస్తూ - **"ముదల్ శ్లోకత్తాలే శ్రీమత్పదార్థత్తై అనుసంధిత్తు, ఇరణ్డామ్ శ్లోకమ్ మున్నాక నాలామ్ శ్లోకత్తళవుమ్ నారాయణశబ్దార్థత్తై అనుసంధిత్తు"** అని అంటూ 1వ శ్లోకం నుండి 4వ శ్లోకంవరకు ద్వయంలోని **"శ్రీమన్నారాయణ"** అనే భాగం వివరింపబడిందని తెల్పి, 5వ శ్లోక వ్యాఖ్యానావతారికలో- **"ఇన్ద శ్లోకమ్ మున్నాక ఇరుపదామ్ శ్లోకత్తళవుమ్ "చరణౌ శరణం ప్రపద్యే" ఎన్గిఱ వాక్యశేషత్తుక్కు అర్థ మను సంధేయమ్"** అని అంటూ 5వ శ్లోకం నుండి 20వ శ్లోకంవరకు గల 16 శ్లోకాలు మిగిలిన భాగాన్ని వివరిస్తున్నాయని చెప్పారు. ఈవిధంగా గోపికాగీతలలోని 20 శ్లోకాలు ద్వయర్థానుసంధానాన్ని చేస్తున్నవని తెలిపారు. ఇదే విషయాన్ని 21వ శ్లోకవ్యాఖ్యానావతారికలో మళ్ళీ తెలియజేయడాన్నికూడా గమనించవచ్చు. ఇంతేగాక, ఇరవైయవ శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ - **"రురుదుః సుస్వరమ్"** అనే ప్రయోగం ద్వయంలోని పూర్వవాక్యంయొక్క అర్థాన్ని, **"కృష్ణదర్శన లాలసాః"** అనే ప్రయోగం ఉత్తరవాక్యార్థాన్ని అనుసంధిస్తున్నదని తెలుపడంకూడా స్మరణీయం. అయితే, **"దర్శనలాలసాః"** అనే పదంలో ప్రయోగింపబడ్డ దర్శనశబ్దం ఉత్తరవాక్యార్థంలోని కైంకర్యాన్ని ఏవిధంగా తెల్పుతుందని ఆశంకించిన వ్యాఖ్యాత, **"ఉన్ పవళవాయ్ కాణ్బేనే - ఎన్గిఱపడియే ఒరు కైంకర్యమే యాకైయాలుమ్, దర్శనత్తిలే ఇழிకిఱతుమ్ ప్రధానప్రాప్యమాన కైంకర్యత్తుక్కు హేతువాకైయాలుమ్"** అని అంటూ ఇత్యాదిగా చక్కగా చెప్పిన సమాధానంకూడా గమనించదగినది. ఇటువంటి సరససహేతుకాలైన వివరణలు ఈ వ్యాఖ్యలో కోకొల్లలు.

"షడ్విధా శరణాగతిః" అని అంటూ శరణాగతికి చెప్పబడ్డ ఆఱు అంగాలుకూడా ఈ గోపికాగీతలలో ఇమిడి ఉన్నాయని వ్యాఖ్యాత నిరూపించారు. ఈ అంశాన్ని 20వ శ్లోకం యొక్క అవతారికలో - "విధికరీ రిమా వీర! ముహ్యతీః అధరశీధునాऽప్యాయయస్వ నః" అని అనుకూల్యసంకల్పం, "పతిసుతాన్వయభ్రాతృబాంధవా నతివిలంఘ్య" అని ప్రాతికూల్యవర్జనం, "విషజలాశయాత్" అని రక్షణవిశ్వాసం, "విశ్వగుప్తయే సఖ! ఉదేయివాన్ సాత్వతాం కులే" అనే గోప్తృత్వవరణం, "త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే" అని ఆత్మనిక్షేపం, "అశుల్కదాసికాః" అని కార్పణ్యం తెలుపబడినందువల్ల షడ్విధమైన శరణాగతి చెప్పబడిందని వివరింపబడింది.

ఈ సందర్భంలోనే వ్యాఖ్యాత "ముదల్‌శ్లోకమ్ మున్నాక ఇరుపదామ్ శ్లోకత్తళవుమ్ ఉపాసకకృత్యత్తై అనుసంధిత్తు, నిగమత్తిల్ ఉపేయకృత్యత్తై అరుళిచ్చెయ్‌కిఱార్ - ఎన్ఱపుమామ్. ఉపాసకకృత్యమ్ శరణాగతి, ఉపేయకృత్యమ్ ఆశ్రితర్‌క్కు తన్నుడైయ సన్నిధియై కటాక్షిత్తు కైంకర్యఙ్గళై ప్రసాదిక్కై" అని వివరించినందువల్ల, "రురుదుః సుస్వరమ్" అనే ప్రయోగాన్ని వివరిస్తూ "స్వరయుక్తమాక ప్రపత్తి పణ్ణినార్‌కళ్ - ఎన్ఱపడి. స్వర మావతు వేదస్వరమ్. అతావతు ప్రణవస్వరమ్. అత్తాలే శరణాగతరానార్ - ఎన్ఱపడి" అని అన్నందువల్ల గోపికాగీతలలో చరమశ్లోక - అష్టాక్షరీమంత్రార్థాలు అనుసంధింపబడ్డాయని తెలుపబడినట్లయింది. ఈ విధంగా గోపికాగీతలు రహస్యత్రయార్థ ప్రతిపాదకాలు. ఎనిమిదవ శ్లోకంలోని "మధురయా గిరా వల్గువాక్యయా బుధమనోజ్ఞయా" అనే ప్రయోగంలో గల "మధురయా" అనే పదం తిరుమంత్రారహస్యాన్ని, "వల్గువాక్యయా" అనే ప్రయోగం ద్వయాన్ని, "బుధమనోజ్ఞయా" అనే ప్రయోగం చరమశ్లోకార్థాన్ని తెలుపుతున్నదని వ్యాఖ్యానించడంకూడా స్మరణీయం.

ఆళ్వార్ల శ్రీసూక్తులకు, గోపికాగీతలలోని ప్రయోగాలకు మధ్యగల అర్థసంవాదాల నిరూపణకు వ్యాఖ్యాత అడుగడుగునా వందలాది ప్రమాణాలను ఉట్టంకిస్తూ నిరూపించడమేకాక, కొన్ని సందర్భాలలో చమత్కారంగా గోపికాగీతల వైలక్షణ్యాన్ని కూడా వివరించారు. ఉదాహరణకు - పెరియాళ్వార్లకంటే గోపికలకు గల ప్రేమాధిక్యాన్ని తెలుపుతూ - "పెరియాళ్వార్ ఎదిరే విళఙ్గానిన్ఱ వస్తువుక్కు మంగళాశాసనమ్ పణ్ణినార్. ఇవర్‌కళ్ తఙ్గళై విట్టు దూరమాక నిఱ్కిఱ వస్తువుక్కు మంగళాశాసనమ్ పణ్ణుకిఱారితే" అని అంటూ 12వ శ్లోకం వ్యాఖ్యానం చివరలో పల్కడం గమనించవచ్చు. పదమూడవ శ్లోకంలోని "చరణపంకజం శంతమం చ మే రమణ! నః స్తనేష్వర్పయార్తి హన్!" అనే ప్రయోగానికి నాచ్చియార్‌తిరుమొళిలోని "అవరైప్పిరాయమ్ తొడఙ్గి యెన్ఱు మాతరి త్తెళున్ద ఎన్ తడములైకళ్ తువరై ప్పిరానుక్కే శఙ్గల్పిత్తు త్తొళుతువైత్తేన్" అనే గోదాసూక్తికి మధ్య గల అర్థసామ్యం హృదయం గమంగా తెలుపబడడంవంటి సమన్వయాలు ఎన్నో ఉన్నాయి.

పూర్వాచార్యులు ఆళ్వార్ల దివ్యప్రబంధాలను వ్యాఖ్యానిస్తూ, ఆ యా ప్రయోగాలలోని సంకేతాత్మకాలైన స్వాపదేశార్థాలను వివరించారు. ఉదాహరణకు, తిరువిరుత్తవ్యాఖ్యానంలో అళకియ మణవాళచ్చీయర్ "పేయ్‌చ్చి ములై శువైత్తాన్" (4) అనే ప్రయోగంలోని పూతన "అనర్థకారిణియా యిరుక్కచ్చెయ్‌తే స్వభోగ్యబుద్ధిజననియాన ప్రకృతియై" అనే రీతిలో ప్రకృతిని నిర్దేశిస్తుందని తెలిపారు. అదేవిధంగా తిరుప్పావై ప్రబంధంలోని "కఞ్జన్ వయిఱ్ఱిల్" అనే ప్రయోగంలోని కంసశబ్దం అహంకారాన్ని తెలుపుతుందని, "కళ్ళ చ్చకడమ్" అనే ప్రయోగంలోని శకటశబ్దం కామక్రోధాదులకు సూచకమని తెలుపబడింది. ఆచార్యహృదయంలోని రెండవ ప్రకరణంలో నాయనార్ తిరువాయ్‌మొళి ప్రబంధంలో ప్రసక్తమైన, పలు ప్రయోగాలలోని సాంకేతికమైన స్వాపదేశాత్మకాలైన అర్థాలను "మయిల్ పిఱై విల్ అమ్బు" ఇత్యాదిగా వివరించడంకూడా గమనించవచ్చు. ఈ పద్ధతిని అనుసరిస్తూ ప్రస్తుత గోపికాగీతావ్యాఖ్యానంలో వ్యాఖ్యాత పలు స్వాపదేశార్థాలను సూచించారు. వాటిలో కొన్ని మాత్రం ప్రస్తావింప బడుతున్నాయి. (1) కంసుడు- అహంకారం, (2) పూతనాదులు - అహంకార కార్యాలు, (3) వేణువు - వేదం,

(4) శరద్రాత్రి - సాత్త్విక సమయం, (5) వేణుగీతం - తిరుమంత్రార్థం, (6) శ్రీకృష్ణుని గానం - ద్వయార్థం, (7) చంద్రుడు - మనస్తత్త్వం, (8) బృందావన శాఖలు - ఉపనిషత్ శాఖలు, (9) కృష్ణుని పాదముద్రలు - కర్మజ్ఞాన భక్తియోగాలు, (10) సురతం-భగవదనుభవాన్ని పొంది చేసే కైంకర్యం, (11) కాళియుడు నివసించే హ్రదం - సంసారం, (12) కాళియుడు - అహంకారం, (13) కాళియుని విషం - లౌకికవిషయసుఖాలు, (14) పాము కాటు - విషయాసక్తి, (15) వ్యాళరాక్షసుడు - కామం, (16) వర్షమారుతాలు - క్రోధలోభాలు, (17) అగ్ని - మోహం, (18) వృషభాసురుడు- మదం, (19) వ్యోమాసురుడు - మాత్సర్యం, (20) స్తనాలు - జ్ఞానభక్తులు, (21) శ్రీకృష్ణుని గోరక్షణ - అనన్యగతికులైన జీవులను భగవానుడు రక్షించడం.

పూర్వాచార్యవ్యాఖ్యలను అనవరతం ఉపాసించిన ఫలంగా శ్రీమాన్ రామానుజాచార్యస్వామివారి వ్యాఖ్యలో పూర్వాచార్యులు తమ వ్యాఖ్యలో ప్రయోగించిన జాతీయాలు, సామెతలు యథాతథంగా, సందర్భానుగుణంగా చోటుచేసికొన్నాయి. వాటిలో కొన్ని ఇక్కడ ప్రస్తావింపబడుతున్నాయి.

(1) **"పఱ్ఱాశు"** - ఈ పదం పలు అర్థాల్లో దివ్యప్రబంధవ్యాఖ్యలలో ప్రయోగింపబడింది. **"ఇవళ్ శొన్న వార్త్తైకళైయే తనక్కు ప్పఱ్ఱాశాక క్కొణ్డు"** (అఱాయిరప్పడి-6-2-5) అనే చోట పట్టుకొమ్మ, ఆలంబనం, ఉపఘ్నం - అనే అర్థంలోను, **"ఇన్ద కృతజ్ఞతైయే పఱ్ఱాశాక క్కొణ్డు"** (ఒన్బదినాయిరప్పడి-5-1-10) అనే ప్రయోగంలో కారణమనే అర్థంలో, **"పఱ్ఱాశాన పెరియపిరాట్టియార్ ఎழுన్దరుళి యిరుక్కుమ్"** (ఈడు-8-9-1) అనే చోట రక్షకమనే అర్థంలో ప్రయోగింపబడింది. ప్రస్తుతవ్యాఖ్యలో (1వ శ్లోకవ్యాఖ్య, 13వ శ్లోక వ్యాఖ్యలో) రెండు చోట్ల పట్టుకొమ్మ - అనే అర్థంలో ప్రయోగింపబడింది.

(2) **"కుమిழి నీరుణ్ణప్పణ్ణుమ్"** - (1వ శ్లోక వ్యాఖ్య) **"తిరువడి, తిరువనన్దాழ்వాన్ ఇవర్కళ్ కుమిழி నీరుణ్గిఱ విషయత్తిలేయితే"**- (ఈడు-2-6-8) (2-3-2) మొదలైన చోట్ల కన్పించే ఈ ప్రయోగానికి అట్ట అడుగువరకు - లోతుకు మునిగి ఉక్కిరి బిక్కిరి అయ్యేటట్లు చేసిన - అని అర్థం. **"కుమిழி"** అంటే ప్రవాహోత్పత్తిస్థానం.

(3) ఎழுతిక్కొణ్డ :- (2వ శ్లోక వ్యాఖ్య) తనకు శేషంగా, అధీనంగా చేసికొన్న - అని అర్థం. **"తిరువాழிయై క్కాట్టి ఎన్నై ఎழுతిక్కొణ్డవనే!"** (ఒన్బదినాయిరప్పడి-4-7-10) అనే చోట ఈ ప్రయోగం ఉన్నది. కైంకర్యాన్ని స్వీకరించడమనే అర్థంలో ఈడువ్యాఖ్యలో (1-8-9)లో **"నమ్మై యెழுతిక్కొళ్ళుకైయే ప్రయోజనమాక"** అని ప్రయోగింపబడింది.

(4) ఆழ்ఙ్గాఱ్పట్టు :- (3వ శ్లోక వ్యాఖ్య) **"ఆழம్ కాల్"** - అంటే లోతు. లోతుగా మునిగి - అని ఈ ప్రయోగానికి అర్థం. పూర్తిగా అభినివేశాన్ని పొంది- అని తాత్పర్యం. **"ఆழ்ఙ్గాఱ్పట్టతు కృష్ణావతారత్తిలే యాయిఱ్ఱు"** (ఈడు-3-6-10) ఇత్యాదిప్రయోగాలలో గమనించవచ్చు. **"కాల్ ఆழம్ పడుకై"** - కాళ్ళు లోతులో పడడం - పూర్తిగా మునిగిపోవడమనికూడా పదాల క్రమాన్ని మార్చి ఈ ప్రయోగం వివరింపబడింది. తాత్పర్యార్థం ఒకటే.

(5) కుழైచ్చరక్కు :- (3వ శ్లోక వ్యాఖ్య) రక్షింపబడే వస్తువు - అనే అర్థంలో **"ఇవర్ సుకుమారరా యిరుక్కైయాలే కుழైచ్చరక్కు ఎన్నుమ్"** (ఈడు-6-10-4) అనే చోట, సారం లేని వస్తువు అనే అర్థంలో - **"కుழైచ్చరక్కే యాయినుమ్ విడవొణ్ణాత భోగ్యతై మిక్కిరుక్కై"** (తిరుప్పావై-4వ పాశురవ్యాఖ్య) అనే చోట ప్రయోగింపబడినది. ప్రకృతవ్యాఖ్యలో సారం లేని వస్తువు అనే అర్థంలో ప్రయోగింపబడింది.

(6) వైత్తవేలి :- (4వ శ్లోక వ్యాఖ్య) కావలి కట్టు. రక్షగా పెట్టిన కంచె - అని అర్థం. **"ఇప్పేఱ్ఱుక్కు వేలియా యిరుక్కిఱతు"** (ఈడు-8-7-ప్రవేశం), **"పెరియ తాళ్గళై వేలియాక ఉడైయ"** (ఒన్బదినాయిరప్పడి-4-10-8) ఇత్యాది ప్రయోగాలను గమనించవచ్చు.

(7) ముఱ్ఱూట్టాక :- (6వ శ్లోక వ్యాఖ్య) పూర్ణ భోజనంగా - అని అర్థం. **"ముఱ్ఱు''**- మొత్తం, ఊట్టు - భోజనం. పూర్ణానుభావమని తాత్పర్యం **"ఎన్నై ఒరువనైయే విశేషిత్తు ముఱ్ఱూట్టాక క్కొణ్డు"** (ఒన్బదినాయిరప్పడి 8-8-4) ఇత్యాదిప్రయోగాలలో గమనించవచ్చు.

(8) అలై ఎఱిగిఱ - (6వ శ్లోక వ్యాఖ్య) అలలు వీచే - అని భావం. **"అలై యెఱియా నిన్షుళ్ళ కడల్"** అని ఒన్బదినాయిరప్పడి (8-9-3) ప్రయోగాన్ని చూడవచ్చు.

(9) వయిఱు పిడిక్కుమ్ :- (11వ శ్లోక వ్యాఖ్య) దుఃఖసూచకంగా కడుపును పిసికికోవడం. **"ఇవన్ ఉణరిల్ శెయ్వదెన్? ఎన్ఱు వయిఱు పిడిక్కవేణ్డుమ్బడియా యిరుక్కై"** (ఈడు-5-8-1) ఇత్యాదిప్రయోగాలలో ఈ అర్థాన్ని గమనించవచ్చు.

(10) అరై కులైయ త్తలై కులైయ : (9వ శ్లోక వ్యాఖ్య) మహావేగంగా - అని తాత్పర్యం. నడుముబట్ట వీడిపోయేటట్లు, తల ముడి వీడిపోయేటట్లు - అని శబ్దార్థం. **"అరై కులైయ త్తలై కులైయ వన్దు తోఱ్ఱినాన్"** (ఈడు-1-5-1) మొదలైన ప్రయోగాలు ఉదాహార్యాలు. **"అరై"** అంటే నడుము. ఈ పదం నడుమున ధరించిన ధోవతిని లక్షిస్తుంది. **"తలై"**- అంటే శిరస్సు. ఇది జుట్టుముడిని గాని, శిరస్సులో ధరించిన తలపాగా, కిరీటంవంటి అభరణాలను కాని లక్షిస్తుంది.

(11) పెణ్ణుడై యుడుత్తుమ్బడి : (12వ శ్లోక వ్యాఖ్య) స్త్రీలు ధరించే చీరను కట్టుకొనేటట్లు, స్త్రీ వేషాన్ని ధరించేటట్లు - అని అర్థం. స్త్రీ భావాన్ని ఆరోపించుకొనేటట్లు - అని తాత్పర్యం. **"ఎదిర్ త్తలైయిల్ పుంస్త్వత్తై యళిత్తు ప్పెణ్ణుడై యుడుత్తుమ్బడియితే అవనుడైయ పురుషోత్తమత్వమ్"** (ఈడు-1-4-1) ఇత్యాది ప్రయోగాలు గ్రాహ్యాలు.

(12) కరై పురణ్డు :- (13వ శ్లోక వ్యాఖ్య) మిక్కిలి - అని అర్థం. **"కరై పురణ్డు పెరుకిఱ కారుణ్యావెళ్ళత్తాలే"** (ఆఱాయిరప్పడి-3-2-1) ఇత్యాది ప్రయోగాలలో గమనించవచ్చు.

(13) కమర్ పిళన్ద :- (13వ, 16 శ్లోక వ్యాఖ్య) దుఃఖపడే - అని తాత్పర్యం. **"కమర్"** అంటే - నేలలో మిక్కిలి వేడివల్ల ఏర్పడే పగులు- చీలిక. బీటలు తీసిన - అని అర్థం. **"కమర్ పిళన్ద విడత్తిలే ఒరు పాట్టమ్ మళై విళున్దాప్పోలే"** (ఈడు-6-2-2), **"మికవుమ్ కమర్ పిళన్దిరుక్కిఱ హృదయమ్"** (ఒన్బది నాయిరప్పడి-6-7-5) ఇత్యాది ప్రయోగాలలో గమనించవచ్చు.

(14) **"పతమ్ శెయ్యుమ్బడి"**:- (13వ శ్లోక వ్యాఖ్య) స్వాధీనం చేసికొనేటట్లు - అని అర్థం. **"యమునియ మాదిక్రమత్తాలే పతమ్ శెయ్య ప్పార్త్తలుమ్"** (ఈడు-6-5-9) మొదలైన ప్రయోగాలలో చూడవచ్చు.

(15) విళాక్కులై క్కొణ్డు :- (17వ శ్లోక వ్యాఖ్య) వ్యాపించి, కబళీకరించి - అని అర్థం. **"ఒరు తిరువడియే భూమి పరప్పడఙ్గలుమ్ పోయ్ విళాక్కులై క్కొణ్డతు"** (తిరువిరుత్తమ్-58), **"శేషియానవనై విళాక్కులై క్కొళ్ళవల్లనాన తిరువనన్దాళ్వాన్ మేలే కిట్టి"** (ఈడు-3-4-9) మొదలైన ప్రయోగాలలో గమనించవచ్చు.

(16) ఒరు పాట్టమ్ మఝై :- (17వ శ్లోక వ్యాఖ్య) ఒక దిక్కు, పదును వర్షం - అని అర్థం. "కమల్ పిళన్ద విడత్తిలే ఒరు పాట్టమ్ మఝై విఝున్దాప్పోలే" (ఒన్బదినాయిరప్పడి-6-2-2) అనే ప్రయోగం గ్రాహ్యం.

(17) వైత్త కణ్ వాఙ్గాత పడి :- (19వ శ్లోక వ్యాఖ్య) చూచిన చూపును తిప్పుకోకుండా - అని అర్థం. "ఆనైక్కన్దు పోలే వైత్త కణ్ వాఙ్గాతే" - (పెరుమాళ్ తిరుమొఝి వ్యాఖ్య - 7-1) అనే ప్రయోగం గ్రాహ్యం.

(18) కాడు మేడైయుమాన :- (19వ శ్లోక వ్యాఖ్య) అడవి, మిట్టగా ఉండే - అని అర్థం. "కాడు మోడైయుమాన" (ఈడు-8-3-7) అనే రూపాన్ని గ్రహించి అరణ్యాన్ని, అందులోని పల్లపుప్రాంతాలను - అనే అర్థంకూడా చెప్పబడింది.

(19) కణ్ణెచ్చిల్ :- (19వ శ్లోక వ్యాఖ్య) కంటి ఎంగిలి - దృష్టి దోషం - అని అర్థం. "పిఱర్ కణ్ణెచ్చిల్ పడామైక్కు" (ఒన్బది నాయిరప్పడి-2-6-1) అనే ప్రయోగం గమనించవచ్చు.

(20) ఊరెణ్ణె వైత్తాప్పోలే :- (20వ శ్లోక వ్యాఖ్య) "ఎణ్ణై" - అంటే ఎన్నిక - లెక్కించడం. ఊరిలోనివారి లెక్కను లెక్కించడమని అర్థం. స్థాలీపులాకంగా ఈ వ్యాఖ్యానంలో కన్పించే కొన్ని ప్రయోగాలుమాత్రమే ఇక్కడ ప్రస్తావింపబడ్డాయి.

చివరిగా వ్యాఖ్యాత వ్యాఖ్యానచాతుర్యాన్ని నిరూపించే ఒక్క సందర్భాన్నిమాత్రం ప్రస్తుతిస్తాను. 4వ శ్లోకంలో గల "సఖ! ఉదేయివాన్ సాత్వతాం కులే" అనే ప్రయోగంలోని "సఖ" అనే పదాన్ని ముందుగా "స్నేహియానవనే! ఇప్పడి యెల్లామ్ శెయ్‌తతు సఖనాకైయాలేయిఱే. ఆనందిత్తిరుక్కుమ్బోతు ఆనందిత్తుమ్, విచారత్తిలే యిరుక్కుమ్బోతు తానుమ్ విచారమగ్ననాయిరుక్కైయిఱే సఖనానవనుక్కు స్వభావమ్" అని లౌకికమైన రీతిలో సఖశబ్దాన్ని వివరించి, తరువాత "ఇత్తాల్ - ద్వా సుపర్ణా సయుజా సఖాయా" ఎన్ఱు శ్రుతియిల్ శొల్లప్పడుకిఱ ఆత్మసఖత్వమ్ శొల్లిఱ్ఱాయ్‌ఱ్ఱు. య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽంతరః - ఎన్గిఱపడియే ఆత్మావుక్కుళ్ళే సత్తాధారకమామ్బడి అనుప్రవేశిత్తు, ఇప్పడి యిరున్దమాత్రమన్ఱిక్కే, ఇవనై సర్వాపదైకళిల్ నిన్ఱుమ్ రక్షిప్పదఱ్కు దశదిశైకళ్ తోఱుమ్ వ్యాపిత్తు, అద్వేషమ్ తొడక్కమాన ఆత్మగుణఙ్గళెల్లామ్ ఉణ్డాక్కి, "దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే" ఎన్గిఱపడియే సర్వేశ్వరనై ప్రాపిక్కైక్కు త్తకుతియాన ప్రపన్నత్వముణ్డామ్బడి కటాక్షిత్తరుళినపడియాలే, ఇప్పడి అరుళిన ప్రకారఙ్గళెల్లామ్ అనుసంధిత్తు "సఖ" ఎన్గిఱార్కళ్" అని వేదాంతపరంగా వివరించడం వ్యాఖ్యాతయొక్క అసాధారణప్రతిభను, అభయవేదాంతాలలోని అగాధమైన పాండిత్యాన్ని, అద్భుతవ్యాఖ్యాన పటిమను నిరూపిస్తున్నది. ఇటువంటి సరస సప్రమాణ గభీర వివరణలను పదే పదే గమనించ వచ్చు. చివరిగా ముఖ్యమైన ఒక వక్తవ్యాంశాన్నిగూర్చి క్లుప్తంగా విన్నపించి నా విజ్ఞాపనను ముగిస్తాను.

భక్తిరసామృతం అనదగిన శ్రీభాగవతంలో భౌతికమైన, అశాశ్వతమైన దైహికశృంగారాన్నిగూర్చిన వర్ణనను పరమవిరక్తుడు, తత్త్వజ్ఞానాన్ని కలవారిలో అగ్రేసరుడైన శుకమహర్షి ఏవిధంగా ప్రస్తావించాడు? అనే ప్రశ్న తప్పక కల్గుతుంది. దీనికి తగిన పలు సమాధానాలను అభిజ్ఞులైన భాగవతతత్త్వవేత్తలు తెలిపారు. వాటిలో ముఖ్యమైన మూడు సమాధానాలు ఇక్కడ తెలుపబడుతున్నాయి.

(1) శ్రీకృష్ణుడు గోపికలమధ్య వర్ణింపబడ్డ శృంగార వృత్తాంతం సంకేతాత్మకమేకాని, వాస్తవం కాదు. గోపికలు జీవాత్మలుగాను, శ్రీకృష్ణుడు పరమాత్మగాను, జీవుడు పరమాత్మ పొందాలనే తీవ్రమైన ఆశయే ఇక్కడ గోపికలకు శ్రీకృష్ణుని విషయంలోని కామంగాను రూపకాతిశయోక్తి ప్రక్రియలో సంకేతాత్మకంగా ప్రతిపాదింప

బడింది. ఈ సిద్ధాంతంలో, ఆధ్యాత్మికదృష్టిలో జీవుడు పరమాత్మయొక్క ప్రకృతి కనుక, జీవునిలో స్త్రీత్వం కల్పింపబడింది. ఈ సమాధానంలో- చారిత్రక సత్యత్వం అంగీకరింపబడలేదని గాని, ఉపేక్షింపబడిందని గాని చెప్పాలి. అన్ని సంఘటనలు సంకేతాత్మ కాలుగానే గ్రహింపబడ్డాయి. అందువల్ల ఈ వృత్తాంతంలో అధార్మికత్వ శంకకు చోటు లేదు.

(2) శ్రీకృష్ణుడు గోపికలతో రాసక్రీడను సలిపినపుడు అతని వయస్సు 11 మాత్రమే. అందువల్ల అతని చేష్టలలో భౌతికమైన శృంగారదృష్టికి స్థానం లేదు. అమాయికంగా, శ్రీకృష్ణుడు గోపికలతో ఆడిన ఆటలలో కవితాశైలిలో అతిశయోక్తిద్వారా శృంగారభంగిమలను ఆరోపించి వర్ణించి, తద్ద్వారా అర్థచమత్కారం సాధింపబడింది- అని ఇంకొక సమాధానం. భగవానుడైన శ్రీకృష్ణుడు గోకులంలో గోపబాలునివలె యుక్తవయస్కులైన బాలికలలో కలసి గోపకులానికి సహజమైన, పవిత్రాలైన ఆటలను ఆడుతూ లీలారసాన్ని అనుభవించాడు. అమలినాలైన ఆ క్రీడలలో శృంగారం ఆరోపం చేయబడింది - అనే ఈ మతంలో శ్రీకృష్ణలీలలు చరిత్రసిద్ధాలే. వాటిలో ఉదాత్తమైన రీతిలో శృంగారాత్మకభావన చేయబడింది. కనుక అధార్మికత్వశంకకు అవకాశం లేదు.

(3) ఇక మూడవ సమాధానం. ఈ మతంలోకూడా చారిత్రకసత్యత్వం అంగీకరింపబడింది. గోపికలు భౌతికవాసనారహితలు, శరీరాభిమానశూన్యులు. వారు పరమాత్మగా భావించిన శ్రీకృష్ణునితో అధ్యాత్మిక భావనతోనే కలిశారు. ఈ విషయంలో దైహికమైన కామసుఖగంధం లేదు. ఇక్కడ చేయబడ్డ వర్ణన అంతా గోప్యాలైన ఆధ్యాత్మికతత్త్వాలను గాఢంగా, గూఢంగా ప్రతిపాదించడం కేసమే. ఈ సమాధానానికి అనుగుణంగా **"నాఽసూయన్ ఖలు కృష్ణాయ మోహితా యస్య మాయయా, మన్యమానాః స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్ దారాన్ వ్రజౌకసః" (10-33-38)** అనే భాగవతశ్లోకం స్మరణీయం. గోపాంగనలు శ్రీకృష్ణునితో రాసక్రీడ ఆడేటపుడు వారి భర్తలు తమ తమ భార్యలు తమ చెంతనే ఉన్నట్లుగా భావించి, శ్రీకృష్ణుని విషయంలో ఏవిధమైన అసూయను పొందలేదని తెలిపే ఈ శ్లోకంవల్ల ఇది అంతా భగవానుని మాయానిర్వాహమని తెలుపబడింది. రాసక్రీడాసంరంభ వర్ణన సందర్భంలోని - **"భగవానపి తా రాత్రీ శశరదోత్ఫుల్లమల్లికాః, వీక్ష్య రంతుం మన శ్చక్రే యోగమాయా ముపాశ్రితః" (10-29-1)** అనే శ్లోకంకూడా ఈ విషయాన్ని ధ్రువీకరిస్తున్నవి.

శ్రీభాగవతమహాపురాణాన్ని పరిష్కరించి, తి. తి. దేవస్థానంవారిద్వారా ప్రచురింపజేసిన ప్రసిద్ధపండితులు, **గురువర్యులు, కీర్తిమూర్తులు, వాచస్పతి, ఉ.వే. శ్రీమాన్ ఎన్.సి.వి. నరసింహాచార్యులవారు** పై మూడు వాదాలను శ్రీభాగవతం బలపఱుస్తున్న దని అన్నారు. భగవానునితో జీవుని సంబంధం ఎటువంటిది అయినా, అది జీవుని ఉద్ధరిస్తుంది. **"కామాత్ ద్వేషాత్ భయాత్ స్నేహాత్ యథా భక్త్యేశ్వరే మనః, ఆవేశ్య తథాం హిత్వా బహవః సద్గతిం తాః గోప్యఃకామాత్ భయాత్ కంసో ద్వేషా చ్చైద్యాదయో నృపాః, సంబంధాత్ వృష్ణయః స్నేహాత్ భూప! భక్త్యా వయం విభో"** అనే భాగవతసూక్తివల్ల భగవానునిపట్లగల కామంతో గోపికలు మోక్షాన్ని పొందారని తెలుపుతున్నది.

భగవానుని అతిమానుషసౌందర్యంచేత, దివ్యవేణుగానమాధుర్యంచేత ఆకర్షింపబడి భౌతికప్రేమరసాన్ని కల్గిన గోపికలు సాధారణుడైన ప్రియునివలె శ్రీకృష్ణుని దరి చేరారు. వికారాన్ని కల్గించే హేతువుల సన్నిధానంలో సైతం వికారాన్ని పొందని ధీరాగ్రేసరుడైన, అనాదిబ్రహ్మచారి అయిన శ్రీకృష్ణుడు వారితో కలిసి తన సంబంధంతో వారికి దివ్యత్వాన్ని కల్గించాడు. గీతాచార్యుడైన శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరబ్రహ్మయేకదా! ఆ స్వామి స్వరూపం హేయప్రత్యనీకం, సకలకల్యాణగుణాస్పదం. మహోదాత్తం. కామాతురలు, దైహికసుఖాన్ని కోరిన కాముకలైన

వారైనా, గోపికలు భగవానునితో ఏర్పడిన దివ్యసంబంధంవల్ల కామవాసనాబంధాలు తొలగినవారు, దివ్యభక్తిభావ సంభృతులైన పరమహంసల వలె శుద్ధాత్మలు కలవారయ్యారు. ఈ దృష్టిలో గమనించినపుడు శ్రీకృష్ణగోపికా ప్రణయం మధ్య ధర్మవైరుధ్యం ఏమీ కన్పించదు. భగవానుని ప్రవృత్తిలో సందేహం ఏర్పడదు. "నిదిధ్యాసితవ్యః" అని వేదాంతంలో విధింపబడ్డ నిదిధ్యాసనానికి హేతువు ఏమయినా కానీ. భగవానుని విషయంలో చిత్తైకాగ్రత ఒక్కటే ముఖ్యం. ఆ ఏకాగ్రత కల్గడానికి కారణం ఏమయినా కానీ, అటువంటి సంషయంలో తీవ్రమైన ఏకాగ్రతను కలవారిని చివరకు సత్పథవర్తినులుగా సంస్కరించి, ముక్తిని ప్రసాదిస్తాడు. వంచనతో వచ్చిన పూతన, ద్వేషంతో ప్రవర్తించిన శిశుపాలుడు పొందినది మోక్షమే కదా! **"నిభృతమరున్మనో ఉక్షదృఢయోగయుజో యున్మనయ ఉపాసతే తదరయో ఉపి యయుః స్మరణాత్, స్త్రియ ఉరగేంద్రభోగభుజదండవిషక్తధియో వయ మపి తే సమాః సమదృశో ఉంఘ్రిసరోజసుధాః"** (భాగవత-10-87-23) (మునులు ప్రాణవాయువును నిరోధించినవారై, దృఢయోగ చిత్తులై, నీ ఏ తత్త్వాన్ని పొందుతున్నారో, ద్వేషభావంతో శత్రువులుకూడా ఆ తత్త్వాన్ని పొందారు. గోపికలు భోగిభోగంవలె అందమైన నీ బాహువుల సౌందర్యంలో ఆసక్తచిత్తలై ఆ తత్త్వాన్నే పొందారు. వేదాధిదేవతలమైన మేముకూడా ఆ తత్త్వాన్నే భజిస్తున్నాను. అంతటా నీవు సమదృష్టిని కల్గి ఉన్నావు.) అనే భాగవతశ్లోకం స్మరణీయం.

దివ్యప్రబంధాలలో కన్పించే శృంగారరసాత్మకాలైన సూక్తులనుగూర్చిన సామంజస్యాన్ని వివరిస్తూ పూర్వాచార్యులు వేదాంత తత్త్వాలను మధురమైన రీతిలో అందించడంకోసమే ఈ ప్రక్రియ అవలంబింపబడిదని అంటూ గుడజిహ్వికాన్యాయాన్ని ఉదాహరించి సమర్థించారు. **"శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః"** అన్నట్లు సర్వప్రాణిసాధారణమైన శృంగారరసాన్ని ఆధారంగా చేసికొని తత్త్వార్థావిష్కరణ చేస్తే అది అందరికి అనుభావ్య మవుతుంది. అంతేకాక, తత్త్వదృష్టిలో గమనించినా జీవులంతా స్త్రీప్రాయులని, పరమాత్మ ఒక్కడే పురుషోత్తముడని **"ఉత్తమః పురుష స్త్వన్యః", "స్త్రీప్రాయ మితరత్ సర్వమ్"** ఇత్యాది సూక్తులు తెలుపుతున్నది. మన పూర్వాచార్యులు భగవానునకు జీవునకుమధ్య తొమ్మిది విధాలైన సంబంధాలున్నాయని, అవి పరమవైదికమైన అష్టాక్షరీచేత తెలుపబడుతున్నాయని నిరూపించారు. వాటిలో అవధారణార్థకమైన ఉకారంచేత చెప్పబడేది భర్తృభార్యాసంబంధం. శ్రీపిళ్ళైలోకాచార్యులవారు నవవిధసంబంధమనే రహస్యగ్రంథంలో జీవుడు భగవానునకు పత్నీస్థానీయుడనే విషయాన్ని సప్రమాణంగా వివరించారు. జీవుని బాహ్యరూపం పురుషరూపమైనా, స్త్రీరూపమైనా. జీవుడు తన స్వరూపాన్నిబట్టి భగవాననకు పత్నీస్థానీయుడైనపుడు, గోపికలైనా, మహర్షులైనా, ఆ*ళ్వా*ర్లు అయినా భక్తి అతిశయించినపుడు నాయికా భావాన్ని పొందడం, ఆ భావనతో పల్కడం సహజమే అవుతుంది. ఆరోపానికి అవకాశం లేదు. ఇక్కడ వక్తవ్య విషయాలు చాలా ఉన్నా విస్తర భీతితో ఇంతటితో విరమింపబడుతున్నది.

ఆంధ్రదేశంలో, విశేషించి ఉత్తరాంధ్ర ప్రాంతంలో ద్రావిడభాషపట్ల ఆ*ళ్వా*ర్ల ద్రావిడప్రబంధాలపట్ల, వాటికి పూర్వాచార్యులు కృపజేసిన వ్యాఖ్యానాలపట్ల చిరకాలంగా గల ఆదరగౌరవాలు ఎనలేనివి. గతశతాబ్దిలో రామతీర్థంలో వేంచేసి ఉన్న పండిత ఉ.వే. శ్రీమాన్ తి.ప. రామానుజస్వామివారికి, విశాఖపట్టణంలో వేంచేసి ఉన్న ఉ.వే. శ్రీమాన్ పండిత తి.ప. నారాయణస్వామివారికి గల బహుముఖవైదుష్యాన్ని, విశేషించి ద్రావిడ భాషపై వీరిరువురకు గల పట్టును వీరు వెలయించిన పలు కృతులు నిరూపిస్తున్నాయి. శ్రీమాన్ తి.ప. రామానుజస్వామివారు సింహాచలం, జగన్నాథం, భద్రాచలం, పద్మనాభం, శ్రీకూర్మం, రామతీర్థం - అనే దివ్యదేశాలలో వేంచేసి ఉండే అర్చామూర్తుల విషయంలో రచించిన ద్రావిడ పాశురదశకాలు, శ్రీమాన్ తి.ప. నారాయణస్వామివారు రచించిన **శఠకోపర్ అన్దాది, నూ*ఱ్ఱె*ట్టుత్తిరుపతి అన్దాది** వివరణాలు నిరూపిస్తున్నాయి. వీరిరువురివలెనే కోరుకొండ ప్రాంతంలో ఉభయవేదాంత విద్వత్తల్లజులుగా పేరొంది, మహావిద్వాన్ కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారిచే **"ఆంధ్రదేశీయా*ళ్వా*ర్"**గా సంభావింపబడ్డ ఉ.వే. శ్రీమాన్ శాంతలూరి జయజయ రామానుజాచార్య స్వామివారు

మణిప్రవాళశైలిలో అత్యంతం రసవంతంగా రచించిన శ్రీ గోపికాగీతా వ్యాఖ్యానం పైన పేర్కొన్న సత్కృతుల కోవలోనికి చెందినది. వీరిది పండితవంశం. వీరి పరమాచార్యులు భగవానుని వైజయంతీ వనమాలను స్తుతిస్తూ అద్భుతమైన "శ్రీవైజయంతీ స్తవాన్ని" రచించారు. అందలి శ్లోకాలను శ్రీమాన్ జయజయ రామానుజాచార్యస్వామివారు అసకృత్ ప్రమాణంగా గ్రహించారుకూడా. శ్రుతిచ్ఛాయలో రచింపబడినా, శుకమహర్షి ప్రోక్తంగా ప్రసిద్ధి చెందినా, ఏ కారణం వల్లనో కాని మన పూర్వాచార్యులు శ్రీరామాయణ, శ్రీవిష్ణుపురాణ, శ్రీభారత, హరివంశాదుల కిచ్చిన ప్రాముఖ్యాన్ని భాగవతానికి ఇవ్వలేదు అన్నది సుస్పష్టం. ఇపుడు శ్రీమాన్ జయజయ రామానుజాచార్యస్వామివారు రచించిన శ్రీగోపికాగీతావ్యాఖ్య ఆ కొఱతను కొంత తీరుస్తున్నదనడంలో సందేహం లేదు.

విశిష్టవిషయసంకలితం, ప్రమాణబహుళం, మధురగంభీరం అయిన ఈ వ్యాఖ్యను ఆంధ్రీకరించ వలసినదిగా భాగవతామృతవర్షి ఉ.వే. శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామివారు చేసిన ఆదేశాన్నే అర్హతగా భావించి ఈ వ్యాఖ్యానానువాదప్రయత్నాన్ని చేశాను. నిజానికి నా శక్తికి, జ్ఞానానికి మించినది అయినా, స్వరూపానురూపమైన భగవద్భాగవతాచార్య కైంకర్యాన్ని వాచికంగా చేసికొనే గొప్ప అవకాశం లభించిందనే పేరాశయే నన్నీ ప్రయత్నానికి పురికొల్పింది. నాకు తెలిసినంతవరకు ప్రమాణాల ఆకరాలనుకూడా చూపుతూ, ఆ ప్రమాణా లనూ, వ్యాఖ్యానాన్ని అనువదించాను. నా ఈ ప్రయత్నంలో ఎంతవరకు సాఫల్యాన్ని పొందాననే విషయాన్ని అభిజ్ఞులు, నిర్మత్సరులైన పెద్దలు, సహృదయపాఠకులు నిర్ణయిస్తారు. నాకు ఈ గొప్ప అవకాశాన్ని పిలిచి ఇచ్చిన సహృదయసుధీమణి, శ్రీమాన్ సాతులూరి గోపాల కృష్ణమాచార్యస్వామివారి సన్నిధిలో ముందుగా హార్దమైన, వినయంతోకూడిన కార్తజ్ఞ్యావిష్కరణను చేసికొంటున్నాను. తమ సాధువాదాలతో నన్ను ఆశీర్వదించిన పెద్దలు మహామహోపాధ్యాయ, ఉ.వే. శ్రీమాన్ డా॥ శ్రీ. న.చ. రఘునాథాచార్యస్వామివారి సన్నిధిలో, పండితరత్న, ఉభయవేదాంత వాచస్పతి, ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామి వారి సన్నిధిలో సవినయంగా కృతజ్ఞతలను సమర్పించుకొంటున్నాను. నా ఈ అనువాద ప్రయత్నంలో నాకు అన్ని విధాల మార్గనిర్దేశాన్ని చేసి, ఆశీర్వదించిన పితృపాదులు, న్యాయవేదాంత విద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి సన్నిధిలో ప్రణమిల్లుతున్నాను. ఈ సద్గ్రంథముద్రణార్థం తమ పవిత్ర ద్రవ్యాన్ని భక్తిప్రపత్తులతో సమర్పించిన శ్రీమతి చెలికాని రాజ్యలక్ష్మిగారికి, వారికుమార్తె శ్రీమతి అవనిజగారికి నా హృదయపూర్వకాభినందనలు. గ్రంథాన్ని సకాలంలో డిటిపి చేయడంలో తోడ్పడిన శ్రీమతి జయలక్ష్మిగారికి, శ్రీ చంద్రశేఖర్ గారికి, ముద్రణ కార్యభారాన్ని సమర్థవంతంగా నిర్వహించిన శ్రీహర్షవర్ధన్ గారికి కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాను. ఆంధ్రదేశప్రపన్న భాగ్యఫలంగా, కల్పతరువుగా సుధారసఝురిగా, గోపికాచార్యహృదయంగా చెప్పదగిన ఈ వ్యాఖ్యానంలోని సూక్తి మధురిమను మనసారా ఆస్వాదించి, అనుభవించి, ఆనందించవలసినదిగా సహృదయులైన ప్రపన్నులను ఆహ్వానిస్తూ. స్వస్తి.

**జయజయ రామానుజగురుశేఖర ముఖపద్మనిఃసృతా మేనామ్ ।**
**వాఙ్మకరందఝురీం భోః సహృదయభృంగాః పిబంతు హృచ్చషకైః ॥**

ఇట్లు, విన్నవించు

తిరుపతి, భాగవత విధేయుడు

16-10-10. **ఈ. ఏ. శింగరాచార్యులు**



శ్రీరస్తు.

పుణ్యామ్భోజవికాసాయ పాపధ్వాన్తక్షయాయ చ
శ్రీమానావిరభూద్భూమౌ రామానుజదివాకరః ॥

# శ్రీ రామానుజ పత్రిక

(కంచినుండి ప్రతిమాసము వెలువడుచున్నది)

సంపాదకులు :
శ్రీ కాఞ్చీ ప్రతివాదిభయఙ్కరమ్
**అణ్ణఙ్గరాచార్యులవారు.**

సం. **3.** { స్వభాను సం॥ ఫాల్గుణ మాసము. 1944 సం॥ మార్చి నెల. } నెం. **12**

## శ్రీ విశిష్టాద్వైతమత ప్రచారక సభ
## సంగ్రహ చరిత్రము.

కోరుకొండ-రాజమండ్రీ తా॥

స్వస్తిశ్రీ 1933 అంగీరసనామసంవత్సర మాఘశుద్ధ ఏకాదశీదినమున ఈగ్రామమందున్న కొండపై వేంచేసియున్న శ్రీ లక్ష్మీనృసింహస్వామివారిసన్నిధిలో అధ్యయనోత్సవము ప్రారంభమై 2 దినములు జరుగగనే 3 వనాడు మాగ్రామ ప్రధానపండితులగు శ్రీమాన్ గొట్టుముక్కల వెంకటాచా

శ్రీః

# పత్రికాధిపతి నివేదిక.

కోరుకొండ శ్రీవైష్ణవమహాసభావిషయమైన చరితములీ సంచికలో బ్రచురించియుండుటచే నావిషయములను తిరిగి వ్రాయునక్కఱలేదు. అయినను నా సంతోషాతిశయంబుచే గొన్నివిషయములను నేనుకూడ వ్రాయుచున్నాడను.

కోరుకొండయనునది రాజమండ్రికి ౧౩వ మైలులోగల క్షేత్రము. సుమారు ౨౦౦ మెట్లుగలకొండలో శ్రీ లక్ష్మీనరసింహస్వామియు క్రింద నుత్సవులును వేంచేసియున్నారు. ఇదియొక ప్రాచీనమయినక్షేత్రము. ఇచట ౧౨ సంవత్సరములుగ 'విశిష్టాద్వైతమహాసభ' జరుగుచున్నది.

సుమారు ౫. ౬. సంవత్సరములుగ నాహ్వానపత్రిక నాకంపియుండినను ఆసభను అనుభవించు భాగ్యమిపుడే గల్గెను. తెనుగుదేశములనుండు పండితులనేకులు కూడుచున్నారు. ఉపన్యాసములంజేయుటకనియే పలు విద్వాంసులు విచ్చేయుదురు. ఆ మహనీయుల యుపన్యాసములను వీనులకింపుగ ననుభవించిన యానందమును నేనుప్రచురించెడి యమృతలహరియను ద్రావిడ పత్రికలో ప్రచురించియుండినను ఈపత్రికలోను బ్రచురించుచున్నాడను.

ఆసభలో నతిమధురముగ నుపన్యసించినవిద్వాంసులు.

౧. శ్రీమదిత్యాది. న్యాయవేదాంతవాచస్పతి, నరసాపురము, తె. క. రామానుజాచార్యస్వాములవారు వీరు

మహావిద్వాంసులు న్యాయవేదాంతశాస్త్రపారంగతులు. ప్రతిపక్షులసభలోను ధైర్యముగ వాదించువిద్వాంసులు. వీరు ౨౫ సం॥లకు పూర్వము కాశిలోజరిగిన దర్శనవివాదసభ నలంకరించి వాదించి ప్రసిద్ధినొందినవారు. వీరు 'శ్రీభాష్యసార'మను విషయమును మనోహరముగ నుపన్యసించిరి. వీరికి ద్రావిడభాషలోకూడ మంచి పరిచయమున్నది.

౨. శ్రీమదిత్యాది. ఉపన్యాసకేసరి, సుబోధకసుధీమణి, కోయిల్ రంగాచార్యస్వాములవారు. వరంగలు. వీరు ఉభయవేదాంతములలోను ఇతిహాసపురాణములలోను నిపుణులు. భగవద్విషయము, రహస్యవ్యాఖ్యానములు, శ్రీరామాయణము, భగవద్గీతమున్నగువానిని పలుసారులు ప్రవచనముచేసినవారు. నిర్గళముగ నుపన్యాసములంజేసి 'యుపన్యాసకేసరి'యను బిరుదమునొందినవారు. కాంచీపురము శ్రీరంగమున్నగు దివ్యదేశములలోను ద్రావిడభాషలో నుపన్యసించినవారు. వీరి యుపన్యాసములు శ్రోతలకు కుతూహలమునుగల్గించును. వీరు రెండు ఉపన్యాసములంజేసి యమితమయిన సభారంజనముచేసిరి.

౩. శ్రీమదిత్యాది. శాంతలూరు. జయజయ రామానుజాచార్యులవారు. వీరు ఇతిహాసపురాణములలోను భగవద్విషయమునను నిపుణులు. ఆళ్వారుల దివ్యప్రబంధములను కర్ణశ్రావ్యముగ ప్రమాణీకరించి సంగీతసారస్యముతోనుపన్యసించువారు. 'ఆంధ్రదేశీయాళ్వారు' అనియే వీరిని చెప్పవచ్చును. వీరు 'నమ్మాళ్వారులవైభవము' నుపన్యసించిరి.

అస్మద్గురుభ్యో నమః                                                    శ్రీమతే రామానుజాయ నమః



ఉభయవేదాన్తవిద్వద్వరేణ్యైః శాంతలూరి జయజయ రామానుజాచార్యవర్యై రనుగృహీతమ్

# శ్రీగోపికాగీతావ్యాఖ్యానమ్

## అవతారికై

### ముదల్ శ్రియఃపతి

1) శ్రియా విలసితోరసం శ్రితజనానుకంపారసం
జగజ్జననకారణం జనసమూహపాపచ్ఛిదమ్ ।
వరాద్రిశిఖరస్థితం కరధృతాబ్జపంచాయుధం
సదా నరహరిం భజే సకలదేవతానాం వరమ్ ॥

2) శ్రీమద్వేంకటనారసింహతనయం తత్పాదపద్మాశ్రయం
భారద్వాజసగోత్రజాత ముభయశ్రుత్యంతశాస్త్రార్థదమ్ ।
మాయావాదిమదేభకుంభదళనక్రీడావిహారక్షమం
శ్రీమత్కృష్ణగురూత్తమం బుధమణిం సేవేఽనిశం భక్తితః ॥

3) శమదమగుణభూషం శాంతలూర్వంశవార్ధి-
ప్రవిమలకిరణం తం కృష్ణసూర్యాత్మజాతమ్ ।

---

ఉ.వే. విద్వద్వరేణ్యులు శాంతలూరు జయజయ రామానుజాచార్యస్వామివారు అనుగ్రహించిన

# శ్రీగోపికాగీతావ్యాఖ్యానము

## అవతారిక - ఆంధ్రానువాదము

### ముదల్ శ్రియఃపతి

1. లక్ష్మీదేవితో ప్రకాశించే వక్షఃస్థలాన్ని కలవాడు, ఆశ్రితజనులపట్ల కరుణారసాన్ని కలవాడు, లోకసృష్టికి హేతుభూతమైనవాడు, భక్తసమూహంయొక్క పాపాలను ఛేదించేవాడు, గొప్ప సింహాద్రిశిఖరంపై ఉన్నవాడు, పద్మాలవంటి చేతులలో అయిదు ఆయుధాలను ధరించినవాడు, సకలదేవతలలో శ్రేష్ఠుడు అయిన నృసింహస్వామిని ఎల్లప్పుడు భజిస్తున్నాను.

2. శ్రీవేంకటనృసింహుల తనయులు, ఆ నరసింహాచార్యులవారి పాదపద్మాలను ఆశ్రయించినవారు, భారద్వాజగోత్రులు, ఉభయవేదాంతాల అర్థాన్ని ప్రసాదించేవారు, మాయావాదులనబడే మత్తగజాల కుంభస్థలాలను (మర్మస్థానాలను) బద్దలుకొట్టడం అనే క్రీడలో (లీలలో) సమర్థులు, పండితులలో మణివంటివారు అయిన శ్రీకృష్ణులనే గొప్ప గురువులను నిత్యం భక్తితో సేవిస్తున్నాను.

3. శమం, దమం మొదలైన కల్యాణగుణాలకు శోభను కలిగించే అలంకారమైనవారు, శాంతలూరు వంశమనే సముద్రానికి చంద్రునివంటివారు. కృష్ణమాచార్యుల కుమారులు, ఆ కృష్ణమాచార్యులవారి పాదాలలో భక్తిని కలవారు.

తదమలపదసక్తం మన్త్రసారార్థబోధం
జయజయపదపూర్వం నౌమి రామానుజార్యమ్ ॥

శ్రియఃపతియాయ్, నిఖిలహేయప్రత్యనీకకల్యాణైకతాననాయ్, స్వేతరసమస్తవస్తువిలక్షణవిగ్రహయుక్తనాయిరుక్కిఱ సర్వేశ్వరన్ "దేవానాం పూ రయోధ్యా" (తైత్తి. ఆర - 1-27) ఎన్గుమ్, "న తత్ర సూర్యో భాతి"(కఠ - 5-15) ఎన్గుమ్, "యత్రర్షయః ప్రథమజా యే పురాణాః" (అచ్ఛిద్రే) ఎన్గుమ్, "అత్యర్కానలదీప్తం తత్ స్థానం విష్ణోర్మహాత్మనః" (భార. వన- 163-19) ఎన్గుమ్, "తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యంతి సూరయః" (ఋగ్వేద - 1-22-20) ఎన్గుమ్, "త్వాం సేవితం జలజచక్రగదాసిశార్ఙ్గైః తార్క్ష్యేణ సైన్యపతినానుచరై స్తథాన్యైః, దేవ్యా శ్రియా సహ వసన్త మనంతభోగే భుంజీయ సాంజలి రసంకుచితాక్షిపక్ష్మా" (వైకుంఠస్తవే - 76) ఎన్గుమ్, "తేవిమారావార్" (తిరువాయ్ - 8-1-1) ఎన్గుమ్, "వీఱ్ఱిరున్దు" (తిరువాయ్ - 4-5-1) ఎన్గుమ్ శొల్లుగిఱపడియే "అన్దమిల్ పేరిన్బ" (తిరువాయ్ - 10-9-11) మాయ్, పునరావృత్తిరహితమాయ్, స్వయంప్రకాశమాయ్, అప్రతిమవైభవముడైయ శ్రీవైకుంఠత్తిలే "అవాక్యనాదరః" (ఛాందో-3-14-2) ఎన్గుమ్బడి పెరియ మేన్మైయోడే, అప్రాకృతమాన తిరుమామణిమంటపత్తిలే పంచశయనమాయ్, "నివాసశయ్యాసన పాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభిః, శరీరభేదై స్తవ శేషతాం గతై ర్యథోచితం శేష ఇతీరితే జనైః" (స్తోత్రరత్నమ్-40) ఎన్గిఱపడియే తద్విషయత్తిలే మికవుమ్

---

తిరుమంత్రం మొదలైన జ్ఞాతవ్యాలైన మంత్రాల అర్థాన్ని అనుగ్రహించేవారైన, అద్వితీయులైన శ్రీమాన్ జయజయ రామానుజాచార్యస్వామివారికి నమస్కరిస్తున్నాను.

శ్రియఃపతియై, నిఖిలహేయప్రత్యనీకుడై (చేతనాచేతనగతాలైన దోషాలకు అన్నిటికిని ప్రతిభటుడై), అన్ని కల్యాణగుణాలకు స్థానమైనవాడై, తనకంటె వేఱయిన సమస్తవస్తువుల రూపంకంటే విలక్షణమైన విగ్రహాన్ని (రూపాన్ని) కలవాడై ఉండే సర్వేశ్వరుడు "దేవానాం పూ రయోధ్యా" (దేవతలనబడే నిత్యసూరులుండే నగరం అయోధ్య) అని, "న తత్ర సూర్యో భాతి" (అక్కడ పరమపదంలో సూర్యుడు ప్రకాశించడు) అని, "యత్రర్షయః ప్రథమజా యే పురాణాః" (ఎక్కడ సర్వజ్ఞులైనవారు, ముందు పుట్టినవారు, సనాతనులైన నిత్యసూరులు) అని, "అత్యర్కానలదీప్తం తత్ స్థానం విష్ణో ర్మహాత్మనః" (మహాత్ముడైన విష్ణువుయొక్క ఆ స్థానం సూర్యుని కాంతిని, అగ్ని కాంతిని మించిన కాంతిని కల్గినది.) "తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యంతి సూరయః" (అది విష్ణువుయొక్క గొప్ప స్థానం, అక్కడ నిత్యసూరులు సదా భగవానుని సేవిస్తూ ఉంటారు) అని, "త్వాం సేవితం జలజచక్రగదాసి శార్ఙ్గైః తార్క్ష్యేణ సైన్యపతినానుచరైస్తథాన్యైః దేవ్యా శ్రియాసహ వసంత మనంతభోగే భుంజీయ సాంజలి రసం కుచితాక్షిపక్ష్మా" (శంఖం, చక్రం, గద, ఖడ్గం, శార్ఙ్గం''- అనే ఆయుధాలచే, గరుడునిచే, సేనాపతి అయిన విష్వక్సేనునిచే, ఆ విధంగానే ఇంకా ఇతర అనుచరులచే సేవింపబడేవాడవు, లక్ష్మీదేవితో పాటు ఆదిశేషునిపైన ఉన్నవాడవైన నిన్ను అంజలి చేస్తూ కన్నులార దర్శిస్తాను) అని, "తేవిమారావార్" (దేవేరులైనవారు) అని, "వీఱ్ఱిరున్దు" (వేంచేసి ఉండి) అని పలికే రీతిలో "అన్దమిల్ పేరిన్బమ్" (అంతు లేని బ్రహ్మానందమై), పునరావృత్తిని లేనిదై, స్వయంప్రకాశకమై, సాటి లేని వైభవాన్ని కల శ్రీవైకుంఠంలో "అవాక్యనాదరః" (ఏమీ పలుకడు, ఎవరిపట్ల ఆదరాన్ని చూపడు) అనే రీతిలో గొప్ప పరత్వగుణంతో, అప్రాకృతం అయిన తిరుమామణిమంటపంలో పంచశయనమై, "నివాసశయ్యాసన పాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభిః శరీరభేదై స్తవ శేషతాం గతైః యథోచితం శేష ఇతీరితే జనైః" (నివాసం, శయ్య, ఆసనం, పాదుకలు, ధరించే వస్త్రం, తలదిండు, గొడుగు మొదలైన, నీకు శేషవృత్తిని చేసే శరీరప్రకారాలతో సేవిస్తూ, జనులచేత శేషుడని పిలువబడే) అన్నట్లు ఆ స్వామి

పరివృఢైయనాయ్, తచ్ఛేషత్వప్రకాశమాన శేష నెన్గిఱ తిరునామత్తై తనక్కు నిరూపకమాక ధరిత్తిరుక్కిఱ తిరువన్దాఴ్వాన్మేలే నిత్యసూరినిషేవ్యమాణ చరణనళిననాయ్కొణ్డు, పిరాట్టిమార్కళోడు అవాఙ్మానసగోచరవైభవ యుక్తనాయ్ వీఱ్ఱిరున్దరుళి యిరుక్కచ్చెయ్దేయుమ్, "అక్షరం తమసి లీయతే ..... తమః పరే దేవ ఏకీ భవతి" (సుబాల-2) ఎన్గిఱ పడియే ప్రళయకాలత్తిలే తన్ వయిఱ్ఱిలే మూలప్రకృతియోడే శేరి అసత్కల్పరాయ్ కిడక్కిఱ చేతనర్గళై ప్పార్త్తు "అచిదవిశిష్టాన్ ప్రళయే జంతూ నవలోక్య జాతనిర్వేదా, కరణకళేబరయోగం ఘటయసి వృషశైలనాథకరుణే! త్వమ్" (దయాశతకమ్-17) ఎన్గిఱపడియే అత్యంతవ్యాకులచిత్తనాయ్, కరుణాసముద్ర నాగైయాలే "ఇవర్గళ్ ఇప్పడి ఇఴక్కవొణ్ణాదు" ఎన్ఱు "విచిత్రా దేహసంపత్తిః" (విష్ణుతత్త్వే- 6) ఎన్గిఱపడియే తన్నై సర్వవిధకైంకర్యఙ్గళాలే ఉగప్పిత్తు త్తరిక్కైక్కుఉప్పాగ ఇవర్గళుక్కు కరణకళేబరఙ్గళై క్కొడుత్తు, ఇవఱ్ఱై క్కొణ్డు వ్యభిచరియాదే "మానం ప్రదీప మివ కారుణికో దదాతి" (శ్రీరంగరాజస్తవ- ఉత్తర- 1) ఎన్గిఱపడియే "వేదనూల్" (తిరుమాలై-3) ఎన్నోదప్పడుగిఱ విధినిషేధాత్మకమాన వేద మెన్గిఱ శాస్త్రత్తై "తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే ముహ్యంతి యత్సూరయః" (భాగవతమ్-1-1-1) ఎన్గిఱపడియే నాన్ముగనారై మున్నిట్టు ప్రసాదిత్తరుళి, ఇన్ద "వేదత్తినుట్పొరు" (కణ్ణినుణ్ -9) ళాన అర్థమ్ "వేదార్థవిజ్ఞానసునిశ్చితార్థాః సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః" (తైత్తి. నారా-10-10) ఎన్గిఱ పడియే తన్ తిరువడిగళిల్ పణ్ణుమ్ శరణాగతియాగైయాలే, ఇన్ద అర్థత్తై క్కాణుమ్బడి "వేదోపబృంహణకుతూహలినా నిబద్ధమ్ విశ్వంభరా శ్రుతిభవేన మహర్షిణా యత్, వ్యాసేన యచ్చ

---

విషయంలో చాలా ప్రేమతో, ఆ స్వామికి శేషభూతుడై ఉండే స్థితిని ప్రకాశింపజేసే శేషుడనే పేరును తనకు నిరూపకంగా కల్గి ఉన్న తిరువనన్దాఴ్వాన్ (అనే శయ్య) పైన నిత్యసూరులచే సేవింపబడే పాదపద్మాలను కలవాడై, దేవేరులతో పాటుగా, వాక్కుకు, మనస్సుకు అందని వైభవాన్ని కలవాడై వేంచేసి ఉన్నా, "అక్షరం తమసి లీయతే, తమః పరే దేవ ఏకీభవతి" (అక్షరమనే తత్త్వం తమస్సులో లయిస్తుంది; తమస్సు పరమాత్మలో లీనమవుతుంది) అని పలికే రీతిలో ప్రళయకాలంలో తన ఉదరంలోని మూలప్రకృతితో చేరి, అసత్కల్పులై (ఉన్నా లేనట్లున్నవారై) ఉండే చేతనులను చూచి, "అచిదవిశిష్టాన్ ప్రళయే జంతూ నవలోక్య జాతనిర్వేదా, కరణకళేబరయోగం ఘటయసి వృషశైలనాథకరుణే! త్వమ్" (అచిత్తుతో సమానంగా ప్రళయసమయంలో ఉన్న జీవులను చూచి, నిర్వేదాన్ని పొంది, వారికి కరణకళేబర ప్రదానాన్ని ఓ వృషశైలనాథుని కరుణాదేవీ! నీవు అనుగ్రహిస్తున్నావు) అనే రీతిలో మిక్కిలి వ్యాకులాన్ని కల మనస్సును కలవాడై, కరుణాసముద్రుడు కావడంవల్ల "వీరీవిధంగా పాడుకాకూడదు'' అని, "విచిత్రా దేహసంపత్తిః' (విచిత్రమైన దేహసంపద) అని అన్నట్లు తనను అన్నివిధాలైన కైంకర్యాలతో ఆనందింపజేసి, తరించడానికి వీలుగా వీరికి కరణకళేబరాలను ఇచ్చి, వీటిని వీరు ఉపయోగించి, అక్రమంగా ప్రవర్తించకుండా ఉండేటట్లు "మానం ప్రదీప మివ కారుణికో దదాతి" (గొప్ప దీపంవంటి శాస్త్రాన్ని కరుణాళువు అయిన భగవానుడు ఇస్తాడు) అని పలికేటట్లు "వేదనూల్" (వేదమనే శాస్త్రం) అని చెప్పబడే విధినిషేధాత్మకం అయిన శాస్త్రాన్ని "తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే ముహ్యంతి యత్సూరయః" (ఆ పరమాత్మ తన సంకల్పంతో బ్రహ్మదేవునికి వేదజ్ఞానాన్ని ప్రసాదించాడు) అన్నట్లు చతుర్ముఖుని పురస్కరించుకొని అనుగ్రహించి, ఈ "వేదత్తినుట్పొరుళ్" (వేదంలోని రహస్యార్థం), "వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః సన్న్యాసయోగా ద్యతయః శుద్ధసత్త్వాః" (వేదాంతవిజ్ఞానంలో సుదృఢమైన అర్థాన్ని కలవారు, సన్న్యాస (శరణాగతి) యోగాన్ని స్వీకరించినవారు, శుద్ధస్వభావాన్ని కలవారు) అని చెప్పే రీతిలో తన శ్రీపాదాలలో చేసే శరణాగతి కనుక, ఈ అర్థాన్ని గ్రహించేటట్లుగా "వేదోపబృంహణకుతూహలినా నిబద్ధమ్ విశ్వంభరాశ్రుతిభవేన మహర్షిణా యత్, వ్యాసేన యచ్చ మధుసూదన పాదరక్షే! ద్వే చక్షుషీ త్వదనుభావ మవేక్షితుం నః" (వేదార్థాన్ని విశదీకరించాలనే కుతూహలం కల

మధుసూదనపాదరక్షే! ద్వే చక్షుషీ త్వదనుభావ మవేక్షితుం నః" (పాదుకాసహస్రే-33) ఎన్గిఱపడియే శ్రీమద్రామాయణ మహాభారతజ్గళై ఇరణ్డు కణ్గళాగ ప్రసాదిత్త విడత్తిలుమ్ ఇవర్గళ్ సర్వేశ్వరకైంకర్యత్తిల్ అభినివేశత్తై ప్పణ్ణాదే, "త్వం మే" (భట్టర్‌ముక్తకమ్) ఎన్నాల్, "అహం మే" (భట్టర్ ముక్తకమ్) ఎన్ఱు విముఖరాయ్ దుర్విషయజ్గళిలే మణ్డిప్పోరుగిఱపడియై క్కణ్డు, "మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణః" (సుబాల-6) ఎన్గిఱపడియే సర్వవిధబంధువాగైయాలే, అన్ద కుడల్‌తుడక్కాలే ఎన్నిరుప్పు "భక్తానామ్" (జితంతే-) ఎన్ఱుమ్బడి చేతనర్క్కన్ఱో? చేతనరక్షణత్తుక్కుఉప్పాగ ధరిక్కిఱ ఇన్ద విభూతియుమ్, పిరాట్టిమార్గళుమ్, నిత్యసూరివర్గముమ్, పంచాయుధజ్గళు మెల్లామ్, చేతనరక్షణత్తుక్కుఉప్పాగాదే, "న మాంసచక్షుభి రభివీక్షతే తమ్" (తిరుమాలైవ్యాఖ్య - 33వ పా), "న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్" (ముండక- 3-1-8) ఎన్ఱుమ్, "కట్కిలీ!" (తిరువాయ్ - 7-2-3) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే ఒరువర్క్కుమ్ కాణవొణ్ణాదపడి దుర్లభమాయిరుక్కిఱ ఇరుప్పుక్కు ప్రయోజన మెన్?" ఎన్ఱు పెరియ ఆర్తియోడే "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" (భగ- 4-8) ఎన్గిఱపడియే అనేక దివ్యావతారజ్గళ్ పణ్ణియరుళినాన్. భగవద్విషయత్తుక్కు ఉఉప్పాగాదవన్ఱు "న హి మే జీవితేనార్థః" (రామా-సుందర-26-5) ఎన్ఱుమ్, "న దేహం న ప్రాణాన్" (స్తోత్రరత్నమ్) ఎన్ఱుమ్,"ఉయిరినాల్ కుఱైవిలమే" (తిరువాయ్ 4-8-1), "మణిమామై కుఱైవిలమే" (తిరువాయ్-4-8-1) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే శరీరత్తోడు, ప్రాణజ్గళోడు, అర్థజ్గళోడు సంబంధమ్ త్యజిత్త తదీయర్ (పడి)పోలే కాణుమ్, చేతనవిషయత్తిల్ అత్యంతసౌహార్దయుక్తనా యిరుక్కిఱ ఇవన్ పడియుమ్. "అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్, న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః" (రామా- ఆరణ్య-10-19) ఎన్నాఱిరే శ్రీచక్రవర్తితిరుమకనార్.

---

వాల్మీకిమహర్షిచేత, వ్యాసమహర్షిచేత ఓ మధుసూదనపాదుకా! నీ మహిమను దర్శించడంకోసం మాకు రెండు కళ్ళవంటి శ్రీరామాయణ, మహాభారతాలు రచింపబడ్డాయి) అని పలికేటట్లు శ్రీమద్రామాయణ మహాభారతాలను రెండు నేత్రాలుగా ప్రసాదించినప్పటికీ, వీరు (జీవులు) సర్వేశ్వరుని కైంకర్యంలో అభినివేశాన్ని పొందకుండా, "త్వం మే" (నీవు నా వాడివి) అని అంటే "అహమ్ మే" (నేను నాకు చెందినవాడనే) అని పరమాత్మపట్ల విముఖులై, చెడ్డ విషయాలలో పూర్తిగా ఆసక్తులై ఉండే స్థితిని చూచి, "మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణః" (తల్లి, తండ్రి, సోదరుడు, నివాసం, శరణం, స్నేహితుడు, గతి నారాయణుడు) అని పలికే రీతిలో సర్వవిధబంధువైనందున, ఆ గర్భసంబంధంవల్ల "నా స్థితి "భక్తానామ్" (భక్తులకోసం) అన్నట్లు చేతనులకోసమేకదా ! చేతనుల రక్షణకు వీలుగా ధరించే ఈ విభూతి, దేవేరులు, నిత్యసూరివర్గం, పంచాయుధాలు- అన్నీ చేతనుల రక్షణకోసం కాకుండా, "న మాంసచక్షుభి రభివీక్షతే తమ్" (మాంసచక్షువులతో ఆ పరమాత్మను చూడలేడు) అని, "న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్" (ఎవడూ ఇతనిని కంటితో చూడలేడు) అని, "కట్కిలీ !" (నేత్రగోచరుడవు కానివాడా) అని పలికే రీతిలో ఎవరికీనీ కానరాని రీతిలో దుర్లభమై ఉన్న స్థితికి ప్రయోజనం ఏమి ?'' అనే గొప్ప ఆర్తితో "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" (ధర్మాని చక్కగా స్థాపించడంకోసం ప్రతియుగంలోను అవతరిస్తాను) అని అన్నట్లు అనేక దివ్యావతారాలను ఎత్తాడు. భగవద్విషయానికి ఉపయోగపడనపుడు "న హి మే జీవితేనార్థః" (నాకు జీవితంలో ప్రయోజనం లేదుకదా) అని, "న దేహం న ప్రాణాన్" (దేహాన్ని కోరను, ప్రాణాలను కోరను)అని, "ఉయిరినాల్ కుఱైవిలమే" (ప్రాణాలతో నాకు పని లేదు) "మణి మామై కుఱైవిలమే" (దేహలావణ్యంతో పని లేదు) అని చెప్పే రీతిలో శరీరంతో, ప్రాణాలతో, విషయాలతో సంబంధాన్ని త్యజించిన భక్తుల స్థితివలె కదా, చేతనుల విషయంలో ఎంతో సౌహార్దం కల ఇతని స్థితికూడా ఉంటుంది. "అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో

**(అహం జీవిత మపి జహ్యామ్)** పెరుమాళ్, దండకారణ్యావాసిగళాన ఋషిగళ్ శరణాగతరాగ, "రాక్షసర్గళై వధిత్తు ఉజ్గళై రక్షిక్కిఱేన్" ఎన్ఱు ప్రతిజ్ఞై పణ్ణినవాఱే, పిరాట్టి అవరుడైయ దీక్షైయై పరీక్షిక్కైక్కాగ "రాజ్యత్తై విట్టు తాపసవేషత్తోడే ఇరుక్కిఱ ఉజ్గళుక్కు నిరపరాధిగళాన రాక్షసర్గళోడు విరోధ మసంభావితమ్కాణ్" ఎన్ఱు తడైత్త, **(అహం జీవిత మపి జహ్యామ్)** ఎన్గిఱార్.

**(అహమ్)** సర్వజ్ఞనాయ్, సర్వశక్తనాయ్, అఖిలకల్యాణగుణాకరనాయ్, సకలచేతనరక్షణవిషయమాగ సౌశీల్యవేషత్తోడే ఇన్ద విభూతియిలే వన్దవతరిత్త నాన్.

**(అహమ్)** నారాయణత్వ ప్రయుక్తమాన సర్వవిధ బంధువాన నాన్.

**(అహమ్)** "వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః" (భగ-15-15) ఎన్ఱుమ్, "పతిం విశ్వస్యాత్మేశ్వరమ్" (తైత్తి. నారా-11) ఎన్ఱుమ్, "అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః", "న ద్వితీయోఽస్తి కశ్చిత్" (సుబాల- 7) ఎన్ఱుమ్, "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్" (కఠ-5-13, శ్వేత-6-13) ఎన్ఱుమ్ శొల్లు గిఱపడియే సకలవేదవేద్యనాయ్, సర్వరక్షకనాయ్, ఉపాయోపేయభూతనాయ్, సర్వఫలప్రదనా యిరుక్కిఱ నాన్.

**(అహమ్)** ఇప్పడి యిరుక్కిఱ నాన్ ఇవర్గళై ఎప్పడి విడువేన్? అప్రాప్త నెన్ఱు విడువేనో? అరక్షకనెన్ఱు విడువేనో? ఫలప్రదనాగమాట్టే నెన్ఱు విడువేనో ? అబంధువాయ్ విడువేనో ? దుర్గుణజ్గళు డైయనాయ్ విడువేనో ? అశక్తనాయ్ విడువేనో? ఎన్ శొల్లి విడువేన్?

---

విశేషతః" (సీతా! నేను నా జీవితాన్ని అయినా, లేక, లక్ష్మణునితో పాటు నిన్ను అయినా వదలివేస్తాను. కాని చేసిన ప్రతిజ్ఞను మాత్రం వదలను. విశేషించి బ్రాహ్మణుల కిచ్చిన మాటనుమాత్రం వదలను) అన్నాడుకదా శ్రీరాముడు. (ఇక ఇపుడు ఈ శ్రీరామాయణ ప్రమాణశ్లోకం వ్యాఖ్యానింపబడుతున్నది.)

**(అప్యహం జీవితం జహ్యామ్)** - శ్రీరాముడు, దండకారణ్యంలో నివసించే ఋషులు శరణాగతిని చేసినపుడు, "రాక్షసులను వధించి మిమ్ములను రక్షిస్తాను'' అని ప్రతిజ్ఞ చేయగానే, సీతాదేవి ఆయన దీక్షను పరీక్షించడంకోసం "రాజ్యాన్ని విడచి తాపసవేషంతో ఉన్న మీకు నిరపరాధులైన రాక్షసులతో విరోధం మంచిది కాదు సుమా!'' అని అడ్డుకోగా, **(అహం జీవిత మపి జహ్యామ్)**- అని అన్నాడు.

**(అహమ్)** సర్వజ్ఞుడనై, సర్వశక్తినై, అఖిలకల్యాణగుణాకరుడనై, సకలచేతనుల రక్షణవిషయంలో సౌశీల్యవేషంతో ఈ విభూతిలో అవతరించిన నేను.

**(అహమ్)** - నారాయణత్వప్రయుక్తం అయిన సర్వవిధ బంధుత్వాన్ని కల నేను.

**(అహమ్)** - **"వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః"** (అన్ని వేదాలచే తెలియబడేవాడను నేనే) అని, **"పతిం విశ్వస్యాత్మేశ్వరమ్"** (లోకానికి ప్రభువు, తనకు తానే ఈశ్వరుడు అయినవానిని) అని, **"అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః"** (పాపసంబంధాన్ని లేనివాడు, ప్రకాశించేవాడు నారాయణుడొకడే) **"న ద్వితీయోఽస్తి కశ్చిత్"** (నారాయణుడు తప్ప రెండవవాడు ఎవడూ లేడు) అని, **"నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్"** (నిత్యులలో నిత్యుడు, చేతనులలో పరమచేతనుడు అయిన ఒకడు పలు విధాలైన మనోరథాలను సృష్టిస్తున్నాడో) అని చెప్పే రీతిలో సకలవేదవేద్యుడనై, సర్వరక్షకుడనై, ఉపాయోపేయ భూతుడనై, సర్వఫలప్రదుడనై ఉన్న నేను.

**(అహమ్)** - ఈవిధంగా ఉన్న నేను వీరిని ఏవిధంగా విడుస్తాను? సంబంధం లేనివాడనని విడువనా? రక్షకుణ్ణి కానని విడువనా? ఫలప్రదుడను కాలేనని విడువనా? బంధువునుకానని విడువనా? దుర్గుణాలను

**(జీవిత మపి జహ్యామ్)** ఎల్లామ్ పోనాలుమ్ విడ అరిదాన జీవితత్తైయుమ్ నాన్ తృణమాగ విడుగిఱేన్. చేతనసంరక్షణత్తుక్కుఱుప్పాగవిఱే నాన్ ఇన్ద విభూతియిలే అవతరిత్తదు. ఎన్నుడైయ అవతారమ్ చేతనసంరక్షత్తుక్కాగాదవన్టు నమ్ జీవితత్తోడు ఎనక్కు ప్పయ నిల్లై. ఆనపిన్బు అత్తై ఎళిదాగ విడుగిఱేన్ ఎన్గిఱార్.

**(త్వాం వా)** జీవితత్తై విడిలుమ్ విడలామ్, "ప్రాణేభ్యోఽపి గరీయసీ" **(రామా-ఆర- 10-22)** ఎన్టు దేవర్ మున్బు శొల్లినపడియే దేవర్క్కు అతిప్రియావహైయాయ్, ఉఙ్గళుక్కు ఉయిర్ ప*ఱ్ఱా*న నాన్ శొన్న వార్త్తై కేట్టవల్లరల్లీరో?" ఎన్టు పిరాట్టి విణ్ణప్పమ్ శెయ్దవాఱే, **(త్వాం వా)** ఎన్గిఱార్.

**(త్వాం వా)** "చేతనరై పురుషకారభూతైయాయ్ ఎన్బక్కల్ అభిముఖరాక్కుకైక్కల్లైయో ఉన్నై నా నఙ్గీకరిప్పదు. చేతనరై ఎన్ తిరువడియుడనే శేర్త్తు రక్షిక్కత్తక్క నీ, చేతనరై విడచ్చొన్న ఇత్తాలే ఉన్నుడైయ శేర్త్తి ఎనక్కు విషమిశ్రభోజనమ్బోలే మిగవు మనిష్టమాయ్ విడుమ్. ఆనపిన్బు, ఉన్నైయుమ్ వేణ్డా ఎన్టు విడుగిఱేన్. "న జీవేయం క్షణ మపి" **(రామా-సుందర- 66-11)** ఎన్టుమ్బడి ఉన్నై నాన్ ప్రేమిక్కిఱా నెన్నదువే హేతువాగ మిగవుమ్ భాగవతవిరోధియా యిరున్దాయ్!

**(సీతే)** "నా నయోనిజై". "గన్ధవతీ పృథివీ" **(తర్కసంగ్రహమ్)** ఎన్టు సర్వగన్ధత్తుక్కిరుప్పిడమాయ్, రత్నగర్భైయాయిరుక్కిఱ బూమిక్కు పిఱన్దేన్. గన్ధమ్బోలేయుమ్, రత్నఙ్గళ్ పోలేయుమ్ ఎన్నుడైయ వైభవ మనుభవైకవేద్య మాగిఱదొ*ழி*య, వాక్కాల్ శొల్లి ముడియప్పోగామల్, "అధిశయితవా నబ్ధిం నాథో మమన్థ బబన్ధ తమ్, హరధను రసౌ వల్లీభఙ్జం బభఞ్జ చ మైథిలి!" (శ్రీగుణరత్న) ఎన్గిఱపడియే, అత్యంతశ్రమయుక్తనాయ్, ఎన్నై కైప*ఱ్ఱి*నవన్ నమ్ వార్త్తై కేళానో?" ఎన్టు మిగవుమ్ గర్వితైయా యిరున్దాయో? ఉన్నుడైయ సీతాత్వమ్

---

కలవాడనని విడువనా? శక్తి లేనివాడనని విడువనా? ఏమని చెప్పి విడువను?

**(జీవిత మపి జహ్యామ్)** - అన్నీ పోయినా విడువడానికి సాధ్యం కాని జీవితాన్నికూడా నేను తృణంగా విడుస్తాను. చేతనసంరక్షణకు వీలుగాకదా నేను ఈ లోకంలో అవతరించాను. నా అవతారం చేతనరక్షణకోసం కానపుడు నా జీవితంతో నాకు ప్రయోజనం లేదు. అందువల్ల దానిని సులభంగా వదలివేస్తాను- అని అంటున్నాడు.

**(త్వాం వా)** - జీవితాన్ని విడిచినా విడువవచ్చు. "ప్రాణేభ్యోఽపి గరీయసీ" (ప్రాణాలకంటే కూడా గొప్పది) అని అంటూ పూర్వం నీవు పల్కిన రీతిలోనే నీకు అత్యంతప్రియావహమై, నీకు ప్రాణాధారం అయిన నేను పల్కిన వార్తను వినలేదా? అని పిరాట్టి విన్నపించగానే, **(త్వాం వా)** - అని అంటున్నాడు.

**(త్వాం వా)**- చేతనులను పురుషకారభూతవై, నాపట్ల అభిముఖులను చేయడానికేకదా నిన్ను నేను అంగీకరించినది. చేతనులను నా శ్రీపాదాలలో చేర్చి, రక్షించతగిన నీవు, చేతనులను విడువమని చెప్పినందువల్ల నీ సంబంధం నాకు విషమిశ్రభోజనంవలె చాలా అనిష్టం అవుతుంది. అందువల్ల నిన్నుకూడా వద్దని వదలివేస్తాను. **"న జీవేయం క్షణ మపి"** (క్షణం కూడా జీవించలేను) అనే రీతిలో "నిన్ను నేను ప్రేమిస్తున్నాను"అనే కారణంవల్ల చాలా భాగవత విరోధిగా ఉన్నావే!

**(సీతే)** "నేను అయోనిజను. **"గంధవతీ పృథివీ"** (గంధాన్ని కల్గినది పృథివి) అని సమస్తగంధాలకు నెలవై, రత్నగర్భ అయిన భూమికి జన్మించాను. గంధంవలె, రత్నాలవలె నా వైభవం అనుభవైకవేద్యం అవుతుంది తప్ప, వాక్కుతో చెప్పి ముగించలేనిది. కనుక, **"అధిశయితవా నబ్ధిం నాథో మమంథ బబంధ తమ్, హరధను రసౌ వల్లీభంజం బభంజ చ మైథిలి !"** (తల్లీ ! మైథిలీ ! నీకోసం నాథుడు సముద్రంలో శయనించాడు, దానిని మథించాడు, బంధించాడు. శివధనుస్సును చిన్నతీగను తెంపినట్లు అనాయాసంగా విఱిచాడు) అనే రీతిలో

చేతనరక్షణత్తుక్కుఉపయోగామే, ఎన్నైయుమ్ తడైత్తవాతే ఎనక్కు మిగవుమ్ ప్రియకరమాగాదు. అదొ౯్ఱియ హేయకల్పమా యిరున్దదీ! ఆనపిన్బు, ఉన్నుడైయ సహవాసముమ్ నాన్ వేణ్డేన్.

(సలక్ష్మణామ్) ఉన్నై ఒరుత్తియైయు మాగాదుకాణ్ నాన్ విడువదు. లక్ష్మణసహితమాగ ఉన్నై విడుగిఱేన్.

(సలక్ష్మణామ్) "లక్ష్మణో లక్ష్మిసంపన్నః" (రామా-బాల-18-31) ఎన్నుమ్బడి మహర్షిగళాల్ కొణ్డాడప్పడుగిఱ జ్ఞానశ్రీయుడైయనాయ్, "న దేవలోకాక్రమణం నామరత్వ మహం వృణే, ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయా వినా" (రామా-అయో- 31-5) ఎన్గిఱపడియే ఎన్ పక్కల్ కుఱ్ఱ్రేవల్ శెయ్గైక్కు మేలాన దొరు వేఱనుభవ మిల్లై- ఎన్ఱు ప్రతిజ్ఞై పణ్ణి, తిరువయోధ్యత్తోడు- వనవాసత్తోడు వాశి యఱ తొడర్న్దు అడిమైశెయ్గిఱ ఎన్ తిరుత్తమ్బియాన లక్ష్మణనైయుమ్, ఎన్నుడైయ చేతనరక్షణత్తుక్కు విరోధిత్తవాతే విడుగిఱేన్

(న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య) పిన్బు దేవరీరుక్కు విడ అరిదానదుదాన్ ఏదు? ఎన్న అరుళిచ్చెయ్గిఱార్

(న తు ప్రతిజ్ఞాం) ఎన్ఱు. యారేనుమ్ "ఎన్నై నీ రక్షిక్కవేణు మెన్ఱు" శరణమ్ పుక్క "ఉన్నై రక్షిక్కిఱేన్" ఎన్ఱు నాన్ పణ్ణిన ప్రతిజ్ఞైయై భగ్నమాక్కవొట్టేన్. అవర్గళ్ ప్రార్థిక్కైక్కు మున్బే అవర్గళ్ పడుగిఱ క్లేశ మఱిన్దు రక్షిక్కవల్ల సర్వవిధబంధువాన నాన్, అవర్గళ్ ప్రార్థిత్త పిన్బుమ్ కైవిడువేనో? నా నచ్యుత నెన్ఱు నీ అఱిన్దిలైయో? "ఉపస్థేయై రుపస్థితః" (రామా-ఆర-10-9) ఎన్ఱిఱే అవన్పడి.

(బ్రాహ్మణేభ్యో విశేషతః) అదిలుమ్, కరణత్రయత్తైయు మెనక్కు సమర్పిత్తు "మచ్చిత్తాః మద్గతప్రాణాః" (భగ-10-9) ఎన్నుమ్బడి ఎన్బక్కల్ అత్యంతప్రేమయుక్తరాయ్, "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" (భగ-7-18) ఎన్గిఱపడియే

---

చాలా శ్రమ కలవాడై నన్ను చేపట్టినవాడు నా మాటను వినడా?-'' అనే గర్వం కలదానివై ఉన్నావా? నీ సీతాత్వం చేతనుల రక్షణకు ఉపయోగపడకుండా, నీవు నన్ను అడ్డుకోగానే అది నాకు మిక్కిలి ప్రియకరం కాక పోవడమే కాదు. హేయంవంటిది అయింది. అందువల్ల నీ సహవాసం నేను కోరను.

(సలక్ష్మణామ్) - నిన్ను ఒక్కతెనే కాదు నేను విడువడం. లక్ష్మణసహితంగా నిన్ను విడుస్తాను.

(స లక్ష్మణామ్) - "లక్ష్మణో లక్ష్మిసంపన్నః" (లక్ష్మణుడు కైంకర్యమనే సంపదను చక్కగా కలవాడు) అన్నట్లు మహర్షులచేత ప్రశంసింపబడే జ్ఞానసంపదను కలవాడై, "న దేవలోకాక్రమణం నామరత్వ మహం వృణే, ఐశ్వర్యం వాఽపి లోకానాం కామయే న త్వయా వినా" (నీవు లేని స్వర్గాధిపత్యాన్ని కాని, కైవల్యాన్ని కాని, అన్నిలోకాలలోని ఐశ్వర్యాన్ని కాని కోరను) అని పలికే రీతిలో నా విషయంలో కైంకర్యం చేయడంకంటే మేలైన వేఱొక అనుభవం లేదు- అని ప్రతిజ్ఞ చేసి, అయోధ్యతోపాటు వనవాసంతోపాటు తేడా లేకుండా, వెంటగా ఉండి సేవ చేసే నా తమ్ముడైన లక్ష్మణునికూడా, నా చేతనరక్షణకు విరోధిస్తే విడచి వేస్తాను.

(న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య) అయితే మీకు వదలిపెట్టడానికి సాధ్యం కానిది ఏది? అని అంటే, బదులిస్తున్నారు.

(న తు ప్రతిజ్ఞామ్)- అని. ఎవరైనాగాని "నన్ను నీవు రక్షించాలి''అని శరణు వేడితే "నేను నిన్ను రక్షిస్తాను'' అని నేను చేసిన ప్రతిజ్ఞను మాత్రం భగ్నం చేయలేను. వారు ప్రార్థించడానికి ముందే వారు పడే బాధను తెలిసికొని రక్షించవలసిన సర్వవిధబంధువైన నేను, వారు ప్రార్థించిన తర్వాతకూడా (వారి) చేయిని విడచిపెడతానా? నేను అచ్యుతుడనని నీకు తెలియదా? "ఉపస్థేయై రుపస్థితః" (తాను సమీపించవలసినవారిచేత సమీపించబడ్డవాడు) అనికదా అతని స్వభావం.

(బ్రాహ్మణేభ్యో విశేషతః) -అందులోను కరణత్రయాలను నాకు సమర్పించి, "మచిత్తాః మద్గతప్రాణాః"

ఎనక్కు శరీరభూతరాయ్, ఎన్నుడైయ అభిమానత్తుక్కు విషయభూతరాయిరున్ద భాగవతవిషయమాగ నాన్ పణ్ణిన ప్రతిజ్ఞైయై ఒరునాళుమ్ కైవిడమాట్టేన్. "రామో ద్విర్నాభిభాషతే" (రామా-అయో- 18-30) యిఱే.

ఇప్పడి చేతనసంరక్షణత్తుక్కు "అజాయమానో బహుధా విజాయతే" (పురుష సూ-21) ఎన్గిఱపడియే అనేకదివ్యావతారఙ్గళ్ పణ్ణియరుళినవిడత్తిలుమ్, చేతనర్ తన్పక్కల్ అభినివేశత్తై ప్పణ్ణామైయాలే, "నామ్ మున్బు పరత్వప్రధానమాన సౌలభ్యఙ్గళ్ ప్రకాశిప్పిత్తదు. ఇని, ఒరు దివ్యావతారత్తిలే సౌలభ్యమే ప్రధానమాగ ప్రకాశిప్పిత్తు సకలచేతనరైయుమ్ నమ్ వశమాక్కిక్కొళ్ళుగిఱేన్." ఎన్ఱు తిరువుళ్ళమ్బఱ్ఱి, మనుష్యసజాతీయనాయ్, "సకలమనుజనయనవిషయతాంగత" నాయ్, "మధురా నామ నగరీ పుణ్యా పాపహరీ శుభా, యస్యాం జాతో జగన్నాథః సాక్షా ద్విష్ణు స్సనాతనః" (తిరుప్పావైవ్యాఖ్య-4వ పా.) ఎన్గిఱపడియే సర్వప్రకారత్తాలుమ్ పరమ పదత్తోడొక్కుమ్ శ్రీమధురైయిలే శ్రీదేవకీవసుదేవర్గళ్వయిఱ్ఱిలే "నిశీథే తమ ఉద్భూతే జాయమానే జనార్దనే" (భాగ) ఎన్గిఱపడియే మాఞాలమెల్లామ్ పరిపూర్ణతమఃప్రచురమాన సమయత్తిలే "జాతోఽసి" ఎన్ఱుమ్, "తమద్భుతం బాలకమ్" ఎన్ఱుమ్, "ఉత్తర మధురైయిల్ పిఱన్ద మాయనే!" (తిరువాయ్-8-5-9) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే సకలచేతనోజ్జీవనార్థమాగ పరమసౌలభ్యవేషత్తోడే శ్రీకృష్ణనాయ్ వన్దు పిఱన్దాన్. ఇవ్వవతారత్తిల్ పిఱన్ద సమయత్తోడు వళర్న్ద సమయత్తోడు వాశియఱ "పిఱన్దవాఱుమ్" (తిరువాయ్ 5-10-1) ఎన్ఱుమ్, "ఆయర్కొழுన్దాయ్" (తిరువాయ్ - 1-7-3) ఎన్ఱుమ్, "పత్తుడై యడివర్క్కెళియవన్" (తిరువాయ్-1-3-1) ఎన్ఱుమ్ పరమాచార్యరాన నమ్మాழ்వార్ అరుళిచ్చెయ్ద పడియే నీర్మైయిఱే విఞ్జియిరుప్పదు. "హర్తుం కుంభే వినిహితకర స్స్వాదు హయ్యంగవీనం దృష్ట్వా దామగ్రహణచతురాం (చటుతాం) మాతరం జాతరోషామ్, పాయా దీషత్ప్రచలితపదో నాపగచ్ఛ న్నతిష్ఠన్

---

(నాపట్ల మనస్సు కలవారు, నాయందే ప్రాణాలను పెట్టుకొన్నవారు) అనేటట్లు నా విషయంలో చాలా ప్రేమను కలవారై, **"జ్ఞానీత్వాత్మైవ మే మతమ్"** (జ్ఞాని అయితే ఆత్మలాంటివాడని నా అభిప్రాయం) అన్నట్లు నాకు శరీరభూతులై, నా అభిమానానికి పాత్రులై ఉన్న భాగవతుల విషయంలో నేను చేసిన ప్రతిజ్ఞను ఏనాడు చేయి విడువలేను. **"రామో ద్వి ర్నాభిభాషతే"** (రాముడు రెండు మాటలు మాటలాడడు) కదా!

ఈ విధంగా చేతనసంరక్షణకోసం **"అజాయమానో బహుధా విజాయతే"** (కర్మమూలకంగా పుట్టనివాడైనా, కృపామూలకంగా పలు రీతుల్లో అవతరిస్తున్నాడు) అని అన్నట్లు అనేకదివ్యావతారాలను ఎత్తినప్పటికీ, చేతనులు తనపట్ల అభినివేశాన్ని కల్గి ఉండకపోవడంచేత, "నేను ముందు పరత్వప్రధానమైన సౌలభ్యాన్నేకదా ప్రకాశింపజేశాను. ఇక ఒక దివ్యావతారంలో సౌలభ్యాన్నే ప్రధానంగా ప్రకాశింపజేసి, జీవులనందఱిని మా వశం చేసికొంటాను"- అని భావించి, మనుష్యసజాతీయుడై, సకలమానవుల నేత్రాలకు కన్పడేవాడై, **"మధురా నామ నగరీ పుణ్యా పాపహరీ శుభా, యస్యాం జాతో జగన్నాథః సాక్షా ద్విష్ణు స్సనాతనః"** (ఏ మధురలో జగన్నాథుడు, సనాతనుడు అయిన విష్ణువే సాక్షాత్తు అవతరించాడో అ మధుర అనే ప్రసిద్ధమైన నగరి చాలా పవిత్రమైనది, పాపహరమైనది, మంగళకరమైనదికూడా) అన్నట్లు అన్ని రీతుల్లో పరమపదంతో తులతూగే శ్రీమధురలో శ్రీదేవకీదేవిగర్భంలో **"నిశీథే తమ ఉద్భూతే జాయమానే జనార్దనే"** (చీకటి వ్యాపించి ఉన్న అర్ధరాత్రి సమయంలో శ్రీకృష్ణుడు అవతరించగా) అన్నట్లు విశాలమైన భూమి అంతా పూర్తిగా చీకటితో వ్యాపించిన సమయంలో **"జాతోఽసి"** (పుట్టావు) అని, **"త మద్భుతం బాలకమ్"** (ఆశ్చర్యాన్ని కల్గించే ఆ బాలుని) అని, **"ఉత్తరమదురైయిల్ పిఱన్ద మాయనే!"** (ఉత్తరమధురలో పుట్టిన మాయావీ) అని చెప్పే రీతిలో సకలజీవులను ఉద్ధరించడంకోసం పరమసౌలభ్యాన్ని కల రూపంతో శ్రీకృష్ణుడై పుట్టాడు. ఈ అవతారంలో పుట్టిన సమయంతో పెరిగిన సమయంతో, తేడా లేకుండా **"పిఱన్ద వాఱుమ్"** (పుట్టిన తీరు) అని, **"ఆయర్కొழுన్దాయ్"** (గోపాలబాలుడై) అని, **"పత్తుడై**

మిథ్యాగోప స్సపది నయనే మీలయన్ విశ్వగోప్తా" (గోపాలవింశతి) ఎన్ఱు అన్ద సౌలభ్యవేషత్తైయే అనుసంధిత్తరుళినారితే శ్రీవేదాన్తాచార్యర్. ఇవ్వవతారమ్ మున్బవతరిత్త అవతారఙ్గళిల్ వైభవమెల్లామ్ కీళ్ పడుమ్బడి సౌలభ్యత్తు కెల్లైనిలమాయిరున్దు, ఆళ్వార్గళ్ నెఞ్జురుగుమ్బడి ప్రకాశిత్తదెన్ఱు నమ్మాచార్యర్ పలకాలు మరుళిచ్చెయ్వర్. ఇవ్వవతారసౌలభ్యమ్ వాచామగోచరమాయిరుక్కైయాలే, "ఎత్తిఱమ్" (తిరువాయ్-1-3-1) ఎన్ఱు మోహిక్కప్పణ్ణుమితే ప్రపన్నరై. ఇప్పడి వన్దవతరిత్తు, "అతిమానుషశీలవృత్తవేషైః అతివృత్తామరవిక్రమప్రతాపైః, అతిలంఘితసర్వలోకసామ్యం వరయే వైష్ణవవైభవావతారమ్" (అతిమానుష-1) ఎన్గిఱపడియే అతిమానుషచేష్టితఙ్గళాలే తన్నుడైయ పరత్వత్తై స్థాపిత్తు, "బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం బిభ్రద్వాసః కనకకపిశం వైజయంతీం చ మాలామ్, రంధ్రాన్ వేణో రధరసుధయా పూరయన్ గోపబృందైః బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్గీతకీర్తిః" ఎన్గిఱపడియే తన్నుడైయ దివ్యమంగళ విగ్రహసౌందర్యత్తాలుమ్, వేణునినాదత్తాలుమ్ గోపగోపీజనఙ్గళెల్లారైయుమ్ తన్ వశమాక్కికొణ్డాన్. "మైయలేఱ్ఱి మయక్క ఉన్ ముగమ్ మాయమన్దిరమ్దాన్కొలో?" (నాచ్చియార్-2-4) ఎన్ఱుమ్, "ఊదు మత్తీజ్కుళత్కే యుయ్యేన్ నాన్" (తిరువాయ్ - 9-9-8) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే ఇవై ఇరణ్డుమ్ కాణ్గవే మగ్నమాక్కి విడుమితే. ఇప్పడి గోపీజనఙ్గళై తన్ వశమాక్కి తన్ తిరువడిగళిల్ కైఙ్కర్యఙ్గళై ప్రసాదిత్తు, "ఆనన్దం

---

యడియవర్క్కెళియవన్" (తనపట్ల భక్తిని కలవారికి సులభుడు) అని పరమాచార్యులైన నమ్మాళ్వార్లు అనుగ్రహించిన రీతిలోనే సౌలభ్యమేకదా అతిశయించి ఉంటుంది. "హర్తుం కుంభే వినిహితకరః స్వాదు హయ్యంగవీనం దృష్ట్వా దామగ్రహణచటులాం మాతరం జాతరోషామ్, పాయా దీష త్ప్రచలితపదో నాపగచ్ఛన్న తిష్ఠన్ మిథ్యాగోపః సపది నయనే మీలయన్ విశ్వగోప్తా" (భోగ్యమైన వెన్నను తన చేతినిండా తీసికోవడం కోసం కుండంలో లోపల వరకు చేతిని పెట్టినవాడై, తనపై కోపించినది, దారాన్ని తీసికోవడం కోసం తొందరపడుతున్నది అయిన తల్లిని చూచి, కొంచెం కాలు ఎత్తినవాడై, ముందుకు పోకుండా అక్కడే నిలచి ఉండకుండా వెంటనే తన కన్నులను మూసికొన్నవాడైన విశ్వరక్షకుడు మాయాగోపాలుడు మనలను రక్షించుగాక!) అని ఆ సౌలభ్యవేషాన్నే శ్రీవేదాంతాచార్యులు (దేశికులు) అనుసంధించారుకదా! ఈ అవతారం, ముందు అవతరించిన అవతారాలలోని వైభవం అంతా తక్కువ అయేరీతిలో సౌలభ్యానికి సీమాభూమియై, ఆళ్వార్ల చిత్తాలు ద్రవించేటట్లు ప్రకాశించిందని మన ఆచార్యులు పలుమార్లు అనుగ్రహిస్తారు. ఈ అవతారసౌలభ్యం వాచామగోచరం కావడంవల్ల "ఎత్తిఱమ్" అని మోహించేటట్లుగా ప్రపన్నులను చేస్తుందికదా. ఈ విధంగా అవతరించి, "అతిమానుషశీలవృత్తవేషై రతివృత్తామరవిక్రమప్రతాపైః, అతిలంఘిత సర్వలోకసామ్యం వరయే వైష్ణవవైభవావతారమ్" (మానవాతీతాలైన శీలవృత్తవేషాలతో, దేవతలకు మించిన విక్రమప్రతాపాలతో సర్వలోకసామ్యాన్ని మించినది అయిన విష్ణువుయొక్క విభవావతారాన్ని ఆశ్రయిస్తున్నాను) అనే రీతిలో అతిమానుషచేష్టితాలతో తన పరత్వాన్ని స్థాపించి, "బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం బిభ్రద్వాసః కనకకపిశం వైజయంతీం చ మాలామ్, రంధ్రాన్ వేణో రధరసుధయా పూరయన్ గోపబృందైః బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్గీతకీర్తిః" (శిరస్సుకు ఆభరణంగా నెమిలి పింఛాన్ని, చెవులలో కర్ణికారపుష్పాన్ని, బంగారు ఎఱ్ఱని వస్త్రాన్ని, వైజయంతీమాలను ధరించిన గొప్పనటవేషాన్ని కల్గినవాడై, వేణువుయొక్క రంధ్రాలను తన అధరామృతంతో నిండిస్తూ గోపబృందాలతో పాటుగా తన పాదాలతో మనోహరం అయిన బృందావనాన్ని పొగడబడే కీర్తిని కల కృష్ణుడు ప్రవేశించాడు) అన్నట్లు తన దివ్యమంగళవిగ్రహసౌందర్యంతో, వేణుధ్వనితో గోపగోపీజనాన్ని అందఱిని తన వశం చేసికొన్నాడు. "మైయలేఱ్ఱి మయక్క ఉన్ముకమ్ మాయమన్దిరన్దాన్కొలో !" (వ్యామోహాన్ని కల్గించి, భ్రమింపజేయడానికి నీ ముఖం మాయ చేసే మంత్రచూర్ణంకదా) అని, "ఊదు మత్తీజ్కుళత్కే ఉయ్యేన్ నాన్" (స్వామి ఊదే ఆ చెడ్డ వేణువువల్లనే నేను ఉజ్జీవిస్తాను) అని

**బ్రహ్మణో విద్వాన్, న బిభేతి కుతశ్చ నేతి" (తైత్తి. ఆనంద-8) ఎన్గిఱపడియే అవర్గళుక్కు సంసారభయనివర్తకమాన బ్రహ్మానుభవత్తై కటాక్షిత్తు, అవర్గళ్ "ఉత్ఫులపంకజదళస్పష్టకాంతివిలోచనమ్, అపశ్యంతో హరిం దీనాః కథం గోష్ఠే భవిష్యథ?" (భాగవతమ్) ఎన్గిఱపడియే ఇవనై అరక్షణముమ్ పిరియమాట్టామల్ సేవిత్తిరుక్కుఱ దశైయిలే సర్వేశ్వరన్ అంతర్ధానమానవాఱే, ఇవనై బృందావనాంతరత్తిలే కాణ్కై క్కోలి ప్రయత్నిత్త విడత్తిలుమ్ కాణామైయాలే, స్వప్రయత్నత్తిల్ నిన్ఱుమ్ కైమా*ఴ్ఴి*, "నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, య మేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్" (కఠ-2-23, ముండక-3-2-3) ఎన్ఱుమ్, "తస్మా న్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః" (తైత్తి-నారా-50) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే సర్వేశ్వరన్ స్వప్రయత్ననివృత్తిపూర్వక శరణాగతి సాధ్యనాగైయాలే, అత్యంతార్తప్రపన్నర్కళాన శ్రీగోపిమార్గళ్ న్యాసవిద్యైయాలే శరణమ్ పుకుగిఱార్, ఇన్ద గోపికాగీతైయిలే.**

**సర్వేశ్వరన్ తన్నుడైయ కృపయాలే ఆ*ఴ్వా*ర్ మున్బే ప్రత్యక్ష సమానాకారమాక జ్ఞానగోచరనానవాఱే, ఇవర్ బాహ్యేంద్రియగళాలే సంశ్లేషిక్క ప్రయత్నిక్క ఇరణ్డుమ్ పోనసమయత్తిలే "ముడియానే" (తిరువాయ్-3-8) యిల్ శొల్లుగిఱపడియే ఆ*ఴ్వా*ర్, అత్యన్తాభినివేశత్తై ప్పణ్ణికొణ్డు అవన్ తిరువడిగళిలే వి*ఴు*న్దాప్పోలే ఇవర్గళుమ్ మిగవుమ్ శోకిత్తు తిరువడిగళిలే వి*ఴు*కిఱార్. శ్రీఆణ్డాళుమ్, ఆ*ఴ్వా*ర్ గళెల్లారుమ్, ఇవర్గళ్పడియే అనుకరిత్తు పురుషార్థమ్**

---

పల్కినట్లు ఈ రెండు (దివ్యమంగళ విగ్రహసౌందర్యం, వేణుగానం) చూడగానే మనస్సును మగ్నం అయేటట్లు చేస్తాయికదా! ఈ విధంగా గోపికలను తన వశం చేసికొని, తన శ్రీపాదాలలో కైంకర్యాలను (వారికి) అనుగ్రహించి, **"ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చ నేతి"** (పరమాత్మ ఆనందగుణాన్ని తెలిసినవాడు దేనివల్ల భయపడడు) అనే రీతిలో వారికి సంసారభయాన్ని తొలగించి, బ్రహ్మానుభవాన్ని కటాక్షించి, వారు **"ఉత్ఫుల్లపంకజ దళస్పష్టకాంతివిలోచనమ్, అపశ్యంతో హరిం దీనా కథం గోష్ఠే భవిష్యథ ?"** (వికసించిన తామరదళాలవలె స్పష్టమైన కాంతిని కల నేత్రాలను కల హరిని చూడలేనివారై ఏ విధంగా మీరు గోష్ఠంలో (గోశాలలో) ఉండగలరు?) అన్నట్లు ఇతనిని అరక్షణం కూడా విశ్లేషించలేక సేవిస్తున్న దశలో సర్వేశ్వరుడు అంతర్ధానం కాగానే, ఇతనిని బృందావనంలో సేవించాలని ఆశపడి ప్రయత్నించినా చూడలేకపోవడంవల్ల, స్వప్రయత్నంనుండి విరమించి, **"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, య మేవైష వృణుతే తేన లభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్"** (ఈ పరమాత్మ ప్రవచనంచేతకాని, బుద్ధిచేతగాని, లేక, విస్తృతమైన వేదాభ్యాసం చేతగాని పొందడానికి వీలయినవాడు కాడు. అతడు ఎవరిని వరిస్తాడో అతని చేతనే పొందడానికి వీలయినవాడు. అతనికే ఈ పరమాత్మ తన స్వరూపాన్ని ఆవిష్కరిస్తాడు) అని, **"తస్మా న్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః"** (అందువల్ల న్యాసం ఈ తపస్సులన్నిటికంటె వేఱయినదని అంటారు) అని చెప్పే రీతిలో ప్రపన్నుడు స్వప్రయత్నాన్ని విరమించడంతోపాటు శరణాగతిని చేయడంద్వారా సర్వేశ్వరుడు సాధ్యమౌతాడు కనుక, అత్యంతం ఆర్తప్రపన్నులు అయిన గోపికలు న్యాసవిద్యతో శరణాగతిని చేస్తున్నారు- ఈ గోపికాగీతలో.

సర్వేశ్వరుడు తన కృపతో ఆ*ఴ్వా*ర్లముందు ప్రత్యక్షసమానాకారంగా వారి జ్ఞానానికి గోచరుడు కాగానే, వీరు బాహ్యేంద్రియాలతో సంశ్లేషించాలని ప్రయత్నించగా, రెండూ- అంటే- జ్ఞానగోచరత్వం, బాహ్యసంశ్లేషం రెండూ పోయిన సమయంలో **"ముడియానే"** అనే దశకంలో ఆర్తితో పలికే రీతిలో, ఆ*ఴ్వా*ర్లు చాలా అభినివేశాన్ని పొంది, అతని శ్రీపాదాలతో పడినట్లే, వీరుకూడ చాలా శోకించి అతని శ్రీపాదాలలో పడుతున్నారు. శ్రీగోదాదేవి,

పెఱువేణ్డుమ్బడియితే ఇవరుడైయ ఏ*ఱ్ఱ* మిరుప్పదు. "అహో భాగ్య మహో భాగ్యం నందగోపవ్రజౌకసామ్" **(భాగవతమ్-10-14-32)** ఎన్ఱు శ్రీవేదవ్యాసభగవానుమ్ ఇవర్గళై కొణ్డాడినారితే.

ముదల్ శ్రియఃపతి ము*ఱ్ఱిఱ్ఱు*

❊❊❊

## ఇరణ్డామ్ శ్రియఃపతి

శ్రియఃపతియాయ్, నిఖిలహేయప్రత్యనీకకల్యాణైకతాననాయ్, స్వేతర సమస్తవస్తువిలక్షణవిగ్రహయుక్తనాన సర్వేశ్వరన్ తనక్కు శేషమాన జగత్తెల్లామ్ కంసనెన్గిఱ అహంకారత్తుక్కు వశమాయ్, అజ్ఞానావృతమాయిరుక్కిఱ సమయత్తిలే, "సాక్షా న్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనూమ్, మగ్నా నుద్ధరతే లోకాత్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా" **(ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాదివ్యాఖ్య - 38పా.)** ఎన్ఱుమ్, "గోపాలో యాదవం వంశం మగ్న మభ్యుద్ధరిష్యతి" **(విష్ణు. పు-5-1-49)** ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే పంచోపనిషణ్మయ విగ్రహయుక్తనాయ్, పరమపదత్తిలే ఇరుక్కిఱ తాన్ సకలజగత్తైయు ముద్ధరిక్క క్కోలి, చరాచరనివహగోచరమాయ్, సౌలభ్యత్తు ఎల్లైనిలమాన ఆచార్యవేషత్తోడే నిర్హేతుకకటాక్షయుక్తనాయ్ వన్దు పిఱన్దు, చేతనర్గళై స్వరూపనాశకమామ్బడి నలియ త్తేడుగిఱ అహంకార కార్యఙ్గళాన పూతనాది ప్రకృతివిషయఙ్గళెల్లావ*ఱ్ఱై*యుమ్ నశిప్పిత్తాన్. "గుశబ్ద స్త్వంధకారః స్యాత్ రుశబ్ద స్తన్నిరోధకః, అంధకారనిరోధిత్వాత్ గురు రిత్యభిధీయతే" (గురుశబ్దనిరుక్తి) ఎన్గిఱపడియే అజ్ఞాననివర్తకత్వమితే ఆచార్యనానవనుక్కు స్వభావమ్. ఇవనుమ్ రామానుజనితే. ఇప్పడి చేతనర్గళెల్లారైయుమ్ అజ్ఞానత్తిల్ నిన్ఱుమ్ మీళువిత్తు,

---

ఆళ్వార్లు అందఱూ వీరి (గోపికల) రీతిని అనుసరించి పురుషార్థాన్ని పొందే రీతిలోకదా వీరి గొప్పతనం ఉన్నది. **"అహో భాగ్య మహో భాగ్యం నందగోపవ్రజౌకసామ్"** (నందగోపుని రేపల్లెలో ఉండేవారి భాగ్యం ఎంత మహాభాగ్యం! ఎంత గొప్ప భాగ్యం!) అని శ్రీవేదవ్యాసభగవానులుకూడా వీరిని (గోపికలను) ప్రశంసించారుకదా!

ముదల్ శ్రియఃపతి అనువాదం ముగిసింది

❊ ❊ ❊

## ఇరణ్డామ్ శ్రియఃపతి

శ్రియఃపతియై, నిఖిలహేయప్రత్యనీకకల్యాణైకతానుడై, తనకంటే వేఱయిన వస్తువుల రూపంకంటే విలక్షణమైన రూపాన్ని కలవాడైన సర్వేశ్వరుడు తనకు శేషమైన జగత్తు అంతా కంసుడనే అహంకారానికి వశమై, అజ్ఞానంచేత ఆవరింపబడ్డ సమయంలో, **"సాక్షా న్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనూమ్, మగ్నా నుద్ధరతే లోకాత్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా"** (జగజ్జన్మాదిక్రీడాపరుడైన నారాయణుడే సాక్షాత్తు మానవరూపాన్ని ధరించి, కరుణతో శాస్త్ర మనే హస్తంతో సంసారసముద్రంలో మునిగిన మానవులను ఉద్ధరిస్తున్నాడు) అని, **"గోపాలో యాదవం వంశం మగ్న మభ్యుద్ధరిష్యతి"** (గోపాలుడు మునిగిన యాదవవంశాన్ని ఉద్ధరించగలడు) అని చెప్పే రీతిలో పంచోపనిషణ్మయమైన విగ్రహాన్ని కలవాడై, పరమపదంలో ఉండే తాను సకలజగత్తును ఉద్ధరించాలని ఆశించి, చరాచరసమూహానికి గోచరమై, సౌలభ్యానికి పర్యంతసీమ అయిన ఆచార్యవేషంతో నిర్హేతుకకటాక్షాన్ని కలవాడై వచ్చి జన్మించి, చేతనులను స్వరూపనాశం అయేటట్లు బాధించాలని వెదకే అహంకారకార్యాలైన పూతనాది ప్రకృతివిషయాలను అన్నిటినీ నశింపజేశాడు. **"గుశబ్ద స్త్వంధకార స్స్యాత్ రుశబ్ద స్తన్నిరోధకః, అంధకారనిరోధిత్వాత్ గురు రిత్యభిధీయతే"** (గుశబ్దం అంధకారాన్ని -అంటే - అజ్ఞానాన్ని

తిరుక్కు*ழల్* ఎన్గిఱ వేదత్తై క్కొణ్డు, శరద్రాత్రి ఎన్గిఱ సాత్త్వికసమయత్తిలే, "కుసుమితవనరాజిశుష్మిభృంగ ద్విజకులఘుష్ట సరస్సరిన్మహీధ్రమ్, యదుపతి రవగాహ్య చారయన్ గాః సహపశుపాలబల శ్చుకూజ వేణుమ్" (భాగ-10-21-2) ఎన్టుమ్, "తద్వ్రజస్త్రియ ఆశ్రుత్య వేణుగీతం స్మరోదయమ్, కాశ్చిత్పరోక్షం కృష్ణస్య స్వసఖీభ్యోఽన్వవర్ణయన్" (భాగ-10-21-3) ఎన్గిఱపడియే ఉపనిషత్ప్రతిపాద్యమాయ్, అర్థపంచకత్తై ప్రతిపాదిక్కిఱ పెరియతిరుమంత్రార్థత్తై ప్రసాదిత్తు, స్వరూపజ్ఞానకార్యమాన భగవద్విషయవ్యామోహత్తై అవర్గళుక్కు ప్రసాదిత్తాన్. ఇవ్వర్థమ్, "ఆశ్రుత్య వేణుగీతం స్మరోదయమ్" (భాగ-10-21-3) ఎన్న ఇత్తాలే సుస్పష్టమిఱే - ఎన్టు నమ్మాచార్యరరుళిచ్చెయ్‌వర్.

(స్మరోదయం వేణుగీతమ్) ఆత్మయాథాత్మ్యజ్ఞానకార్యమాన భగవద్విషయవ్యామోహత్తై ఉదయిక్కప్పణ్ణుగిఱ వేదసారమాన తిరుమంత్రార్థమెన్టపడి. ఇప్పడి ఆగాదపోదు భగవదవతారమ్ నిష్ప్రయోజనమామిఱే.

ఇప్పడి ముదలిలే స్వరూపయాథాత్మ్యప్రతిపాదనపరమాన తిరుమంత్రార్థత్తై వేణునినాదత్తాలే ఉపదేశిత్తు, గోపీజనఙ్గళై, "అక్షణ్వతాం ఫల మిదం న పరం విదామ స్సఖ్యః పశూ ననువివేశయతో ర్వయస్యైః, వక్త్రం వ్రజేశసుతయో రనువేణుజుష్టం యై స్తై ర్నిపీత మనురక్తకటాక్షమోక్షమ్" (భాగ-10-21-8) ఎన్గిఱపడియే తన్పక్కల్ అనన్యార్హశేష భూతరామ్బడి పణ్ణివైత్తాన్. "తవామృతస్యన్దిని పాదపంకజే నివేశితాత్మా కథ మన్య దిచ్ఛతి?" (స్తోత్రరత్నమ్-27) ఎన్గిఱపడియే భగవద్వైభవరస మఱిన్దవర్ మ*ఱ్ఱో*రు విషయమ్ తట్టాదపడి అదిలే మయఙ్గువర్గళిఱే.

---

తెలుపుతుంది. రు శబ్దం దానిని నిరోధించే దానిని తెలుపుతుంది. అందువల్ల గురుశబ్దం అజ్ఞాననివర్తకుని తెలుపుతుంది.) అనే రీతిలో అజ్ఞానాన్ని నివర్తింపజేయడమేకదా ఆచార్యుడైనవాని స్వభావం. ఇతడు కూడా (శ్రీకృష్ణుడు) రామానుజులే కదా! ఈ విధంగా చేతనులను అందటినీ అజ్ఞానంనుండి నివర్తింపజేసి, వేణువు అనే వేదాన్ని గ్రహించి, శరద్రాత్రి అనే సాత్త్వికసమయంలో "కుసుమితవనరాజిశుష్మిభృంగరిద్విజకుల- ఘుష్ట సరస్సరిన్మహీధ్రమ్, యదుపతి రవగాహ్య చారయన్ గాః సహ పశుపాలబల శ్చుకూజ వేణుమ్" (చక్కగా పూచిన వృక్షసముదాయం యొక్క శోభను కల్గినది, తుమ్మెదల ఝుంకారాలతో పక్షుల కిలకిల ధ్వనులతో ఘోషించేది, సరస్సులతో, నదులతో కూడినది అయిన పర్వతంపైన యాదవప్రభువైన శ్రీకృష్ణుడు సంచరించి, తనతోటి గోపాలురతో గోవులను మేపుతూ వేణువును ఊదాడు) అని, "తద్వ్రజస్త్రియ ఆశ్రుత్య వేణుగీతం స్మరోదయమ్, కాశ్చిత్ పరోక్షం కృష్ణస్య స్వసఖీభ్యోఽన్వవర్ణయన్" (ఆ రేపల్లెలోని స్త్రీలు వ్యామోహాన్ని కల్గించే వేణుగీతాన్ని విన్నారు. వారిలో కొందఱు గోపికలు కృష్ణుని పరోక్షంలో తమ సఖులకు దానినిగూర్చి వర్ణించారు) అని చెప్పబడ్డ రీతిలో ఉపనిషత్ ప్రతిపాద్యమై, అర్థపంచకాన్ని ప్రతిపాదించే గొప్ప తిరుమంత్రార్థాన్ని ప్రసాదించి, యథార్థ స్వరూపజ్ఞానకార్యం అయిన భగవద్విషయ వ్యామోహాన్ని వారికి ప్రసాదించాడు. ఈ అర్థం "ఆశ్రుత్య వేణుగీతం స్మరోదయమ్" అనడంవల్ల సుస్పష్టం కదా!- అని మా ఆచార్యులు అనుగ్రహించేవారు.

(స్మరోదయం వేణుగీతమ్) - ఆత్మయాథాత్మ్యకార్యం అయిన భగవద్విషయ వ్యామోహాన్ని కల్గించే వేదసారమైన తిరుమంత్రార్థం- అని అర్థం. ఈ విధంగా కానపుడు భగవదవతారం ప్రయోజనం లేనిదేకదా!

ఈ విధంగా మొదట స్వరూపయాథాత్మ్యాన్ని ప్రధానంగా ప్రతిపాదించే తిరుమంత్రార్థాన్ని ఉపదేశించి, గోపికలను "అక్షణ్వతాం ఫల మిదం న పరం విదారుః సఖ్యః పశూ ననువివేశయతోః వయస్యైః, వక్త్రం వ్రజేశసుతయో రనువేణుజుష్టం యై స్తై ర్నిపీత మనురక్తకటాక్షమోక్షమ్" (సఖులారా! నందకుమారులైన బలరాములు తమ మిత్రులతో బృందావనాన్ని ప్రవేశిస్తున్నారు. వారి ప్రసన్న వదనాలను, కరుణాకటాక్షాలను దర్శించినవారు, వేణుగానాన్ని విన్నవారు ధన్యులు. కన్నులున్నందుకు వారిని దర్శించడమే భాగ్యం. వారిని దర్శించినవారి జీవితం సార్థకం. ఇంతక మించిన అదృష్టం ఇంకొకటి ఉండదు.) అనే రీతిలో తనపట్ల అనన్యార్హశేషభూతలయేటట్లు

పిన్బు ఒరునాళ్, పరిపూర్ణచంద్రయుక్తశరద్రాత్రియిలే, అదావదు- స్వరూపయాథాత్మ్యజ్ఞానమ్ పరిపూర్ణమా యిరుక్కిఱ పరమసాత్త్వికకాలత్తిలే - ఎన్రపడి. ఎజ్గనే? ఎన్నిల్. "చంద్రమా మనసో జాతః" (పురుషసూ-) ఎన్ఱు పురుషసూక్తత్తిల్ శొల్లుగిఱపడియే చంద్రన్ మనస్తత్త్వమాయ్, మనస్సానదు జ్ఞానత్తుక్కిరుప్పిడమాగైయాలే, చంద్రనై జ్ఞానమాగ చ్చొల్లత్తట్టిల్లైయిఱే. ఇజ్గు జ్ఞానమావదు - "తద్జ్ఞాన యద్జ్ఞాన మతోఽన్యదుక్తమ్"(విష్ణు. పు.6-5-87) ఎన్గిఱపడియే స్వరూపయథాత్మ్యజ్ఞానమాన భగవదనన్యార్హశేషత్వజ్ఞానమ్. ఆగ, పరిపూర్ణచంద్రయుక్త శరద్రాత్రి ఎన్రాల్, పరిపూర్ణస్వరూపయాథాత్మ్యజ్ఞానమ్ ప్రకాశిక్కిఱ శుద్ధసాత్త్వికసమయత్తిలే- ఎన్రపడి. "దృష్ట్వా కుముద్వంత మఖండమండలం రమాసనాభం నవకుంకుమారుణమ్, వనం చ తత్కోమలగోభి రంజితం జగౌ కలం వామదృశాం మనోహరమ్" (భాగ-10-29-3) ఎన్గిఱపడియే ప్రాప్యపరమాన ద్వయమంత్రార్థత్తై యుపదేశిత్తాన్.

(దృష్ట్వా కుముద్వంత మఖణ్డమణ్డలమ్) పరిపూర్ణమా యిరుక్కిఱ చేతనరుడైయ స్వరూపయాథాత్మ్యజ్ఞానత్తై కటాక్షిత్తు.

(రమాసనాభం నవకుంకుమారుణమ్) అన్ద స్వరూపయథాత్మ్యజ్ఞాన మెప్పడి ఇరున్దదు? ఎన్నిల్ -

(రమాసనాభం నవకుంకుమారుణమ్) ఎన్గిఱార్. అదావదు - భగవద్విషయానురాగత్తాలే ప్రకాశిక్కిఱ ఆకారషట్కత్తోడే కూడియిరుక్కిఱ పిరాట్టియుడైయ జ్ఞానమ్బోలే యిరున్దదెన్రపడి. "ఆఱుప్రకారత్తాలే పరిశుద్ధాత్మ స్వరూపత్తుక్కు తత్సామ్య ముణ్డాయిరుక్కుమ్" (శ్రీవచనభూషణమ్) ఎన్ఱు పిళ్ళైలోకాచార్యరుమ్ శ్రీవచనభూషణత్తిలే అరుళిచ్చెయ్దరుళినారిఱే.

---

చేశాడు. "తవామృతస్యందిని పాదపంకజే నివేశితాత్మా కథ మన్య దిచ్ఛతి?" (అమృతాన్ని స్రవించే నీ పాదపద్మాలలో మనస్సు నిలిపినవాడు ఆ పాదపద్మాలకంటే వేఱయినదాన్ని ఏవిధంగా ఇష్టపడతాడు?) అన్నట్లు భగవద్వైభవరసాన్ని తెలిసినవారికి వేఱొక విషయం స్ఫురించనట్లుగా అందులో మోహించి ఉంటారుకదా!

తరువాత, ఒకనాడు శరత్కాలంలో నిండు పున్నమినాటి రాత్రి -అంటే స్వరూపయాథాత్మ్యజ్ఞానం పరిపూర్ణంగా ఉన్న పరమసాత్త్వికకాలంలో- అని భావం. ఏవిధంగా అంటే - "చంద్రమా మనసో జాతః" (చంద్రుడు భగవానుని మనస్సునుండి పుట్టాడు) అని పురుషసూక్తంలో చెప్పిన రీతిలో, చంద్రుడు మనస్తత్త్వమై, మనస్సు అనేది జ్ఞానానికి ఆశ్రయం అవడంచేత, చంద్రుణ్ణి జ్ఞానంగా చెప్పడంలో అడ్డు లేదుకదా! ఇక్కడ జ్ఞానం అంటే "తత్ జ్ఞాన మజ్ఞాన మతోఽన్యదుక్తమ్" (భగవచ్ఛేషత్వ జ్ఞానమే సరిఅయిన జ్ఞానం, అని అంతకంటే వేఱయినది అజ్ఞానమని చెప్పబడింది) అనే రీతిలో స్వరూపయాథాత్మ్యజ్ఞానం అనబడే భగవానునకు తప్ప వేఱొకరి శేషభూతులం కాము- అనే జ్ఞానం. ఈవిధంగా, పూర్ణచంద్రుని కల శరద్రాత్రి అంటే - పరిపూర్ణమైన స్వరూప యాథాత్మ్యజ్ఞానం ప్రకాశించే శుద్ధసాత్త్వికసమయంలో - అని అర్థం. "దృష్ట్వా కుముద్వంత మఖండమండలం రమా సనాభం నవకుంకుమారుణమ్, వనం చ తత్కోమలగోభిరంజితమ్ జగౌ కలం వామదృశాం మనోహరమ్" (పరిపూర్ణమైన బింబాన్ని కలవాడు, నూతనమైన కుంకుమవలె ఎఱ్ఱని రంగును కలవాడు, లక్ష్మీసహోదరుడు అయిన చంద్రుణ్ణి, ఆ చంద్రుని యొక్క సుకుమారాలైన కాంతులతో ఎఱ్ఱగా అయిన బృందావనాన్ని చూచి వనితలకు మనోహరంగా ఉండేటట్లు శ్రీకృష్ణుడు అందంగా గానం చేశాడు) అన్నట్లు ప్రాప్యపరమైన ద్వయమంత్రాన్ని ఉపదేశించాడు. (ఇపుడు ఈ భాగవత శ్లోకం వ్యాఖ్యానింపబడుతున్నది)

(దృష్ట్వా కుముద్వంత మఖండమండలమ్)- పరిపూర్ణంగా ఉండే చేతనుల స్వరూపయాథాత్మ్యజ్ఞానాన్ని కటాక్షించి - అని అర్థం.

(రమాసనాభం నవకుంకుమారుణమ్) ఆ స్వరూపయథాత్మ్యజ్ఞానం ఏవిధంగా ఉన్నదని అంటే,

(వనం చ) బృన్దావనముమ్. అచేతనమాన వన మిరుక్కిఱపడి కణ్డాల్ చేతనవిషయమ్ శొల్లవేణ్డావితే.

(తత్కోమలగోభిరంజితమ్) అన్ద స్వరూపయాథాత్మ్యజ్ఞానత్తినుడైయ ప్రకాశత్తాలే ప్రకాశిక్కిఱదు. సర్వేశ్వరనై కాణ ఆశైప్పట్ట గోపిమార్గళుక్కు "కిం తే కృతం క్షితి! తపో బత! కేశవాంఘ్రి స్పర్శోత్సవోత్పులకితాజ్గరుహై ర్విభాసి" (భాగవతమ్-10-30-10) ఎన్గిఱపడియే బృందావనత్తై ఆశ్రయిక్క వేణ్డుమ్బడియితే అదినుడైయ జ్ఞాన మిరుప్పదు.

(జగౌ) ఇప్పడి పరిపూర్ణ మాయిరుక్కిఱ చేతనాచేతనజ్గళినుడైయ భగవదనన్యారహాశేషత్వ జ్ఞానత్తై క్కణ్డు పరమానన్దత్తోడే గానమ్ పణ్ణినాన్.

(కలమ్) ద్వయమంత్రత్తై. ఎజ్గనే? ఎన్నిల్? "కం లాతీతి కలః, తం కలమ్" ఎన్దాయ్, సర్వేశ్వరనై గ్రహిక్కత్తక్కవఱ్ఱై ఎన్దపడి. "సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్వాః" (తైత్తి. నారా-10-10) ఎన్గిఱపడియే సర్వేశ్వరనై గ్రహిక్కత్తక్కదు న్యాసవిద్యయితే. అన్ద న్యాసవిద్యాప్రకాశకమ్ ద్వయమంత్రమాగైయాలే, "కలమ్" ఎన్దాల్ ద్వయమంత్రత్తై ఎన్దపడి.

(వామదృశామ్) భగవదనన్యార్హశేషత్వ మెన్గిఱ సూక్ష్మజ్ఞానముడైయారుడైయ.

(మనోహరమ్) మనస్సై అపహరిక్కిఱ కల మెన్దబడి. "ఇంద్రియేభ్యః పరం మనః" (భగ- 3-42) ఎన్గిఱపడియే ఇంద్రియజ్గళెల్లా వఱ్ఱుక్కుమ్ మేలాయ్, ఇంద్రియజ్గళై స్వవ్యాపారత్తిలే ప్రవర్తిప్పిక్కిఱ మనస్సై అపహరిక్కిఱదెన్దు

---

(రమాసనాభం నవకుంకుమారుణమ్)- అని అంటున్నారు. అంటే -భగవద్విషయానురాగంతో ప్రకాశించే ఆకారషట్కంలో కూడిఉండే లక్ష్మీదేవియొక్క జ్ఞానంవలె ఉన్నదని భావం. ఆఱు ప్రకారాలలో పరిశుద్ధాత్మ స్వరూపానికి ఆ లక్ష్మీదేవితో సామ్యం ఉన్నది. "ఆఱు ప్రకారత్తాలే పరిశుద్ధాత్మస్వరూపత్తుక్కు తత్సామ్యముణ్డాయిరుక్కుమ్" (ఆఱు రీతులలో పరిశుద్ధాత్మ స్వరూపానికి లక్ష్మితో సామ్యం ఉన్నది) అని శ్రీపిళ్లైలోకాచార్యుల వారుకూడా శ్రీవచనభూషణంలో అనుగ్రహించారుకదా!

(వనం చ) - బృందావనంకూడా అని అర్థం. (ప్రకాశిస్తున్నది) అచేతనం అయిన వనం ఉండే తీరును చూస్తే ఇక చేతనవిషయం చెప్పవలసిన పనిలేదు కదా!

(తత్కోమలగోభిరంజితమ్)- ఆ స్వరూపయథాత్మ్యజ్ఞానం యొక్క ప్రకాశంతో ప్రకాశిస్తున్నది. సర్వేశ్వరుణ్ణి దర్శించాలని ఆశపడిన గోపికలకు "కిం తే కృతం క్షితి! తపో బత! కేశవాంఘ్రిస్పర్శోత్సవోత్పులకితాజ్గరుహై ర్విభాసి" (ఓ భూమీ! నీవేం తపస్సు చేశావో కదా! కేశవుని పాదస్పర్శ అనే ఉత్సవం చేత పులకితాలైన రోమాలతో భాసిస్తున్నావు) అనే రీతిలో బృందావనాన్ని ఆశ్రయించవలసిన రీతిలోకదా దాని (బృందావనం యొక్క) జ్ఞానం ఉన్నది.

(జగౌ)- ఈ రీతిలో పరిపూర్ణమై ఉండే చేతనాచేతనాల భగవదనన్యార్హ శేషత్వజ్ఞానాన్ని చూచి శ్రీకృష్ణుడు పరమానందంతో గానం చేశాడు.

(కలమ్)- ద్వయమంత్రాన్ని- అని భావం. ఏవిధంగా అంటే "కం లాతీతి కలః, తమ్ కలమ్" అనే వ్యుత్పత్తివల్ల సర్వేశ్వరుని గ్రహించగల్గినది- అని భావం. "సన్న్యాసయోగాః యతయః శుద్ధసత్త్వాః" అనే రీతిలో సర్వేశ్వరుని గ్రహించగలిగేది న్యాసవిద్యే కదా! ఆ న్యాసవిద్యాప్రకాశకం ద్వయమంత్రం కాబట్టి ద్వయమంత్రాన్ని "కలమ్" అని అన్నారు.

(వామదృశామ్) భగవదనన్యార్హ శేషత్వమనే సూక్ష్మజ్ఞానాన్ని కలవారియొక్క. (అని భావం.)

**శొన్న ఇత్తాలే మఱ్ఱ ఇంద్రియఙ్గళెల్లామ్ శొల్లప్పట్టనవాయిఱ్ఱు. భగవదనన్యార్హశేషత్వజ్ఞాన కార్యమాన ప్రాప్యత్తై యుణర్న్దాల్ "కొడియ వెన్నెఞ్జ మవనెన్నే కిడక్కుమ్" (తిరువాయ్ - 5-3-5), ఎన్టుమ్ "కొణ్డల్ వణ్ణా ! వణ్డత్తుమ్బరిల్ నెడియానే! యెన్టు కిడక్కు మెన్నెఞ్జమే" (తిరువాయ్- 3-8-1) ఎన్టుమ్, "తవామృతస్యన్దిని పాదపఙ్కజే నివేశితాత్మా కథ మన్య దిచ్ఛతి ?" (స్తోత్రరత్నమ్) ఎన్టుమ్ శొల్లుగిఱపడియే మనస్సు అవనై యల్లదఱియాదిఱే.**

**ఇప్పడి అవనుడైయ అరుళాలే ద్వయమంత్రార్థత్తై అఱిన్దు, ప్రాప్యత్వరై విఞ్జి, "నిశమ్య గీతం తదనంగవర్ధనం వ్రజస్త్రియః కృష్ణగృహీతమానసాః, అజగ్ము రన్యోన్య మలక్షితోద్యమాః స యత్ర కాంతో జవలోలకుండలాః" (భాగవతమ్) ఎన్గిఱపడియే ప్రకృతిప్రాకృతఙ్గళిల్ నశై యఱ్ఱు, అవన్ సన్నిధి యడైన్దు, "త న్నః ప్రసీద వృజినార్దన! తేఽంఘ్రిమూలం, ప్రాప్తా విసృజ్య వసతీ స్త్వదుపాసనాశాః, త్వత్సుందరస్మితనిరీక్షణతీవ్రకామతప్తాత్మనాం పురుషభూషణ! దేహి దాస్యమ్" (భాగవతమ్-10-29-38), "వీక్ష్యాలకావృతముఖం తవ కుండలశ్రీ గండస్థలాధరసుధం హసితావలోకమ్, దత్తాభయం చ భుజదండయుగం విలోక్య వక్షఃశ్రియైకరమణం చ భవామ దాస్యః, వ్యక్తం భవాన్ వ్రజజనార్తిహరోఽభిజాతో దేవో యథాదిపురుష స్సురలోకగోప్తా, తన్నో విధేహి కరపంకజ మార్తబంధో! తప్తః స్తనేషు చ శిరస్సు చ కింకరీణామ్" (భాగవతమ్-10-29-39) ఎన్గిఱపడియే అవనుడైయ కైంకర్యత్తైయుమ్,**

---

**(మనోహరమ్)** మనస్సును దోచే కల మని అర్థం. **"ఇంద్రియేభ్యః పరం మనః"** (ఇంద్రియాలను పైన ఉన్నది మనస్సు) అనేరీతిలో ఇంద్రియాలు అన్నిటికి మించినదై, ఇంద్రియాలను వాటి వ్యాపారాలో ప్రవర్తించే మనస్సును అపహరిస్తున్నదని అనడంవల్ల మిగిలిన ఇంద్రియాలన్నీ ఇక్కడ చెప్పబడినవి అయినవి. భగవదనన్యార్హశేషత్వ జ్ఞానకార్యం అయిన ప్రాప్యాన్ని తెలిసినట్లయితే **"కొడియ వెన్నెఞ్జమ్ అవనెన్నే కిడక్కుమ్"** (కఠినమైన నా మనస్సు అతడే అని అతనిపట్ల ఆసక్తమై ఉంటుంది) అని, **"కొణ్డల్ వణ్ణా! అణ్డత్తుమ్బరిల్ నెడియానే! యెన్టు కిడక్కు మెన్నెఞ్జమే"** (మేఘవర్ణా! బ్రహ్మాండంలోని బ్రహ్మాదులకంటే అధికుడా! అని నా మనస్సు ధ్యానిస్తూ ఉంటుంది.) అని, **"తవామృతస్యందిని పాదపంకజే నివేశితాత్మా కథ మన్యదిచ్ఛతి"** (అమృతాన్ని చిందించే నీ పాదపద్మాలలో మనస్సు నిలిపినవాడు ఇక దేనిని కోరతాడు?) అని పలికే రీతిలో మనస్సు అతనిని తప్ప వేఱొకదానిని తెలియదుకదా!

ఈవిధంగా అతని అనుగ్రహంవల్ల ద్వయమంత్రార్థాన్ని తెలిసికొని, ప్రాప్యంలో త్వర అతిశయించి, **"నిశమ్య గీతం తదనంగవర్ధనం వ్రజస్త్రియః కృష్ణగృహీతమానసాః, ఆజగ్ము రన్యోన్య మలక్షితోద్యమాః స యత్ర కాంతో జవలోలకుండలాః"** (రేపల్లెలోని గోపికలు వ్యామోహాన్ని వృద్ధి చేసే ఆ గీతాన్ని విని, కృష్ణునిచేత అకృష్టమైన మనస్సును కలవారై, ఒకరు చేసే పనిని వేఱొకరు గుర్తింపకుండా, కదలాడే కుండలాలను కల్గినవారై, శ్రీకృష్ణుడున్న చోటికి వచ్చారు) అనే రీతిలో ప్రకృతిప్రాకృతాలలో ఆశ వీడి, అతని సన్నిధిని చేరి, **"త న్నః ప్రసీద వృజినార్దన! తేఽంఘ్రిమూలం ప్రాప్తా విసృజ్య వసతీ త్వదుపాసనాశాః, త్వత్సుందరస్మితనిరీక్షణ తీవ్రకామతప్తాత్మనాం పురుషభూషణ! దేహి దాస్యమ్"** (పాపాలను నశింపజేసేవాడా! మా ఇళ్ళను వదలి నిన్ను ఉపాసించాలనే ఆశను కలవారమై నీ పాదాల చెంతకు చేరిన మమ్ములను అనుగ్రహించు. నీ అందమైన చిఱునవ్వును దర్శించాలనే తీవ్రమైన కోరికచేత తపింపబడ్డ మాకు ఓ పురుషభూషణా! సేవను అనుగ్రహించు) అని, **"వీక్ష్యాలకావృతముఖం తవ కుండలశ్రీ గండస్థలాధరసుధం హసితావలోకమ్, దత్తాభయం చ భుజదండయుగం విలోక్య వక్షఃశ్రియైకరమణం చ భవామ దాస్యః"** (కుండలాల శోభను కల గండస్థలాలను, అధరసుధలను, చిఱునవ్వుతో కూడిన దృష్టిని కల, ముంగురులతో ఆవరింపబడ్డ నీ ముఖాన్ని చూచి, అభయాన్నిచ్చే రెండు భుజదండాలను, లక్ష్మీదేవికి మాత్రమే విహారయోగ్యం అయిన వక్షస్సును దర్శించి నీకు మేము దాసురాండ్రము కాగలము) అని, **"వ్యక్తం భవాన్ వ్రజజనార్తిహరోఽ**

అభయప్రదానత్తైయుమ్ ప్రార్థిత్తార్. ఇప్పడి ప్రార్థిక్క, సర్వేశ్వరన్ **"ఇతి విక్లబితం తాసాం శృత్వా యోగీశ్వరేశ్వరః, ప్రహస్య సదయం గోపీ రాత్మారామోఽప్యరీరమత్, తాభి స్సమేతాభి రుదారచేష్టితః, ప్రియేక్షణోత్ఫుల్ల ముఖీభి రచ్యుతః, ఉదారహాస ద్విజకుందదీధితి ర్వ్యరోచతైణాంక ఇవోడుభి ర్వృతః, ఉపగీయమాన ఉద్గాయన్ వనితాశతయూథపః, మాలాం బిభ్ర ద్వైజయంతీం వ్యచర త్సవనా ద్వనమ్" (భాగవతమ్-10-29-32)** ఎన్గిఱపడియే అవరోడే ఒరు నీరాగ కలన్దు సర్వవిధకైంకర్యఙ్గళైయుమ్ కటాక్షిత్తు, అవరై ఆనందసముద్రత్తిలే మయఙ్గ ప్పణ్ణిన సమయత్తిర్, ఇన్ద చేతనర్గళ్ **"ఏవం భగవతః కృష్ణా ల్లబ్ధమానా మహాత్మనః, స్వాత్మానం మేనిరే స్త్రీణాం మానిన్యోఽభ్యధికం భువి" (భాగవతమ్-10-29-47)** ఎన్గిఱపడియే తఙ్గళై సమస్తభాగవతరిలు మభ్యధికరాగవుమ్. కృపామాత్రప్రసన్ననాన సర్వేశ్వరనిడత్తిల్, తఙ్గళుడైయ జ్ఞానాధిక్యత్తాలే అవన్ తమక్కు వశ్యనానా నెన్ఱుమ్ అహంబుద్ధి పణ్ణినవాఱే, **"తాసాం తత్సౌభగమదం వీక్ష్య మానం చ కేశవః, ప్రశమాయ ప్రసాదాయ తత్రైవాంతరధీయత" (భాగవతమ్-10-29-28)** ఎన్గిఱపడియే అన్ద స్వరూపవిరోధియాన అహంకారత్తై నీక్కి నోక్కుగైక్కాగ, చేతనర్గళై ప్పిరిన్దు కృష్ణనొళిక్క, **"కచ్చి త్తులసి! కల్యాణి! గోవిందచరణప్రియే సహ త్వాళికులై ర్బిభ్ర ద్దృష్ట స్తేఽతిప్రియోఽచ్యుతః, చూతప్రియాళు పనసాసవకోవిదార**

---

**భిజాతో దేవో యథాదిపురుషః సురలోకగోప్తా, త న్నో విధేహి కరపంకజ మార్తబంధో! తప్తః స్తనేషు చ శిరస్సు చ కింకరీణామ్"** (ఆదిపురుషుడైన పరమాత్మ ఏరీతిలో దేవతల ఆర్తిని తీర్చాడో, ఆ రీతిలోనే నీవు రేపల్లెలోనివారి ఆర్తిని హరించడంకోసం అవరించావు అన్నది వ్యక్తం. అందువల్ల ఓ ఆర్తబంధూ!, నీ కరకమలాన్ని కింకరులమైన మా తలపైన, తాపం పొందిన వక్షస్సులోను ఉంచు) అని అంటూ అతని కైంకర్యాన్ని, అభయప్రదానాన్ని ప్రార్థించారు. ఈ విధంగా ప్రార్థించగా, సర్వేశ్వరుడు **"ఇతి విక్లబితం తాసాం శృత్వా యోగీశ్వరేశ్వరః, ప్రహస్య సదయం గీపీ రాత్మారామోఽప్యరీరమత్"** (ఈవిధంగా వారి పారవశ్యప్రలపితాన్ని విన్న యోగీశ్వరేశ్వరుడు, ఆత్మారాముడు అయిన శ్రీకృష్ణుడు దయతో నవ్వి గోపికలతో ఆనందించాడు). **"తాభి స్సమేతాభి రుదారచేష్టితః ప్రియేక్షణోత్ఫుల్లముఖీభి రచ్యుతః, ఉదారహాసద్విజకుందదీధితిః వ్యరోచతైణాంక ఇవోడుభిర్వృతః"** (తనతో కూడి ఉన్నవారు, వారికి ప్రియుడైన తన వీక్షణాలవల్ల వికసించిన ముఖాలు కలవారైన వారితో (గోపికలతో) పలు రీతులలో క్రీడించిన అచ్యుతుడు తన గొప్పదైన మందహాసం చేసేటప్పుడు కనుపించే కుందమొగ్గలవంటి పలువరుసల కాంతులను కలవాడై, నక్షత్రాలతో కూడిఉన్న చంద్రుడివలె ప్రకాశించాడు) **"ఉపగీయమాన ఉద్గాయన్ వనితాశతయూథపః, మాలాం బిభ్ర ద్వైజయంతీం వ్యచర త్స వనాద్వనమ్"** (గోపికలచేత కీర్తింపబడుతూ, తానుకూడ గొప్ప వేణుగానం చేస్తూ శ్రీకృష్ణుడు వందలకొలది గోపికాస్త్రీలతో కూడినవాడై, వైజయంతీమాలను ధరించి ఒక వనంనుండి ఇంకొకవనం లోకి సంచరించాడు) అనే రీతిలో వారితో, నీరు ఇంకొక నీటితో ఏ భేదం లేకుండా కలిసినట్లుగా, కలిసి అన్ని కైంకర్యాలను అంగీకరించి, వారిని ఆనందసముద్రంలో మోహింపజేసిన సమయంలో, ఈ చేతనులు (గోపికలు) **"ఏవం భగవతః కృష్ణా ల్లబ్ధమానా మహాత్మనః, స్వాత్మానం మేనిరే స్త్రీణాం మానిన్యోఽభ్యధికం భువి"** (ఈవిధంగా భగవానుడు, మహాత్ముడైన కృష్ణుడు తమను అనుగ్రహించి నందువల్ల గర్వాన్ని పొందినవారై గోపికలు తమను భూమిలోని స్త్రీలలో అందరిలో చాలా గొప్పవారమని భావించారు) అన్నట్లు తమను భాగవతులందఱిలో చాలా గొప్పవారిగా భావించి, కృపామాత్రప్రసన్నుడైన సర్వేశ్వరుని విషయంలో తమకున్న జ్ఞానాధిక్యంచేత అతడు తమకు వశుడయ్యాడని అహంకారాన్ని పొందగానే, **"తాసాం తత్సౌభగమదం వీక్ష్య మానం చ కేశవః, ప్రశమాయ ప్రసాదాయ తత్రైవాంతరధీయత"** (ఆ గోపికల సౌందర్యగర్వాన్ని, అహంకారాన్ని చూచిన శ్రీకృష్ణుడు వారి సౌందర్య గర్వాన్ని, అహంకారాన్ని పోగొట్టడంకోసం, ఇంకా ఇంకా తన విషయంలో వారికి అభినివేశం కల్గడమనే అనుగ్రహం కోసం అక్కడే అంతర్ధానమయ్యాడు) అన్నట్లు ఆ స్వరూపవిరోధి

జంబీరబిల్వవకుళామ్రకదంబనీపాః, యేఽన్యే పరార్థభవికాః యమునోపకూలాః శంసంతు కృష్ణపదవీం రహితాత్మనాం నః" (భాగవతమ్-10-30-7), "గాయంత్య ఉచ్చై రము మేవ సంగతాః విచిక్యు ర్యున్మత్తకవద్వనా ద్వనమ్, పప్రచ్ఛు రాకాశవదంతరం బహిః భూతేషు సంతం పురుషం వనస్పతీన్" (భాగవతమ్- 10-30-4) ఎన్గిఱపడియే అన్ద పరమభక్తియుడైయరాన చేతనర్గళ్ అఱియాద అవర్థజ్గళై అడైయ అఱివిత్త ఆచార్యనాన కృష్ణవిశ్లేషత్తిల్ తజ్గళా*ర్*రామైయై అవనుక్కు అఱివిక్కవేణు మెన్ఱు, బృందావనత్తిలే ఇరుక్కిఱ శాఖిగళ్దోఱుమ్ శెన్ఱు అర్థిత్తార్. అదావదు, వేదత్తిలే ఇరుక్కిఱ ఉపనిషత్తుక్కళిలే సర్వేశ్వరనై ప్రాపిక్కైక్కు మార్గత్తై అన్వేషిత్తార్. ఇప్పడి అన్వేషిక్క, "ఏవం కృష్ణం పృచ్ఛమానా బృందావనలతాతరూన్, వ్యచక్షత వనోద్దేశే పదాని పరమాత్మనః" (భాగవతమ్-10-30-24) ఎన్గిఱపడియే సర్వేశ్వరనుడైయ పదజ్గళై సేవిత్తు, అవత్తిన్ వ*ழி*యే పోయ్ కాణ ఆశైప్పట్టవిడత్తిలుమ్ కాణామైయాలే, "పునః పుళిన మాగత్య కాళింద్యా కృష్ణభావితాః, సమవేతా జగుః కృష్ణం తదాగమనకాంక్షితాః" (భాగవతమ్-10-30-45) ఎన్గిఱపడియే, అవనై సేవిక్కైక్కు ఉపనిషత్తుక్కళిలే సాధనజ్గళాగ నిశ్చయిక్కప్పట్ట కర్మజ్ఞానభక్తిగళాగిఱ సాధనజ్గళిలే అన్వయిత్త విడత్తిలుమ్, సహాయాన్తరనిరపేక్షనాన సర్వేశ్వరన్ ఇవరుడైయ చక్షుర్విషయమాగామైయాలుమ్, "నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన" (కఠ-2-2-3) ఎన్గిఱ శ్రుతియిల్ శొన్నపడియే అవనై ప్రాపిక్కైక్కు అవనుడైయ అభిమానమే సాధనమాగైయాలుమ్, "భూయిష్ఠాం

---

అయిన అహంకారాన్ని తీర్చి కటాక్షించడంకోసం చేతనులను (గోపికలను) విశ్లేషించి, శ్రీకృష్ణుడు అంతర్ధానం కాగా, "కచ్చి త్తులసి ! కల్యాణి! గోవిందచరణప్రియే! సహ త్వాళికులైః బిభ్ర ద్దృష్ట స్తేఽతిప్రియోఽచ్యుతః" (గోవిందుని చరణాలను ఆశపడే కల్యాణీ! తులసీ! నీకు మిక్కిలి ప్రియుడైనవాడు, తుమ్మెదల గుంపుతో పాటు నిన్ను ధరించేవాడైన అచ్యుతుడు నీకు కనుపించాడా! ఏమి?), "చూతప్రియాళుపనసాసవకోవిదార జంబీరబిల్వవకుళామ్ర కదంబనీపాః, యేఽన్యే పరార్థభవికాః యమునోపకూలాః శంసంతు కృష్ణపదవీం రహితాత్మనాం నః" (తీయమామిడీ! పనస, ఎఱ్ఱకాంచన కోవిదార), జంబీర(నిమ్మ), బిల్వ, వకుళ, ఆమ్ర, కడిమివృక్షాలలారా! యమునాతీరంలోని పరార్థం కోసమే పుట్టిన మిగిలిన వృక్షలలారా! శ్రీకృష్ణవియోగం వల్ల వ్యర్థమైన జన్మను కల మాకు కృష్ణుడుండే చోటును చెప్పండి), "గాయంత్య ఉచ్చై రము మేవ సంగతాః విచిక్యు రున్మత్తకవద్వనాద్వనమ్, పప్రచ్ఛు రాకాశవదంతరం బహిః భూతేషు సంతం పురుషం వనస్పతీన్" (అందఱు గోపికలు ఒకటిగా కలిసి, ఆ కృష్ణుని గానం చేస్తూ పిచ్చి పట్టినవారివలె ఒక వనంనుండి ఇంకో వనంలో తిరుగుతూ వెదికారు. వనదేవతలను చూచి, ఆకాశంవలె ప్రాణుల లోపల బయట అంతా వ్యాపించి ఉన్న పురుషునిగూర్చి ప్రశ్నించారు) అంటూ గొప్పభక్తిని కల చేతనులు (గోపికలు) అజ్ఞాతార్థజ్ఞాపకాన్ని చేసిన ఆచార్యుడైన శ్రీకృష్ణుని విశ్లేషాన్ని తాము సహించలేక పోవడంచేత అతనినిగూర్చి తెలియజేయాలని బృందావనంలో ఉన్న అన్ని వృక్షాల దగ్గరకుపోయి ప్రార్థించారు. అంటే, వేదంలో ఉన్న ఉపనిషత్తులలో సర్వేశ్వరుణ్ణి పొందడానికి తగిన మార్గాన్నిగూర్చి అన్వేషించారు. (అని భావం) ఈవిధంగా అన్వేషించగా, "ఏవం కృష్ణం పృచ్ఛమానా బృందావనలతాతరూన్, వ్యచక్షత వనోద్దేశే పదాని పరమాత్మనః" (ఈవిధంగా బృందావనిలోని లతలను, చెట్లను అడుగుతూ గోపికలు ఆ వనప్రదేశంలో పరమాత్మపాదాల గుర్తులను చూచారు) అన్నట్లు సర్వేశ్వరుని పాదాలను సేవించి, అతని దారిలోనే పోయి, చూడాలని అనుకున్నా కనుపించకపోవడంవల్ల, "పునః పుళిన మాగత్య కాళింద్యా కృష్ణభావితాః, సమవేతాః జగుః కృష్ణం తదాగమనకాంక్షితాః" (తిరిగి యమునానదీతీరానికి వచ్చి, కృష్ణుణ్ణే ధ్యానిస్తూ అతని రాకను కోరుతూ అందఱూ కలిసి అతణ్ణి గానం చేశారు) అనే రీతిలో అతణ్ణి సేవించడంకోసం అతని శ్రీపాదాలలో పడ్డారు. అంటే, సర్వేశ్వరుణ్ణి పొందడానికి ఉపనిషత్తులలో సాధనాలుగా నిశ్చయింపబడ్డ కర్మజ్ఞానభక్తులనే సాధనాలలో అన్వయించినా సహాయాంతరాన్ని కోఱని సర్వేశ్వరుడు వీరి కంటికి కనుపించనందున, "నాయ మాత్మా ప్రవచనేన

తే నమ ఉక్తిం విధేమ" (కఠ) ఎన్గిఱపడియే అవనుక్కిదు పొఱాదపడియాలుమ్, అవన్ తిరువడిగళిలే శరణాగతరాయ్ సర్వేశ్వరనై ప్రాపిత్తపడి శొల్లుగిఱదు ఇన్ద గోపికాగీతై.

ఇరణ్డామ్ శ్రియఃపతి ముర్రిర్రు

***

## మూన్దామ్ శ్రియఃపతి

శ్రియఃపతియాయ్, నిఖిలహేయప్రత్యనీకకల్యాణైకతాననాయ్, స్వేతరసమస్తవస్తువిలక్షణవిగ్రహయుక్త నాయిరుక్కిఱ సర్వేశ్వరన్, జగత్తెల్లామ్ అజ్ఞానాంధకారయుక్తమాయ్, ఉరుమాయ్న్దు కిడక్కిఱ దశైయిలే అత్తై కణ్డు సర్వవిధబంధువాగైయాలుమ్, "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే" (భగ-7-14) ఎన్గిఱపడియే ఇన్ద అజ్ఞానత్తై నీక్కి చేతనర్గళై రక్షిప్పదఱ్కు త్తానల్లాల్ ముర్రొరువర్ సమర్థర్ ఇల్లామైయాలుమ్, తానే వన్దు పిఱన్దు ఇన్ద చేతనర్గళుక్కు మంత్రమంత్రార్థజ్ఞళై పూర్ణమాగ ఉపదేశిత్తు, ఇవరుడైయ జ్ఞానపరీక్షార్థమాగవుమ్, అహంకారత్తై నీక్కి నోక్కుగైక్కాగవుమ్, తన్నై ఒళిత్తు దూరమాగ నిన్ద్రవళవిలే, ఆచార్యవిశ్లేషత్తై ధరిక్కమాట్టామైయాలుమ్, అవరే ప్రాప్యప్రాపకర్ ఎన్ఱిరున్దవర్కళాగైయాలుమ్, సర్వరక్షకరాన చరమశేషియాయ్ నిన్ర అవర్ తిరువడియై శరణమాగ పర్రి ఆచార్యరై ప్రాపిత్తు అనన్దిత్తపడి శొల్లుగిఱదు ఇన్ద

---

లభ్యో న మేధయా న బహునా శ్రుతేన" (ఈ పరమాత్మ ప్రవచనం చేతగాని, బుద్ధిచేతగాని, బహుశ్రుతంవల్లగాని పొందడానికి వీలయినవాడు కాడు, ఆ పరమాత్మ ఎవరిని వరిస్తాడో అతడే ఆ పరమాత్మను పొందగలడు) అనే శ్రుతిలో చెప్పినట్లు అతనిని పొందడానికి అతని అభిమానమే సాధనం కాబట్టి, "భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ" (నీకు గొప్పదైన నమస్కారోక్తిని చేస్తాము) అన్నట్లు అతనికి ఇది (నమస్కారోక్తి) సహించలేనిది కాబట్టి, అతని శ్రీపాదాలలో శరణాగతులై, సర్వేశ్వరుణ్ణి పొందిన తీరు ఈ గోపికాగీత తెలుపుతున్నది.

ఇరణ్డామ్ శ్రియఃపతి అనువాదం ముగిసింది

***

### మూన్దామ్ శ్రియఃపతి - అనువాదం

శ్రియఃపతియై, నిఖిలహేయప్రత్యనీకకల్యాణైకతానుడై, స్వేతరసమస్తవస్తు విలక్షణవిగ్రహయుక్తుడై ఉండే సర్వేశ్వరుడు జగత్తు అంతా అజ్ఞానాంధకారంలో రూపు మాసిపోయి ఉండే దశలో, దానిని చూచి, సర్వవిధబంధువు కావడంవల్ల, "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యజా, మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే" (గుణత్రయాత్మకమైన ఈ దివ్యమైన నామాయ దాటలేనిది. నన్నే ఎవరు ఆశ్రయిస్తారో, వారే దీనిని దాటగలరు) అన్నట్లు ఈ అజ్ఞానాన్ని పోగొట్టి, చేతనులను రక్షించడానికి తాను తప్ప వేఱొకరు సమర్థులు లేకపోవడంచేత, తానే వచ్చి అవతరించి, ఈచేతనులకు మంత్రమంత్రార్థాలను పూర్ణంగా ఉపదేశించి, వీరి జ్ఞానాన్ని పరీక్షించడంకోసం, అహంకారాన్ని పోగొట్టి రక్షించడంకోసం, తనను మఱుగు పఱచుకొని దూరంగా ఉన్న సమయంలో, ఆచార్యవిశ్లేషాన్ని ధరించలేక పోవడంచేత, వారే (ఆచార్యులే) ప్రాప్యప్రాపకులని తలచేవారు కావడంచేత, సర్వరక్షకులై, చరమశేషియై ఉన్న వారి (ఆచార్యుల) శ్రీపాదాలను శరణంగా ఆశ్రయించి, ఆచార్యులను పొంది ఆనందించిన తీరు ఈ గోపికాగీత తెలుపుతున్నది "ఆశారియన్ శెయ్ద వుపకారమానవదు తూయదాక నెఞ్జుదన్నిల్ తోన్నుమేల్ దేశాన్తరత్తిలిరుక్క మనన్దాన్ పొఱుక్క మాట్టాదు ఇరుత్తలిని యేదఱియోమ్ యామ్" (ఆచార్యుడు చేసిన ఉపకారం పవిత్రమైనదని మనస్సులో తోస్తే ఆ ఆచార్యుని విడచి దేశాంతరంలో ఉండడాన్ని

గోపికాగీతై. **"ఆశారియన్ శెయ్‌ద వుపకారమానవదు తూయదాగ నెఙ్జదన్నిల్ తోన్డుమేల్, దేశాన్తరత్తిలిరుక్క మనన్దాన్ పొఱుక్కమాట్టాదు ఇరుత్తలిని యేదరియోమ్ యామ్" (ఉపదేశ-63)** ఎన్డు శొల్లానిన్దదితే.

**(ఆశారియన్ శెయ్‌ద వుపకార మానవదు)** ఆచార్యర్ ఇన్ద సంసారమగ్నరాన చేతరనరిడత్తిల్ పణ్ణిన మహోపకారమానదు. ఆశారియర్ శెయ్‌దదువే ఉపకారమితే. సర్వేశ్వరన్ పణ్ణిన ఉపకారత్తుక్కుమ్, ఇవర్ పణ్ణిన ఉపకారత్తుక్కుమ్ నెడు వాశి యుణ్డు. సర్వేశ్వరన్ కర్మసృష్టిక్కు కడవవన్. ఆయాలే విషమసృష్టి యుణ్డాయ్, అదిలుమ్ అజ్ఞానత్తై విళైవిత్తు, చేతనరై సంసారత్తిలే మూట్టి స్వరూపత్తై యురుమాయ్‌న్దు పోమ్బడి పణ్ణుగిఱ శరీరత్తోడు సృష్టియాగైయాలే, ఇదు ఉపకార మెన్డు శొల్లప్పోగాదితే. ఆచార్యర్ కారుణ్యసృష్టిక్కు క్కడవరాగైయాలే, విషమసృష్టియిల్లాదే **"పాపహతో వా పుణ్యాయుతో వా సురనరతిర్యగ్జాతిగతో వా, రామానుజపదతీర్థా న్ముక్తిం విందతి విందతి విందత్యేవ" (భజయతి రాజ-17)** ఎన్డుమ్, **"రామానుజమహిరాడవతారం మూకాంధా నపి మోక్షయితారమ్" (భజయతిరాజ-30)** ఎన్డుమ్, **"పాపిష్ఠః క్షత్రబంధు శ్చ పుండరీక శ్చ పుణ్యాకృత్ ఆచార్యవత్తయా ముక్తౌ" (తిరుప్పావైవ్యాఖ్య-16వపా)** ఎన్డుమ్ శొల్లుగిఱపడి పణ్ణి, అద్వేషమ్ తొడఙ్గి ఉణ్డాక్క వేణ్డియ ఆత్మగుణఙ్గళెల్లా ముణ్డాక్కి, స్వరూపత్తై ప్రకాశిప్పిత్తు, పరమపదప్రాప్తియై కటాక్షిత్తు రక్షిక్కిఱపడియాలే, ఇవర్ పణ్ణినదువేయితే ఇవ్వాత్మస్వరూపత్తుక్కు ఉపకార మెన్డు శొల్లత్తక్కదు. ఇత్తై ప్పఱ్ఱియితే **"ఆచార్యా దిహ దేవతాం సమధికా మన్యాం న మన్యామహే" (దేశికసూక్తి)** ఎన్డు మభియుక్తరనుసంధిత్తార్. **"రామానుజంబంధమిల్లాదపోదు నముక్కు పెరియపెరుమాళోడు తేవై యిల్లై"** ఎన్ఱ ఆఴ్వాన్‌వార్త్తైయై నినైప్పదు.

---

మనస్సు సహించదు. ఒకవేళ అటువంటి మనస్సు ఉంటే అది ఏమో మాకు తెలియదు) అని చెప్పబడుతున్నదికదా! (ఇపుడు ఈ ఉపదేశరత్తినమాలైపాశురం వ్యాఖ్యానింప బడుతున్నది.)

**(ఆశారియన్ శెయ్‌ద వుపకారమానవదు)**- ఆచార్యులు ఈ సంసారమగ్నులైన చేతనుల విషయంలో చేసిన మహోపకారం అనేది. ఆచార్యుడు చేసినదేకదా ఉపకారం. సర్వేశ్వరుడు చేసిన ఉపకారానికి, వీరు (ఆచార్యులు) చేసిన ఉపకారానికి చాలా తేడా ఉన్నది. సర్వేశ్వరుడు కర్మసృష్టికి బాధ్యుడు కావడంవల్ల, విషమసృష్టి ఏర్పడి, అందులోను అజ్ఞానాన్ని అంకురింపజేసి, చేతనులను సంసారంలో లగ్నం అయేటట్లుచేసి, స్వరూపాన్ని రూపు లేకుండా పోయేటట్లు చేసే శరీరంతో సృష్టించడంచేత ఇది ఉపకారం అని చెప్పడాజీనికి వీలుకాదు కదా! ఆచార్యులు కారుణ్యసృష్టిని చేసేవారు కావడంచేత విషమసృష్టి లేకుండా, **"పాపహతో వా పుణ్యాయుతో వా సురనరతిర్యగ్జాతియుతో వా, రామానుజపదతీర్థా న్ముక్తిం విదంతి విదంతి విందత్యేవ"** (పాపంచేత బాధింపబడ్డ వాడైనా, పుణ్యం కలవాడైనా, దేవతల, మానవుల, తిర్యక్కుల జాతిలో జన్మించినవాడైనా శ్రీరామానుజుల శ్రీపాదతీర్థంవల్ల ముక్తిని పొందుతున్నాడు, పొందుతున్నాడు, తప్పక పొందుతున్నాడు) అని, **"రామానుజ మహిరాడవతారం మూకాంధానపి మోక్షయితారమ్"** (ఆదిశేషుల అవతారం, మూగవాళ్లను, గుడ్డివారినికూడా తరింపజేసేవారు అయిన రామానుజులను)అని, **"పాపిష్ఠః క్షత్రబంధు శ్చ పుండరీక శ్చ పుణ్యాకృత్, ఆచార్యవత్తయా ముక్తౌ"** (పాపిష్ఠివాడైన క్షత్రబంధువు, పుణ్యాత్ముడైన పుండరీకుడు ఆచార్యుణ్ణి కల్గినవారు కావడంవల్ల ముక్తులయ్యారు) అని చెప్పే రీతిలో చేసి, అద్వేషం మొదలు ఉండవలసిన ఆత్మగుణాలను అన్నిటిని కల్గించి, స్వరూపాన్ని ప్రకాశింపజేసి, పరమపదప్రాప్తిని కటాక్షించి, రక్షించడంవల్ల, వీరు చేసినదే ఈ ఆత్మస్వరూపానికి ఉపకారం అని చెప్పదగినది. దీనినిబట్టేకదా **"ఆచార్యా దిహ దేవతాం సమధికా మన్యాం న మన్యామహే"** (ఆచార్యుల కంటె వేఱొక గొప్ప దేవత ఉన్నదని మేము భావించము) అని అభియుక్తులు (దేశికులు) అనుసంధించారు. రామానుజసంబంధం లేనపుడు మనకు శ్రీరంగనాథునితో అవసరం లేదన్న కూరేశుల సూక్తి భావింపతగినది.

(తూయదాగ నెఞ్జదన్నిల్ తోన్ఱుమేల్) లోకత్తిలే పణ్ణిన ఉపకారత్తై మఱన్దు కృతఘ్నరాయ్ నిన్ఱవర్‌దా మనేకరా యిరున్దార్‌గళిఱే. అప్పడి ఆగాదే, ఇవర్ పణ్ణిన ఉపకారమానదు నిష్కల్మషమాగ మనస్సిలే తోన్ఱినిన్ఱదాగిల్. (దేశాంతరత్తిలిరుక్క మనన్దాన్ పొఱుక్కమాట్టాదు) అన్ద మహోపకారకరానవరై విట్టు సంసారవర్ధకరాళవర్‌గళోడే పొరున్ది యిరుక్క మనస్సానదు సహిక్కమాట్టాదు. "కోల్ తేడి యోడుమ్ కొழுన్దదే పోన్ఱదే మాల్ తేడి యోడుమ్ మనమ్" (ఇరణ్డామ్ తిరు-27), ఎన్గిఱపడియే ఆశ్రితవ్యామోహశీలరాన ఆచార్యరై పిన్ తొడర్న్దు, సర్వదేశ-సర్వకాల-సర్వావస్థైగళిలుమ్, అవరుడైయ ప్రీతికారిత సర్వవిధకైంకర్యఙ్గళాలే అవరై ఉగప్పిత్తు మగ్నమాయిరుక్క మన్ఱి, అవరై విశ్లేషిత్తిరుక్క సహియాదు. అప్పడి యాగాదపోదు, "మణిమాయన్ కవరాద మడనెఞ్జాల్ కుఱైవిలమే" (తిరువాయ్-4-8-2) ఎన్గిఱపడియే అతినుడైయ సంబంధమ్ త్యాజ్యమామిఱే. "న హి మే జీవితేనార్థః నైవార్థై ర్న చ భూషణైః, వసంత్యా రాక్షసీమధ్యే వినా రామం మహారథమ్" (రామా-సుందర-26.5) ఎన్ఱారిఱే ఆచార్యవిశ్లేషత్తై సహియాదార్. (ఇరుత్తలిని యేదఱియోమ్ యామ్) ఆగ, ముదలిలే ఆచార్యరై విశ్లేషిత్తిరుక్కుమ్ నెఞ్జానదు తరైయిలే కిడైయాదు. అప్పడి యాగాదే, మహోపకారకరాన ఆచార్యరై విట్టు సంసారవర్ధకరానవర్‌గళోడే పழగివైత్తు ఆనందిత్తిరుక్కుమ్ నెఞ్జుణ్డాగిల్, అదు ఏదో నమక్కు తెఱియాదు. ఇత్తాల్ అదు నెఞ్జాగాదెన్ఱు కరుత్తు. అదు శిలాప్రాయమా మిత్తనై. అన్ఱిక్కే, ఆచార్యరై విశ్లేషిత్తిరున్దదాగిల్, అతుక్కు హేతు నమక్కు తెఱియాదెన్ఱు శొల్లవుమామ్. ఆచార్యరై అరక్షణముమ్ పిఱియాదే అవరుడైయ ఛందానువర్‌త్తిగళాయ్, ప్రీతికారితకైంకర్యఙ్గళాలే అవరై సేవిత్తుగప్పిత్త మహాభాగవతరుడైయ శ్రీసూక్తియిఱే యిదు.

మూన్ఱామ్ శ్రియఃపతి ముఱ్ఱిఱ్ఱు

---

(తూయదాగ నెఞ్జదన్నిల్ తోన్ఱుమేల్)- లోకంలో చేసిన ఉపకారాన్ని మఱచి, కృతఘ్నులై ఉండేవారు అనేకులు ఉన్నారుకదా! ఆ విధంగా కాకుండా, వీరు చేసిన ఉపకారం, నిష్కల్మషంగా మనస్సులో తోచినట్లయితే. (దేశాన్తరత్తిల్ ఇరుక్క మనన్దాన్ పొఱుక్కమాట్టాదు) ఆ మహోపకారకులను విడచి, సంసారాన్ని వర్ధిల్లజేసేవారితో కలసి ఉండడానికి మనస్సు సహించదు. "కోల్ తేడి యోడుమ్ కొழுన్దదే పోన్ఱదే మాల్ తేడి యోడుమ్ మనమ్" (ఆలంబనాన్ని వెదుకుతూ పోయే చిగురు(లత) వంటిదే ఆశ్రితవ్యాముగ్ధుని వెదుకుతూ పోయే మనస్సు) అన్నట్లు ఆశ్రితవ్యామోహశీలురైన ఆచార్యులను అనుసరించి, సర్వదేశ-సర్వకాల-సర్వావస్థలలోను వారిని తాను ప్రీతితో చేసే కైంకర్యాలతో సంతోషింపజేసి, మునిగి ఉంటుంటే తప్ప, వారిని విడిచి ఉండడాన్ని సహించదు. ఆ విధంగా కాకపోతే, "మణిమాయన్ కవరాద మడనెఞ్జాల్ కుఱై విలమే" (మణివర్ణుడు, ఆశ్చర్యభూతుడైన స్వామికి ఉపయోగపడని మూఢమనస్సుతో పనిలేదు.) అన్నట్లు దానిసంబంధం త్యాజ్యమేకదా! "న హి మే జీవితేనార్థః నైవార్థైః న చ భూషణైః, వసంత్యా రాక్షసీమధ్యే వినా రామం మహారథమ్" (మహారథుడైన రాముడు లేకుండా రాక్షసస్త్రీలమధ్య ఉండే నాకు జీవితంతో పనిలేదు, ధనంతో పని లేదు, ఆభరణాలతో పని లేదు) అని అన్నారుకదా ఆచార్యుని విశ్లేషాన్ని సహించలేనివారు. (ఇరుత్తలిని యేదఱియోమ్ యామ్) అందువల్ల మొదట ఆచార్యుని విడచి ఉండే మనస్సు భూమిలో లేదు. ఆ రీతిలో కాకుండా, మహోపకారకులైన ఆచార్యులను విడచి, సంసారాన్ని వృద్ధి చేసేవారితో కలసి మెలసి ఉంటూ ఆనందించే మనస్సు ఉంటే, అది ఏదో మనకు తెలియదు. ఇందువల్ల అది మనస్సు కాదని భావం. అది శిలవంటిది అంతే. లేక, ఆచార్యులను విశ్లేషించి ఉంటే, దానికి హేతువు మనకు తెలియదు- అనికూడా చెప్పవచ్చును. ఆచార్యులను అరక్షణం అయినా విడువలేకుండా వారి మనస్సునుబట్టి మెలిగేవారై, ప్రీతితో చేసే కైంకర్యాలతో వారిని సేవించి ఆనందింపజేసిన మహాభాగవతుల (శ్రీవరవరమునుల) శ్రీసూక్తికదా ఇది.

మూన్ఱామ్ శ్రియఃపతి అనువాదం ముగిసింది.

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీగోపికాగీతావ్యాఖ్యానమ్

## ముదల్ శ్లోకమ్

### అవతారికై

"మగ్నానాం భవినాం భవార్ణవసముత్తారాయ నారాయణః" ఎన్టుమ్, "మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యా చ్ఛాస్త్రపాణినా" (ఇరామానుశ నూఱ్ఱన్దాదివ్యాఖ్య-38పా) ఎన్టుమ్, "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" (భగ-4-8) ఎన్టుమ్, "పీతగవాడైప్పిరానార్ పిరమగురు వాగి వన్దు" (పెరియాఴ్వార్ తిరు 5-2-8) ఎన్టుమ్ శొల్లుగిఱపడియే భవార్ణవత్తిల్ మగ్నరాయ్, "అస న్నేవ" (తైత్తి- ఆనంద) ఎన్గిఱపడియే అసత్కల్పరాయ్ కిడక్కిఱ ఎఙ్గళై రక్షిక్కవేణు మెన్టు మభినివేశత్తాలే ఇవ్విభూతియిల్ వన్దు పిఱన్దరుళి, సంకల్పిత్తపడియే ఎఙ్గళై పరిపూర్ణజ్ఞానరాక్కి పిన్బు అదృశ్యమానపడి కణ్డాల్, మిగవుమ్ కష్టమాయిరున్దదీ! ఉన్నుడైయ మార్గత్తై అన్వేషిక్కిఱ ఎఙ్గళ్ మున్నే ప్రత్యక్షిక్కవేణు మెన్టు ప్రార్థిక్కిఱార్. మధురపదార్థత్తై భుజిక్కిఱ బాలకనుడైయ వాయిల్ నిన్టుమ్ అత్తై వాఙ్గినాల్, "అమ్మే" ఎన్టు కూప్పిడుమితే. అప్పడియే, "రసో వై సః, రసగ్‌ం హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి" (తైత్తి-ఆనంద) ఎన్టుమ్, "తేనుమ్ పాలుమ్ నెయ్యుమ్ కన్నలు మముదు మొత్తే" (తిరువాయ్ - 2-3-2) ఎన్టుమ్ శొల్లుగిఱపడియే, అతృప్తామృతమాన పరబ్రహ్మానుభవత్తై అనుభవిత్తు ఆనన్దిక్కిఱ పరమభక్తియుడైయ చేతనన్, అన్ద అనుభవవిచ్ఛేదత్తిల్

---

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీగోపికాగీతావ్యాఖ్యానమ్

## మొదటి శ్లోకం

### అవతారిక

"మగ్నానాం భవినాం భవార్ణవసముత్తారాయ నారాయణః" (సంసారంలో మునిగిన సంసారులను ఆ సంసారసముద్రంనుండి ఉద్ధరించడంకోసం నారాయణుడు అవతరిస్తాడు)అని, "మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యా చ్ఛాస్త్రపాణినా" (సంసారంలో మునిగిన లోకులను కరుణతో శాస్త్రమనే చేతితో ఉద్ధరిస్తాడు) అని, "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" (ధర్మాన్ని స్థాపించడంకోసం ప్రతియుగంలో అవతరిస్తున్నాను) అని, "పీతకవాడైపిరానార్ పిరమగురువాకి వన్దు" (పీతాంబరధారి అయన స్వామి పరమాచార్యుడై వచ్చి) అని చెప్పే రీతిలో సంసారసముద్రంలో మునిగినవారై, "అస న్నేవ" (సత్త లేనివాడుగా) అన్నట్లు అసత్కల్పులై ఉండే మమ్ములను రక్షించాలనే అభినివేశంతో ఈ విభూతిలోకి వచ్చి అవతరించి, సంకల్పించినట్లే, మమ్ములను పరిపూర్ణజ్ఞానం కలవారినిగా చేసి, తరువాత అదృశ్యం అయిన తీరును చూస్తే, చాలా కష్టంగా ఉన్నది. నీవు పోయిన దారిని వెదకే మా ముందు నీవు ప్రత్యక్షం కావాలి- అని (గోపికలు) ప్రార్థిస్తున్నారు. మధురపదార్థాన్ని భుజించే కుఱ్ఱవాని నోటినుండి దాన్ని తీసి వేస్తే, "అమ్మా" అని ఆక్రందిస్తాడు కదా! అదే విధంగా "రసో వై సః రసగ్‌ం హ్యేవాయం లబ్ధ్వాఽనందీభవతి" (ఆ పరమాత్మ రసస్వరూపుడు, అతణ్ణి జీవుడు పొంది ఆనందాన్ని పొందేవాడు అవుతున్నాడు)అని, "తేనుమ్ పాలుమ్ నెయ్యుమ్ కన్నలు మముదు మొత్తే" (తేనె, పాలు, నేయి, కలకండ, అమృతం - అనే వీటితో సాటిగా) అని చెప్పే రీతిలో, అతృప్తామృతం అయిన పరబ్రహ్మానుభవాన్ని

"తవళ వొణ్ శఙ్గు శక్కర మెన్టుమ్, తామరైత్తడఙ్గణెన్టుమ్, కువళైయొణ్ మలర్క్కణ్గళ్ నీర్ మల్క నిన్టు నిన్టు కుమిరుమే" (తిరువాయ్ - 6-5-1) ఎన్గిఱపడియే కుమిరి కూప్పిడు మన్టి ఆటియిరుక్కుమో ?

జయతి తేఽధికం జన్మనా వ్రజః శ్రయత ఇందిరా శశ్వదత్ర హి ।
దయిత! దృశ్యతాం దిక్షు తావకాః త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే ॥

(తే) "హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ" (తైత్తి. నారా) ఎన్టుమ్, "అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః, న ద్వితీయోఽస్తి కశ్చిత్" (సుబాల-7) ఎన్టుమ్, "పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్" (తైత్తి. నారా-11) ఎన్టుమ్, "విష్ణుపోతం వినా నాన్య త్కించి దస్తి పరాయణమ్" (వైష్ణవధర్మ-1) ఎన్టుమ్ శొల్లుగిఱపడియే శ్రియఃపతియాయ్, అఖిలహేయప్రత్యనీక కల్యాణైకతాననాయ్, సర్వనియంతావాయ్, సర్వస్వామియాయ్, సర్వరక్షకనాయ్, సంసారనిస్తరణత్తుక్కు సిద్ధోపాయభూతనాన దేవరీరుడైయ.

(జన్మనా) తిరువవతారత్తాలే. అల్లాత అవతారఙ్గళ్‌పోలేయో ఇవ్వవతారమ్? "సంసారార్ణవమగ్నానామ్" (వైష్ణవధర్మ-1) ఎన్గిఱపడియే సంసారత్తి లఴున్దు కిడన్దు "అసన్నేవ" (తైత్తి.ఆనంద-6) ఎన్టుమ్బడి అసత్కల్పరాన సంసారిచేతనర్గళిఴవు కణ్డు తానటిన్ద నిరుపాధికసంబంధమే పఱ్ఱాశాగ, "అనురక్తకటాక్షమోక్షమ్" (భాగవతమ్) ఎన్గిఱపడియే నిర్హేతుకకటాక్షయుక్తనాయ్‌క్కొణ్డు "మగ్నా నుద్ధరతే లోకాత్ కారుణ్యాచ్ఛాస్త్ర పాణినా" (ఇరామానుశ నూఱ్ఱన్దాదివ్యాఖ్య-38పా) ఎన్గిఱపడియే అవర్గళై రక్షిక్కైక్కాగ వన్దు అవతరిత్తరుళిన పరమసౌలభ్యయుక్తమాన తిరువవతారమిఱే ఇదు. "ఉత్ఫుల్లపంకజదళస్పష్టకాంతివిలోచనమ్" (భాగవతమ్) ఎన్టుమ్, "వేణీమూలే" (భాగవతమ్)

---

అనుభవించి ఆనందించే పరమభక్తిని కల చేతనుడు ఆ అనుభవవిచ్ఛేదంలో "తవళ వొణ్ శఙ్గు శక్కర మెన్టుమ్ తామరై త్తడఙ్గణెన్టుమ్, కువళై యొణ్ మలర్ క్కణ్గళ్ నీర్ మల్క నిన్టు నిన్టు కుమిరుమే" (తెల్లని అందమైన శంఖం, చక్రం అని, తామరలవంటి విశాలమైన నేత్రాలు అని అంటూ, కలువలవంటి అందమైన నేత్రాలలో కన్నీళ్ళు నిండగా మాటిమాటికి కుమిలిపోతున్నది.) అనే రీతిలో కుమిలి, ఆక్రందిస్తాడు తప్ప, సహించి ఉండగలడా?

జయతి తేఽధికం జన్మనా వ్రజః శ్రయత ఇందిరా శశ్వ దత్ర హి ।
దయిత! దృశ్యతాం దిక్షు తావకాః త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే ॥

(తే) - "హ్రీ శ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" (భూదేవి, లక్ష్మీదేవి నీకు పత్నులు) అని, "అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః, న ద్వితీయోఽస్తి కశ్చిత్" (పాపసంబంధం లేనివాడు, సృష్టిస్థితిలయాదులను క్రీడగా కలవాడు, ప్రకాశించేవాడు నారాయణు డొక్కడే, వేఱొకడు లేడు) అని, "పతిం విశ్వస్య ఆత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్" (సమస్తలోకానికి ప్రభువు, తనకు తానే నియామకుడు, నిత్యమైనవాడు, మంగళకరుడు, చ్యుతి లేనివాడు అయినవానిని) అని, "విష్ణుపోతం వినా నాన్యత్ కించి దస్తి పరాయణమ్" (విష్ణువు అనే పడవ తప్ప వేఱొక గతి కొంచెంకూడా లేదు) అని చెప్పే రీతిలో శ్రియఃపతివి, అఖిలహేయప్రత్యనీకుడవు, కల్యాణగుణాలకు అద్వితీయ ఆశ్రయభూతుడవు, సర్వానికి నియంతవు, సర్వస్వామివి, సర్వరక్షకుడవు, సంసారాన్ని దాటడానికి సిద్ధోపాయం అయిన నీయొక్క అని అర్థం.

(జన్మనా)- అవతారంచేత అని అర్థం. మిగిలిన అవతారాలవంటిదా ఈ అవతారం! "సంసారార్ణవమగ్నానామ్" (సంసారమనే సముద్రంలో మునిగినవారికి) అన్న రీతిలో సంసారంలో మునిగి ఉండి, "అసన్నేవ" (సత్త లేనివాడుగానే) అనేటట్లు అసత్తుతో సమానులైన సంసారిచేతనుల నష్టాన్ని చూచి తాను తెలిసిన నిరుపాధిక సంబంధమే కారణంగా, "అనురక్తకటాక్షమోక్షమ్" (అనురాగంతో కూడిన కటాక్షాన్ని ప్రసరింపజేసేవానిని) అనే

ఎన్నుమ్, "దధ్యాదికం మోహవశా దవోచత్, గోవింద దామోదర మాధవేతి" (శ్రీకృష్ణకర్ణామృతమ్) ఎన్నుమ్, "పత్తుడై యడియవర్క్కెళియవన్" (తిరువాయ్-1-3-1) ఎన్నుమ్, "ఇళవాయ్చ్చియర్ కణ్ణినుళ్ విడవే శెయ్దు విழిక్కుమ్ పిరానైయే" (తిరువాయ్-1-7-5) ఎన్నుమ్ శొల్లుగిఱపడియే తదీయరై తన్నழగాలుమ్, అతిమానుషగుణచేష్టితఙ్గళాలుమ్ కుమిழி నీరుణ్ణప్పణ్ణు మవతారమితే. "అతిమానుషశీలవృత్తవేషైః అతివృత్తామరవిక్రమప్రతాపైః, అతిలంఘిత సర్వలోకసామ్యం వరయే వైష్ణవవైభవావతారమ్" (అతిమానుష- 1) ఎన్ఱు శ్రీకూరత్తாழ్వాన్ కొణ్డాడినారితే ఇవ్వవతారవైభవత్తై.

(తే జన్మనా) కర్మబంధత్తాలే వన్దు పిఱక్కిఱ బద్ధరై ప్పోలన్ఱిక్కే,"స ఉ శ్రేయాన్ భవతి జాయమానః" (యజు-అష్టక- 3-6-3-9) ఎన్గిఱపడియే, కేవలకృపైయాలే వన్దు అవతరిత్తపడియాలే, వాత్సల్యాదిగుణప్రకాశకమాయ్, అత్యౌజ్జ్వల్యమాన తిరువవతారత్తాలే.

(తే జన్మనా) దేవరీర్ సర్వస్వతంత్రరాగైయాలే, తిరువడి ఆశ్రయిత్తవర్గళై పాపమే పచ్చైయాగక్కొణ్డు, పరమకృపైయాలే, ప్రకృతిభయత్తై నీక్కి రక్షిక్కవల్ల సామర్థ్యముడైయ దేవరీరుడైయ తిరువవతారత్తాలే- ఎన్ఱవుమామ్. "మా భీ ర్మన్ద! మనో! విచింత్య బహుధా యామీ శ్చిరం యాతనాః, నాऽమీ నః ప్రభవన్తి పాపరిపవః స్వామీ నను శ్రీధరః" (ముకుందమాల-11) ఎన్ఱారితే శ్రీకులశేఖరప్పెరుమాళ్.

---

రీతిలో నిర్హేతుకకటాక్షాన్ని కలవాడై, "మగ్నా నుద్ధరతే లోకాత్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా" (సంసారంలో మునిగిన లోకులను కరుణతో శాస్త్రమనే చేతితో లేవనెత్తుతున్నాడు) అనే రీతిలో వారిని రక్షించడం కోసం అవతరించిన, ఎంతో సౌలభ్యాన్ని కల్గిన అవతారంకదా ఇది. "ఉత్ఫుల్లపంకజదళస్పష్టకాంతివిలోచనమ్" (వికసించిన తామరదళంవంటి స్పష్టమైన కాంతిని కల నేత్రాలను కలవానిని) అని, "వేణీమూలే" అని, "దధ్యాదికం మోహవశాదవోచత్, గోవింద దామోదర మాధవేతి" (కృష్ణునిపై ఉన్న మోహంవల్ల పెఱుగు మొదలైనవానిని గోవింద, దామోదర అని నామాలను నిర్దేశించి ఒక గోపిక పల్కింది) అని, "పత్తుడై యడియవర్క్కెళియవన్" (భక్తిని కల దాసులకు సులభుడు)అని, "ఇళవాయ్చ్చియర్కణ్ణినుళ్ విడవేశెయ్దు విழிక్కుమ్ పిరానైయే" (చిన్నిగోపికల కన్నులలోనికి దౌత్యాన్ని చేసి చూచే స్వామినే) అని చెప్పే రీతిలో తన భక్తులను తన అందంతో, అతిమానుష చేష్టితాలతో వారిని మునిగి ఉక్కిరి బిక్కిరి అయి నీరు తాగేటట్లు చేసే అవతారంకదా! "అతిమానుష శీలవృత్తవేషై రతివృత్తామరవిక్రమప్రతాపైః, అతిలంఘితసర్వలోకసామ్యం వరయే వైష్ణవవైభవావతారమ్" (మానవమాత్రులకు సాధ్యం కాని శీల, వృత్తవేషాలతో, దేవతల విక్రమప్రతాపాలను మించిన విక్రమప్రతాపాలతో, అతిక్రమించిన సమస్తలోకసామ్యాన్ని కల విష్ణువుయొక్క విభవావతారాన్ని ఆశ్రయిస్తున్నాను)అని అంటూ కూరేశులు కీర్తించారుకదా- ఈ అవతారవైభవాన్ని.

**(తే జన్మనా)-** కర్మబంధంతో వచ్చి జన్మించే బద్ధచేతనులవలెకాకుండా, "స ఉ శ్రేయాన్ భవతి జాయమానః" (అతడు జన్మించినవాడు అవుతూనే గొప్పవాడవుతున్నాడు) అనే రీతిలో కేవలం కృపతో వచ్చి అవతరించినందువల్ల వాత్సల్యం మొదలైన గుణాలను ప్రకాశింపజేసే మిక్కిలి ఉజ్జ్వలమైన అవతారంతో.

**(తే జన్మనా)-** నీవు సర్వస్వతంత్రుడవు కాబట్టి (నీ) శ్రీపాదాలను ఆశ్రయించినవారి పాపమే నిరూపకంగా చేసికొని పరమకృపతో ప్రకృతిభయాన్ని పోగొట్టి రక్షించగల సామర్థ్యాన్నికల్గిన నీ అవతారంతో- అని కూడా భావం. "మాభీ ర్మంద! మనో విచింత్య బహుధా యామీ శ్చిరం యాతనాః నామీ నః ప్రభవంతి పాపరిపవః స్వామీ నను శ్రీధరః" (ఓ మూఢమనస్సా ! చిరకాలం ఈ యాతనలనుగూర్చి ఆలోచించి భయపడవద్దు. ఈ పాపాలనే శత్రువులు ఏమీ చేయలేవు. మన స్వామి శ్రీధరుడుకదా!) అని కులశేఖరప్పెరుమాళ్ అన్నారుకదా!

**(తే జన్మనా)** **"ఎన్ మాయప్పిఱవి మయర్వఱుత్తేనే"** **(తిరువాయ్-1-7-3)** ఎన్గిఱపడియే ఆశ్రయిత్త చేతనర్గళుడైయ మాయప్పిఱవి మయర్వై అఱుక్కత్తక్క దేవరీరుడైయ తిరువవతారత్తాలే. **"యే యజన్తి తు మాం భక్త్యా తేషాం ముక్తి ర్న సంశయః"** ఎన్లానిన్దదిఱే.

**(తే జన్మనా)** **"పెఱ్ఱమ్ మేయ్‌త్తుణ్ణుమ్ కులత్తిల్ పిఱన్ద నీ"** **(తిరుప్పావై-29)** ఎన్గిఱపడియే ఆశ్రితరై రక్షిత్తాలల్లదు నిఱ్కమాట్టాద స్వభావత్తైయుడైయ దేవరీరుడైయ జన్మత్తాలే- ఎన్దవుమామ్.

**(వ్రజః అధికం జయతి)** శ్రీవైకుంఠనాథరాన దేవరీర్, **"అవాక్యనాదరః"** **(ఛాందో-3-14-2)** ఎన్దు శొల్లుగిఱ పరత్వత్తై విట్టు, అఖిలకల్యాణగుణ్గళుమ్ ప్రకాశిక్కుమ్ పరమసౌలభ్యవేషత్తోడే వన్దు పిఱన్దరుళినపడియాలే అతినికృష్టమాన ఇన్ద వ్రజమానదు, పరమపదత్తిలు మధికమాగ ప్రకాశిక్కిఱదు. **"య స్త్వయా సహ స స్వర్గో నిరయో య స్త్వయా వినా"** **(రామా-అయో- 30-18)** ఎన్లానిన్దదిఱే. సర్వేశ్వరనుడైయ రక్షకత్వమ్ ప్రకాశిక్కిఱదు ఇజ్గేయిఱే. నందవ్రజమ్ సర్వేశ్వరనుడైయ తిరువడియాశ్రయత్తాల్ పరమపదత్తిలు మధికమాన పడి కణ్డాల్, ఇదైయరుమ్ నిత్యసూరిగళిల్ తలైవరానపడి శొల్లవేణుమో? పరమపదమ్ శుద్ధసాత్త్వికమాగైయాలే అజ్గిరున్దవర్‌గళ్ జ్ఞానిగళాకై స్వభావమిఱే ! **"ఇరుళ్ తరు మాఞాల"** **(తిరువిరు-80)** మాన ఇన్ద విభూతియిలుమ్ పిఱన్దువైత్తు ప్రపన్నరానాల్, **"విణ్ణుళారిలుమ్ శీరియ"** **(తిరువాయ్-10-7-1)** రిఱే. **"విణ్ణు మాళ్‌వర్ మణ్ణూడే"** **(తిరువాయ్-4-3-11)** ఎన్గిఱపడియే ఉభయవిభూతిగళైయు మాళ సమర్థర్‌గళిఱే అవర్‌గళ్.

**(జయతి తేఽధికం జన్మనా వ్రజః)** **"ఉలకినిల్ తోఱ్ఱమాయ్ నిన్ఱ శుడరే!"** **(తిరుప్పావై-22)** ఎన్గిఱపడియే ఇవ్వులకినిల్ వన్దవతరిత్త పిన్బు సర్వేశ్వరనుడైయ వైభవమ్ విఞ్జియిరుక్కుమాప్పోలే కాణుమ్, ఇన్ద వ్రజముమ్

---

**(తే జన్మనా)- "ఎన్ మాయప్పిఱవి మయర్వఱుత్తేనే"** (మాయాజన్మవల్ల కల్గిన నా అజ్ఞానాన్ని ఛేధించాను.) అనే రీతిలో ఆశ్రయించే చేతనుల మాయాజన్మవల్ల కల్గిన అజ్ఞానాన్ని ఛేదించతగిన నీ అవతారంచేత. **"యే యజంతి తు మాం భక్త్యా తేషాం ముక్తి ర్న సంశయః"** (ఎవరునన్ను భక్తితో ఆరాధిస్తారో వారికి ముక్తి కల్గుతుంది. సందేహం లేదు) అని అనబడుతున్నదికదా!

**(తే జన్మనా)- "పెఱ్ఱమ్ మెయ్‌త్తుణ్ణుమ్ కులత్తిల్ పిఱన్ద నీ"** (పశువులను మేపి భుజించే కులంలో పుట్టిన నీవు) అన్నట్లు ఆశ్రితులను రక్షిస్తే తప్ప నిలువలేని స్వభావాన్ని కల నీ జన్మతో- అని కూడా భావం.

**(వ్రజః అధికం జయతి)** శ్రీవైకుంఠనాథుడవైన నీవు **"అవాక్యనాదరః"** (ఏమీ పలుకడు, ఎవరిపట్ల ఆదరాన్ని కల్గి ఉండడు) అని చెప్పే పరత్వాన్ని విడచి, అఖిలకల్యాణగుణాలు ప్రకాశించే పరమసౌలభ్యవేషంతో వచ్చి జన్మించినందువల్ల మిక్కిలి తక్కువైన ఈ రేపల్లె పరమపదంకంటె అధికంగా ప్రకాశిస్తున్నది. **"య స్త్వయా సహ స స్వర్గో నిరయో యస్త్వయా వినా"** (నీతో ఉండడమే స్వర్గం, నీతో లేకుండా ఉండడమే నరకం) అని అనబడుతున్నదికదా! సర్వేశ్వరుని రక్షకత్వం ప్రకాశించేది ఇక్కడే కదా! నందవ్రజం సర్వేశ్వరుని శ్రీపాదాల ఆశ్రయంచేత పరమపదంకంటే గొప్పది అయిన తీరును చూస్తే, గొల్లలుకూడ నిత్యసూరులకంటె గొప్పవారు కావడంగూర్చి చెప్పవలసి ఉన్నదా? పరమపదం శుద్ధసాత్త్వికం కాబట్టి అక్కడ ఉన్నవారు జ్ఞానులు కావడం సహజం కదా! అజ్ఞానాన్ని కల్గించే విశాలభూమి అయిన ఈ విభూతిలో పుట్టికూడా ప్రపన్నులైతే వారు నిత్యసూరులకంటె గొప్పవారుకదా! **"విణ్ణుమాళ్వర్ మణ్ణూడే"** (లీలావిభూతితో పాటు పరమపదాన్నికూడా ఏలుతారు!) అన్నట్లు ఉభయవిభూతులను ఏలగల సమర్థులుకదా వారు!

**(జయతి తేఽధికం జన్మనా వ్రజః) - "ఉలకినిల్ తోఱ్ఱమాయ్ నిన్ఱ శుడరే!"** (లోకంలో అవతరించినవాడవై ఉన్న జ్యోతిస్స్వరూపుడా!) అన్నట్లు ఈలోకంలోవచ్చి అవతరించిన తరువాత సర్వేశ్వరునివైభవం

నిఖిలకల్యాణగుణాకరనానవనోట్టై సంబన్ధత్తాలే అభివృద్ధమాయిరుక్కిఱపడి. ఇన్ద నిరవధికవైభవయుక్తమాయ్ వ్రజమ్ ప్రకాశిక్కిఱ దెన్రు శొల్లుగైక్కు ప్రమాణ మేదెన్న ? మఱ్ఱొరు ప్రమాణమ్ వేణుమో? ఇవ్వూరిల్ ఎల్లై యిల్లాద ఐశ్వర్యత్తై కణ్డాల్ తెఱియాదో- ఎన్గిఱార్గళ్.

(శ్రయత ఇందిరా శశ్వ దత్ర హి) ఎన్రు. అదావదు - "అన్యేషు చావతారేషు విష్ణో రేషాఽనపాయినీ" (విష్ణు. పు.-1-9-145) ఎన్గిఱపడియే అనపాయినియాన పిరాట్టియార్ "అకలకిల్లేన్" (తిరువాయ్-6-10-10) ఎన్రుమవళాగైయాలే, శ్రియఃపతి వన్దు పిఱన్దు ఆశ్రయిత్త ఇన్ద వ్రజత్తై ఆదరిత్తుక్కొణ్డు పిరియమాట్టామే నిరవధికమాగ ఆశ్రయిత్తదుగాణ్- ఎన్రబడి. పెరుమాళుడైయ అవతారత్తుక్కు మున్బు నిరవధికదారిద్ర్యత్తోడే ఇరుక్కిఱ వ్రజ మివర్ అవరిత్త పిన్బు పరమైశ్వర్యత్తోడే ప్రకాశిక్కిఱదు. "తత ఆరభ్య నందస్య వ్రజ స్సర్వసమృద్ధిమాన్, హరే ర్నివాసాత్మగుణై రమాక్రీడ మభూన్నృప!" (భాగవతమ్-10-5-17) ఎన్రారితే శ్రీవేదవ్యాసభగవాన్. ఇఙ్గు, "ఇందిరా" ఎన్రు శ్రీయాయ్, "సా హి శ్రీ రమృతా సతామ్" (తైత్తి. ఆనంద-6) ఎన్గిఱపడియే భగవత్ప్రత్యాసత్తియై చ్చొల్లుగిఱదు. ఆగ, ఇవ్విరణ్డువాక్యఙ్గళాలే "దేవరీర్ సకలచేతనోజ్జీవనార్థమాగ "సకలమనుజనయనవిషయతాంగత" (గీతాభాష్యావతారిక) నాయ్, పరమసౌలభ్యాదికల్యాణగుణోపేతనాన ఆచార్యవేషత్తోడే వన్దవతరిత్త పిన్బు, దేవరీరుడైయ కటాక్షత్తాలే ఇతుక్కు మున్బు, "అస న్నేవ" (తైత్తి ఆనంద-6) ఎన్గిఱపడియే అసత్ప్రాయమాయిరుక్కిఱ ఇన్ద చేతనసముదాయమ్ "సన్త మేనం తతో విదుః" (తైత్తి. ఆనంద-6) ఎన్గిఱపడియే భగవత్ప్రత్యాసత్తియై అడైన్దు, సత్తాయ్ ప్రకాశిక్కిఱదు- ఎన్రపడి.

---

అధికంగా ఉన్నట్లే కదా- ఈ రేపల్లెకూడా నిఖిలకల్యాణగుణాకరుడైనవాని సంబంధంలో అభివృద్ధమై ఉన్నది. నిరవధికవైభవంతో ఈ వ్రజం (రేపల్లె) ప్రకాశిస్తున్నది అనడానికి ప్రమాణం ఏది? అని అంటే, వేఱొక ప్రమాణం కావాలా? ఈ ఊరిలోని అంతు లేని సంపదను చూస్తే తెలియదా? అని అంటున్నారు-

(శ్రయత ఇందిరా శశ్వ దత్ర హి)- అని. అది! ఏమంటే- "అన్యేషు చావతారేషు విష్ణోః శ్రీ రనపాయినీ" (మిగిలిన అవతారాల్లోకూడా విష్ణువును విడవకుండా లక్ష్మీదేవి ఉంటుంది) అన్నట్లు అనపాయిని అయిన లక్ష్మీదేవి "అకలకిల్లేన్" (విడిచి ఉండలేను) అనేది కాబట్టి, శ్రియఃపతి వచ్చి ఆశ్రయించిన ఈ రేపల్లెను ఆదరిస్తూ విడవలేకుండా నిరవధికంగా ఆశ్రయించిందిసుమా ! అని భావం. భగవానుని అవతారానికి ముందు నిరవధికమైన దారిద్ర్యంతో ఉన్న రేపల్లె ఇతడు అవతరించిన తరువాత గొప్ప ఐశ్వర్యంతో ప్రకాశిస్తున్నది. "తత ఆరభ్య నందస్య వ్రజ స్సర్వసమృద్ధిమాన్, హరే ర్నివాసాత్మగుణైః రమాక్రీడ మభూ న్నృప" (ఓ రాజా ! అప్పటినుండి నందుని రేపల్లె సమస్తసమృద్ధిని కల్గినదై, విష్ణువుకు నివాసమైనదై, ఆత్మగుణాలతో లక్ష్మీదేవికి క్రీడాస్థానమైనది) అని వేదవ్యాసభగవానుడన్నాడుకదా! ఇక్కడ "ఇందిరా" అన్న పదానికి శ్రీ అని అర్థం. "సా హి శ్రీ రమృతా సతామ్" (అదే కదా సత్పురుషులకు నశించని సంపద) అన్నట్లు భగవానునిపట్లగల ఆసక్తిని (భక్తిని) తెలుపుతున్నది. అందువల్ల ఈ రెండు వాక్యాలచేత "తమరు సకలచేతనుల ఉజ్జీవనంకోసం సకలమానవుల నేత్రాలకు కనుపించే, పరమసౌలభ్యాది కల్యాణగుణాలను కల్గిన ఆచార్యవేషంతో అవతరించిన తరువాత, నీ కటాక్షంచేత ఇంతకుముందు "అసన్నేవ" అన్నట్లు అసత్తువలె ఉన్న ఈ చేతనసముదాయం "సంత మేనం తతో విదుః" (పరమాత్మ ఉన్నాడని భావించినందున వీనిని సత్తను కలవానినిగా తెలిసికొంటారు) అన్నట్లు భగవత్ప్రత్యాసత్తిని పొంది, సత్తుగా- అంటే, అస్తిత్వాన్ని కల్గినదిగా) ప్రకాశిస్తున్నదని భావం.

(దయిత) ఇప్పడి వన్దు పిఱన్దు అద్వేషమ్ తుడజ్గి పరమభక్తిపర్యంతమ్ ఇరుక్కత్తక్క ఆత్మగుణజ్గళెల్లా ముణ్డాక్కి పరమభక్తికార్యమాన కైంకర్య మనోరథసమయత్తిల్ అదృశ్యమానపడి ఎజ్గళుక్కు నాథనాన దేవరీరుడైయ స్వరూపత్తుక్కు శేరాదు కాణ్. "పతిం విశ్వస్యాత్మేశ్వరమ్" (141) ఎన్గిఱపడియే ఎజ్గళుక్కు రక్షకనాగ ప్రసిద్ధియై యుడైయ ఉన్నుడైయ రక్షణత్తుక్కు ఇదు విరుద్ధమిఱే. పతివ్రతైయాన భార్యైయై విట్ట భర్తావుక్కు వరు మవద్యమ్ దేవరీరుక్కు శొల్లవేణుమో? దేవరీరుక్కు అనన్యార్హశేషభూతరాన విశ్వాత్మాక్కళై నాథనాన నీర్ విడ మఱ్ఱొరు గతి యిల్లైయే!

(దృశ్యతామ్) ఉన్నుడైయ దివ్యమజ్గళవిగ్రహసౌభాగ్యసేవైయే ప్రయోజనమాగ అనుసన్ధిత్తు అత్తై యిழన్దు అనుతపిక్కిఱ ఎజ్గళ్ మున్నే ఒరుకాల్ తోఱ్ఱ అమైయుమ్. "నణ్ణి యునై నాన్ కణ్డుగన్దు కూఱ్ఱాడ నణ్ణి యొరు నాళ్ ఞాలత్తూడే నడవాయే" (తిరువాయ్- 6-9-2) ఎన్హుమ్, "ఒరు నాళ్ కాణ వారాయ్ విణ్మీదే" (తిరువాయ్ -6-9-4)ఎన్హుమ్, "కోల మేని కాణ వారాయ్" (తిరువాయ్-4-7-1) ఎన్హుమ్, "కళ్ళమాయా వున్నై ఎన్ కణ్ కాణ వన్దీయాయే" (తిరువాయ్ -) ఎన్హుమ్ ఆழ్వార్ ప్రార్థిత్తుపడియే ఇవరుమ్ ఒరుకాల్ కాణ అమైయు మెన్గిఱార్. "కృష్ణం లోకయ లోచనద్వయ!" (ముకుందమాల-16) ఎన్గిఱపడియే చేతననుడైయ దృగింద్రియవిషయమ్ కృష్ణసేవైయేయిఱే. అతిల్లావిడిల్ ప్రపన్ననుక్కు ప్రాణధారణమ్ దుర్లభమా యిరుక్కుమే. ఆనపిన్బు, దేవరీరుడైయ దాసవర్గమెల్లామ్ ఇన్ద విభూతియిలే శిలనాళ్ ఇరుక్కవేణు మెన్హు తిరువుళ్ళమాగిల్, దేవరీర్ ఒరుకాల్ దృశ్యరాగ అమైయుమ్. అతిల్లాదపోదు "శతధా వినాశం తత్సత్యం మధుమథన! విజ్ఞాపన మిదమ్" (స్తోత్రరత్నమ్-57)ఎన్గిఱపడియే

---

(దయిత) ఈ విధంగా వచ్చి జన్మించి, అద్వేషం మొదలు పరమభక్తిపర్యంతం ఉండదగిన ఆత్మ గుణాలన్నిటినీ కల్గించి, పరమభక్తికార్యం అయిన కైంకర్యమనోరథసమయంలో అదృశ్యం అయేటట్లు మాకు నాథుడవైన మీ స్వరూపానికి తగదుసుమా! అని భావం. "పతిం విశ్వస్యాత్మేశ్వరమ్" (సమస్తజగత్తుకు పతి; తనకు తానే ఈశ్వరుడు అయినవానిని) అన్నట్లు మాకు రక్షకుడవు అనే ప్రసిద్ధిని కల నీ రక్షణకు ఇది విరుద్ధం కదా! పతివ్రత అయిన భార్యను విడచిన భర్తకు వచ్చే దోషాన్ని గూర్చి నీకు చెప్పాలా? నీకు అనన్యార్హశేష భూతులైన ఈ చేతనులను నాథుడవై నీవు విడిస్తే వీరికి వేఱొక గతి లేదుకదా!

(దృశ్యతామ్)- నీ దివ్యమంగళ విగ్రహసౌందర్యాన్ని సేవించడమే ప్రయోజనంగా అనుసంధించి, దానిని కోల్పోయి అనుతపించే మా ముందు ఒకసారి ప్రత్యక్షం అయితే చాలు. "నణ్ణి యునై నాన్ కణ్డుకన్దు కూఱ్ఱాడ నణ్ణి యొరు నాళ్ ఞాలత్తూడే నడవాయే" (నేను నిన్ను చేరి, దర్శించి, ఆనందించి, నాట్యం చేసేటట్లు నీవు ఏదో ఒకనాడు ఈ భూమిపై సంచరించరాదా) అని, "ఒరునాళ్ కాణవారాయ్ విణ్మీదే" (ఏదో ఒకనాడు ఈ భూమిపైన దర్శించేటట్లు రావయ్యా!) అని, "కోల మేని కాణ వారాయ్" (నీ అందమైన తిరుమేనిని దర్శించేటట్లు రావయ్యా!) అని, "కళ్ళ మాయా! వున్నై ఎన్ కణ్ కాణ వన్దీయాయే" (మా మనస్సును దొంగిలించే మోసగాడా! నిన్ను నా కళ్ళు దర్శించేటట్లు రావయ్యా!) అని ఆழ్వార్లు ప్రార్థించిన రీతిలో వీరుకూడా ఒకసారి దర్శిస్తే చాలునని అంటున్నారు. "కృష్ణం లోకయ లోచనద్వయ" (ఓ నేత్రద్వయమా! కృష్ణుణ్ణి దర్శించు) అన్నట్లు చేతనుని దృగింద్రియానికి విషయం కృష్ణసేవే కదా! అది లేకపోతే ప్రపన్ననకు ప్రాణధారణ దుర్లభం అవుతుంది కదా! అందువల్ల తమ దాసవర్గమంతా ఈ లోకంలో కొన్నాళ్ళు ఉండాలని నీ అభిప్రాయం అయితే, మీరు ఒకసారి కనుపిస్తే చాలు. అది లేకపోతే "శతథా వినాశం తత్సత్యం మధుమథన! విజ్ఞాపన మిదమ్" (ఓ మధుసూదనా! వంద రీతుల్లో వినాశం కల్గుతుంది. అది నిజం. నా విజ్ఞాపనం ఇది) అన్నట్లు మా నాశమే సత్యంసుమా! తరువాత ఎవరికి నీ

ఎజ్గళుడైయ నాశమ్ సత్యమ్ కాణ్. పిన్బు యార్క్కు ఉన్నుడైయ సౌందర్యాదిగళ్ వేణ్డియిరుప్పు?. ఆగ, ఇప్పోదే ఎజ్గళ్ మున్నే దృశ్యనాగవేణు మెన్గిఱార్గళ్. "ఉత్ఫుల్లపంకజదళ స్పష్టకాంతి విలోచనమ్, అపశ్యంతో హరిం దీనాః కథం గోష్ఠే భవిష్యథ?" (భాగవతమ్) ఎన్నుమవర్గళిఱే ఇవర్గళ్.

**(దిక్షు తావకాః త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే)** ఎన్ విషయత్తిల్ ఇవర్గళుక్కు ఇత్తనై ప్రేమముణ్డో? ఎన్ఱు దేవరీర్ శజ్కిత్తిరున్దీరాగిల్, పారీర్! దేవరీర్డైయ దాసవర్గమెల్లామ్ ఎప్పడి సర్వతోదిక్కమాగ త్వద్విషయ ప్రవణయుక్తరాయ్క్కొణ్డు, ప్రాణజ్గళెల్లా మున్ విషయత్తిలే సమర్పిత్తు ఉన్నై అన్వేషిక్కిఱార్గళో? ఎన్గిఱార్గళ్. **(దిక్షు)** సర్వదిశైగళిలుమ్. "దిశ శ్చ నారాయణః, ప్రదిశ శ్చ నారాయణః, అన్తర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" (నారాయణోపనిషత్) ఎన్నుమ్, "ఎణ్డిశైయుమ్ కీழుమ్ మేలుమ్ ముత్ఱవు ముణ్డ పిరాన్" (తిరువాయ్ - 9-1-1) ఎన్నుమ్ శొల్లుగిఱపడియే సర్వదిశైగళిలుమ్ వ్యాపిత్తిరుక్కిఱ వస్తువాగైయాలే, ఎన్ద దిశైయిలిరుప్పానో? ఎన్ఱు దిశైగళ్ దోఱుమ్ శెన్ఱు శెన్ఱు అన్వేషిక్కిఱార్గళ్- ప్రేమాధిక్యత్తాలే. "నాడి నాడి నరశిజ్గా! వెన్ఱు వాడి వాడు మివ్వాణుదలే",(తిరువాయ్ -2-4-1) ఎన్ఱ ఆழ్వార్పడియే, ఇవరుమ్ సర్వదిశైగళిలుమ్ నాడి నాడి, స్వామియై కాణాదపడియాలే ఇన్నాదాగిఱార్. **(తావకాః)** త్వదీయాః- ఎన్ఱపడి. ఇవ్వళవు శ్రమమ్ పడుగిఱార్, "దాసభూతాః" (హారీతస్మృతి) ఎన్గిఱపడియే దేవరీరుక్కే అనన్యప్రయోజనరాన దాసభూతరాగైయాలే, ఉన్నుడైయారై ఇప్పడి బాధిక్కిఱదు ఉన్ స్వామిత్వత్తుక్కుమ్, వాత్సల్యత్తుక్కుమ్ శేరాదుకాణ్.

---

సౌందర్యాదులు కావాలి? అందువల్ల ఇప్పుడే మా ముందే సాక్షాత్కరించాలి- అని అంటున్నారు. "ఉత్ఫుల్లపంకజ దళస్పష్టకాంతివిలోచనమ్, అపశ్యంతో హరిం దీనా కథం గోష్ఠే భవిష్యథ?" (చక్కగా పూచిన తామరపూవురేకువలె స్పష్టమైన కాంతిని కల్గిన నేత్రాలను కల కృష్ణుణ్ణి చూడలేనివారై, దీనులైన మీరు ఏవిధంగా రేపల్లెలో ఉండగలరు?) అనే వారుకదా వీరు!

**(దిక్షు తావకాః త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే)** నా విషయంలో వీరికి ఇంత ప్రేమ ఉన్నదా !- అని నీవు సందేహిస్తే చూడు!, తమ దాసవర్గం అంతా ఏవిధంగా అన్ని రీతుల్లో నీ విషయంలో ప్రావణ్యాన్ని కల్గి, ప్రాణాలను అన్నిటినీ నీ విషయంలో సమర్పించి, నిన్ను అన్వేషిస్తున్నారో! -అని అంటున్నారు. **(దిక్షు)** అన్ని దిక్కులలోను అని అర్థం. "దిశ శ్చ నారాయణః ప్రదిశ శ్చ నారాయణః అన్తర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" (దిక్కులుకూడా నారాయణుడే. విదిశలుకూడా నారాయణుడే. లోపల బయటకూడా అంతా వ్యాపించి నారాయణుడున్నాడు) అని, "ఎణ్డిశైయుమ్ కీழుమ్ మేలుమ్ ముత్ఱవు ముణ్డ పిరాన్" (ఎనిమిది దిక్కులు, క్రింద పైన అంతటిని ఆరగించిన స్వామి) అని చెప్పే రీతిలో అన్ని దిక్కులలోను వ్యాపించి ఉన్న వస్తువు కావడంవల్ల ఏ దిశలో ఉన్నాడో? అని ప్రతిదిక్కుకు పోయి పోయి, అన్వేషిస్తున్నారు- ప్రేమాధిక్యంచేత. "నాడి నాడి నరశిజ్గా ! వెన్ఱు వాడి వాడుమ్ ఇవ్వాణుదలే" (అన్వేషించి, అన్వేషించి, ఓ నరసింహా! అని అంటూ ప్రకాశించే ఫాలాన్ని కల ఈ నాయిక మిక్కిలి వాడిపోతున్నది) అనే ఆழ్వార్ల రీతిలో వీరు కూడా అన్ని దిక్కులలోను వెదికి వెదికి స్వామిని చూడలేకపోవడం చేత ఆర్తులవుతున్నారు. **(తావకాః)** నీకు చెందినవారని అర్థం. "దాసభూతాః" (జీవులందరు పరమాత్మకు సహజంగా దాసులు) అన్నట్లు తమకే అనన్యప్రయోజనలైన దాసభూతలు కావడంచేత ఇంతటి శ్రమపడుతున్నారు. నీ సొత్తు అయిన మమ్ములను ఈ విధంగా బాధించడం నీ స్వామిత్వానికి, వాత్సల్యానికి తగదుసుమా!

**(త్వయి)** నిరుపాధికశేషియాయ్, స్వామియాన ఉన్ విషయత్తిలే. ఉన్నై విడప్పార్త్తాలుమ్, విడ వరిదాన "పితా చ రక్షక శ్శేషీ" (నవవిధసంబంధమ్) ఎన్నుమ్, "మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృ ద్గతి ర్నారాయణః" (సుబాల-6) ఎన్నుమ్, "శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలా త్తాయ్ తన్దైయు మవరే యిని యావారే" (తిరువాయ్ -5-1-8) ఎన్నుమ్ శొల్లుగిఱపడియే నిరుపాధికసర్వవిధబంధువాన ఉన్ విషయత్తిలే.

**(ధృతాసవః)** ధరిత్తిరుక్కిఱ ప్రాణఙ్గళై యుడైయరాయ్ క్కొణ్డు. అదావదు - దేవరీరుడైయ పరిచర్యైక్కాగ ప్రాణఙ్గళై ధరిత్తిరుక్కిఱార్గళ్- ఎన్నపడి. అదుక్కు ఆళాగాద వన్దు "న హి మే జీవితేనార్థః" (రామా-సుందర-26-5) ఎన్నుమ్, "న దేహం న ప్రాణాన్" (స్తోత్రరత్నమ్-57) ఎన్నుమ్, "ఉడమ్బుడైయాన్ కవరాద ఉయిరినాల్ కుఱైవిలమే" (తిరువాయ్ -4-8-10) ఎన్నుమ్ శొల్లుగిఱపడియే ప్రాణఙ్గళై త్యజిక్కుమవర్గళితే ఇవర్గళ్. న్యస్తభరరానవర్గళ్ ఎన్నపడి.

**(త్వామ్)** "అడియేన్ మేవు అమర్కిన్ఱ వముదే!" (తిరువాయ్ -6-10-7) ఎన్గిఱపడియే అమృతవద్భోగ్య భూతనాయ్, వకుత్త శేషియాన ఉన్నై. "రసో వై సః" (తైత్తి-ఆనంద) ఎన్నుమ్ శొల్లుగిఱదితే శ్రుతియుమ్.

**(విచిన్వతే)** ఎత్తనైయేనుమ్ శ్రమత్తై సహిత్తు, అనన్యప్రయోజనరాయ్, ఉన్నై సేవిక్కైక్కే అన్వేషిక్కిఱార్గళ్. అవర్గళైక్కాగిలుమ్ ఒరు కాల్ తోన్ఱవేణు మెన్గిఱార్గళ్.

**(దయిత! దృశ్యతాం దిక్షు తావకాః త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే)** ప్రాణఙ్గళెల్లా మున్ విషయత్తిల్ అగప్పడుత్తిక్కొణ్డు ప్రతిక్షణముమ్ ఉనక్కు ఎన్న తీఙ్గు వరుగిఱదో? ఎన్ఱఞ్జి, నిరతముమ్ మంగళాశాసనపరరాయ్,

---

**(త్వయి)** నిరుపాధికశేషివై, స్వామివైన నీ విషయంలో. నిన్ను వదలాలని చూచినా, విడువడానికి అరుదైన (సాధ్యం కాని) "పితా చ రక్షకః శేషీ" (తండ్రి, రక్షకుడు, శేషికూడా) అని, "మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృ ద్గతిః నారాయణః" (తల్లి,తండ్రి తోబుట్టువు, నివాసం, రక్షకం, మిత్రం, గతి- నారాయణుడు) అని, "శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలా త్తాయ్ తన్దైయుమ్ అవరే యిని యావారే" (అందమైన కన్నులను కల స్త్రీలు, గొప్ప సంపద, మంచి సంతానం, ఇంకా తల్లి, తండ్రి అన్నీ ఆయనే) అని చెప్పే రీతిలో నిరుపాధికంగా సర్వవిధబంధువైన నీ విషయంలో.

**(ధృతాసవః)** నిలుపుకొన్న ప్రాణాలను కలవారై. అనగా- తమ సేవకోసం ప్రాణలను ధరించి ఉన్నారని భావం. అందుకు లక్ష్యం కానపుడు "న హి మే జీవితేనార్థః" (నా జీవితంతో పని లేదు)అని, "న దేహం న ప్రాణాన్" (నా దేహాన్ని, ప్రాణాలను కోరను) అని, "ఉడమ్బుడైయాన్ కవరాద ఉయిరినాల్ కుఱైవిలమే" (స్వామిని ఆశపడని ప్రాణాలతో పనిలేదు) అని చెప్పే రీతిలో ప్రాణాలను విడిచివేసేవారుకదా వీరు! న్యస్తభరులు -అంటే, భగవత్సన్నిధిలో తమ రక్షణభారాన్ని సమర్పించినవారని భావం.

**(త్వామ్) -** అడియేన్ మేవుమ్ అమర్కిన్ఱ వముదే!" (దాసుడు ఆశపడే అత్యప్తామృతమా!) అని పలికే రీతిలో అమృతంవలె భోగ్యభూతుడవై, ప్రాప్తశేషివైన నిన్ను అని అర్థం. "రసో వై సః" (ఆ పరమాత్మ రసస్వరూపి) అని శ్రుతికూడా వచిస్తున్నది కదా!

**(విచిన్వతే)-** ఎంతటి శ్రమను అయినా సహించి, అనన్యప్రయోజనులై, నిన్ను సేవించడం కోసమే అన్వేషిస్తున్నారు. వారికోసం అయినా, ఒకసారి ప్రత్యక్షం కావాలి -అని అంటున్నారు.

**(దయిత! దృశ్యతాం దిక్షు తావకాః త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే)-**ప్రాణాలన్నీ నీ వశం చేసికొని, ప్రతిక్షణం నీకు ఏమి ఆపద మూడుతుందో! ఏమో! అని భయపడి, సర్వదా మంగళాశాసనం చేసేవారై, అన్ని

సర్వదిశైగళిలుమ్ ఉన్ దివ్యమంగళవిగ్రహత్తై సేవిక్కవేణుమెన్నుమభినివేశత్తాలే ప్రాప్తశేషియాన ఉన్నై అన్వేషిక్కిఱ ఇవర్గళుక్కుమ్ ఉన్నుడైయ దివ్యమఙ్గళవిగ్రహత్తై మఱైత్తు నిఱ్కిఱపడి కణ్డాల్, ఇతు ఉన్నుడైయ వ్రతత్తుక్కు మిగవుమ్ విరోధమ్ కాణ్. "ఉపస్థేయై రుపస్థితః" (రామా-ఆర- 10-9) ఎన్గిఱపడియే అవర్గళ్ అన్వేషిక్కైక్కు మున్నే తోన్ఱవేణుమెన్ఱిఱే అవన్ పడి. "అతంత్రితచమూపతిప్రహితహస్త మస్వీకృతప్రణీతమణిపాదుకం కిమితి చాకులాంతఃపురమ్, అవాహనపరిష్క్రియమ్ పతగరాజ మారోహతః కరిప్రవరబృంహితే భగవత స్త్వరాయై నమః" (శ్రీరంగరాజస్తవ-ఉత్తర-57) ఎన్గిఱపడియే ఆర్తరక్షణత్తిల్ త్వరై కరై పురణ్డు, "భక్తానాం త్వం ప్రకాశసే" (జితంతే స్తోత్రమ్-4) ఎన్గిఱ వాక్యమ్ సార్థకమాగ ఎఙ్గళ్ మున్నే ఇప్పోదే ప్రత్యక్షిత్తు, చరమప్రాప్యమాన దేవరీరుడైయ కైఙ్కర్యఙ్గళై ప్రసాదిక్కవేణు మెన్గిఱార్గళ్.

ముదల్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

## ఇరణ్డామ్ శ్లోకమ్

అవ : కీழே, చరమశేషియాన సర్వేశ్వరనుడైయ పరమసౌలభ్య యుక్తమాయ్, కృపామాత్రప్రసన్నమాన ఆచార్యావతారత్తాలే తఙ్గళుక్కు నిలై నిన్ఱ జ్ఞానశ్రీయై ప్పేశి, "ఉన్నై క్కాణ క్కరుదు మెన్ కణ్ణే" (తిరువాయ్ -9-4-1) ఎన్గిఱపడియే అన్ద మహోపకారకనానవనై సేవిక్కైయే తమక్కు ప్రయోజనమాయ్ సేవిక్కవేణు మెన్ఱు ప్రార్థిత్తార్. ఇని, ఇరణ్డామ్ శ్లోకత్తాలే, అన్ద ఉపకారస్మృతియాలే అవనుడైయ నిరవధికతేజోయుక్తమాన దివ్యమంగళవిగ్రహత్తై

---

దిక్కుల్లోను నీ దివ్యమంగళ రూపాన్ని సేవించాలనే అభినివేశంతో ప్రాప్తశేషివి అయిన నిన్ను వెదికే వీరికి కూడా నీ దివ్యమంగళరూపాన్ని మఱుగుపఱచి ఉండే తీరు చూస్తే, ఇది నీ వ్రతానికి చాలా విరోధంసుమా! "ఉపస్థేయై రుపస్థితః" (నేనే స్వయంగా పోయి దఱిచేరవలసినవారిచేత సమీపింపబడ్డాను) అన్నట్లు వారు వెదకడానికి ముందే ప్రత్యక్షం కావాలి అని కదా అతని తీరు ఉంటుంది. "అతంత్రితచమూపతిప్రహితహస్త మస్వీకృతప్రణీత మణిపాదుకం కి మితి చాకులాంతఃపురమ్, అవాహనపరిష్క్రియం పతగరాజ మారోహతః కరిప్రవరబృంహితే భగవత స్త్వరాయై నమః" (గజేంద్రుడు ఎలుగెత్తి రక్షణకోసం ఆక్రందించగానే, సేనాధిపతిఅయిన విష్వక్సేనుడు అందిచ్చిన కైదండను గ్రహించకుండా, తీసికొని వచ్చిన మణిపాదుకలను స్వీకరించకుండా, అంతఃపురంలోని దేవేరులు ఇదేమిటి? అని భయపడుతూ ఉండగా, వాహనాలంకారాలు ఏమీ చేయని గరుత్మంతుణ్ణి అధిరోహించే భగవంతుని ఆశ్రితరక్షణలోని త్వరకు నమస్కారం) అనే రీతిలో ఆర్తరక్షణలో తొందర పొంగి పొర్లి, "భక్తానాం త్వం ప్రకాశసే" (భక్తులకోసం నీవు ప్రకాశిస్తున్నావు) అనే వాక్యం సార్థకం అయేటట్లు మాముందే ఇపుడే ప్రత్యక్షమై, చరమప్రాప్యం అయిన తమ కైంకర్యాలను ప్రసాదించాలని అంటున్నారు.

మొదటి శ్లోకం ముగిసింది

## రెండవ శ్లోకం

అవ:- ఇంతకుముందు, చరమశేషి అయిన పరమసౌలభ్యాన్ని కల్గినదై, కృపామాత్రప్రసన్నం అయిన సర్వేశ్వరునియొక్క ఆచార్యావతారంచేత తమకు స్థిరంగా ఏర్పడ్డ జ్ఞానసంపదనుగూర్చి పల్కి, "ఉన్నై క్కాణ క్కరుదుమ్ ఎన్ నెఞ్జే" (నిన్ను దర్శించాలని నా మనస్సు ఆశిస్తుంది) అన్నట్లు మహోపకారకుడైన వానిని సేవించడమే తమకు ప్రయోజనం కనుక సేవించాలని (గోపికలు) ప్రార్థించారు. ఇక రెండవ శ్లోకంతో, ఆ ఉపకారస్మృతిచేత అతని నిరవధికతేజస్సుతో కూడిన దివ్యమంగళవిగ్రహాన్ని స్మరించి, సేవించినపుడే ముందు ముందుగా సౌందర్య

స్మరిత్తు, తజ్గళై సేవిత్తపోతే మున్ మున్నే సౌన్దర్యప్రవాహత్తాలే మయజ్గప్పణ్ణి, ప్రాణజ్గళై ఎ𝓵ుదిక్కొణ్ణ వాత్సల్యాదికల్యాణగుణజ్గళుక్కు ప్రకాశకమాన నయనారవిన్దజ్గళై స్మరిక్కిఱార్గళ్. "నిత్యం యతీంద్ర ! తవ దివ్యవపుఃస్మృతౌ మే సక్తం మనో భవతు" (యతిరాజవింశతి-4) ఎన్఺ారిఱే. అన్఺ిక్కే, "త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే" (భాగవతమ్) ఎన్఺ు నీర్ శొల్లుగిఱీర్గళ్. నీజ్గళ్ అన్వేషిక్క నాన్ దృశ్యనాగవేణు మెన్఺ు నిర్బన్ద మిల్లైయే" ఎన్఺ు సర్వేశ్వరనుడైయ ఉద్దేశ్యమాగ నినైత్తు, "ఉన్నుడైయ నేత్రజ్గళాలే అపహృతమాన ప్రాణజ్గళై ప్రత్యర్పణత్తుక్కాగవుమ్ దృశ్యనాగవేణు" మెన్఺ు ప్రార్థిత్తారాగవుమామ్.

శరదుదాశయే సాధుజాతసత్సరసిజోదరశ్రీముషా దృశా ।
సురతనాథ! తే శుల్కదాసికాః వరద! నిఘ్నతో నేహ కిం వధః ॥

**(శరదుదాశయే)** శరత్కాలత్తిల్ నిర్మలమాన సరస్సిలే. "శరదానీరజోత్పత్త్యా నీరాణి ప్రకృతిం యయుః భ్రష్టానా మివ చేతాంసి పున ర్యోగనిషేవయా" ఎన్గిఱపడియే స్వచ్ఛమాన జలత్తోడే మనోహరమాయిరుక్కుమిఱే శరత్సమయత్తిలే తటాకజ్గళ్. కణ్ణ కాట్చియిలే హృదయతాపమ్ శమిప్పిత్తు, అత్యన్తమనోహరమాయ్, ఆహ్లాదకరముమాయిరుక్కిఱ శరత్కాల తటాకత్తిలే- ఎన్఺పడి.

**(సాధు జాత)** మనోహరమాగ ఉదిత్త. జనకమాన సరస్సిన్పడియే యిరుక్కుమిఱే, జన్యమాన కమలత్తినుడైయ స్వభావమ్. అత్తాలే. (సాధు జాత) ఎన్఺ు శొల్లుకిఱార్. సౌగంధ్య- సౌకుమార్య- లావణ్య- మార్దవ- శీతలత్వజ్గళ్ ప్రకాశిక్కిఱపడి ఉదిత్త ఎన్఺వుమామ్. అన్఺ిక్కే,

---

ప్రవాహంచేత తమకు వ్యామోహం కలిగేటట్లు చేసి, తమ ప్రాణాలను తన అధీనం చేసికొన్న వాత్సల్యాదిగుణాలను ప్రకాశింపజేసే నయనారవిందాలను స్మరిస్తున్నారు. "నిత్యం యతీంద్ర! తవ దివ్యవపుఃస్మృతౌ మే సక్తం మనో భవతు" (యతిరాజా! నిత్యం నా మనస్సు నీ దివ్యరూపాన్ని స్మరించడంలో ఆసక్తి కల్గినదిగా కావాలి) అని అన్నారుకదా! లేక, "త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే" (నీపై ప్రాణాలను నిలుపుకొన్నవారై నిన్ను వెదకుతున్నారు) అని మీరు అంటున్నారు. మీరు వెదికితే నేను కనబడాలనే నిర్బంధం లేదే!'' అని సర్వేశ్వరుని ఉద్దేశ్యంగా భావించి, "నీ నేత్రాలచే అపహరింపబడ్డ ప్రాణాలను వారికి ప్రత్యర్పణం చేయడంకోసమైనా గానీ నీవు కనబడాలి''- అని ప్రార్థిస్తున్నారని భావం.

శరదుదాశయే సాధుజాతసత్సరసిజోదరశ్రీముషాదృశా ।
సురతనాథ! తే శుల్కదాసికాః వరద! నిఘ్నతో నేహ కిం వధః ॥

**(శరదుదాశయే)**- శరత్కాలంలో నిర్మలమైన సరస్సులో - అని అర్థం. "శరదానీరజోత్పత్త్యా నీరాణి ప్రకృతిం యయుః, భ్రష్టానా మివ చేతాంసి పున ర్యోగనిషేవయా" (భ్రష్టులైనవారి మనస్సులు తిరిగి యోగాభ్యాసం చేయడంచేత తేటబడినట్లే, శరత్కాలంలోని పద్మాల ఉత్పత్తివల్ల నీళ్ళు తమ స్వభావం అయిన స్వచ్ఛతను పొందాయి) అన్నట్లు స్వచ్ఛమైన జలంతో మనోహరంగా ఉంటాయికదా శరత్కాలంలోని తటాకాలు. చూచిన చూపులోనే (చూచిన మఱుక్షణమే) హృదయతాపాన్ని ఉపశమింపజేసి, అత్యంతం మనోహరంగా, అహ్లాదకరంగా ఉండే శరత్కాలతటాకంలో- అని భావం.

**(సాధు జాత)** -మనోహరంగా ఉదయించిన - అని అర్థం. జన్మింపజేసిన తటాకం తీరులోనే ఉంటుందికదా దానినుండి పుట్టే కమలంయొక్కస్వభావం. అందుచేత **(సాధు జాత)**- అని అంటున్నారు. సౌగంధ్య-సౌకుమార్య-లావణ్య- మార్దవ- శీతలత్వాలు ప్రకాశించేటట్లు ఉదయించిన- అని కూడా భావం. లేక,

**(సాధు జాత)** అతిశయమాగ జనిత్త. అతిశయ మావదు- తటాకపరిసరత్తి లుద్భూతమాన కమలత్తిన్ పడి యన్నిక్కే గంభీరాంభస్సముద్భూతమాన- ఎన్గపడి.

**(సత్సరసిజోదర)** అత్యంతవిలక్షణమాన సహస్రపత్రకమలత్తినిడత్తిలే ప్రకాశిక్కిఱ. కమలత్తుక్కు వైలక్షణ్యమావదు- నీరసమాన నాళత్తిల్ జనిత్తు, అరుణోదయసమయత్తిలే వికసిక్కైయన్నిక్కే, సుమృష్టనాళయుక్తమాయ్, రవికరవికసిత మాయ్ ప్రకాశిక్కై.

**(శ్రీముషా దృశా)** అన్ద సహస్రపత్రకమలత్తినిడత్తిలే ఇరున్దుళ్ళ అత్యంతమనోహరమాన శోభైయై అపహరిక్కిఱ నేత్రత్తాలే. ఇత్తాల్- **"కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"** (ఛాందో-1-6-7) ఎన్ద శ్రుత్యర్థమ్ ప్రకాశితమ్. సహస్రపత్రకమలత్తినుడైయ సముదాయశోభైయై అపహరిక్కిఱదెన్దు శొన్న ఇత్తాలే ఇవనుడైయ నయనశోభై వొరు కాల్ సేవిక్కవే, పిన్బు కమలత్తిన్పక్కల్ పోగాదపడి తడుత్తు మెన్దవుమామ్.

**(సత్సరసిజోదరశ్రీముషా దృశా)** కమలత్తినిడత్తిలే మనోహరమా యిరుక్కిఱ రక్తిమైయై అపహరిక్కిఱ నేత్రత్తాలే- ఎన్నవుమామ్. **"ఆరక్తనయనః శ్రీమాన్"** (రామా-?) ఎన్గిఱపడియే శ్రియఃపతిత్వత్తుక్కు నిదానమిఱే యిదు. అత్తాలేయిఱే కమలమ్ లక్ష్మీనివాసమాయ్ ప్రకాశిక్కిఱదు. ఇత్తాల్ శ్రియఃపతిత్వత్తుక్కు నిదానమాన తిరుక్కణ్గళ్- ఎన్దవుమామ్. అన్నిక్కే, సత్సరసిజోదరత్తిలే వర్త్తిక్కిఱ పిరాట్టియై అపహరిక్కిఱ తిరునేత్రత్తాలే- ఎన్దవుమామ్. **"పాదారుంతుద మేవ పంకజరజః"** (శ్రీగుణరత్న-42) ఎన్గిఱపడియే ఇవనుడైయ నేత్రసౌభాగ్యత్తై సేవిత్తపిన్బు

---

**(సాధు జాత)**- అతిశయంగా-గొప్పగా పుట్టిన- అని అర్థం. ఇక్కడ అతిశయం అంటే- తటాకం చుట్టుపక్కల ఎక్కడో పుట్టిన కమలంవలె కాకుండా, గంభీరాంభః సముద్భూతం అయిన- అని అర్థం.

**(సత్సరసిజోదర)**- మిక్కిలి విలక్షణం అయిన సహస్రపత్రకమలంలో ప్రకాశించే అని అర్థం. కమలానికి వైలక్షణ్యం ఏమంటే - నీరసం అయిన కాడలో పుట్టి, అరుణోదయసమయంలో వికసించడం కాకుండా, బలమైన నాళాన్ని కల్గినదై, సూర్యకిరణాలవల్ల వికసించినదై ప్రకాశించడం.

**(శ్రీముషా దృశా)**- ఆ సహస్రపత్రకమలంలో ఉన్న, చాలా మనోహరం అయిన శోభను కొల్లగొట్టే నేత్రాలతో- అని భావం. దీనివల్ల **"కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"** (భగవానుని రెండు కన్నులు నిండు నీటిలో పుట్టిన సూర్యునిచే వికసింపబడ్డ రెండు తామరలే) అనే శ్రుత్యర్థం (ఇక్కడ) ప్రకాశింపజేయబడింది. సహస్రపత్రకమలం యొక్క సముదాయశోభను అపహరిస్తున్నదనడంవల్ల ఇతని నేత్రశోభ ఒకసారి సేవించగానే, తర్వాత కమలం వైపు పోకుండేటట్లు అడ్డుపడుతుందనికూడా చెప్పవచ్చు.

**(సత్సరసిజోదరశ్రీముషా దృశా)**- కమలంలో మనోహరంగా ఉండే రక్తిమను అపహరించే నేత్రంతో -అని కూడా అర్థం. **"ఆరక్తనయనః శ్రీమాన్"** (ఎఱ్ఱని నేత్రాలను కలవాడు, అందువల్లనే శ్రియఃపతి అయినవాడు) అన్నట్లు శ్రియఃపతిత్వానికి మూలకారణంకదా ఇది. అందుచేతనేకదా కమలం లక్ష్మీనివాసంగా ప్రకాశిస్తున్నది. ఇందువల్ల శ్రియఃపతిత్వానికి నిదానం (మూలకారణం) అయిన తిరునేత్రాలు- అని కూడా భావం. లేక, సత్సరసిజోదరంలో (గొప్ప పద్మంలోపల) ఉండే లక్ష్మీదేవిని అపహరించే తిరునేత్రంతో- అని కూడా భావం. **"పాదారుంతుద మేవ పంకజరజః"** (పద్మాలలోని పుప్పొడి లక్ష్మీదేవి పాదాలకు అరుంతుదమే- మర్మస్థానాలను బాధించేదే) అన్నట్లు ఇతని నేత్రసౌభాగ్యాన్ని సేవించిన తరువాత లక్ష్మీదేవికి కమలనివాసం భరించరానిదిగా అయినదికదా! ఇందువల్ల, తన శోభతో లక్ష్మీదేవిని వశీకరించుకొన్న నేత్రంతో- అని అర్థం. అతని నేత్రం ఈమెను

పిరాట్టిక్కు కమలనివాస మసహ్యామాయ్‌విట్టదితే. ఇత్తాల్ తన్నుడైయ శోభైయాలే పిరాట్టియై ఎ*ழு*ంతిక్కొణ్డ నేత్రత్తాలే- ఎన్నపడి. అవనుడైయ నేత్ర మివళై అపహరిక్కుమ్. "న జీవేయం క్షణ మపి వినా తా మసితేక్షణామ్" (రామా-యుద్ధ-26-11) ఎన్గిఱపడియే ఇవళుడైయ నేత్ర మవనై అపహరిక్కుమ్. "సర్వలక్షణసంపన్నా నారీణా. ముత్తమా వధూః" (రామా-బాల-1-28) ఎన్గిఱపడియే సర్వలక్షణసంపన్నైయాయ్, ఉత్తమస్త్రీత్వ ముడైయైయాయ్, సౌభాగ్యత్తుక్కు ఉపమానవస్తువాయ్ ప్రకాశిక్కిఱ పిరాట్టియుడైయ హృదయత్తై అపహరిక్కిఱపడి కణ్డాల్, ఇతరచేతనరుడైయ హృదయత్తై అపహరిక్క శొల్లవేణుమో? "జితం తే పుండరీకాక్ష !" (జితంతే- 1) ఎన్ఱు ఋషిగళుమ్, "రామః కమలపత్రాక్షః" (రామా-సుందర-35-8) ఎన్ఱు శిఱియతిరువడియుమ్, "గోవింద! పుండరీకాక్ష!" (భార.సభా-90-45) ఎన్ఱు ద్రౌపదీదేవియారుమ్, "ఏహ్యేహి పుల్లాంబుజపత్రనేత్ర !" (భార. భీష్మ-59-98) ఎన్ఱు శ్రీభీష్మాచార్యరుమ్, "ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః" (రామా-బాల-20-2) ఎన్ఱు శ్రీ చక్రవర్త్తియుమ్, "పాపం హరతి యత్పుంసాం స్మృతం సంకల్పనామయమ్, తత్పుండరీకనయనం విష్ణో ర్ద్రక్ష్యామ్యహం ముఖమ్" (విష్ణు.పు. 5-17-4) ఎన్ఱు శ్రీ అక్రూరనుమ్, "అజాతవ్యంజన శ్రీమాన్ పద్మపత్రనిభేక్షణః" (రామా-ఆర-38-14) ఎన్ఱు మారీచనుమ్, "మహాబలౌ పుండరీకవిశాలాక్షౌ" (రామా-ఆర- 19-14) ఎన్ఱు శూర్పణఖైయుమ్, "న నమేయమ్" (రామా-యుద్ధ-36-11) ఎన్ఱు రావణనుమ్, "తామరైకణ్గళ్ కొణ్డీర్‌దియాలో" (తిరువాయ్ -10-3-1), "తామరైక్కణ్ ఎన్నే తళరుమ్" (తిరువాయ్ -6-5-1), "శెయ్యతామరైక్కణ్ణనాయ్" (తిరువాయ్ -3-6-1) ఎన్ఱు ఆ*ழ்*వారుమ్ సమమాక వాచామగోచరమాక అవనుడైయ నేత్రసౌందర్యప్రవాహత్తిలే ఆ*ழு*ఙ్గాల్ పట్టు మోహిత్తుక్కిడన్దారితే.

---

అపహరిస్తున్నది. "న జీవేయం క్షణ మపి వినా తా మసితే క్షణామ్" (ఆ అసితేక్షణ అయిన సీత లేకుండా ఒక్కక్షణం కూడా జీవించలేను) అన్నట్లు ఈమె నేత్రం అతనిని అపహరిస్తుంది. "సర్వలక్షణసంపన్నా నారీణా ముత్తమా వధూః" (అన్ని మంచి లక్షణాలతో కూడినది, స్త్రీలలో ఉత్తమవధువు) అన్నట్లు సర్వలక్షణసంపన్నయై, ఉత్తమస్త్రీత్వాన్ని కల్గినదై, సౌభాగ్యానికి ఉపమానవస్తువై ప్రకాశించే లక్ష్మీదేవియొక్క హృదయాన్ని అపహరించే తీరును చూస్తే ఇతరచేతనుల హృదయాన్ని (స్వామినేత్రం) అపహరిస్తుందని ఇక వేఱే చెప్పాలా? "జితం తే పుండరీకాక్ష!" (పుణ్డరీకాక్షా! నీకు మంగళం) అని ఋషులు, "రామః కమలపత్రాక్షః" (శ్రీరాముడు కమలదళాలవంటి నేత్రాలను కలవాడు) అని హనుమానుడు, "గోవింద ! పుండరీకాక్ష !" (గోవిందా! పుండరీకాక్షా!) అని ద్రౌపదీదేవి, "ఏహ్యేహి పుల్లామ్బుజపత్రనేత్ర" (పూర్తిగా వికసించిన పద్మాల రేకులవంటి నేత్రాలను కలవాడా! రావయ్యా! రా!) అని భీష్మాచార్యులు, "ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః" (పద్మాలవంటి కన్నులు కల నా రాముడు పదహారు సంవత్సరాలు నిండనివాడు) అని దశరథచక్రవర్తి, "పాపం హరతి యత్పుంసాం స్మృతం సంకల్పనామయమ్, తత్పుండరీకనయనం విష్ణోః ద్రక్ష్యా మ్యహం ముఖమ్" (ఏ నయనం స్మరిస్తే మానవుల పాపాన్ని హరిస్తుందో, ఆ విష్ణువుయొక్క పుండరీకనయనాన్ని నేను చూడగలనుకదా) అని శ్రీఅక్రూరుడు, "అజాతవ్యంజనః శ్రీమాన్ పద్మపత్రనిభేక్షణః" అని మారీచుడు, "మహాబలౌ పుండరీకవిశాలాక్షౌ" (గొప్ప బలం కలవారు, పుండరీకాలవంటి విశాలనేత్రాలను కలవారు) అని శూర్పణఖ, "న నమేయమ్" అని రావణుడు, "తామరైక్కణ్‌గళ్ కొణ్డీర్‌ది యాలో" (అయ్యో ! తన తామరనేత్రాలతో నన్ను చీల్చుతున్నాడు) అని, "తామరైక్కణ్ ఎన్నే తళరుమ్" (పద్మనేత్రుడా! అని అంటూ తపిస్తుంది) "శెయ్యతామరై క్కణ్ణినాయ్" (ఎఱ్ఱని తామరలవంటి నేత్రాలను కలవాడై) అని ఆ*ழ்*వార్లు సమంగా వాక్కుకు అందని అతని నేత్రసౌందర్యప్రవాహంలో మునిగి ఉక్కిరి బిక్కిరి అయి మోహించారు కదా!

గోపగీపీజనజ్గళెల్లారుమ్ శోకిత్తు మూర్ఛాక్రాంతరాయ్ విழுన్దార్గళ్. అప్పోదు కణ్ణనై అపహరిత్తుక్కొణ్డు ఆకాశత్తిలే పోకిఱ తృణావర్తన్ తనక్కు బాలక నతిభారమాగ, వహిక్క మాట్టామే వ్యసనప్పట్టు, బాలకన్ తన్నుడైయ కంఠత్తై గ్రహిక్క నిర్గతసత్వనాయ్, తరైయిలే భయావహమాన తన్నుడైయ పూర్వశరీరత్తోడే ప్రాణజ్గళై విట్టు విழுన్దాన్. ఇప్పడి మరణిత్తు తరైయిలే విழுన్ద రాక్షసనైయుమ్, అన్ద రాక్షసన్ మేలే క్రీడిక్కిఱ మోహనస్వరూపనాన బాలకనైయుమ్ కణ్డు లబ్ధప్రాణరాయ్, గోపగోపీజనజ్గళ్ మిగవు మానన్దిత్తార్గళ్. ఇప్పడి క్రూరనాన తృణావర్తనై వధిత్తు, తన్నై అవర్గళుక్కు క్కొడుత్తరుళినపడియై ప్పేశుగిఱార్,

**(మారుతాత్)** ఎన్గిఱపదత్తాలే. ఇఙ్గు వర్షమారుతజ్గళెన్గిఱదు క్రోధలోభజ్గళై. ఆగ, క్రోధలోభజ్గళాలే ఇవర్ నశియాదపడి రక్షిత్తాయ్ ఎన్లపడి.

**(వైద్యుతానలాత్)** అఞ్జామ్ రక్షణప్రకారత్తై విణ్ణప్పమ్ శెయ్గిఱార్. వైద్యుతానల మావదు - అశనిపాతమితే. అతిల్ నిన్ఱుమ్ రక్షిత్తాయ్- ఎన్లపడి. అతావదు- "తాం రాత్రిం తత్ర రాజేంద్ర! క్షుత్తృడ్భ్యాం శ్రమకర్శితాః, ఊషు ర్వ్రజౌకసో గావః కాళింద్యా ఉపకూలతః, తదాశు విపినోద్భూతోదవాగ్ని స్సర్వతో వ్రజమ్, సుప్తం నిశీథావావృత్య ప్రదగ్ధు ముపచక్రమే" (భాగవతమ్-10-17-20,21) ఎన్గిఱపడియే ఒరునాళ్ రాత్రియిలే గోపజనజ్గళెల్లామ్ శ్రమయుక్తరాయ్, యమునోపకూలత్తిలే వసిక్క అర్ధరాత్రియిలే దవాగ్ని విజృంభిత్తు వ్రజత్తై దహిక్కిఱపడియై క్కణ్డు, "తత ఉత్థాయ సంభ్రాంతా దహ్యమానా వ్రజౌకసః, కృష్ణం యయు స్తే శరణం మాయామనుజ మీశ్వరమ్" (భాగవతమ్-10-17-22) ఎన్గిఱపడియే గోపర్గళెల్లామ్ సంభ్రాన్తత్తోడే కృష్ణన్సన్నిధియిలే శెన్ఱు శరణమ్ పుక్కార్గళ్.

---

చేస్తూ, దిక్కులను అన్నిటిని చీకటితో నిండిపోయే రీతిలో భూమిరేణువులు వ్యాపించేటట్లు చేసి, శ్రీకృష్ణుణ్ణి అపహరించుకొని ఆకాశంలోకి వెళ్ళిపోయాడు. ఈ విధంగా తృణావర్తుడు కురిపించిన ధూళివర్షంలో శ్రీకృష్ణుణ్ణి చూడలేకపోవడంవల్ల చాలా దీనంగా గోపగోపీజనాలు అందఱు దుఃఖించి, మూర్ఛను పొంది పడిపోయారు. అపుడు శ్రీకృష్ణుణ్ణి అపహరించి ఆకాశంలో పోయే తృణావర్తుడు తనకు బాలుడు చాలా బరువు కాగా, మోయలేక, బాధపడి, బాలకుడు తన గొంతును పట్టుకోవడంవల్ల బలం లేనివాడై, భూమిమీద భయాన్ని కల్గించే తన పూర్వశరీరంతోనే ప్రాణాలను విడిచి పడిపోయాడు. ఈ విధంగా చచ్చి భూమిపై పడ్డ రాక్షసుని, ఆ రాక్షసుని మీదనే ఆడుకొనే మోహనరూపుడైన కుఱ్ఱవానిని చూచి, ప్రాణాలు (తిరిగి) పొందినవారై గోపగోపీజనాలు చాలా ఆనందించారు. ఈవిధంగా క్రూరుడైన తృణావర్తుని వధించి, తనను వారికి అనుగ్రహించిన రీతిని పల్కుతున్నారు

**(మారుతాత్)**- అనే పదంతో. ఈ సందర్భంలో వర్షమారుతాలు అంటే క్రోధలోభాలు. ఈ రీతిలో క్రోధలోభాలతో వీరు నశించకుండా ఉండేటట్లు రక్షించావు- అని భావం.

**(వైద్యుతానలాత్)**- అయిదవ రక్షణప్రకారాన్ని విన్నవిస్తున్నారు. "వైద్యుతానలమ్" అంటే ఆశనిపాతమేకదా! (పిడుగుపాటు). దానినుండి రక్షించావు- అని భావం. అంటే - **"తాం రాత్రిం తత్ర రాజేంద్ర! క్షుత్తృడ్భ్యాం శ్రమకర్శితాః, ఊషు ర్వ్రజౌకసో గావః కాళింద్యా ఉపకూలతః, తదాశు విపినోద్భూతో దవాగ్ని స్సర్వతో వ్రజమ్, సుప్తం నిశీథా వావృత్య ప్రదగ్ధు ముపచక్రమే"** (రాజేంద్రా! అక్కడ ఆనాటి రాత్రి ఆకలిదాహాలతో అలసి సొలసిన రేపల్లెలో ఉండే గోవులు, యమునా నదీతీరంలో ఉన్నారు. అపుడు అరణ్యంలో పైకెగసిన దవాగ్ని వేగంగా అంతట వ్యాపించి, నిద్రపోతున్న రేపల్లెను ఆవరించి, దహించడానికి ఆరంభించింది) అని చెప్పిన రీతిలో ఒకనాటి రాత్రి గోపజనాలందఱు శ్రమ పొందినవారై, యమునానదీతీరసమీపంలో నివసించగా, అర్ధరాత్రిలో దవాగ్ని విజృంభించి, రేపల్లెను దహించే రీతిని చూచి, **"తత ఉత్థాయ సంభ్రాంతా దహ్యమానా వ్రజౌకసః, కృష్ణం యయు స్తే శరణం**

ఇప్పడి శరణాగతరాన ఆశ్రిర్‌గళై క్కణ్డు **"ఇత్థం స్వజనవైక్లబ్యం నిరీక్ష్య జగదీశ్వరః, తమగ్ని మపిబ త్తీవ్ర మనంతోఽనంతశక్తిధృత్" (భాగవతమ్-10-15-25)** ఎన్గిఱపడియే అన్ద దావాగ్నియై పానమ్ పణ్ణి ఆశ్రితర్‌గళై రక్షిత్తాన్. **"న త్యజేయం కథంచన" (రామా-యుద్ధ-18-3)** ఎన్ఱుమ్, **"యోగక్షేమం వహామ్యహమ్" (భగ-9-22)** ఎన్ఱుమ్ శొల్లుమవనిఱే యవన్. ఇప్పడి అగ్నిహోత్రత్తాలే వరుమ్ మహాభయత్తిల్ నిన్ఱుమ్ రక్షిత్తా యెన్ఱు అత్తై స్మరిక్కిఱార్. ఇదు మోహగుణత్తుక్కుపలక్షణమ్. ఇత్తాల్- మోహగుణత్తాలే ఆత్మస్వరూపమ్ నశియాదపడి రక్షిత్తాయ్‌ఎన్ఱపడి.

**(వృషమయాత్మజాత్)** ఆఱామ్ రక్షణప్రకారత్తైయుమ్, ఏழாమ్ రక్షణప్రకారత్తైయుమ్ విణ్ణప్పమ్ శెయ్‌గిఱార్. **(వృషమయాత్మజాత్)** వృషత్తిల్ నిన్ఱుమ్, మయాత్మజత్తిల్ నిన్ఱు మెన్ఱపడి. వృషభ మావదు- అరిష్టాసురన్. అరిష్టనెన్గిఱ రాక్షసన్ కంసప్రేరితనాయ్, శ్రీతమ్బిమూత్తపిరానైయుమ్, కణ్ణనైయుమ్, గోపజనఙ్గళెల్లారైయుమ్ వధిక్క కోలి, **"అథ తర్హ్యాగతో గోష్ఠ మరిష్టో వృషభాసురః, మహీం మహాకకుత్కాయః కంపయన్ ఖురవిక్షతామ్, తం తీక్ష్ణశృంగ ముద్వీక్ష్య గోప్యో గోపా శ్చ తత్రసుః, పశవో దుద్రువూ రాజన్! సంత్యజ్య నిజగోకులమ్, కృష్ణ! కృష్ణేతి తే సర్వే గోవిందం శరణం యయుః" (భాగవతమ్-10-36-1, 5)** ఎన్గిఱపడియే మహాభయంకరమాన వృషభరూపత్తై యేఱిట్టుక్కొణ్డు వ్రజత్తిలే వన్దు పుకున్దాన్. ఇప్పడి వన్ద వృషభత్తై క్కణ్డు త్రస్తచిత్తత్తాలే గోకుల మెల్లామ్ సర్వేశ్వరనై శరణమ్ పుక్కవాఱే, అవన్ **"భగవా నథ తద్వీక్ష్య గోకులం భయవిహ్వలమ్, మాభైష్టేతి గిరాఽశ్వాస్య వృషాసుర**

---

**మాయామనుజ మీశ్వరమ్"** (అపుడు రేపల్లెవాసులు విభ్రాంతి చెందినవారై, దహింపబడేవారై నిద్రలేచి, లీలామానుషవేషధారి, ఈశ్వరుడు అయిన కృష్ణుని శరణు పొందారు) అనే రీతిలో గోపాలురు అందఱూ భయంతో కృష్ణుని సన్నిధికి చేరి శరణు పొందారు. ఈ విధంగా శరణాగతులైన ఆశ్రితులను చూచి **"ఇత్థం స్వజనవైక్లబ్యం నిరీక్ష్య జగదీశ్వరః, త మగ్ని మపిబత్తీవ్రం మనంతోఽనంతశక్తిధృత్"** (ఈరీతిలో తనవారి బాధను చూచిన జగదీశ్వరుడు, గొప్ప శక్తిని కలవాడు అయిన అనంతుడు ఆ తీవ్రమైన అగ్నిని పానం చేశాడు) అనే రీతిలో ఆ దావాగ్నిని పానం చేసి, ఆశ్రితులను రక్షించాడు. **"న త్యజేయం కథంచన"** (ఏసమయంలోను వదలిపెట్టను) అని, **"యోగక్షేమం వహామ్యహమ్"** (యోగక్షేమాలను భరిస్తాను) అని పలికేవాడుకదా అతడు. (ఈవిధంగా అగ్నిహోత్రంవల్ల వచ్చే మహాభయంనుండి రక్షించావు- అని దానిని స్మరిస్తున్నారు. ఇది మోహానికి ఉపలక్షణం. ఇందువల్ల మోహగుణంచేత ఆత్మస్వరూపం నశించకుండా ఉండేటట్లు రక్షించావు- అని భావం.)

**(వృషమయాత్మజాత్)** - ఆఱవ రక్షణ ప్రకారాన్ని, ఏడవ రక్షణప్రకారాన్ని విన్నపిస్తున్నారు. **(వృషమయాత్మజాత్)** - వృషుని బారినుండి, మయాత్మజుని బారినుండి- అని అర్థం. వృషమంటే అరిష్టాసురుడు. అరిష్టుడనే రాక్షసుడు కంసప్రేరితుడై బలరాముని, కృష్ణుని, గోపజనాలను అందఱిని వధించాలని తలచి, **"అథ తర్హ్యాగతో గోష్ఠ మరిష్టో వృషభాసురః, మహీం మహాకకుత్కాయః కంపయన్ ఖురవిక్షతామ్"** (అపుడు అరిష్టుడనే పేరు గల వృషభాసురుడు గొప్ప మూపురాన్ని, శరీరాన్ని కలవాడై, తన గిట్టలతో కుమ్మిన భూమిని కంపించేటట్లు చేస్తూ వచ్చాడు.), **"తం తీక్ష్ణశృంగ ముద్వీక్ష్య గోప్యో గోపా శ్చ తత్రసుః, పశవో దుద్రువూ రాజన్ ! సంత్యజ్య నిజగోకులమ్, కృష్ణ కృష్ణేతి తే సర్వే గోవిందం శరణం యయుః"** (వాడి అయిన కొమ్ములను కల అతనిని (అరిష్టుని) చూచి గోపికలు, గోపాలురు చాలా భయపడ్డారు. పశువులు తమ గోకులాన్ని వదలి పారిపోయాయి. రాజా! వారంతా కృష్ణా! కృష్ణా! అని అంటూ గోవిందుణ్ణి శరణు పొందారు) అనే రీతిలో మహాభయంకరం అయిన వృషభరూపాన్ని ఆరోపించుకొని, రేపల్లెలోకి వచ్చి, ప్రవేశించాడు. ఈ విధంగా వచ్చిన వృషభాన్ని చూచి భయం పొందిన మనస్సుతో గోకులం అంతా సర్వేశ్వరుని శరణు పొందగానే, అతడు **"భగవానథ తద్వీక్ష్య గోకులం భయవిహ్వలమ్, మా భైష్టేతి గిరాఽశ్వాస్య వృషాసుర ముపాహ్వాయత్"** (భగవానుడపుడు భయంతో

ముపాహ్వాయత్" (భాగవతమ్) ఎన్గిఱపడియే ఆశ్రితర్‌గళుక్కు అభయప్రదానత్తై కొడుత్తు, వృషాసురనై చ్చీఱి, "త మాపతంతం స నిగృహ్య శృంగయోః, పదా సమాక్రమ్య నిపాత్య భూతలే, నిష్పీడయామాస యథార్ద్ర మంబరమ్ కృత్వా విషాణేన జఘాన సోఽపతత్" (భాగవతమ్-10-36-13) ఎన్గిఱపడియే అవనై గ్రహిత్తు విషాణత్తాలే వధిత్తు గోపజనఙ్గళెల్లారైయుమ్ రక్షిత్తాన్. ఇదు వృషాసురత్తిల్ నిన్ఱుమ్ రక్షిత్తపడి. (మయాత్మజాత్) మయాత్మజనావన వ్యోమాసురన్. అవన్, వాయిల్ నిన్ఱుమ్ రక్షిత్తా యెన్గిఱార్‌గళ్. అదావదు - "ఏకదా తే పశూన్ బాలా శ్చారయంతోఽద్రిసానుషు, చక్రు ర్నిలాయనక్రీడాం చోరపాలాపదేశతః, త్రాసన్ కతిచి చ్చోరాః పాలా శ్చ కతిచి న్నృప, మేషాయితా శ్చ తత్రైకే విజహ్రు రకుతోభయాః" (భాగవతమ్-10-37-27) ఎన్గిఱపడియే గోపకరెల్లారుమ్ ఒరునాళ్ పర్వతసానుక్కళిలే పశుక్కళ్ మేయ్‌త్తుక్కొణ్డు వర్త్తిక్క, తామెల్లామ్ శిలరై చోరర్‌గళాకవుమ్, శిలరై పాలకరాకవుమ్, శిలరై మేషఙ్గళాగవుమ్ కల్పిత్తుక్కొణ్డు క్రీడిక్కిఱ సమయత్తిలే, కంసప్రేరితనాయ్ వ్యోమనెన్గిఱ రాక్షసన్ గోపాలవేషత్తోడే అవర్‌గళ్ మధ్యత్తిలే శెన్ఱు తన్నై ఒరు చోరనాక కల్పిత్తు మేషఙ్గళానవర్గళై తనిత్తనియే కొణ్డుపోయ్, నాలైన్దు పేర్గళైయొழிయ మఱ్ఱెల్లారైయుమ్ గిరిగహ్వరత్తిలే వైత్తు ఒరు మహాశిలైయాలే ద్వారత్తై ఆచ్ఛాదిత్తు వరుకిఱపడియై క్కణ్డు, పెరుమాళ్, "తస్య తత్కర్మ విజ్ఞాయ కృష్ణ శ్శరణద స్సతామ్, గోపా న్నయంతం జగ్రాహ వృకం హరి రివౌజసా" (భాగవతమ్-10-37-31) ఎన్గిఱపడియే రాక్షసనుడైయ కుటిలత్వత్తై క్కణ్డు, గోపాలర్‌గళై కొణ్డుపోగిఱ అవనై, వృకత్తై సింహమ్ గ్రహిక్కుమాప్పోలే గ్రహిత్తు "తం నిగృహ్యాచ్యుతో దోర్భ్యాం పాతయిత్వా మహీతలే, పశ్యతాం దివి దేవానాం పశుమార మమారయత్, గుహాపిధానం నిర్భిద్య గోపా న్నిస్సార్య కృచ్ఛ్రతః, స్తూయమాన స్సురై ర్గోపైః

---

వణికే గోకులాన్ని తూచి, భయపడవద్దనే మాటతో ఓదార్చి, వృషాసురుణ్ణి యుద్ధానికి పిలిచాడు) అనే రీతిలో ఆశ్రితులకు అభయాన్ని ఇచ్చి, వృషాసురునిపై కోపించి, "త మాపతంతం స నిగృహ్య శృంగయోః, పదా సమాక్రమ్య నిపాత్య భూతలే, నిష్పీడయామాస యథార్ద్ర మంబరమ్ హత్వా విషాణేన సోఽపతత్" (తనపైకి వచ్చే అతణ్ణి కొమ్ములతో పట్టి నిలువరించి, కాళ్ళతో ఆక్రమించి, భూమిపై పడవేసి, కొమ్ములతో వధించి, తడిగుడ్డను పిండినట్లుగా పూర్తిగా పిండివేశాడు. ఆ అసురుడు నేలకూలాడు) అని చెప్పిన రీతిలో అతణ్ణి పట్టుకొని కొమ్ముతో వధించి గోపజనాలను అందఱిని రక్షించాడు. ఇది వృషాసురుని బారినుండి రక్షించిన తీరు. (మయాత్మజాత్)- మయాత్మజుడైన వ్యోమాసురుడు. అతని నోటిలోనుండి రక్షించావు- అని అంటున్నారు. అంటే - "ఏకదా తే పశూన్ బాలా శ్చారయంతోఽద్రిసానుషు, చక్రు ర్నిలాయనక్రీడాం చోరపాలాపదేశతః, త్రాసన్ కతిచిచ్చోరాః పాలా శ్చ కతిచి న్నృప!, మేషాయితాం శ్చ తత్రైకే విజహ్రు రకుతోభయాః" (ఒకానొక సమయంలో కొండచఱియలలో గోపాలురు పశువులను మేపుతూ రాజు- దొంగాట నెపంతో దాగుడుమూతలు ఆడారు. కొంతమంది దొంగలుగా, కొంతమంది రాజులుగా, మఱి కొంతమంది మేకలుగా ఎట్టి భయంలేకుండా ఆడుతూ విహరించారు) అనే రీతిలో గోపాలురు అందఱు ఒకనాడు పర్వతసానువులలో పశువులను మేపుతూ ఉండగా, తామంతా కొందఱిని దొంగలుగా, కొందరిని పాలకులుగా, కొందఱిని మేకలుగా కల్పించి, ఆడే సమయంలో, కంసప్రేరితుడై, వ్యోముడనే రాక్షసుడు గోపాలవేషంతో వారి మధ్యలో చేరి తనను ఒక దొంగగా కల్పించుకొని, మేకలుగా ఉన్నవారిని వేఱ్వేరుగా తీసికొనిపోయి, నల్గురు అయిదుగురిని తప్ప మిగిలిన అందఱిని కొండగుహలో పెట్టి, ఒక పెద్ద శిలతో ద్వారాన్ని మూసి వచ్చే తీరును చూచి, భగవానుడు "తస్య తత్కర్మ విజ్ఞాయ కృష్ణ శ్శరణద స్సతామ్, గోపా న్నయంతం జగ్రాహ వృకం హరి రివౌజసా" (అతని ఆ పనిని గ్రహించి సత్పురుషులకు రక్షకుడైన కృష్ణుడు గోపాలురను తీసికొనిపోయే అతణ్ణి, తోడేలును సింహం గ్రహించే రీతిలో గ్రహించి, "తం నిగృహ్యాచ్యుతో దోర్భ్యాం పాతయిత్వా మహీతలే, పశ్యతాం దివి దేవానాం పశుమార మమారయత్" (కృష్ణుడు అతణ్ణి బాహువులతో నిలువరించి,

ప్రవివేశ స్వగోకులమ్" (భాగవతమ్-10-37-33) ఎన్గిఱపడియే తరైయిలే పొకట్టు, అంతరిక్షత్తిలే దేవర్గళ్ కాణుమ్పడి అవనై క్రూరమాగ వధిత్తు, గిరిగహ్వరత్తై ఆచ్ఛాదిత్త మహాశిలైయై తళ్ళి ప్పొకట్టి, గోపాలకరెల్లారైయుమ్ కొణ్డు గోకులమ్ ప్రవేశిత్తాన్. ఇన్ద మహోపకార మొరువరాల్ విస్మరిక్కప్పోమో? ఆకైయాలే అనుసన్ధిత్తార్గళ్. ఇఙ్గు వృషభాసురనెన్నుమ్, వ్యోమాసురనెన్నుమ్ శొల్లుగిఱదు-మదమాత్సర్యఙ్గళై. ఇవ్విరణ్డు ప్రకృతిగుణఙ్గళుమ్ అవర్గళ్ పక్కలిలే కుడికొణ్డాయిఱ్ఱిఱ్ఱే యిరుప్పదు. "తద్గుణసారత్వా త్తద్వ్యపదేశః" (బ్రహ్మ.సూ. 2-3-29) ఎన్గిఱపడియే ఇవర్గళై అగ్గుణఙ్గళాగ నిరూపిక్క తట్టిల్లైయిఱ్ఱే.

(విశ్వతో భయాత్) అనుక్తమాన మఱ్ఱెల్లా భయఙ్గళ్ నిన్నుమ్ నశియాదపడి రక్షిత్తాయ్. ఇవ్వేழுమ్ ప్రధానఙ్గళాగ శొన్నో మిత్తనై యల్లదు రక్షిత్త ప్రకారఙ్గళెల్లామ్ ఎణ్ణి ముడియాదపడి అసంఖ్యేయమిఱ్ఱే అవై యావన - పూతనాశకటయమళార్జునాద్య-సంఖ్యాతఙ్గళానవిరోధిగళ్. ఇఙ్గు, "విశ్వతః" ఎన్ఱు శొల్లుగిఱదు అసంఖ్యాతఙ్గళాన సప్తవ్యసనాదిస్వరూప విరోధిగళాన ప్రకృతిగుణఙ్గళై, ఆక, గుణత్రయాత్మకమాయ్, అజ్ఞానజనకమాయ్, స్వరూపవిరోధియాన ప్రకృతిభయత్తిల్ నిన్నుమ్ రక్షిత్తా యెన్దపడి. "మదీయానాదికర్మప్రవాహప్రవృత్తాం, భగవత్స్వరూపతిరోధానకరీం, విపరీతజ్ఞానజననీం, స్వవిషయాయా శ్చ భోగ్యబుద్ధే ర్జననీం, దేహేన్ద్రియత్వేన, భోగ్యత్వేన సూక్ష్మరూపేణ చావస్థితాం, దైవీం గుణమయీం మాయాం దాసభూత శ్శరణాగతోఽస్మి, తవాస్మి దాస ఇతి వక్తారం మాం తారయ" (శరణాగతి గద్యమ్) ఎన్ఱు శ్రీభాష్యకారరుమ్ శ్రీశరణాగతిగద్యత్తిలే ప్రార్థిత్తారిఱ్ఱే. అప్పడి

---

భూమిపై పడవేసి, ఆకాశంలో దేవతలు చూస్తుండగానే పశువును వధించినట్లు వధించాడు), "గుహాపిధానం నిర్భిద్య గోపా న్నిస్సార్య కృచ్ఛ్రతః, స్తూయమానః సురై ర్గోపైః ప్రవివేశ స్వగోకులమ్" (గుహకు అడ్డుగా పెట్టిన మూతను పగులగొట్టి, గోపాలురను బలవంతంగా బయటికు తీసికొనివచ్చి, దేవతలు, గోపాలురు పొగడుతూ ఉండగా రేపల్లెలోకి ప్రవేశించాడు) అన్న రీతిలో భూమిపై పడవేసి, ఆకాశంలోని దేవతలంతా చూచేటట్లు అతణ్ణి క్రూరంగా చంపి, గిరిద్వారాన్ని మూసిన పెద్ద రాతిని గెంటి, పగుల గొట్టి, గోపాలురను అందఱిని తీసికొని గోకులాన్ని ప్రవేశించాడు. ఈ మహోపకారం ఎవరికైనా మఱువడానికి వీలున్నదా? అందుచేత అనుసంధించారు. ఇక్కడ వృషభాసురుడు, వ్యోమాసురుడు అంటే మదమాత్సర్యాలు. ఈ రెండు ప్రకృతిగుణాలు వారిలో (అసురులలో) గూడుకట్టుకొని ఉన్నాయికదా! "తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః" (ఆ గుణాలసారంగా - అంటే - ప్రధానంగా కల్గి ఉన్నందున ఆ గుణాల పేరుతోనే వ్యవహారం) అనే రీతిలో వీరిని ఆ గుణాలుగా నిరూపించడంలో అడ్డు లేదుకదా!

(విశ్వతో భయాత్)- ఇంతవరకు చెప్పని మిగిలిన అన్ని భయాలవల్ల నశించకుండేటట్లు రక్షించావు. ఈ ఏడింటిని ప్రధానాలుగా చెప్పామే తప్ప రక్షించిన ప్రకారాలను అన్నిటిని లెక్కించి ముగించలేనట్లుగా లెక్కలేనివి కదా! అవి ఏవి? అంటే, పూతనా- శకటాసుర- యమళార్జునాదులైన లెక్కలేని, సప్తవ్యసనాదిస్వరూపవిరోధులైన ప్రకృతిగుణాలు. అందువల్ల, గుణత్రయాత్మకమైన అజ్ఞానాన్ని కలిగించేదై, స్వరూపవిరోధి అయిన ప్రకృతిభయం నుండి రక్షించావు- అని భావం. "మదీయానాదికర్మప్రవాహ ప్రవృత్తాం, భగవత్స్వరూపతిరోధానకరీం, విపరీతజ్ఞానజననీం స్వవిషయాయా శ్చ భోగ్యబుద్ధే ర్జననీం, దేహేంద్రియత్వేన, భోగ్యత్వేన, సూక్ష్మరూపేణ చావస్థితాం, దైవీం గుణమయీం మాయాం దాసభూత శ్శరణాగతోఽస్మి తవాస్మి దాసః ఇతి వక్తారం మాం తారయ" అని శ్రీభాష్యకారులు కూడా శ్రీశరణాగతిగద్యలో ప్రార్థించారుకదా! ఆ విధంగా ప్రార్థించనక్కఱలేనట్లుగా అతడే వచ్చి సహాయపడాలని వచ్చిన కల్యాణగుణానికి ఓడి, ఆ మహోపకారాన్ని అనుసంధిస్తున్నారు. ఈ ప్రకృతిభయం అన్నది సర్వేశ్వరునివల్లతప్ప వేఱొకరివల్ల తీరడానికి వీలులేనిదికదా! "దైవీ హ్యేషా గుణమయీ

ప్రార్థిక్కవేణ్డాదపడి అవన్‌దానే వన్దుపకరిత్త అన్ద కల్యాణగుణత్తుక్కు తోఱ్ఱు, అన్ద మహోపకారత్తై అనుసన్ధిక్కిఱార్‌గళ్. ఇన్ద ప్రకృతిభయమావదు సర్వేశ్వరనాలొழియ మఱ్ఱొరువరాల్ అవిழ్క్క ప్పోగాదిఱే. "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మ మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే" (భగ-7-14)ఎన్ఱానిఱే శ్రీ గీతోపనిషదాచార్యనుమ్. ఆక, ఇన్ద వాక్యత్తాలే, "ఏవం సంస్కృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవే దుఃఖాకులే" (అహిర్బుధ్న్య-14-28) ఎన్గిఱపడియే ఆత్మస్వరూపత్తుక్కు మిగవుమ్ విరోధియాన ప్రకృతిభయత్తిల్ నిన్ఱుమ్ రక్షిత్తరుళినాయ్- ఎన్గిఱార్‌గళ్.

(విశ్వతో భయాత్) అన్ఱిక్కే, సర్వేశ్వరనాన ఉన్నుడైయ విగ్రహసౌన్దర్యత్తాలే వరుకిఱ భయత్తిల్ నిన్ఱుమ్ రక్షిత్తా యెన్ఱవుమామ్. అదావదు- "తత్ర గోవింద మాసీనం ప్రసన్నాదిత్యవర్చసమ్" (భార-ఉద్యో-90-11) ఎన్ఱుమ్, "చంద్రకాన్తాననం రామ మతీవ ప్రియదర్శనమ్" (రామా. అయో-3-28) ఎన్ఱుమ్, "రూపసంహననం లక్ష్మీః సౌకుమార్యం సువేషతామ్, దదృశు ర్విస్మితాకారాః రామస్య వనవాసినః" (రామా-ఆర-1-12) ఎన్ఱుమ్, "మైయలేఱ్ఱి మయక్క ఉన్ ముకమ్ మాయమన్దిరమ్‌దాన్‌కొలో" (నాచ్చియార్-2-4) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే అవన్ తన్నుడైయ విగ్రహసౌన్దర్యత్తిల్ చేతనరై మగ్న మాక్కి, ద్వయోత్తరవాక్యత్తిల్ శొన్న పరమప్రాప్యమాన కైఙ్కర్యత్తిలే అన్వయియాతపడి తడైత్తుమిఱే. ఇదు, "శెఞ్జొల్కవిగాళ్! ఉయిర్ కాఱ్ఱాట్చెయ్‌మిన్" (తిరువాయ్-10-7-1) ఎన్గిఱపడియే ద్వయోత్తరవాక్యనిష్ఠరాన అధికారిగళుక్కు మికవుమ్ భయావహమాయిఱే యిరుప్పదు. అఱ్ఱై ప్పఱ్ఱవిఱే శ్రీసుమిత్రాదేవియారుమ్ ఇళైయపెరుమాళై క్కుఱిత్తు, "రామే ప్రమాదం మా కార్షీః గచ్ఛ తాత !

---

మమ మాయా దురత్యయా, మా మేవ యే ప్రద్యంతే మాయా మేతాం తరంతి తే" (దివ్యమైన- నా క్రీడాపరికరం అయిన ఈ సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాల రూపంలో ఉన్న నా మాయ దాటరానిది. ఎవరు నన్నే శరణు వేడుతారో వారే ఈ మాయను దాటుతున్నారు) అని అన్నాడుకదా శ్రీగీతోపనిషదాచార్యుడుకూడా. ఈ విధంగా, ఈ వాక్యంచేత "ఏవం సంస్కృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవే దుఃఖాకులే" (ఈ రీతిలో సంసారచక్రంలో తన కర్మలవల్ల పరిభ్రమిస్తూ, దుఃఖాలలో అలమటించే జీవుని విషయంలో) అనే రీతిలో ఆత్మస్వరూపానికి చాలా విరోధి అయిన ప్రకృతిభయంనుండి రక్షించావు- అని అంటున్నారు.

**(విశ్వతో భయాత్)**- లేక, సర్వేశ్వరుడవైన నీ రూపసౌందర్యంచేత వచ్చే భయంనుండి రక్షించావు- అనికూడా భావం. అది ఏమంటే- "తత్ర గోవింద మాసీనం ప్రసన్నాదిత్యవర్చసమ్" (అక్కడ చల్లనైన సూర్యకాంతిని కలవాడై కూర్చుని ఉన్న గోవిందుని)అని, "చంద్రకాంతాననం రామ మతీవ ప్రియదర్శనమ్" (చంద్రునికంటె అందమైన ముఖాన్ని కలవాడు, చాలా అందమైన రూపాన్ని కలవాడు అయిన రాముని) అని, "రూపసంహననం లక్ష్మీః సౌకుమార్యం సువేషతామ్, దదృశుః విస్మితాకారా రామస్య వనవాసినః" (రాముని అందమైన రూపాన్ని, కాంతిని, సౌకుమార్యాన్ని, అవయవాల పొందికను వనవాసులైన ఋషులు ఆశ్చర్యచకితులై దర్శించారు.) అని, "మైయలేఱ్ఱి మయక్క ఉన్ ముకమ్ మాయమన్దిరన్దాన్‌కొలో" (పిచ్చెక్కించి, వ్యామోహం పఱచడంలో నీ ముఖం ఒక మాయమంత్రం సుమా!) అని చెప్పే రీతిలో అతని విగ్రహసౌందర్యంలో చేతనులను మునిగేటట్లు చేసి, ద్వయం ఉత్తరవాక్యంలో చెప్పిన పరమప్రాప్యం రూపం అయిన కైంకర్యంలో అన్వయించలేనట్లు (అతని సౌందర్యం) అడ్డుకుంటుందికదా! ఇది "శెఞ్జొల్కవికాళ్ ఉయిర్ కాఱ్ఱాట్చెయ్‌మిన్" (తీయని కవిత్వాన్ని చెప్పే కవులారా! మీరు మీ ప్రాణాలను రక్షించుకొని కైంకర్యం చేయండి) అనే రీతిలో ద్వయంలోని ఉత్తరవాక్యార్థంలో నిష్ఠను కలవారైన అధికారులకు చాలా భయం కల్గించేదిగాకదా ఉంటుంది. దానినిబట్టికదా శ్రీసుమిత్రాదేవికూడా

**యథాసుఖమ్" (రామా.అయో-40.5)** ఎన్ఱరుళిచ్చెయ్‌దార్. ఇతిన్ ఊఱ్ఱత్తై ప్పఱ్ఱియిఱే ఇళైయపెరుమాళుమ్, **"కురుష్వ మా మనుచరం .... కృతార్థోఽహం భవిష్యామి" (రామా.అయో-31-24)** ఎన్ఱు ప్రార్థిత్తార్. ఆగైయాలే, "దేవరీర్ ఉన్నుడైయ కైఙ్కర్యవిరోధియాన విగ్రహసౌన్దర్యత్తిల్ ఆழఙ్గాల్ పడాదపడి పణ్ణి, ఎఙ్గళుడైయ స్వరూపత్తై అభివృద్ధమాక్కి రక్షిత్తాయ్" ఎన్గిఱార్గళ్ ఎన్ఱవుమామ్. ఇన్ద రక్షణమ్ మఱ్ఱెల్లా రక్షణఙ్గళిలుమ్ మికవు మధికమాయిఱే ఇరుప్పదు. **"సర్వగంధ స్సర్వరసః" (ఛాందో-3-14-4)** ఎన్ఱుమ్, **"అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" (ఛాందో-8-7-1)** ఎన్ఱుమ్, **"ఎనక్కు త్తేనే పాలే కన్నలే యముదే" (తిరువాయ్-10-7-2)** ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే అత్యంతవిలక్షణమాన భగవద్వైభవ మఱిన్దవర్కళుక్కు, హేయమాన ప్రకృత్యనుభవత్తై విట్టు సర్వేశ్వరనుడైయ సేవైయిలే అన్వయిక్కై ఎళిదాయిరుక్కుమ్. ఇప్పడి **"రసంగ్గ్హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి" (తైత్తి. ఆనంద)** ఎన్గిఱపడియే అత్యన్తమనోహరమాన భగవద్విగ్రహసౌన్దర్యత్తిలే ఆழఙ్గాల్ పట్టవనుక్కు అతు విట్టు విట్టు పిన్నై కైంకర్యఙ్గళిలే అన్వయిక్కై మికవుమ్ దుర్లభమాయిరుక్కుమ్. "ప్రథమపర్వత్తై విట్టు చరమపర్వత్తై ఆశ్రయిక్కైయిలుళ్ళ అరుమైపోలే కాణుమ్, విగ్రహసేవైయై విట్టు కైఙ్కర్యత్తిలే అన్వయిక్కైక్కుళ్ళ అరుమై. ఇదుదాన్ దుర్లభమ్" **(శ్రీవచనభూషణమ్)** ఎన్ఱరుళిచ్చెయ్‌దారిఱే శ్రీపిళ్ళైలోకాచార్యరుమ్. అన్ఱిక్కే,

**(విశ్వతో భయాత్)** ఎన్ఱ ఇత్తాలే సర్వేశ్వరనుడైయ కైఙ్కర్యత్తిలే నిఱ్కైయన్ఱిక్కే, అతువుమ్ కుழைచ్చరక్కాప్పడి పణ్ణి, **"అడియార్ క్కెన్నై యాళ్ పడుత్త విమలన్" (అమలనాది-1)** ఎన్ఱుమ్ **"అడియేనై ఉన్నడియార్క్కాట్పడుత్తాయ్"**

---

లక్ష్మణస్వామిని ఉద్దేశించి, **"రామే ప్రమాదం మా కార్షీః గచ్ఛ తాత! యథాసుఖమ్"** (నాయనా! రాముని సౌందర్యం విషయంలో ప్రమాదపడవద్దు. సుఖంగా వెళ్ళు) అని పల్కింది. దీని (కైంకర్యంయొక్క) ప్రాధాన్యాన్నిబట్టికదా లక్ష్మణస్వామికూడా **"కురుష్వ మానుచరం.... కృతార్థోఽహం భవిష్యామి"** (నన్ను అనుచరుణ్ణిగా చేసికో. నేను కృతార్థుణ్ణి కాగలను) అని ప్రార్థించారు. అందవల్ల "నీవు, నీ కైంకర్యానికి విరోధి అయిన విగ్రహసౌందర్యంలో తలమునకలు కాకుండేటట్లు చేసి, మా స్వరూపాన్ని అభివృద్ధి చేసి రక్షించావు'' అని అంటున్నారని కూడా భావం. ఈ రక్షణం మిగిలిన రక్షణాలు అన్నిటికంటె మిక్కిలి ఎక్కువగాకదా ఉంటుంది **"సర్వగంధః సర్వరసః"** అని, **"అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః"** అని, **"ఎనక్కు త్తేనే పాలే కన్నలే యముదే"** (నాకు తేనె, పాలు, కలకండ, అమృతం వంటివాడా) అని చెప్పే రీతిలో చాలా విలక్షణం అయిన భగవద్వైభవాన్ని తెలిసినవారికి, హేయం అయిన ప్రకృతి అనుభవాన్ని విడచి సర్వేశ్వరుని సేవలో అన్వయించడం సులభంగా ఉంటుంది. ఈ విధంగా **"రసంగ్ హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి"** అనే రీతిలో అత్యంతం మనోహరం అయిన భగవద్విగ్రహసౌందర్యంలో మగ్నమైనవానికి దానిని విడచి కైంకర్యాలలో అన్వయించడం చాలా దుర్లభంగా ఉంటుంది. "ప్రథమపర్వత్తై విట్టు చరమపర్వత్తై ఆశ్రయిక్కైయిలుళ్ళ అరుమైపోలే కాణుమ్, విగ్రహసేవైయై విట్టు కైంకర్యత్తిలే యన్వయిక్కైయిలుళ్ళ వరుమై; ఇదుదాన్ దుర్లభమ్" (ప్రథమ పర్వాన్ని విడచి చరమపర్వాన్ని ఆశ్రయించడంలో ఉండే దౌర్లభ్యంవంటిదే సుమా, భగవానుని రూపసౌందర్యంలో అభినివేశాన్ని పొందకుండా కైంకర్యం చేయగల్గడంలోని దౌర్లభ్యం) అని అనుగ్రహించారుకదా శ్రీపిళ్ళైలోకాచార్యులవారుకూడా. లేక,

**(విశ్వతో భయాత్)-** అని అనడంద్వారా సర్వేశ్వరుని కైంకర్యంలో నిలవడంకాకుండా, అదికూడా అసారం అయిన వస్తువు అనేటట్లు చేసి, **"అడియార్క్కు ఎన్నై ఆళ్‌పడుత్త విమలన్"** (దాసులకు నన్ను దాసుని చేసిన విమలుడు) అని, **"అడియేనై ఉన్నడియార్కాట్పడుత్తాయ్"** (దాసుణ్ణి అయిన నన్ను నీ దాసులకు దాసునిగా

ఎన్లుమ్, "ఎన్నై యడ్గాట్పడుత్తే" (తిరుపళ్ళి-10) ఎన్లుమ్ శొల్లుగిఅపడియే "ఆత్మావుక్కు స్వరూపమాన భగవత్కైఙ్కర్యత్తుక్కు చరమావధియాన భాగవతకైఙ్కర్యత్తిలే మూట్టి రక్షిత్తాయ్"- ఎన్లవుమామ్.

**(ఋషభ)** శ్రేష్ఠనానవనే ! ఇప్పడి ఎల్లామ్ శెయ్‌దదు శ్రేష్ఠనాకైయాలేయిఱే. "యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్" **(శ్వేతా-6-18)** ఎన్గిఅపడియే వ్యష్టిసృష్టిక్కు కారణభూతనాన చతుర్ముఖనుక్కుమ్ కారణమాయ్, అత్తాలే సర్వశ్రేష్ఠ నెన్లపడి.

**(తే వయం రక్షితాః)** "కృష్ణాశ్రయాః కృష్ణబలాః కృష్ణనాథా శ్చ" **(భార.ద్రోణ-183. 24)** ఎన్గిఅపడియే అనన్యప్రయోజనరాయ్, ఉన్ తిరువడిగళైయే ఆశ్రయిత్తు, అనన్యార్హదాసభూతరాన యామ్, ఉన్నాలే రక్షిక్క ప్పెట్రోమ్. అన్టిక్కే, ఇప్పడి, ఆత్మవినాశకరమాన ఆపదైగళిలే మగ్నమాన యామ్ ఉన్నాలే రక్షిక్కపెట్రోమ్- ఎన్నవుమామ్.

**(తే వయం రక్షితాః)** అన్టిక్కే, "తే" ఎన్ల పదమ్ చతుర్థీవిభక్తియాయ్, ఇప్పడి ఉన్నుడైయ ప్రయోజనార్థమాగ ఉన్నాలే రక్షిక్కపెట్రోమ్ ఎన్నవుమామ్.

**(తే వయం రక్షితాః)** అన్టిక్కే, విరోధిగళాన అవర్గళుమ్, దాసభూతరాన యాముమ్ ఉన్నాలే సమమాగ రక్షిక్కపెట్రో మెన్లవుమామ్. రక్షణమావదు - విరోధిగళై నీక్కి అపేక్షితఙ్గళై కొడుక్కైయిఱే. ఆకైయాలే, తన్ తిరుక్కైయాలే అవర్‌కళుక్కు విరోధియాన శరీరసంబన్ధత్తై యఱుత్తు, పరమపదత్తై కొడుత్తుమ్, తఙ్గళుక్కు భగవత్కైంకర్యత్తుక్కుమ్, సేవైక్కుమ్ విరోధిగళానవట్రై నశిప్పిత్తు, అవట్రై కొడుత్తుమ్ రక్షిత్తానాక చ్చొల్ల త్తట్టిల్లైయిఱే.

---

చేశావు) అని, "ఎన్నై అడ్గాట్పడుత్తే" (నన్ను నీ భక్తులకు దాసునిగా చేశావే) అని చెప్పే రీతిలో "ఆత్మకు స్వరూపమైన భగవత్కైంకర్యానికి చరమావధి అయిన భాగవత కైంకర్యంలో ఆసక్తం చేసి రక్షించావు - అనికూడా భావం.

**(ఋషభ)**- శ్రేష్ఠుడైనవాడా! ఈ విధంగా అన్నీ చేసినది నీవు శ్రేష్ఠుడు కావడంవల్లకదా! "యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్" (ఎవడు ముందు బ్రహ్మను సృష్టించాడో) అనే రీతిలో వ్యష్టిసృష్టికి కారణభూతుడైన చతుర్ముఖునికి సైతం కారణమై, అందువల్ల సర్వశ్రేష్ఠుడని (ఋషభశబ్దానికి) భావం.

**(తే వయం రక్షితాః)** - "కృష్ణాశ్రయాః కృష్ణబలాః కృష్ణనాథా శ్చ" (శ్రీకృష్ణుని ఆశ్రయంగా కలవారు, శ్రీకృష్ణుని బలంగా కలవారు, శ్రీకృష్ణుని నాథునిగా కలవారును) అనే రీతిలో అనన్యప్రయోజనలై, నీ పాదాలనే ఆశ్రయించి, అనన్యార్హదాసభూతులమైన మేము నీచేత రక్షింపబడ్డాము. లేక, ఈ విధంగా ఆత్మనాశకరం అయిన ఆపత్తులలో మునిగిన మేము నీచేత రక్షింపబడ్డాము- అనికూడా భావం.

**(తే వయం రక్షితాః)** లేక, "తే"అనే పదం చతుర్థీవిభక్తిగా గ్రహిస్తే, "తనక్కేయాక ఎనై క్కొళ్ళుమీదే" (నీ కోసమే నన్ను స్వీకరించు) అనే రీతిలో అనన్యప్రయోజనలైన మేము ఈ విధంగా నీకోసం నీవల్ల రక్షింపబడ్డాము- అనికూడా భావం.

**(తే వయం రక్షితాః)**- లేక, విరోధులైన వారు, దాసభూతులమైన మేము నీ చేత సమంగా రక్షింపబడ్డాము- అనికూడా భావం. రక్షణం అంటే - విరోధులను పోగొట్టి అపేక్షించినవాటిని ఇవ్వడమే కదా! అందువల్ల తన శ్రీహస్తంతో వారికి విరోధి అయిన శరీరసంబంధాన్ని ఛేదించి, పరమపదాన్ని ఇచ్చి,తమకు భగవత్కైంకర్యానికి, సేవకు విరోధులైన వానిని నశింపజేసి, వాటిని ఇచ్చి రక్షించాడని అనడంలో అడ్డు లేదుకదా!

(తే వయం రక్షితాః) "బ్రహ్మలోక మభిసంపద్యతే, న చ పునరావర్తతే" (ఛాందో-8-15-1) ఎన్డుమ్, "మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్, నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః" (భగ-8-15) ఎన్డుమ్ శొల్లుగిఱపడియే ఉన్ తిరువడిగళై ఆశ్రయిత్తవర్గళ్ బ్రహ్మలోకత్తై ప్రాపిత్తు, సంసారమ్ మఱువలిడాదపడి అదిలే ఎప్పోదు మిరున్డు, "ఆనందీ భవతి" (తైత్తి. ఆనంద) ఎన్గిఱపడియే ఆనందమాగ్నరా యిరుక్కిఱాప్పోలే, యాముమ్ విరోధిగళ్ పిన్నాట్టాతపడి నశిత్తు, ఉన్ సేవైయైయుమ్, కైంకర్యజ్గళైయుమ్ లభిత్తు, ఆనన్దమగ్నరామ్బడి ఉన్నాలే రక్షిక్కపట్టోమ్" ఎన్గిఱార్గళాగవుమామ్.

(రక్షితాః ముహుః) ఇప్పడి యామున్నాలే రక్షిక్కప్పట్టదు ఒరు పర్యాయమో? వరుకిఱ అపాయజ్గళెల్లావఱ్ఱిల్ నిన్డుమ్ అనేకపర్యాయజ్గళ్ రక్షిక్కప్పట్టోమ్ కాణ్- ఎన్గిఱార్గళ్. ఆక, ఇన్ద శ్లోకత్తాలే - "ఇప్పడి సర్వభయజ్గళ్ నిన్డుమ్ నశియాతపడి పణ్ణి, ఉన్ సేవైయైయుమ్,కైంకర్యజ్గళైయుమ్ ప్రసాదిత్తు రక్షిత్త నీ, ఇన్ఱు ఎజ్గళై విట్టు వధిక్కప్పార్క్కిఱాయో? ఇదెన్న ఆశ్చర్యమ్! ఇదు నిర్ఘృణనానవన్ శెయ్యత్తక్క కార్యమితే !"- ఎన్గిఱార్గళ్.

మూన్డామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

## నాలామ్ శ్లోకమ్

అవ :- "యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య తదాఽత్మానం సృజామ్యహమ్" (భగ-4-7) ఎన్డుమ్, "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" (భగ-4-8) ఎన్డుమ్

---

(తే వయం రక్షితాః) - "బ్రహ్మలోక మభిసంపద్యతే, న చ పునరావర్తతే" (బ్రహ్మలోకాన్ని పొందుతున్నాడు, తిరిగి రావడం లేదుకూడా) అని, "మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్, నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాంగతాః" (గొప్ప మనస్సును కలవారు గొప్పసిద్ధిని పొందినవారై నన్ను చేరి తిరిగి దుఃఖాలకు నిలయం అయిన, అస్థిరమైన జన్మను పొందరు) అని చెప్పే రీతిలో నీ శ్రీపాదాలను ఆశ్రయించినవారు బ్రహ్మలోకాన్ని పొంది, సంసారం పునరావృత్తం కాకుండేటట్లుగా అందులో ఎప్పుడూ ఉండి, "ఆనందీ భవతి" (ఆనందాన్ని కలవాడు అవుతాడు) అనే రీతిలో ఆనందమగ్నులై ఉండే రీతిలోనే, మేముకూడా విరోధులు వెంటబడకుండా ఉండేటట్లు నశించి, నీ సేవను, కైంకర్యాలను పొంది, ఆనందంలో మునిగినవారం అయేటట్లు నీవల్ల రక్షింపబడ్డాము- అని అంటున్నారు అనికూడా భావం.

(రక్షితాః ముహుః)- ఈ విధంగా మేము నీచేత రక్షింపబడినది ఒక పర్యాయమా? వచ్చే అపాయాలనుండి అనేకపర్యాయాలు రక్షింపబడ్డాంకదా! అని అంటున్నారు. అందువల్ల, ఈ శ్లోకంద్వారా ఈవిధంగా అన్నిభయాలనుండి నశించకుండా ఉండేటట్లుచేసి, నీ సేవను, కైంకర్యాలను ప్రసాదించి రక్షించిన నీవు ఇపుడు మమ్ములను విడచిపెట్టి వధించాలని చూస్తున్నావా? ఇదేమి ఆశ్చర్యం ! ఇది దయలేనివాడు చేయదగిన పనిసుమా!- అని అంటున్నారు.

మూడవ శ్లోకం పూర్తి అయినది

## నాల్గవ శ్లోకం

**అవ :-** "యదా! యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత! అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్" ("అర్జునా! ఎపుడెపుడు ధర్మానికి హాని కల్గుతుందో, అధర్మానికి అభివృద్ధి కల్గుతుందో అపుడు నన్ను నేను అవతరింప జేసికొంటాను'') అని, "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" (ధర్మ సంస్థాపనకోసం

శొల్లుగిఱపడియే విశ్వపరిపాలనత్తుక్కాక అవతరిత్తరుళిన దేవరీర్క్కు, ఇప్పడి భక్తరై ఉపేక్షిక్కుమ్బడి మిగవు మనుచితమ్కాణ్. "భక్తానాం త్వం ప్రకాశసే", (జితంతే-5) ఎన్గిఱపడియే భక్తరై రక్షిత్తాలల్లదు ప్రకాశియాద ఉన్నుడైయ శేషిత్వస్వరూపత్తుక్కిదు శేరుమో? "రాఘవం చ మహావ్రతమ్" (రామా-అయో-18-3) ఎన్డుమ్, "ఏతద్వ్రతం మమ" (రామా- యుద్ధ-18-32) ఎన్డుమ్ శొల్లప్పడుగిఱ శ్రీసూక్తిగళై నీర్పాల్ శెయ్య పార్క్కిఱాయో? ఎన్గిఱార్గళ్. అన్ఱిక్కే, కీழ్, ముదల్ శ్లోకత్తాలే శ్రీమత్పదార్థత్తై అనుసన్ధిత్తు, ఇరణ్డామ్ శ్లోకమ్ మున్నాగ నాలామ్ శ్లోకత్తళవుమ్ వర నారాయణశబ్దార్థత్తై అనుసన్ధిత్తు, ఇన్ద శ్లోకత్తిలే నారాయణశబ్దత్తిల్ శొన్న రక్షణోపయోగియాన సౌలభ్యత్తుక్కు సీమాభూమియాయ్, చరమావతారమాన ఆచార్యావతారత్తాలే వన్దవతరిత్తరుళిన పడియై అనుసన్ధిత్తు, ఇప్పడి కృపామాత్రప్రసన్నమాయ్, అనధికారిగళైయు మగప్పడ రక్షిత్తక్క ఆచార్యవేషత్తోడే వన్దవరిత్త పిన్బుమ్ కైవిడుగిఱాయే! యా మెత్తనై మందభాగ్యముడైయోమాయ్ జన్మిత్తోమో! "నాన్యత్ కించి దస్తి పరాయణమ్" (విష్ణుధర్మమ్) ఎన్గిఱపడియే సంసారనిస్తరణత్తుక్కు మఱ్ఱొరు ఉపాయమిన్ఱిక్కే నీయే ఉపాయభూతనా యిరున్దు వైత్తు, "ఉన్ పాదపఙ్కయమ్ నణ్ణిలా వకైయే నలివా నిన్న మెణ్ణుగిన్ఱాయ్" (తిరువాయ్-7-1-1) ఎన్గిఱపడియే ఉన్నై యామ్ కిట్టాదపడి దూరమాగ త్తళ్ళి కైవిడప్పార్క్క ఎన్ శెయ్యక్కడవోమ్? పయిరై, ఇతరపశుక్కళ్ వన్దు మేయాదపడి రక్షిప్పదఱ్కు వైత్త వేలియే మేయ్న్దాల్ మఱ్ఱొరు విరకుణ్డో? ఎన్గిఱార్కళెన్దవుమామ్.

న ఖలు గోపికానందనో భవాన్ అఖిలదేహినా మంతరాత్మదృక్ ।
విఘనసార్థితో విశ్వగుప్తయే । సఖ! ఉదేయివాన్ సాత్వతాం కులే ॥

---

ప్రతియుగంలోను అవతరిస్తాను) అని చెప్పే రీతిలో విశ్వపరిపాలనకోసం (లోకాలను రక్షించడంకోసం) అవతరించిన నీకు, ఈ విధంగా భక్తులను ఉపేక్షించే తీరు చాలా అనుచితంసుమా! "భక్తానాం త్వం ప్రకాశసే" (భక్తులకోసం నీవు ప్రకాశిస్తున్నావు) అనే రీతిలో భక్తులను రక్షిస్తే తప్ప ప్రకాశించని నీ శేషత్వస్వరూపానికి ఇది తగినదా? "రాఘవం చ మహావ్రతమ్" (శరణాగతరక్షణ అనే గొప్ప వ్రతాన్ని కల శ్రీరాముని) అని, "ఏతద్వ్రతం మమ" (ఇది నా వ్రతం) అని చెప్పబడే శ్రీసూక్తులను నీటిపాలు చేయాలని చూస్తావా? అని అంటున్నారు. లేక, పూర్వం మొదటి శ్లోకంతో శ్రీమత్పదార్థాన్ని అనుసంధించి, రెండవ శ్లోకంనుండి నాల్గవ శ్లోకంవరకు నారాయణశబ్దార్థాన్ని అనుసంధించి, ఈ శ్లోకంలో నారాయణశబ్దంతో చెప్పిన, రక్షణలో ఉపయోగపడే సౌలభ్యానికి సీమాభూమియై, చరమావతారం అయిన ఆచార్యావతారంలో వచ్చి అవతరించిన తీరును అనుసంధించి, ఈ విధంగా కృపామాత్రప్రసన్నమై, అనధికారులను సైతం రక్షించతగిన ఆచార్యవేషంతో వచ్చి అవతరించిన తరువాత కూడా మా చేయి విడుస్తున్నావే! మేము ఎంత మందభాగ్యాన్ని కల్గినవారమై జన్మించామో! "నాన్యత్ కించిదస్తి పరాయణమ్" (ఇంతకంటె గొప్ప శరణం ఇంకొకటి లేదు) అనే రీతిలో సంసారాన్ని దాటడానికి వేఱొక ఉపాయం లేక, నీవే ఉపాయభూతుడవై ఉండి, "ఉన్ పాదపఙ్కయమ్ నణ్ణిలా వకైయే నలివానిన్న మెణ్ణుకిన్ఱాయ్" (నీ పాదపద్మాలను చేరకుండా ఉండేటట్లు తలుస్తున్నావు) అనే రీతిలో మేము నీ దగ్గరకు రాకుండేటట్లు దూరంగా గెంటివేయాలని చూస్తే ఏం చేయగలం? పైరును, ఇతరపశువులు వచ్చి మేయకుండా ఉండే రీతిలో రక్షించడానికై వేసిన కంచే మేస్తే (కంచే చేనును మేస్తే) ఇంకో ఉపాయం ఉన్నదా? - అని అంటున్నారనికూడా భావం.

న ఖలు గోపికానందనో భవాన్ అఖిలదేహినా మంతరాత్మదృక్ ।
విఘనసార్థితో విశ్వగుప్తయే సఖ ! ఉదేయివాన్ సాత్వతాం కులే ॥

**(న ఖలు గోపికానందనో భవాన్)**- ఓ వనితలారా! యశోద అనే పేరును కల ఒక గోపికకు పుత్రుడనై, బద్ధచేతనుడనైన నన్ను ఈ విధంగా సర్వశేషిగా, సర్వరక్షకునిగా, సర్వాధికారాన్నికలవానిగా చెప్పడం తగునా? అని సర్వేశ్వరుని ఉద్దేశ్యంగా భావించి అంటున్నారు.

(న ఖలు గోపికానందనో భవాన్) వారీర్! మడన్లైయర్గాళ్! యశోదై ఎన్ఱు పేరుడైత్తాన ఒరు గోపికైక్కు పుత్రనాయ్, బద్ధచేతననాన ఎన్ఱై ఇప్పడి సర్వశేషియాకవుమ్, సర్వరక్షకనాగవుమ్, సర్వాధికారనాగవుమ్ శొల్లుగిఱ ఇదు తగుమో? ఎన్ఱు సర్వేశ్వరనుడైయ ఉద్దేశ్యమాగ కల్పిత్తు శొల్లుకిఱార్-

(న ఖలు గోపికానందనో భవాన్) ఎన్ఱు. దేవరీర్ గోపికైక్కు కర్మత్తాలే పిఱన్ద కుమారకనల్ల కిడీర్. ఉన్నుడైయ అఘటితఘటనాసామర్థ్యత్తైయుమ్, అతిమానుషఙ్గళాన శీలాదిగళైయుమ్ ప్రకాశిప్పిక్కిఱ పూతనా- శకట- తృణావర్త- యమళార్జున-వత్స-బక-అఘ-ధేనుక-ప్రలంబ-వృషభ- కేశి-వ్యోమాద్యఖిల దుష్టరాక్షసవధత్తైయుమ్, మహాభయంకరమాన కాళియమర్దనత్తైయుమ్, భయంకరదవాగ్ని కబళనత్తైయుమ్, గోవర్ధనోద్ధరణత్తైయుమ్, విశ్వరూపప్రదర్శనత్తైయుమ్ కణ్డ ఎఙ్గళుక్కు దేవరీర్ కేవలబద్ధచేతనరెన్ఱు ప్రతిపత్తి పణ్ణుగైక్కు విరకిల్లైయే!

(అఖిలదేహినా మంతరాత్మదృక్) ఆగ, దేవరీర్, "అనేన జీవేన సహాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛాందో-6-3-2) ఎన్ఱుమ్, "య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽంతరో యమయతి" (బృహ-5-7-22) ఎన్ఱుమ్, "అంత ర్బహి శ్చ త త్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" (తైత్తి. ఆనంద) ఎన్ఱుమ్, "అంతర్హితో నిధి రసి త్వ మశేషపుంసామ్" (వైకుంఠ-12) ఎన్ఱుమ్, "యావైయుమ్ యావరుమ్ తన్నుళ్లే యాకియు మాక్కియుమ్ కాక్కుమ్" (తిరువాయ్- 1-9-1) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే సకలదేహిగళుక్కు మన్తరాత్మావాయ్, సత్తాధారకనాయ్, అవర్కళుడైయ విధినిషేధరూపప్రవృత్తియిల్ సాక్షీభూతనాయ్ నిఱ్కిఱ నారాయణర్. ఇన్ద అనుప్రవేశత్వమ్ శొన్నపోతే సర్వాత్మాక్కళైయుమ్ తనక్కు శరీరమాగ క్కొణ్డు, అవఱ్ఱుక్కు ధారకనాయ్, పోషకనాయ్, భోగ్యనాయ్, స్వామియాయ్, నియంతావాయ్, రక్షకనాయ్, శేషియాయ్, పితావాయ్, భర్త్తావా యిరున్ద పడియై శొల్లిఱ్ఱాయిఱ్ఱు

---

(న ఖలు గోపికానందనో భవాన్)- అని. నీ అఘటితఘటనాసామర్థ్యాన్ని, అతిమానుషాలైన శీలాదులను ప్రకాశింపజేసే పూతన, శకట, తృణావర్త, యమళార్జున, వత్స, బక, అఘ, ధేనుక, ప్రలంబ, వృషభ, కేశివ్యోమాద్యఖిల దుష్టరాక్షసుల వధలను, మహాభయంకరం అయిన కాళియమర్దనాన్ని, భయంకరమైన దావాగ్నిని కబళించడాన్ని, గోవర్ధనోద్ధరణాన్ని, విశ్వరూపప్రదర్శనను చూచిన మాకు నీవు కేవలబద్ధచేతనుడవనే ప్రతిపత్తి (భావన)చేసే అవకాశం లేదే!

(అఖిలదేహినా మంతరాత్మదృక్)- అందువల్ల, నీవు "అనేన జీవేన సహాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఈ జీవునిద్వారా ఇతని లోపల అనుప్రవేశించి నామరూపాలను వ్యాకరిస్తాను) అని, "య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽంతరో యమయతి" (ఎపుడు ఆత్మలోపల ఉంటూ ఆ ఆత్మను నియమిస్తున్నాడో) అని, "అంతర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః", (లోపల బయట అంతటా వ్యాపించి నారాయణుడున్నాడు) అని, "అంతర్హితో నిధి రసి త్వ మశేషపుంసామ్" (సమస్తజీవులకు నీవు లోపల దాగి ఉన్న నిధివి) అని, "యావైయుమ్ యావరుమ్ తన్నుళ్ళే యాకియుమ్ ఆక్కియుమ్ కాక్కుమ్" (చేతనాచేతనాలను అన్నిటినీ తనలో చేర్చుకొని, తిరిగి సృష్టించి, రక్షిస్తాడు) అని చెప్పే రీతిలో దేహం కల సకలజీవులకు అంతరాత్మయై, వారి సత్తను ధరించేవాడై, వారి విధినిషేధరూప ప్రవృత్తులలో సాక్షియై ఉండే నారాయణుడు - అని అర్థం. ఈ అనుప్రవేశం చెప్పినపుడే, సర్వాత్మలను తనకు శరీరంగా గ్రహించి, వాటికి ధారకుడై, పోషకుడై, భోగ్యుడై, స్వామియై, నియంతయై, రక్షకుడై, శేషియై, తండ్రియై, భర్తయై ఉన్న రీతిని చెప్పినట్లయింది. ఇందువల్ల- నీవు, సర్వచరాచరాత్మకం అయిన ప్రపంచాన్ని శేషంగా కల నారాయణుడవు తప్ప చేతనమాత్రుడువు కావుసుమా!- అని చెప్పినట్లయింది. "వాయుళ్ వైయకమ్ కణ్డ మడనల్లార్, ఆయర్పుత్తిర నల్ల నరున్దేయ్వమ్, పాయ శీరుడై ప్పణ్బుడై ప్పాలగన్ మాయ నెన్ఱు మకిఴ్న్దన

ఇత్తాల్ - "దేవరీర్, సర్వచరాచరాత్మకమాన ప్రపంచత్తై శేషమాగ వుడైయ నారాయణనన్ఱి చేతనమాత్రరల్లర్కాణ్"- ఎన్ఱు శొన్నపడి. "వాయుళ్ వైయకజ్కణ్డ మడనల్లార్ ఆయర్పుత్తిర నల్ల నరున్దైయ్వమ్, పాయశీరుడై పృణ్బుడై ప్పాలగన్ మాయ నెన్ఱు మగిழ்న్దనర్ మాదరే" (పెరియాழ்వార్-1-1-7) ఎన్ఱు ఆழ்వార్ అనుసంధిత్తపడియే ఇవరుమ్ అనుసన్ధిక్కిఱార్.

(విఘనసార్థితో విశ్వగుప్తయే సఖ! ఉదేయివాన్ సాత్వతాం కులే) "యాన్ నీర్ శొన్నపడి వైకుంఠనాథనానాల్ పరమపదత్తి లిరుక్కవేణ్డావో? ఇన్ద వ్రజత్తుక్కు ఎదుక్కాగ వరుగిఱేన్?" ఎన్ఱు అవనుడైయ ఉద్దేశ్యమాగక్కొణ్డు ఇన్ద వ్రజత్తిల్ అవతారత్తుక్కు కరుత్తు విణ్ణప్పమ్ శెయ్గిఱార్ ఇన్ద వాక్యత్తాలే. (విఘనసార్థితః) బ్రహ్మావాలే ప్రార్థిక్కప్పట్టు. అదావదు - "భూమి ర్దృప్త నృపవ్యాజదైత్యానీకశతాయుతైః, ఆక్రాంతా భూరిభారేణ బ్రహ్మాణం శరణం యయౌ, గౌ ర్భూత్వాఽశ్రుముఖీ ఖిన్నా రుదంతీ కరుణం విభోః, ఉపస్థితాఽంతికే తస్మై వ్యసనం సమవోచత, బ్రహ్మా తదుపధార్యాథ సహ దేవై స్తయా సహ, జగామ సత్రిణయన స్తీరం క్షీరపయోనిధేః, తత్ర గత్వా జగన్నాథం వాసుదేవం వృషాకపిమ్, పూర్ణం పురుషసూక్తేన హ్యుపతస్థే సమాహితః" (భాగవతమ్-10-1-17,18,19,20) ఎన్గిఱపడియే దుర్మార్గరాయ్, నృపవ్యాజత్తాలే వర్త్తిక్కిఱ అసంఖ్యాతజ్గళాన రాక్షసరర్గళై వధిక్క అశక్తైయాయ్, తఱై బ్రహ్మావిన్ సన్నిధియిలే శెన్ఱు తన్నుడైయ శోకత్తై విణ్ణప్పమ్ శెయ్య, అవనుమ్ దేవేంద్రాదిదేవతైగళైయుమ్, శితికంఠనైయుమ్ పురస్కరిత్తుక్కొణ్డు, క్షీరార్ణవత్తుక్కు చ్చెన్ఱు, అతిన్ కరైయిలే నిన్ఱు సమాహితనాయ్, భూభారత్తై క్కழிప్పతఱ్కు అవతరిక్కవేణు మెన్ఱు పురుషసూక్తత్తాలే ప్రార్థిక్క, అవనుడైయ ప్రార్థనైయై యుట్కొణ్డు, "వసుదేవగృహే సాక్షాత్ భగవాన్ పురుషః పరః, జనిష్యతే" (భాగవతమ్-10-1-23) ఎన్గిఱపడియే, భూభారత్తై క్కழிప్పదఱ్కు వసుదేవగృహత్తిలే వన్దవతరిత్తానిఱే. (విశ్వగుప్తయే) జగత్తై రక్షిప్పదఱ్కు. "స యావ దుర్వ్యా భర మీశ్వరేశ్వరః, స్వకాలశక్త్యా క్షపయం

---

వర్ మాదరే" (నోటిలో లోకాలను అన్నిటిని చూచినవారై, భవ్యతను, స్త్రీత్వాన్ని కల గొల్లవనితలు కల్యాణగుణ సమృద్ధిని కలవాడు, శీలగుణాన్ని కలవాడైన ఈ బాలకుడు నందగోపుని కుమారుడు కాడు; పొందడానికి సాధ్యం కాని సర్వేశ్వరుడు, ఆశ్చర్యశక్తియుక్తుడు అని అంటూ సంతోషించారు.) అని ఆழ்వార్లు అనుసంధించినట్లే వీరుకూడా అనుసంధిస్తున్నారు.

(విఘనసార్థితో విశ్వగుప్తయే సఖ! ఉదేయివాన్ సాత్వతాం కులే) నేను మీరు చెప్పినట్లు వైకుంఠనాథుణ్ణే అయితే పరమపదంలో ఉండవద్దా? ఈ రేపల్లెకు ఎందుకోసం వస్తాను? అని అతని ఉద్దేశ్యంగా భావించి, ఈ రేపల్లెలో అవతారంలోని ఉద్దేశ్యాన్ని ఈ వాక్యంతో విన్నపిస్తున్నారు. (విఘనసార్థితః) -బ్రహ్మచేత ప్రార్థింపబడి (అని భావం). అంటే, "భూమిః దృప్తనృపవ్యాజదైత్యానీకశతాయుతైః, ఆక్రాంతా భూరిభారేణ బ్రహ్మాణం శరణం యయౌ, గౌ ర్భూత్వాఽశ్రుముఖీ ఖిన్నా రుదంతీ కరుణం విభోః, ఉపస్థితాఽంతికే తస్మై వ్యసనం సమవోచత, బ్రహ్మా తదుపధార్యాథ సహ దేవై స్తయా సహ, జగామ సత్రిణయన స్తీరం క్షీరపయోనిధేః, తత్ర గత్వా జగన్నాథం వాసుదేవం వృషాకపిమ్, పూర్ణం పురుషసూక్తేన హ్యుపతస్థే సమాహితః" అనే రీతిలో దుర్మార్గులై, నృపులనే నెపంతో తిరిగే అనేకసంఖ్యాకులైన రాక్షసులను వధించడానికి శక్తి లేనిదై, భూమి బ్రహ్మసన్నిధికి చేరి తన శోకాన్ని విన్నపించగా, అతడుకూడా ఇంద్రాదిదేవతలను, శివుని ముందుబెట్టుకొని, పాలసముద్రాన్ని చేరి, దాని తీరంలో నిలచి, సమాహితుడై, భూభారాన్ని తొలగించడానికై అవతరించాలని పురుషసూక్తంతో ప్రార్థించగా, అతని ప్రార్థనను అంగీకరించి, "వసుదేవగృహే సాక్షాత్ భగవాన్ పురుషః పరః, జనిష్యతే" (వసుదేవుని గృహంలో సాక్షాత్తు పరమపురుషుడైన భగవానుడవతరిస్తాడు) అని చెప్పే రీతిలో భూభారాన్ని తొలగించడానికి వసుదేవుని

శ్చరే ద్భువి" (భాగవతమ్-10-1-22) ఎన్ఱక్కడవదిఱే. అన్ఱిక్కే, విశ్వమెన్ఱు సర్వేశ్వరనాయ్, సర్వేశ్వరనై రక్షిప్పదఱ్కెన్ఱువుమామ్. అదావదు - సర్వేశ్వరనై ఇల్లై శెయ్‌గిఱ పాషండాది సిద్ధాన్తఙ్గళై నిరసిత్తు, సర్వేశ్వరనుడైయ ఉణ్మైయై సాధిత్తు, అవనుడైయ స్వరూపరూప గుణవిభూతిమహ దైశ్వర్యఙ్గళైయుమ్ స్థాపిత్తు, అవనుడైయ పరత్వత్తై రక్షిప్పదఱ్కు వన్దవతరిత్తాన్. తన్నై రక్షిప్పదఱ్కు త్తానే వన్దవతరిత్తానిఱే.

(సఖ) స్నేహియానవనే! ఇప్పడి ఎల్లామ్ శెయ్‌దదు సఖనాగైయాలేయిఱే. ఆనన్దిత్తిరుక్కుమ్బోదు ఆనన్దిత్తుమ్, విచారత్తిలే యిరుక్కుమ్బోదు తానుమ్ విచారనిమగ్ననాయిరుక్కైయుమిఱే సఖనానవనుక్కు స్వభావమ్. "ఆయర్ కొழுన్దాయ్" (తిరువాయ్-1-7-3) ఎన్గిఱపడియే ఇవర్‌కళుడైయ కష్టసుఖఙ్గళై తన్నెఱ్ఱియిలే వైత్తు తిరిపవనాగైయాలే శొల్లుగిఱార్‌గళ్. ఇత్తాల్, "ద్వా సుపర్ణా సయుజా సఖాయౌ" (ముండక-3-1-1) ఎన్ఱు శ్రుతియిల్ శొల్లప్పడుగిఱ ఆత్మసఖత్వమ్ శొల్లిఱ్ఱాయ్‌ఱ్ఱు. "య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽంతరః" (బృహ-మధ్యశాఖ) ఎన్గిఱపడియే ఆత్మావుక్కుళ్ళే సత్తాధారకమామ్బడి అనుప్రవేశిత్తు, అప్పడి యిరున్దమాత్రమన్ఱిక్కే, ఇవనై సర్వాపదైగళ్ నిన్ఱుమ్ రక్షిప్పతఱ్కు, దశదిశైగళ్ తోఱుమ్ వ్యాపిత్తు, అద్వేషమ్ తొడక్కమాన ఆత్మగుణఙ్గళెల్లా ముణ్డాక్కి, "దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే" (భగ-10-10) ఎన్గిఱపడియే సర్వేశ్వరనై ప్రాపిక్కైక్కు త్తగుదియాన ప్రపన్నత్వ ముణ్డామ్బడి కటాక్షిత్తరుళినపడియాలే, ఇప్పడి అరుళిన ప్రకారఙ్గళెల్లా వఱ్ఱైయు మనుసన్ధిత్తు "సఖ" ఎన్గిఱార్‌గళ్.

---

ఇంటికి వచ్చి అవతరించాడుకదా! "స యావ దుర్వ్యా భర మీశ్వరేశ్వరః, స్వకాలశక్త్యా క్షపయం శ్చరే ద్భువి" (భూభారాన్ని లేకుండా చేస్తూ సర్వేశ్వరుడు ఈ భూలోకంలో సంచరిస్తాడు.) అని చెప్పబడుతున్నదికదా! లేక, విశ్వమంటే సర్వేశ్వరుడని అర్థం చెప్పి, సర్వేశ్వరుణ్ణి రక్షించడానికి- అనే అర్థాన్ని చెప్పవచ్చు. అంటే సర్వేశ్వరుడు లేడని నిరాకరించే పాషండాది సిద్ధాంతాలను నిరసించి, సర్వేశ్వరుని అస్తిత్వాన్ని సాధించి, అతని స్వరూపరూపగుణవిభూతి మహదైశ్వర్యాలను నిలిపి, అతని పరత్వాన్ని రక్షించడానికై వచ్చి అవతరించాడు. తనను రక్షించడంకోసం తానే వచ్చి అవతరించాడుకదా!

(సఖ) - స్నేహితుడా ! అని అర్థం. ఈ రీతిలో అంతా చేసినది సఖుడు కావడంవల్లకదా! (స్నేహితుడు) ఆనందంగా ఉండేటపుడు (తాను) ఆనందించి, (అతడు) విచారంలో ఉన్నపుడు తానుకూడా విచారంలో మునిగి ఉండడంకదా సఖుడైనవానికి స్వభావం. "ఆయర్‌కొழுన్దాయ్" (గోపకుల చిగురువంటివాడై) అనే రీతిలో వీరి కష్టసుఖాలను తన నెత్తిపై వేసికొని (నిర్వహిస్తూ) తిరిగినవాడు కావడంవల్ల (సఖుడని) అంటున్నారు. ఇందువల్ల "ద్వా సుపర్ణా సయుజా సఖాయౌ" (మంచి రెక్కలను కల్గినవి, కలసి ఉన్నవి, స్నేహాన్ని కల్గినవి అయిన రెండు పక్షులు) అనే శ్రుతిలో చెప్పబడే ఆత్మసఖత్వం చెప్పబడింది. "య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽంతరః" (ఎవడు ఆత్మలో ఉంటూ ఆత్మకంటే వేఱయి) అన్నట్లు, ఆత్మలోపల సత్తాధారకం అయేటట్లు అనుప్రవేశించి, ఆ రీతిలో ఉండడం మాత్రమేకాకుండా, ఇతనిని అన్ని ఆపదలనుండి రక్షించడానికి పది దిక్కులలో అంతా వ్యాపించి, అద్వేషం మొదలుకొని ఉండే ఆత్మగుణాలను అన్నిటినీ కల్గించి, "దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే" (వారు నా దరికి చేరడానికి సాధనమైన బుద్ధియోగాన్ని ఇస్తాను) అనే రీతిలో సర్వేశ్వరుని పొందడానికి యోగ్యత అయిన ప్రపన్నత్వం కలిగేటట్లు కటాక్షించడంవల్ల - ఈ విధంగా అనుగ్రహించిన రీతులను అన్నిటినీ అనుసంధించి, "సఖ" అని అంటున్నారు.

(సఖ! ఉదేయివాన్ సాత్వతాం కులే) ఇప్పడి సఖనాయ్, “న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః” (కఠ.5-15) ఎన్గుమ్, “అత్యర్కానలదీప్తం తత్ స్థానమ్ విష్ణో ర్మహాత్మనః, స్వయైవ ప్రభయా రాజన్ ! దుష్ప్రేక్ష్యం దేవదానవైః” (భార. వన- 163-19) ఎన్గుమ్, “శుడరొళియాయ్ నిన్ఱ తన్నుడైచ్చోతి” (తిరువాయ్- 3-10-5) ఎన్గుమ్ శొల్లుగిఱపడియే మహావైభవముడైత్తాన పరమపదత్తైయుమ్ కుఱైచ్చరక్కాగ నినైత్తు అత్తై విట్టు, చేతనరుడైయ దుఃఖ పరమ్పరైగళై క్కణ్డు, “అయ్యో !” ఎన్ఱు కూప్పిట్టు, “సర్వవిధబంధువాన నా నిప్పడి యిరుక్క, ఇవర్గళెల్లామ్ దుఃఖసాగరత్తిలే ఉరుమాయ్న్దు కిడన్దార్గళే”ఎన్ఱు నినైత్తు నిర్హేతుకకటాక్షత్తాలే, ప్రజై కిణ్ణకత్తిలే విழுన్దాల్ మిగవు మార్తియోడే కూడవిழுన్దు, అవనై రక్షిక్క ప్పార్క్కు మత్యంతసౌహార్దముడైయ మాతావైప్పోలే, “ఏష నారాయణ శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్” (హరివంశే-113-62) ఎన్గిఱపడియే ఇవ్విభూతియిలే, మహాత్మాక్కళుడైయ కులత్తిలే, “స ఉ శ్రేయాన్ భవతి జాయమానః” (యజు.అష్టక-3-6-3-9) ఎన్గిఱపడియే ఉన్నుడైయ వైభవముమ్, కల్యాణగుణఙ్గళుమ్ ప్రకాశమామ్బడి వన్దు పిఱన్దాయ్.

(సఖ! ఉదేయివాన్ సాత్వతాం కులే) “సాక్షా న్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనూమ్, మగ్నా నుద్ధరతే లోకాత్ కారుణ్యా చ్ఛాస్త్రపాణినా” (ఇరామానుశనూఱ్ఱన్దాదివ్యాఖ్య-38వ పా) ఎన్గిఱపడియే ఆపత్సఖనాగైయాలే సంసారసాగరత్తిలే నిమగ్నరాన ఎఙ్గళై ఉద్ధరిత్తు రక్షిప్పతఱ్కు మున్బవతరిత్త అవతారఙ్గళెల్లా

---

(సఖ! ఉదేయివాన్ సాత్వతాం కులే)- ఈ రీతిలో స్నేహితుడై, “న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకం నేమా విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః” (అక్కడ సూర్యుడు భాసించడు, చంద్రుడు, తారకలు భాసించవు, ఈ విద్యుత్తులు కూడా భాసించవు. ఇక అగ్ని సంగతిని గూర్చి ఏమున్నది?) అని, “అత్యర్కానలదీప్తం తత్స్థానం విష్ణోః మహాత్మనః, స్వయైవ ప్రభయా రాజన్ ! దుష్ప్రేక్ష్యం దేవదానవైః” (మహాత్ముడైన విష్ణువుయొక్క ఆస్థానం సూర్యుని కాంతికి, అగ్నికాంతికి మించిన కాంతిని కల్గినది. తన ప్రభతో ఓ రాజా ! దేవదానవులకు చూడడానికి శక్యం కానిది) అని, “శుడరొళియాయ్ నిన్ఱ తన్నుడైచ్చోది” (వెలిగే ప్రకాశాన్ని కల తన జ్యోతిస్స్వరూపమైన పరమపదం) అని చెప్పే రీతిలో మహావైభవాన్ని కల పరమపదాన్నికూడా అసారమైన వస్తువుగా తలచి, దానిని విడచి, చేతనుల దుఃఖపరంపరలను చూచి, “అయ్యో” అని ఆక్రందించి, సర్వవిధబంధువైన నేను ఈ రీతిలో ఉండగా, వీరంతా దుఃఖసాగరంలో మునిగి రూపుమాసిపోయి ఉన్నారుకదా!” అని తలచి నిర్హేతుకకటాక్షంతో, బిడ్డ బావిలో పడిపోతే చాలా ఆర్తితో తానుకూడా అందులోకి దూకి, అతనిని రక్షించాలని చూచే అత్యంతం సౌహార్దం కల తల్లివలె, “ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్” (క్షీరసముద్రాన్ని నివాసంగా కలవాడు ఈ శ్రియఃపతి అయిన నారాయణుడు ఆదిశేషుడనే పడుకను వదలిపెట్టి మధురాపురికి వచ్చాడు కదా) అనే రీతిలో ఈవిభూతిలో మహాత్ముల కులంలో “స ఉ శ్రేయాన్ భవతి జాయమానః” (ఆ పరమాత్మ కృపామూలకంగా అవతరించినందువల్లనే మిక్కిలి ప్రకాశిస్తున్నాడు.) అనేటట్లు నీ వైభవం, కల్యాణగుణాలూ ప్రకాశించేటట్లు వచ్చి జన్మించావు. (అని చెప్పవచ్చు.)

(సఖ! ఉదేయివాన్ సాత్వంతాం కులే)- “సాక్షా న్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనూమ్, మగ్నా నుద్ధరతే లోకాత్ కారుణ్యా చ్ఛాస్త్రపాణినా” (సాక్షాత్తు నారాయణుడైన దేవుడు మానవశరీరాన్ని ధరించి సంసారంలో మునిగినవారిని శాస్త్రమనే చేతితో ఉద్ధరిస్తాడు) అన్నట్లు ఆపత్సఖుడు కావడంవల్ల సంసారసాగరంలో నిమగ్నులైన మమ్ములను ఉద్ధరించి రక్షించడానికి ముందు అవతరించిన అవతారాలు అన్నీ అసమర్థాలు కావడంచేత,

మసమర్థజ్గళాగైయాలే, వేదశాస్త్ర మెన్గిఱ హస్తత్తై క్కొణ్డు కేవల సౌలభ్యయుక్తమాన మనుజవేషత్తోడే "విగాహే తీర్థబహుళాం శీతలాం గురుసంతతిమ్, శ్రీనివాసదయాంభోధిపరీవాహపరంపరామ్" (దయాశతకమ్-2) ఎన్గిఱ మహావైభవముడైయ సదాచార్యకులత్తిలే రత్నహారత్తుక్కు నాయకక్కల్‌పోలే వన్దు పిఱన్దాయ్. "మణ్మిశై యోనిగళ్ దోఱుమ్ పిఱన్దు ఎజ్గళ్ మాదవనే కణ్డుఱ నిఱ్కిలుమ్ కాణగిల్లా, ఉలగోర్గళెల్లామ్ అణ్ణలి రామానుశన్ వన్దు తోన్టియ వప్పొழుదే నణ్ణరు ఞానమ్ తలై క్కొణ్డు నారాయణఱ్కాయినరే" (ఇరామానుశనూఱ్ఱన్దాది-41) ఎన్గిఱపడియే ఆచార్యావతారత్తాలేయిఱే జగత్తెల్లామ్ తనక్కు శేషమాక్కివైత్తదు. "చరమార్థప్రదాతారం కృష్ణం వన్దే జగద్గురుమ్" ఎన్టివనై జగదాచార్యనాక అనుసంధిత్తారిఱే.

(సఖ! ఉదేయివాన్ సాత్వతాం కులే) ఇప్పడియాయ్ విడప్పార్క్కిలుమ్, వழువవిడాద మహాస్నేహత్తోడే, కృపామాత్రప్రసన్నమాన ఆచార్యవేషత్తోడే అవతరిత్తవిడత్తిలుమ్, ఎజ్గళై ఉన్నుడైయ కృపైక్కు విషయ మాక్కి రక్షియాదే, విడుగిఱదుక్కు పాప మెవ్వళవు శెయ్‌దోమో? ఇని, ఇన్ద దుఃఖసాగరత్తై తరిక్క మఱ్ఱొరు తుణై యుణ్డెన్టు ఆఱియిరున్దప్పోమో? ఎన్ శెయ్యక్కడవోమ్! ఆక, అరుళ వేణుమెన్టు అవన్ తిరువడిగళిలే విழుగిఱార్.

నాలామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

---

వేదశాస్త్రమనే చేతిని గొని కేవలసౌలభ్యంతో కూడిన మానవరూపంతో "విగాహే తీర్థబహుళాం శీతలాం గురుసంతతిమ్, శ్రీనివాసదయాంభోధిపరీవాహపరంపరామ్" (పలురేవులవంటి గురువులతో నిండినది, ఆత్మగుణ సంపన్నమైనది, (చల్లనిది), ఆచార్యపరంపర అనే ప్రవాహాలను కల్గినది అయిన శ్రీనివాసుని దయాసముద్రం నుండి వెలువడే ధారాపరంపరను అనుభవిస్తున్నాను) అనే మహావైభవాన్ని కల సదాచార్యకులంలో రత్నహారానికి నాయకమణిగా వచ్చి జన్మించావు. "మణ్మిశైయోనికళ్ తోఱుమ్ పిఱన్దు ఎజ్గళ్ మాదవనే కణ్ణుఱ నిఱ్కిలుమ్ కాణకిల్లా, ఉలకోర్‌కళెల్లామ్ అణ్ణలిరామానుశన్ వన్దు తోన్టియ వప్పొழుదే నణ్ణరుమ్ ఞానమ్ తలైక్కొణ్డు నారణఱ్కాయినరే" (ఈ భూమిలో అన్ని జాతులలో అవతరించి మనకు నాథుడైన శ్రియఃపతియే కళ్ళకు కన్పించేటట్లు నిలిచినా ఆస్వామిని చూచి ఆశ్రయించని లోకులంతా స్వామి అయిన శ్రీరామానుజులు ఈ లోకానికి వచ్చి అవతరించిన అపుడే గొప్ప అరుదైన జ్ఞానాన్ని పొంది శ్రీమన్నారాయణునకు దాసులయ్యారు.) అనే రీతిలో ఆచార్యావతారంతోకదా జగత్తు అంతా తనకు శేషంగా చేసినది. "చరమార్థప్రదాతారం కృష్ణం వందే జగద్గురుమ్" (చరమశ్లోకాన్ని, దాని అర్థాన్ని ప్రసాదించిన జగద్గురువైన శ్రీకృష్ణునకు నమస్కరిస్తున్నాను) అని ఇతనిని జగదాచార్యునిగా అనుసంధించారుకదా!

(సఖ ! ఉదేయివాన్ సాత్వతాం కులే)- ఈ విధంగా మేము విడవాలని చూచినా, తొలగిపోనివ్వని గొప్ప స్నేహంతో, కృపామాత్రప్రపన్నమైన ఆచార్యవేషంతో అవతరించినా, మమ్ములను నీ కృపకు విషయంగా చేసి రక్షించకుండా, విడువడానికి ఎంత పాపం చేశామో ? ఇక ఈ దుఃఖసాగరాన్ని దాటడానికి వేఱొక సహాయం ఉన్నదని ఊరడిల్లి ఉండగలమా ? ఏమి చేయగలం ? అందువల్ల నీవు అనుగ్రహించాలి- అని అతని శ్రీపాదాలలో పడుతున్నారు. (శరణు పొందుతున్నారు)

నాల్గవ శ్లోకం పూర్తి అయినది

## అఞ్జామ్ శ్లోకమ్

అవ :- దేవరీర్ "తేవిమారావార్" (తిరువాయ్-8-1-1) ఎన్టుమ్, "అత్యర్కానలదీప్తం తత్ స్థానం విష్ణో ర్మహాత్మనః, స్వయైవ ప్రభయా రాజన్! దుష్ప్రేక్ష్యం దేవదానవైః" (భార. వన-163-19) ఎన్టుమ్, "న మాంసచక్షుభి రభివీక్షతే తమ్" (తైత్తి.నారా-3) ఎన్టుమ్, "కట్కిలీ" (తిరువాయ్-7-2-3) ఎన్టుమ్ శొల్లుగిఅపడియే మహావైభవయక్తరాయ్, బ్రహ్మాండకటాహత్తుక్కవ్వరుగే స్వయంప్రకాశమాన దివ్యవైకుంఠత్తిలే యిరున్దు, ఒరువరాలుమ్ కాణవొణ్ణాదపడియాన ఇప్పరత్వత్తుక్కు ప్రయోజన మెన్?" ఎన్టు అత్తై విట్టు, సమస్తచేతనర్గళుడైయ యుళ్ళే కిడన్దు, అవర్కళ్ సత్తైయై నోక్కిక్కొణ్డు, అవర్కళుడైయ ఆపత్సమయత్తిల్, "క్వాసి?" ఎన్టు అழైత్తవాతే, "ఇఙ్గిరున్దేన్" ఎన్టు ప్రత్యుక్తియై పణ్ణిక్కొణ్డు రక్షిప్పదఱ్కు సౌలభ్యవేషత్తోడే నిఱ్కవేణుమెన్ట ఆశైయోడే "య ఆత్మని తిష్ఠన్" (బృహ-మధ్యశాఖ) ఎన్గిఅపడియే ఉళ్ళే కిడన్ద విడత్తిలుమ్, "అంతర్హితో నిధి రసి త్వ మశేషపుంసాం లభ్యోఽసి పుణ్యపురుషై రితరై ర్దురాపః" (వైకుంఠ-12) ఎన్గిఅపడియే అన్ద విగ్రహత్తై మహాజ్ఞానముడైయార్ క్కొళ్ళియ, అతిల్లాదవర్క్కు కాణ విరగిల్లామైయాలుమ్, రక్షణత్తుక్కు సాధనమాగామే నిన్ట అంతర్యామిత్వత్తై త్యజిత్తు, "బ్రహ్మాణ్డత్తుక్కుళ్ళే నిఱ్కిల్ ఇవర్కళై రక్షిక్కక్కడవోమ్" ఎన్టు పార్త్తు, క్షీరార్ణవనికేతననాయ్, శేషపర్యఙ్కత్తిలే భక్తరుడైయ ఆర్తనాదత్తుక్కు శెవి శాయ్త్తుక్కొణ్డు యోగనిద్రైయిలే కిడన్ద విడత్తిలుమ్, "కిడన్దనాళ్ కిడన్దాయ్ యెత్తనై కాలమ్ కిడత్తి యున్ తిరువుడమ్బుశైయ" (తిరువాయ్-9-2-3) ఎన్గిఅపడియే శ్రమమే ఫలిత్తు రక్షిక్కప్పోగామైయాలే, అక్కిడత్తై త్యజిత్తు, ఇని అవర్గళెల్లారుమ్ కణ్ణాలే సేవిత్తు, "శెయ్య తామరైక్కణ్ణుమ్ మల్కులుమ్ శిற்றిడైయుమ్ వడివుమ్, మొయ్

---

## అయిదవ శ్లోకం

అవ :- తమరు "తేవిమారావార్" (దేవేరులైనవారు) అని, "అత్యర్కానలదీప్తం తత్స్థానం విష్ణో ర్మహాత్మనః, స్వయైవ ప్రభయా రాజన్ ! దుష్ప్రేక్ష్యం దేవదానవైః" (ఓ రాజా! మహాత్ముడైన విష్ణువుయొక్క స్థానం అయిన ఆ పరమపదం సూర్యుని కాంతిని, అగ్నికాంతిని మించిన కాంతిని కల్గినది. తన కాంతివల్ల అది దేవదానవులకు చూడడానికి సాధ్యం కానిది) అని, "న మాంసచక్షుభి రభివీక్షతే తమ్" (భౌతిక నేత్రాలతో అతనిని చూడలేరు) అని, "కట్కిలీ!" (కంటికి కనబడనివాడా!) అని చెప్పే రీతిలో మహావైభవాన్ని కలవాడై, బ్రహ్మాండభాండానికి ఆవలి వైపున ఉన్న స్వయంప్రకాశం అయిన దివ్యవైకుంఠంలో ఉండే, ఎవరివల్లా చూడడానికి వీలు కాని రీతిలో ఉండే ఈ పరత్వానికి ఏం ప్రయోజనం? అని దానిని విడచి, సమస్తచేతనుల లోపల ఉండి, వారి సత్తను రక్షిస్తూ ఉండి, వారి ఆపత్సమయంలో "క్వాసి" (ఎక్కడ ఉన్నావు?) అని పిలువగానే, "ఇక్కడ ఉన్నాను'' అని సమాధానం చెప్పి, రక్షించడానికి సౌలభ్యవేషంతో నిలచి ఉండాలనే ఆశతో "య ఆత్మని తిష్ఠన్" (ఆత్మలోపల ఉంటూ) అన్నట్లు లోపల ఉన్నప్పటికీ, "అంతర్హితో నిధి రసి త్వ మశేషపుంసామ్, లభ్యోఽసి పుణ్యపురుషై రితరై ర్దురాపః" (నీవు జనులందరికి లోపల దాచుకొన్న నిధివి. నీవు పుణ్యపురుషులకు లభిస్తావు. ఇతరులకు పొందడానికి సాధ్యం కానివాడవు) అనే రీతిలో,ఆ విగ్రహాన్ని గొప్ప జ్ఞానం కలవారికి తప్ప, అది లేనివారికి దర్శించే అవకాశం లేకపోవడంవల్లను, "రక్షణకు సాధనం కాకుండా ఉన్న అంతర్యామిత్వాన్ని విడచి, బ్రహ్మాండంలోపల నిలిస్తే వీరిని రక్షించగలం'' అని భావించి, క్షీరార్ణవాన్ని నివాసంగా కలవాడై, శేషపర్యంకంలో భక్తుల ఆర్తనాదాన్ని విని, యోగనిద్రలో పరుండి ఉన్నా, "కిడన్దనాళ్ కిడన్దాయ్ ఎత్తనై కాలమ్ కిడత్తి ఉన్ తిరువుడమ్బుశైయ" (పవళించినప్పటినుండి అదే రీతిలో పరుండి ఉన్నావు. నీ శరీరానికి నొప్పి పుట్టేటట్లు ఎంత కాలం శయనిస్తావు?) అనే రీతిలో శ్రమయే ఫలించి, రక్షించలేకపోవడంవల్ల, ఆ శయనసన్నివేశాన్ని విడచి, ఇక వారు అందఱు కళ్ళతో

కొళ్ నీళ్ కుழల్ తాழ్న్ద తోళ్గళుమ్ పావియేన్ మున్నిఱ్కుమే" (తిరువాయ్- 5-5-8) ఎన్గిఱపడియే అన్ద విగ్రహత్తైయే ఎప్పోదుమ్ ధ్యానిత్తు నిఱ్కైయన్ఱి విడ అరిదాయ్, అవర్గళోడే ఒరు నీరాగ క్కలన్దు పరిమారుగైక్కు తక్క కేవలసౌలభ్యయుక్తమాన మానుష్యవేషత్తోడే పిఱక్కిల్, ఇవర్గళై రక్షిక్క విరగామ్" ఎన్ఱు అధ్యవసిత్తు, "ఏష నారాయణ శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్" (హరివంశే-113-62) ఎన్గిఱపడియే తిరువనన్దాழ్వానై మున్బే అవతరిక్కప్పణ్ణి, దేవరీరుమ్ సంసారిగళై రక్షిప్పతఱ్కు పెరియ ఆర్తియోడే చరాచరనివహగోచరమాన దివ్యమఙ్గళవిగ్రహత్తోడే వన్దవతరిత్తు, అదిలుమ్ దూరమాగ అవతరిక్కైయన్ఱిక్కే, "అహం వో బాంధవో జాతః" (విష్ణు.పు. 5-13-14) ఎన్ఱుమ్, "కోవలనాయ్" (అమలనాది-10) ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే ఎఙ్గళిలే ఒరువరాయ్క్కొణ్డు, ఎఙ్గళుడైయ ఉజ్జీవనభార మెల్లామ్ దేవరీరే వహిత్తు, సకలభయఙ్గళ్ నిన్ఱుమ్ ఉద్ధరిత్తరుళినార్- ఎన్ఱు అనుసంధిత్తార్ కీழ్. ఇన్ద శ్లోకత్తిల్, "ఇప్పడి జగత్తై రక్షిప్పతఱ్కే వన్దు పిఱన్దరుళిన దేవరీర్, ఎఙ్గళై విశ్లేషిత్తు, ఉన్నై కిట్టవొట్టాద మహాభయంకరమాన పంచేంద్రియవిషయఙ్గళాలే పూర్ణమాన సంసారమాగిఱ పెరుమ్ కుழియిలే వైక్కైయన్ఱిక్కే, "కున్ఱాడు కొழుముగిల్ పోల్ కువళైగల్ పోల్ కుఱై కడల్పోల్, నిన్ఱాడు కణమయిల్

---

సేవించి, "శెయ్య తామరైక్కణ్ణుమ్ మల్కులుమ్, శిற்றిడైయుమ్ వడివుమ్ మొయ్కొళ్ నీళ్కుழల్ తాழ్న్ద తోళ్కళుమ్ పావియేన్ మున్నిఱ్కుమే" (ఎఱ్ఱని తామరలవంటి నేత్రాలు, నితంబం, సన్నని నడుము, తిరుమేని, అందమై, దీర్ఘమైన కేశపాశం, దీర్ఘంగా వేలాడే భుజాలు- పాపి అయిన నాకంటి ముందు నిలుస్తున్నాయి.) అనే రీతిలో, ఆ విగ్రహాన్నే అన్ని సమయాలలోను అయినా ధ్యానించడం తప్ప, విడువడానికి సాధ్యం కానిదై, వారితో ఒకటిగా కలసి సేవించడానికి తగిన కేవలసౌలభ్యంతో కూడినదైన మానవవేషంతో జన్మిస్తే వీరిని రక్షించడానికి సాధ్యం- అని నిర్ణయించుకొని, "ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్" (పాలకడలిని నివాసంగా కల్గిన ఈ శ్రియఃపతి అయిన నారాయణుడు ఆదిశేషశయనాన్ని వీడి మధురాపురికి వచ్చాడు.) అనే రీతిలో తిరువనన్దాழ్వాన్ను ముందుగానే అవతరింపజేసి, నీవుకూడా సంసారులను రక్షించడంకోసం గొప్ప ఆర్తితో, చరాచరసమూహానికి సైతం కన్పించే దివ్యమంగళవిగ్రహంతో అవతరించి, అందులోను, దూరంగా అవతరించడం కాకుండా, "అహం వో బాంధవో జాతః" (నేను మీకు బంధువై పుట్టాను) అని, "కోవలనాయ్" (గోపాలుడై) అని చెప్పే రీతిలో మాలో ఒకడవై, మా జీవనభారం అంతా నీవే వహించి, సకలభయాలనుండి ఉద్ధరించావు- అని పూర్వం అనుసంధించారు. ఈ శ్లోకంలో- ఈ విధంగా జగత్తును రక్షించడానికే వచ్చి జన్మించిన నీవు మమ్మలను విడచి, నీ దరిచేరనీయని మహాభయంకరం అయిన పంచేంద్రియాలనే విషయాలతో పూర్ణం అయిన సంసారం అనే పెద్ద గుంటలో పడవేయడం కాకుండా, "కున్ఱాడు కొழుముకిల్పోల్ కువళైకళ్పోల్ కుఱై కడల్పోల్ నిన్ఱాడు కణమయిల్పోల్ నిఱముడైయ నెడుమాల్" (పర్వత శిఖరాన్ని చేరిన మేఘం యొక్క చల్లదనం, నల్ల కలువ వలె నైగనిగ్యాన్ని, శబ్దించే సముద్రంయొక్క నల్లదనాన్ని గర్వంతో ఆడే నెమళ్ళ గుంపుల కాంతిని కల ఆశ్రితవ్యాముగ్ధుడు) అని పలికేటట్లు చూచిన చూపు వెనుకకు తిప్పుకోలేనట్లు గొప్ప సౌందర్యంతో కూడిన దివ్యమంగళవిగ్రహాన్ని సేవించి, మా నేత్రద్వయాలు చల్లబడేటట్లుగా మా ముందు సాక్షాత్కరించి, మా భయం అంతా తీరేటట్లు అభయప్రదానాన్ని చేయాలి.''- అని ప్రార్థిస్తున్నారు. అదికదా వీరిభయం తీరడానికి ఉపాయం. వీరు ఆశ్రయించడం చైతన్యకార్యంతప్ప ఉపాయం కాదుకదా! "యదాహ్యేవైష ఏతస్మిన్ అదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే, అథ సోఽభయంగతో భవతి" (ఎపుడు సంసార భయంవల్ల ఇతడు (ముముక్షువు) కంటికి కన్పించనివాడు, రూపాన్ని లేనివాడు, వర్ణనాతీతుడు, అసహాయుడు అయిన భగవానుని వద్ద స్థిరంగా శరణు పొందుతాడో అపుడు అతడు అభయాన్ని

పోల్ నిఱముడైయ నెడుమాల్" (పెరియాళ్వార్-4-8-9) ఎన్గిఱపడియే వైత్త కణ్ వాఙ్గాదపడి పరమసౌందర్యయుక్తమాన దివ్యమంగళవిగ్రహత్తై సేవిత్తు, ఎఙ్గళ్ కణ్ణిణైగళ్ కుళిరుమ్బడి మున్నే తోన్ఱి, ఎఙ్గళ్ భయమెల్లామ్ తీరుమ్బడి అభయప్రదానత్తై తన్దరుళ వేణు" మెన్ఱు ప్రార్థిక్కిఱార్. అతువితే ఇవరుడైయ భయమ్ తీరుగైక్కు ఉపాయమ్. ఇవర్ పన్ఱుగై చైతన్యమాత్ర మన్ఱి ఉపాయ మన్ఱితే. 'యదాహ్యేవైష ఏతస్మి న్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విన్దతే, అథ సోఽభయంగతో భవతి" (తైత్తి. ఆనంద-3) ఎన్ఱు శ్రుతియుమ్ శొల్లిన్ఱితే. ఇన్ద శ్లోకమ్ మున్నాగ ఇరుపదామ్ శ్లోకత్తళవుమ్ "చరణౌ శరణం ప్రపద్యే" (ద్వయమ్) ఎన్గిఱ వాక్యశేషత్తుక్కర్థ మనుసంధేయమ్.

విరచితాభయం వృష్ణిధుర్య! తే శరణ మీయుషాం సంసృతే ర్భయాత్।
కరసరోరుహం కాంత! కామదం శిరసి ధేహి నః శ్రీకరగ్రహమ్ ॥

(విరచితాభయమ్) అభయత్తై ప్రసాదిప్పదాయ్. "భయానా మపహారి" (విష్ణు.పు. 1-17-36) యానవనుడైయ కైయాగైయాలే అభయత్తై పణ్ణుగైయే ఇదుక్కు స్వభావమాయిరుక్కుమితే. "భయం భయానా మపహారిణి స్థితే మనస్యనంతే మమ కుత్ర తిష్ఠతి ?" (విష్ణు.పు. 1-17-36) ఎన్ఱానితే శ్రీప్రహ్లాదాళ్వాన్.

(వృష్ణిధుర్య) వృష్ణికులత్తినుడైయ సంరక్షణభారత్తై వహిత్తవనే ! అవరుడైయ భయత్తై నీక్కుగైక్కాగ అవర్గళ్ కులత్తిలే వన్దవతరిత్తు, "గోపాలో యాదవం వంశం మగ్న మభ్యుద్ధరిష్యతి" (విష్ణు.పు. 5-1-49) ఎన్గిఱపడియే అవర్కళుడైయ రక్షణభారత్తై దేవరీరుడైయ ఉత్తమాఙ్గత్తిలే వైత్తుకొణ్డిరున్దాప్పోలే ఎఙ్గళుడైయ భయఙ్గళెల్లామ్ పోక్కుగైక్కు వ్రజత్తిలే వన్దు తోన్ఱినిన్ఱ దేవరీర్ ఎఙ్గళుడైయ సంరక్షణభారత్తైయుమ్ వహిక్కవేణ్డావో?

(శరణ మీయుషామ్) ఇప్పడి భయమ్ నీక్కుగై యార్క్కు ఎన్నిల్? "......శరణ మీయుషామ్" ఎన్ఱు శొల్లుగిఱార్గళ్. అదావదు -"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్, రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం

---

పొందుతాడు) అని శ్రుతికూడా చెప్పిందికదా! ఈశ్లోకంనుండి ఇరవైయవ శ్లోకంవరకు "చరణౌ శరణం ప్రపద్యే" అనే వాక్యశేషంయొక్క అర్థం అనుసంధేయం.

విరచితాభయం వృష్ణిధుర్య! తే శరణ మీయుషాం సంసృతే ర్భయాత్।
కరసరోరుహం కాంత! కామదం శిరసి దేహి నః శ్రీకరగ్రహమ్ ॥

(విరచితాభయమ్)- అభయాన్ని ప్రసాదించేదై, "భయానా మపహారి" (భయాలను తొలగించేవాడు) అయినవాని హస్తం కాబట్టి అభయాన్ని ఇవ్వడమే దీనికి స్వభావంగా ఉంటుందికదా! "భయం భయానా మపహారిణి స్థితే మనస్యనంతే మమ కుత్ర తిష్ఠతి ?" (భయాలను తొలగించే అనంతుడు నా మనస్సులో ఉండగా ఇక నాకు భయం ఎక్కడ ఉంటుంది ?) అని అన్నాడుకదా ప్రహ్లాదాళ్వాన్.

(వృష్ణిధుర్య)- వృష్ణికులంయొక్క సంరక్షణభారాన్ని వహించినవాడా? వారి భయాన్ని తీర్చడంకోసం వారి కులంలో వచ్చి అవతరించి ఉన్న నీవు మా సంరక్షణభారాన్ని వహించవద్దా !

(శరణ మీయుషామ్)- ఈ రీతిలో భయాన్ని తీర్చవలసినది ఎవరికి? అని అంటే, "శరణ మీయుషామ్" అని అంటున్నారు. అంటే - "ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్, రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వవరణం తథా, ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః" అనే రీతిలో ఆఱు అంగాలను కల శరణాగతితో నీకోసంగా నిన్నే

తథా, ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః" (భగవచ్ఛాస్త్రే) ఎన్గిఱపడియే షడ్విధమాన శరణాగతియాలే త్వదర్థమాగ ఉన్నైయే ఉపాయమాగ పఱ్ఱినాఱ్కెన్ఱపడి. "శరణ మాగుమ్ తనతాళడైన్దార్క్కెల్లామ్" (తిరువాయ్-9-10-5) ఎన్ఱు శొల్లానిన్ఱదిఱే.

(శరణ మీయుషామ్) వశిష్ఠచండాలవిభాగమిన్ఱిక్కే శరణాగతరానవర్‌గళెల్లార్‌క్కు మెన్నవుమామ్. "పశు ర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవసంశ్రయాః, తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పదమ్" (పెరియతిరుమొழிవ్యాఖ్య-2-9ప్రవేశమ్) ఎన్గిఱపడియే భగవద్విషయత్తిలే శరణాగతరాగైక్కు అధికారాతిశయమ్ తేడవేణ్డావిఱే, ప్రాప్త విషయమాగైయాలే. "పయిలుమ్ తిరువుడైయార్ యవరేలుమ్" (తిరువాయ్-3-7-1) ఎన్ఱుమ్, "యే జనాః పర్యుపాసతే" (భగ - 9-22) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే శరణాగతిక్కు మేఱ్పట్ట అధికారాతిశయ మిల్లైయే. అతిల్లాదార్, మిగవు ముత్కృష్టమాన జన్మత్తిలే పిఱన్దాలుమ్, మిగవుమ్ విద్యాధికరాయిరున్దాలుమ్, "అన్యేషు విద్యా వృత్తం ప్రాయో భవతి విధవాకల్పకల్పప్రకర్షః" ఎన్ఱుమ్, "విప్రా ద్విషడ్గుణయుతాదరవిందనాభ పాదారవిందవిముఖా శ్వపచం వరిష్ఠమ్" ఎన్ఱుమ్, "యతి శ్చ శ్వపచాధమః" ఎన్ఱుమ్, "నరకనాశనై నావిఱ్కొణ్డழైయాద మానిడశాదియర్ పరుకు నీరు ముడుక్కుమ్ కూఱైయుమ్ పావమ్ శెయ్‌వనతాన్‌కొలో !" (పెరియాழ்వార్ తిరు-**4-4-4**) ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే అవర్గళుడైయ జన్మవిద్యావృత్తాదిగళెల్లామ్ హేయమాయ్ విడుమిఱే.

(సంసృతే ర్భయాత్) ఎన్ద భయత్తిల్ నిన్ఱుమ్ రక్షిక్కుమ్? ఎన్న, శొల్లుగిఱార్. అదావదు - సంసారభయత్తిల్ నిన్ఱు మెన్ఱబడి. మఱ్ఱ భయఙ్గళ్ పోలన్ఱిఱే ఇన్ద సంసారత్తిల్ భయమ్. ఇతరభయఙ్గళ్ శరీరత్తై నశిక్కప్పణ్ణుమదొழிయ

---

ఉపాయంగా ఆశ్రయించినవారికి- అని భావం. "శరణ మాకుమ్ తనతాళ్ అడైన్దార్క్కెల్లామ్" (తన శ్రీచరణాలను ఆశ్రయించినవారికి అందరికీ శరణం అవుతాడు) అని అనబడుతున్నదికదా!

(శరణ మీయుషామ్)- వశిష్ఠఛండాల తారతమ్యం లేకుండా శరణాగతులైనవారికి అందఱికీ- అని భావం. "పశు ర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవసంశ్రయాః, తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పదమ్" (పశువుగాని, మనుష్యుడు కాని, పక్షికాని ఎవరైనా శ్రీవైష్ణవుని ఆశ్రయించినవారైతే, ఆశ్రీవైష్ణవసంబంధంవల్ల వారు ఆ విష్ణువుయొక్క పరమపదాన్ని చేరగలరు) అనేటట్లు భగవద్విషయంలో శరణాగతి చేసినవారికి యోగ్యతాతిశయం అన్వేషించనక్కఱలేదుకదా- (అది) ప్రాప్తవిషయం కాబట్టి. "పయిలుమ్ తిరువుడైయార్ యవరేలుమ్" (పలికే సంపదను కలవారెవరైనా) అని, "యే జనాః పర్యుపాసతే" (ఏ జనులు ఉపాసిస్తున్నారో) అని పలికే రీతిలో శరణాగతికి మించిన యోగ్యతాతిశయం లేదు. అది లేనివారు, చాలా ఉత్కృష్టమైన జన్మలో పుట్టినా, చాలా విద్యాధికులై ఉన్నా, "అన్యేషు విద్యా వృత్తం ప్రాయో భవతి విధవాకల్పకల్పప్రకర్షః" (మిగిలినవారివిషయంలో విద్య, వృత్తం భర్త గతించిన స్త్రీకి చేసే అలంకారాలవలె నిష్ప్రయోజనాలు) అని, "విప్రా ద్విషడ్గుణయుతాదరవిందనాభ-పాదారవిందవిముఖా శ్వపచం వరిష్ఠమ్" అని, "యతి శ్చ శ్వపచాధమః" (విష్ణుభక్తుడు కాని యతికూడా కుక్కమాంసం తినేవానికంటే అధముడు) అని, "నరకనాశనై నావిఱ్కొణ్డు అழైయాద మానిడశాదియర్ పరుకు నీరు ముడుక్కుమ్ కూఱైయుమ్ పావమ్ శెయ్‌వనతాన్‌కొలో !" (నరకాన్ని నశింపజేసేవాని నాలుకతో పిలువని మానవులు తాగే నీరు, ధరించే వస్త్రం పాపాన్ని చేశాయికదా) అని చెప్పేటట్లు వారి జన్మవిద్యావృత్తాదులన్నీ హేయం అవుతాయికదా!

(సంసృతే ర్భయాత్)- ఏ భయంనుండి రక్షించాలి? అని అంటే, చెబుతున్నారు. అంటే -సంసారభయంనుండి- అని భావం. మిగిలిన భయాలవంటివి కాదుకదా, ఈ సంసారంవల్ల కలిగే భయం. మిగిలిన భయాలు శరీరాన్ని

ఆత్మావై నశిప్పిక్క అసమర్థఙ్గళాయితే యిరుప్పదు. ఇన్ద సంసారభయమ్ పూర్ణమాగ ఆత్మావై నశిప్పిక్కుమితే. అన్ద క్రూరత్తై ప్ప*ఱ్ఱ*వితే "ఆదలాల్ పిఱవి వేణ్డే నరఙ్గమానగరుళానే !" (తిరుమాలై- 3) ఎన్ఱు ఆ*ళ్వా*రనుసన్ధిత్తార్. "సంసారం సాగరం ఘోర మనంతక్లేశభాజనమ్" జితంతే ఎన్ఱు శొల్లప్పట్టదితే.

(తే కరసరోరుహమ్) ఇప్పడి సంసారత్తినుడైయ భయమ్ తట్టాదపడి అభయత్తై ప్రసాదిప్పదు ఎదు? ఎన్ఱిల్, శొల్లుగిఱార్ (తే కరసరోరుహమ్) ఎన్ఱు.

(తే) శ్రియఃపతియాయ్, అవాప్తసమస్తకామనాయ్, అఖిలకల్యాణగుణాకరనాయ్ సర్వశక్తియాయ్, సర్వజ్ఞనాయ్, ప్రాప్యప్రాపకభూతనాయ్, ఆశ్రితర్గళై ఒరునాళుమ్ న*ళు*వవిడాద అత్యన్త వాత్సల్యముడైయ దేవరీరుడైయ.

(కరసరోరుహమ్) కరమెన్గిఱ సరోరుహత్తై. అదు ఎప్పడి యిరున్దదు ? ఎన్నిల్, (కాంతకామదమ్) ఎన్గిఱార్గళ్. అదావదు -స్త్రీగళుడైయ వాంఛితఙ్గళై తరత్తక్కదాయ్- ఎన్ఱపడి. స్త్రీజనఙ్గళుడైయ వాంఛితఙ్గళై కొడుప్పదాన ఇదు ఎఙ్గళుడైయ వాంఛితత్తైయుమ్ కొడాదో? ఎన్గిఱ భావత్తాలే శొల్లుగిఱార్గళ్. అన్ఱిక్కే, "యస్య అంతే కః వర్తతే కః అంతే యస్య సః కాంతః -ఎన్ఱు సమాసమాయ్, భక్త రెన్ఱపడి. "విమలమతి రమత్సరః ప్రశాంత శ్శుభచరితోఽఖిలసత్వ-మిత్రభూతః, ప్రియహితవచనోఽస్తమానమాయో వసతి సదా హృది తస్య వాసుదేవః" ఎన్నక్కడవదితే. అన్ఱిక్కే, "కస్య అంతే యః వర్తతే సః కాంతః" ఎన్ఱుమ్ సమాసమాయ్, ఇత్తాలుమ్ భక్త రెన్ఱపడి. "అహం స్మరామి మద్భక్తమ్" (వరాహచరమశ్లోకమ్) ఎన్గిఱపడియే భక్తన్, తన్ హృదయత్తిలే సర్వేశ్వరనై స్మరిక్కుమాప్పోలే, సర్వేశ్వరనుమ్ ఇవనై

---

నశింపజేస్తాయితప్ప, ఆత్మను నశింపజేయడానికి అసమర్థాలుగాకదా ఉంటాయి. ఈ సంసారభయం ఆత్మను పూర్తిగా నశింపజేస్తుందికదా! ఆ క్రూరత్వాన్నిబట్టేకదా "ఆదలాల్ పిఱవి వేణ్డేన్ అరఙ్గమానకరుళానే !" (శ్రీరంగనాథా! అందువల్ల జన్మను కోరను) అని ఆ*ళ్వా*ర్లు అనుసంధించారు. "సంసారం సాగరం ఘోర మనంతక్లేశభాజనమ్" (సంసారం ఘోరమైన సాగరం, అంతులేని బాధలకు నిలయం) అనికదా చెప్పబడుతున్నది.

**(తే కరసరోరుహమ్)**- ఈ విధంగా సంసారంయొక్క భయం కలగనట్లు అభయాన్ని ప్రసాదించేది ఏది? అని అంటే చెబుతున్నారు - **(తే కరసరోరుహమ్)**- అని అంటూ.

**(తే)**- శ్రియఃపతియై, అవాప్తసమస్తకాముడవై, అఖిలకల్యాణగుణాకరుడవై, ఆశ్రితులను ఏనాడూ బాధపడనీయకుండా ఉండే చాలా వాత్సల్యాన్ని కల నీయొక్క. **(కరసరోరుహమ్)**- హస్తం అనే పద్మాన్ని (అని అర్థం). అది ఏవిధంగా ఉన్నది? అని అంటే-

**(కాంతకామదమ్)**- అని అంటున్నారు. అంటే- స్త్రీల కోటికలను ఇవ్వగల్గినదై- అని భావం. స్త్రీల వాంఛితాలను తీర్చే ఇది (మేము కూడా స్త్రీలం కనుక) మా కోటికలనుకూడా తీర్చదా! అనే భావనతో పల్కుతున్నారు. లేక, **"యస్య అంతే కః వర్తతే"** **(కః అంతే యస్య సః కాంతః)** అనే సమాసాన్ని గ్రహిస్తే భక్తులని (కాంతశబ్దానికి) అర్థం. **"విమలమతి రమత్సరః ప్రశాంత శ్శుభచరితోఽఖిలసత్వమిత్రభూతః, ప్రియహితవచనోఽస్తమానమాయో వసతి సదా హృది తస్య వాసుదేవః"** (పరిశుద్ధమైన మనస్సును కలవాడు, అసూయ లేనివాడు, గొప్ప శాంతిని కలవాడు, శుభచరిత్రుడు, అన్ని ప్రాణులకు మిత్రుడు, ప్రియమైన, హితమైన మాటను పలికేవాడు, తొలగిన మాయను కలవాడు అయిన వ్యక్తిహృదయంలో సదా వాసుదేవుడుంటాడు) అని చెప్పబడుతున్నదికదా! లేక, **"కస్య అంతే యః వర్తతే సః కాంతః"** అనే సమాసాన్ని గ్రహిస్తే, దీనివల్లకూడా (కాంత శబ్దానికి) భక్తుడనే అర్థం. **"అహం స్మరామి మద్భక్తమ్"** (నేను నా భక్తుని స్మరిస్తాను) అనే రీతిలో, భక్తుడు తన హృదయంలో సర్వేశ్వరుణ్ణి స్మరించినట్లే, సర్వేశ్వరుడు ఇతనిని (భక్తుని) తన హృదయంలో స్మరిస్తాడుకదా! **"ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమ్ అహం స చ**

తన్ హృదయత్తిలే స్మరిక్కుమితే. "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః" (భగ- 7-17) ఎన్డుమ్, "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" (భగ- 7-18) ఎన్డుమ్, "బ్రాహ్మణో మమ దేవతా" ఎన్డుమ్ తానే శొల్లివైత్తానితే. అన్ద భక్తరుడైయ కామమావదు -"ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయా వినా" (రామా-అయో-31-5) ఎన్డుమ్, "ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేఽపి త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తి రస్తు" (ముకుందమాల-5) ఎన్డుమ్, "అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపత శ్చతే" (రామా-అయో- 31-27) ఎన్డుమ్, "ఒ**ழి**విల్ కాల మెల్లా ముడనాయ్ మన్ని వ**ழு**విలా వడిమై శెయ్యవేణ్డుమ్ నామ్" (తిరువాయ్- 3-3-1) ఎన్డుమ్ శొల్లుగిఱపడియే సర్వదేశ -సర్వకాల- సర్వావస్థైగళిలుమ్ సర్వేశ్వరనుడైయ తిరువడిగళిల్ పణ్ణుమ్ ప్రీతికారితకైంకర్య మితే. అత్తై కొడుప్పదాగైయాలే "కాంతకామదమ్" ఎన్ఱపడి. ఇతొన్డు మన్డిక్కే మ**ఱ్ఱొ**రు విలక్షణవిశేషణమ్ శొల్లుగిఱార్గళ్

(శ్రీకరగ్రహమ్) ఎన్డు. అదావదు - పెరియపిరాట్టియారుడైయ కరగ్రహత్తై యుడైయదాయిరుక్కై. "సర్వలక్షణసంపన్నా నారీణా ముత్తమా వధూః" (రామా- బాల- 1-28) ఎన్గిఱపడియే ఉత్తమస్త్రీత్వముడైయ పిరాట్టి కైయాలే పిడిత్తదాగైయాలే ఎఙ్గళుక్కు శిరసా వాహ్యా మెన్డుమామ్. అన్డిక్కే, (శ్రీకరగ్రహమ్) "శ్రితాస్యన్యై స్సర్వై

---

మమ ప్రియః" (నేను జ్ఞానికి మిక్కిలి ఇష్టమైన వాడను, అతడు కూడా నాకు ఇష్టమైనవాడు) అని, "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" (జ్ఞాని అయితే నాకు ఆత్మ అని నా మతం) అని, "బ్రాహ్మణో మమ దేవతాః" (బ్రాహ్మణులు నా దైవాలు) అని తానే చెప్పాడుకదా! ఆ భక్తుల కోటిక (ఏమి అంటే)- "ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయా వినా" (నీవు లేని ఈ లోకాలలోని ఐశ్వర్యాన్ని కోరను) అని, "ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేఽపి, త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తి రస్తు" (ఇదే నాకు చాలా ఇష్టమైనది ప్రార్థించదగినది. అది ఏది? అంటే, జన్మాంతరాలలోకూడా నీ పాదారవిందాలలో నిశ్చలమైన భక్తి నాకు కలగాలి) అని, "అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపత శ్చ తే" (నిద్రిస్తున్నపుడు మేల్కొని ఉన్నపుడు నేను నీకు అన్ని సేవలను చేస్తాను) అని, "ఒ**ழி**విల్ కాల మెల్లామ్ ఉడనాయ్ మన్ని, వ**ழு**విలా వడిమై శెయ్యవేణ్డుమ్ నామ్" (విచ్ఛేదం లేకుండా కాలం అంతా స్థిరంగా నిలచి ఉండి ఏ అడ్డులేని కైంకర్యాన్ని మనం చేయాలి)అని చెప్పే రీతిలో సర్వదేశ-సర్వకాల సర్వావస్థలలోను సర్వేశ్వరుని శ్రీపాదాలలో చేసే ప్రీతికారితకైంకర్యమేకదా! దానిని ఇచ్చేది కాబట్టి "కాంతకామదమ్" అని భావం. ఇది ఒక్కటే కాకుండా ఇంకొక విలక్షణమైన విశేషణాన్ని చెబుతున్నారు.

(శ్రీకరగ్రహమ్)- అని. అంటే- లక్ష్మీదేవియొక్క కరగ్రహణాన్ని కల్గినదిగా ఉండడం. "సర్వలక్షణసంపన్నా నారీణా ముత్తమా వధూః" (అన్ని లక్షణాలతో కూడినది, స్త్రీలలో ఉత్తమ అయిన వధువు) అన్నట్లు ఉత్తమస్త్రీత్వాన్ని కల లక్ష్మీదేవిచేతిలో పట్టుకొన్నది కావడంవల్ల, మాకు శిరసా ధార్యమని భావం. లేక,

(శ్రీకరగ్రహమ్)- "శ్రితాస్యన్యై స్సర్వైః శ్రయసి రమణం సంశ్రితగిరః, శ్రుణోషి శ్రేయాంసం శ్రితజనవచః శ్రావయసి చ, శృణాస్యేతద్దోషాన్ జనని ! నిఖిలాన్ సర్వజగతీమ్, గుణైః శ్రీణాసి త్వం త దిహ భవతీం శ్రీ రితి విదుః" (నీకంటే అన్యులైన అందఱిచే ఆశ్రయింపబడుతున్నావు, నీ విభుని ఆశ్రయిస్తున్నావు, భక్తుని మాటలను వింటున్నావు, నీ ప్రియునకు భక్తుల వచనాలను వినిపిస్తున్నావు. ఓ తల్లీ ! వీరి అన్ని దోషాలను హరిస్తున్నావు, నీ గుణాలలో జగత్తు అంతా వ్యాపిస్తున్నావు. అందువల్ల విజ్ఞులు నిన్ను "శ్రీః" అని తెలిసికొంటున్నారు.) అని చెప్పే రీతిలో పురుషకారానికి ఉపయోగించే సకలకల్యాణగుణాలను కల్గినదై, అందువల్ల సర్వసమాశ్రయణీయ అయిన లక్ష్మీదేవియొక్క కరగ్రహణాన్ని ఎల్లప్పుడూ కల్గినది కావడంచేత ఈస్వామియొక్క చేయికూడా "తవ స్పర్శాదీశం

శ్రుయసి రమణం సంశ్రితగిరః, శ్రుణోషి ప్రేయాంసం శ్రితజనవచః శ్రావయసి చ, శృణాస్యేతద్దోషాన్ జనని ! నిఖిలాన్ సర్వజగతీమ్, గుణై శ్రీణాసి త్వం తదిహ భవతీం శ్రీ రితి విదుః" ఎన్గిఱపడియే పురుషకారోపయోగియాన సర్వకల్యాణగుణఙ్గళైయుడైయళాయ్, అత్తాలే సర్వసంశ్రయణీయైయాన శ్రీయైయుడైయ కరగ్రహత్తై ఎప్పోదు ముడైయదాగైయాలే, ఇన్ద పెరుమాళుడైయ కైయుమ్ "తవ స్పర్శాధీశం స్పృశతి కమలే ! మంగళపదమ్" (శ్రీగుణరత్న-29) ఎన్గిఱపడియే అన్ద కల్యాణగుణఙ్గళైయుడైయదాయ్, సర్వసమాశ్రయమాయ్, చేతనరుడైయ భయత్తై నీక్కి రక్షిక్క సమర్థ మెన్గపడి. "మాతర్మైథిలి ! రాక్షసీ స్త్వయి తదైవార్ద్రాపరాధా స్త్వయా, రక్షన్త్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా" (శ్రీగుణరత్న-50) ఎన్గిఱపడియే ఆర్ద్రాపరాధినిగళాన రాక్షసస్త్రీగళ్ విషయత్తిలే "భవేయం శరణం హి వః" (రామా-సుందర- 27-63) ఎన్ఱు అభయత్తై కాట్టిన కైయిఱే అవళదు. అన్ద కైయోట్టై అవినాభావసంబన్ధత్తాలేయిఱే ఇవనుడైయ కైయుమ్ అన్ద స్వభావముడైయదాయ్, "అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ" (రామా-యుద్ధ-18-32) ఎన్ఱుమ్, "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన" (రామా-యుద్ధ- 18-3) ఎన్ఱుమ్ అభయప్రదానమ్ పణ్ణిఱ్ఱు. ఆకైయాలే (శ్రీకరగ్రహమ్) ఎన్ఱుమ్ శొల్లుగిఱార్గళ్.

(శిరసి ధేహి నః) అనన్యప్రయోజనరాన ఎఙ్గళుడైయ ఉత్తమాఙ్గఙ్గళిలే వైప్పాయ్. అదావదు- అనన్యప్రయోజన రాయ్, అనన్యగతిగళాన ఎఙ్గళుక్కు అభయప్రదానత్తై తారాయ్ -ఎన్ఱు ప్రార్థిక్కిఱార్గళ్. "య మేవైష వృణుతే తేన లభ్యః" (ముండక- 3-2-3) ఎన్గిఱపడియే అవనభిమానిత్తు అభయత్తై త్తరుగైయిఱే ఇవర్కళుక్కు వేణ్డువదు. ఇదువిఱే "ప్రపద్యే" (ద్వయమ్) ఎన్గిఱ పదత్తుక్కు సారభూతమాన అర్థమ్. "ఇవన్ పఱ్ఱుమ్ పఱ్ఱు అహంకారగర్భమ్, అవనుడైయ స్వీకారమే రక్షకమ్" (శ్రీవచనభూషణమ్) ఎన్ఱారిఱే.

---

స్పృశతి కమలే ! మంగళపదమ్" (ఓ కమలాదేవీ ! నీ స్పర్శవల్ల నీ ప్రభువును మంగళపదం స్పృశిస్తున్నది) అనే రీతిలో ఆ కల్యాణగుణాలను కల్గినదై, అందటికీ ఆశ్రయింపతగినదై, చేతనుల భయాన్ని పోగొట్టి రక్షించడంలో సమర్థమైనదని భావం. "మాత ర్మైథిలి ! రాక్షసీ స్త్వయి తదైవార్ద్రాపరాధా స్త్వయా రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీ కృతా" (తల్లీ! మైథిలీ ! నీ విషయంలో ఆర్ద్రాపరాధాన్ని చేసిన రాక్షసస్త్రీలను సైతం హనుమానుని బారినుండి రక్షించిన నీ చేత రాముని గోష్ఠి తక్కువగా చేయబడింది) అనేటట్లు ఆర్ద్రాపరాధినులైన రాక్షసస్త్రీల విషయంలో "భవేయం శరణం హి వః" (మీకు శరణం కాగలను) అని అభయాన్ని చూపిన శ్రీహస్తంకదా ఆమెది. ఆ చేతితో గల అవినాభావసంబంధంచేతకదా- ఇతని చేయికూడా ఆ స్వభావాన్ని కల్గినదై, "అభయం సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ" (అన్ని ప్రాణులకు అభయాన్ని ఇస్తాను. ఇది నా వ్రతం) అని, "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన" (మిత్రభావంతో దరిచేరినవానిని ఏవిధంగాను విడచిపెట్టను) అని అభయప్రదానాన్ని చేసినది. అందువల్ల "శ్రీకరగ్రహమ్" అని అంటున్నారు.

(శిరసి ధేహి నః) అనన్యప్రయోజనులైన మా శిరస్సులలో ఉంచు. అంటే- నీవు తప్ప వేఱొక ప్రయోజనం లేనివారమై (అనన్యప్రయోజనులై) వేఱొక గతి లేని మాకు అభయప్రదానాన్ని ఇయ్యి- అని ప్రార్థిస్తున్నారు. "య మేవైష వృణుతే తేన లభ్యః" (ఎవరిని ఈ పరమాత్మ వరిస్తాడో, అతని చేతనే పరమాత్మ పొందడానికి సాధ్యుడు) అన్నట్లు అతడు అభిమానించి అభయాన్ని ఇవ్వడమేకదా వీరికి కావాలి. ఇదేకదా "ప్రపద్యే" అనే పదానికి సారభూతం అయిన అర్థం. "ఇవన్ పఱ్ఱుమ్ పఱ్ఱు అహంకార గర్భమ్, అవనుడైయ స్వీకారమే రక్షకమ్" (ఇతడు (జీవుడు) ఆశ్రయించే ఆశ్రయణం అహంకారగర్భం. అతని (పరమాత్మయొక్క) స్వీకారమే రక్షకం) అని (శ్రీపిళ్ళైలోకాచార్యులవారు) అన్నారుకదా !

(తే కరసరోరుహం శిరసి ధేహి నః) దేవరీరుడైయ కరమాకిఱ సరోరుహత్తై ఎజ్గళుడైయ శిరోదేశజ్గళిలే అవతంసకుసుమమాప్పుడి వైప్పాయ్. అతువిఱే ప్రపన్నరానవర్గళుక్కు శిరోభూషణమ్. ఆకైయాలే ప్రార్థిక్కిఱార్గళ్. “అణిమికు తామరైక్కైయై యన్దో! అడిచ్చియోమ్దలైమిశై నీ యణియాయ్” (తిరువాయ్- 10-3-5) ఎన్ఱు ఆళ్వార్ ప్రార్థిత్తపడియే ఇవరుమ్ ప్రార్థిక్కిఱార్గళ్.

(తే కరసరోరుహం కాంత కామదం శిరసి ధేహి నః) మున్బు దేవరీరుడైయ శ్రీనృసింహావతారత్తిలే, శరణాగతనాన శ్రీప్రహ్లాదాళ్వానుడైయ శిరస్సిలే ఎత్తనై ప్రేమత్తోడే ఉన్ కరారవిన్దత్తై వైత్తాయో, అమ్మాత్రమాన ప్రేమత్తోడే, దేవరీర్విషయత్తిలే శరణాగతరాన ఎజ్గళుడైయ ఉత్తమాజ్గజ్గళిలే ఎజ్గళుడైయ భయనివర్తకమాగ ఉన్ కరారవిందత్తై వైక్కవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్గళెన్ఱవుమామ్. “స్వపాదమూలే పతితం త మర్భకం విలోక్య దేవః కృపయా పరిప్లుతః, ఉత్థాప్య తచ్ఛీర్ష్ణ్యదధాత్కరాంబుజం కాలా హి విత్రస్తధియాం కృతాభయమ్” (భాగవతమ్) ఎన్నానిన్ఱదిఱే.

(తే కరసరోరుహం కాంత కామదం శిరసి ధేహి నః) ఉన్ తిరువడియై ఆశ్రయిత్త సర్వజనజ్గళుక్కుమ్ “అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ” (రామా-యుద్ధ-18-32) ఎన్ఱు అభయత్తై త్తరుగిఱ కై, తన్నైయే ఉపాయమాగ ప్పత్తిన ఎజ్గళుక్కు అభయత్తై త్తారాదో? - ఎన్గిఱార్గళెన్ఱవుమామ్.

(కరసరోరుహం శిరసి ధేహి నః) స్త్రీజనజ్గళుక్కు శిరోభూషణమాన పుష్పత్తై క్కొణ్డు ఒళిత్తునిన్ఱాయే! అప్పుష్పత్తై కొణ్డువన్దు దేవరీరుడైయ ప్రియస్త్రీజనజ్గళుమాన ఎజ్గళుక్కు శిరోభూషణమాగ అలఙ్కరిత్తు కణ్డు ఉకక్కైయిఱే వల్లభనాన ఉనక్కు స్వరూపమ్ అత్తై ప్పణ్ణి అరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్గళెన్ఱవుమామ్.

---

(తే కరసరోరుహం శిరసి ధేహి నః)- తమ హస్తం అనే పద్మాన్ని మా శిరఃప్రదేశాలలో శిరోభూషణ కుసుమంగా పెట్టు. అదికదా ప్రపన్నులైనవారికి శిరోభూషణం. అందుచేత (గోపికలు) ప్రార్థిస్తున్నారు. “అణిమికు తామరైక్కైయై యన్దో ! అడిచ్చియోమ్ తలైమిశై నీ యణియాయ్” (చాలా అందమైన నీ తామరపూవు వంటి నీ చేతిని ఆహా ! మా తలలపై నీవు పెట్టి అలంకరించు) అని ఆళ్వార్లు ప్రార్థించినట్లు వీరుకూడా ప్రార్థిస్తున్నారు.

(తే కరసరోరుహం కాంతకామదం శిరసి ధేహి నః) - పూర్వం నీ నృసింహావతారంలో శరణాగతుడైన శ్రీప్రహ్లాదాళ్వాన్ శిరస్సులో ఎంత ప్రేమతో నీ కరారవిందాన్ని పెట్టావో, అంతటి ప్రేమతో తమ విషయంలో శరణాగతి చేసిన మా శిరస్సులలో మా భయం తీరేటట్లు నీ కరారవిందాన్ని పెట్టాలి- అని ప్రార్థిస్తున్నారు - అని కూడా భావం. “స్వపాదమూలే పతితం త మర్భకం విలోక్య దేవః కృపయా పరిప్లుతః, ఉత్థాప్య తచ్ఛీర్ష్ణ్యదధాత్ కరాంబుజం కాలా హి విత్రస్తధియాం కృతాభయమ్” (తన పాదమూలంలో పడిన ఆ బాలకుని చూచి భగవానుడు దయతో నిండినవాడై అతనిని లేవనెత్తి, అతని తలపై తన కరపద్మాన్ని పెట్టాడు) అని చెప్పబడుతున్నదికదా!

(తే కరసరోరుహం కాంత కామదం శిరసి ధేహి నః) - నీ శ్రీపాదాలను ఆశ్రయించిన అందరికీ “అభయం సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ” (అన్ని ప్రాణులకు అభయాన్ని ఇస్తాను. ఇది నా వ్రతం) అని అభయాన్ని ఇచ్చే హస్తం తననే ఉపాయంగా ఆశ్రయించిన మాకు అభయాన్ని ఇవ్వదా? అని అంటున్నారనికూడా భావం.

(కరసరోరుహం శిరసి ధేహి నః) స్త్రీలకు శిరోభూషణం అయిన పుష్పాన్ని (నీ శ్రీచరణాన్ని) తీసికొని దాగి ఉన్నావే! ఆ పూవును తీసికొనివచ్చి నీకు ప్రియస్త్రీజనం అయిన మాకు శిరోభూషణంగా అలంకరించి చూచి, సంతోషించడమేకదా ప్రియుడవైన నీకు స్వరూపం. దానిని చేయాలి- అని ప్రార్థిస్తున్నారనికూడా భావం.

(శిరసి ధేహి నః శ్రీకరగ్రహమ్) ఇత్తై ఉన్నుడైయ స్వమ్మెన్ను నినైత్తాయో? ఎజ్గళుక్కు స్వామినియానవళ్ తిరుహస్తత్తిలే ఎప్పోదు మలఙ్కారమాగ గ్రహిత్తు నిఱ్కుమ్ వస్తువితే. ఎజ్గళుక్కు స్వామినియానవళుడైయ వస్తు ఎజ్గళాల్ అనుభవియాదొ*ழி*వదే ! ఎన్ను విషణ్ణరాగిఱార్‌గళెన్లవుమామ్. ఎజ్గళుక్కు స్వామినియాయ్, ప్రాప్యభూతైయాన పెరియపిరాట్టియార్ కైయిలే ఎప్పోదు మలఙ్కారమాగ గ్రహిత్తు తనక్కు శేషమాక్కి వైత్త ఉన్నుడైయ సర్వమఙ్గళనిలయమాన కరారవిందత్తై, ఎజ్గళుడైయ శిరోదేశఙ్గళిలే వైత్తలఙ్కరిత్తరుళవేణు మెన్ను ప్రార్థిక్కిఱార్‌గళెన్లవు మామ్. శేషిగళాల్ అనుభవిక్కపట్ట వస్తువైక్కొణ్డితే శేషభూతర్ అలఙ్కరిప్పదు. అత్తాలే ప్రార్థిక్కిఱార్‌గళ్. "తొడుత్త తు*ழாయ్*మలర్ శూడు మిత్తొణ్డర్‌గళోమ్" (తిరుప్పల్లాణ్డు- 9) ఎన్నానిన్నదితే.

అఞ్జామ్ శ్లోకమ్ ము*ற்றிற்று*

## ఆఱామ్ శ్లోకమ్

అవ:- కీ*ழே*, ద్వయత్తిల్ పూర్వవాక్యత్తాలే శొల్లప్పడుగిఱ ఉపాయభూతమాన సర్వేశ్వరనుడైయ అభయప్రదానత్తై ప్రార్థిత్తార్. ఇవరుడైయ ప్రార్థనత్తిన్‌పడియే, అవన్ సర్వశక్తియాగైయాలే, తన్నై ఇవర్‌గళ్ కాణాదపడి తానిరున్ద విడత్తిలే ఇరున్దు తన్ తిరుక్కైయై నీట్టి ఇవర్‌కళుడైయ ఉత్తమాఙ్గత్తిలే వైత్తాల్ శెయ్‌వదెన్ ? ఇరున్ద విడత్తిలే ఇరున్దు "లోకవిక్రాన్తచరణౌ" (శరణాగతిగద్య), "విలాసవిక్రాన్త పరావరాలయమ్" (స్తోత్రరత్నమ్-30), "ఓఙ్గి యులగళన్ద" (తిరుప్పావై-3) ఎన్గిఱపడియే "కమలమన్న కుఱైకళ*ழ*ల్‌గళై" (తిరువాయ్-4-3-6) నీట్టి పారెల్లా మళన్దవన్ తానిరున్ద విడత్తిలే యిరున్దు తిరుక్కైయై నీట్టి ఇవరుడైయ శిరోప్రదేశఙ్గళిలే వైక్కవల్లనల్లైయో? ఎన్ను పార్‌త్తు "ఇడఙ్గొళ్ మూవులగుమ్ తొ*ழ* విరున్దరుళాయ్" (తిరువాయ్-4-3-7) ఎన్నుమ్, "కనివాయ్ శివప్ప నీ కాణవారాయే"

---

(శిరసి ధేహి నః శ్రీకరగ్రహమ్)- దీని నీ సొంతం అని అనుకుంటున్నావా! మాకు స్వామిని అయిన లక్ష్మీదేవి తన శ్రీహస్తంలో ఎల్లప్పుడూ అలంకారంగా గ్రహించి ఉండే వస్తువుకదా. మాకు స్వామిని అయిన లక్ష్మియొక్క వస్తువు మాచేత అనుభవింపబడకుండా ఉన్నదే! -అని విషణ్ణులు అవుతున్నారనికూడా భావం. మాకు స్వామినియై, ప్రాప్యభూత అయిన లక్ష్మీదేవి (తన) చేతిలో ఎల్లప్పుడూ ఆభరణంగా గ్రహించి, తనకు శేషంగా చేసికొన్న, నీయొక్క సర్వమంగళాలు స్థానం అయిన కరారవిందాన్ని, మా శిరస్సులలో పెట్టి అలంకరించాలి- అని ప్రార్థిస్తున్నారనికూడా భావం. శేషిచేత అనుభవింపబడ్డ వస్తువుతోకదా శేషభూతులు (తమను) అలంకరించుకొంటారు. అందువల్ల ప్రార్థిస్తున్నారు- "తొడుత్త తు*ழாయ్* మలర్ శూడు మిత్తొణ్డర్‌కళోమ్" (నీవు ధరించిన తులసీమాలను, పూలను అలంకరించుకొన్న ఈ దాసులము) అని చెప్పబడుతున్నదికదా!

అయిదవ శ్లోకం ముగిసింది

## ఆఱవ శ్లోకం

అవ :- పూర్వం, ద్వయంలోని పూర్వవాక్యంలో చెప్పబడే ఉపాయభూతుడైన సర్వేశ్వరునివల్ల అభయ ప్రదానాన్ని ప్రార్థించారు. వీరి ప్రార్థనానుసారంగా అతడు సర్వశక్తి కావడంవల్ల తనను వీరు చూడకుండా ఉండేటట్లు తానున్న చోటే ఉండి తన శ్రీహస్తాన్ని చాచి వీరి శిరస్సులో పెడితే ఏం చేయాలి? ఉన్న చోటే ఉండి "లోకవిక్రాంత చరణౌ", (లోకాలలో విక్రమించిన రెండు చరణాలు) "విలాసవిక్రాంతపరావరాలయమ్", (అనాయాసంగా భూలోక - ఊర్ధ్వలోకాలను విక్రమించినవానిని) "ఓఙ్గి ఉలకళన్ద" (వృద్ధిచెంది లోకాన్ని కొలిచిన) అని చెప్పే రీతిలో "కమల మన్న కుఱైకళ*ழ*ల్" (కమలం అనదగిన శబ్దించే పాదాల)ను చాచి భూమిని అంతటినీ కొలిచినవాడు, తానున్న

**(తిరువాయ్- 8-5-1)** ఎన్గుమ్, "ఇమ్మడ వులగర్ కాణ నీ యొరునాళిరున్దిడాయ్ ఎజ్గళ్ కణ్ముకప్పే" **(తిరువాయ్ 9-2-7)** ఎన్గుమ్ శొల్లుగిఱపడియే స్వామియుడైయ దివ్యమంగళవిగ్రహసేవైయే తమక్కు ప్రయోజనమాగ నినైత్తిరున్దవర్గళా గైయాలే "దేవరీర్ శ్రీవామనావతారత్తిన్ పడియే యిరున్ద విడత్తే యిరున్దు కైయై నీట్ట అఙ్గీకరిప్పోమల్లోమ్కాణ్. "ఉన్ కోయిల్ నిన్ఱిజ్గనే పోన్దరుళి" (తిరుప్పావై-22) ఎజ్గళ్ కణ్ణిణై కుళిరుమ్పడి ఎజ్గళ్ మున్బే నిన్ఱు, ఉన్నుడైయ నిరవధికసౌన్దర్యయుక్తమాయ్, "ఐశ్వర్యం చ శుభాశ్రయత్వ మఖిలోపాస్యత్వ మానందితా స్వాతంత్ర్యం నిజవైశ్వరూప్య మఖిలాంతర్యామితా శ్రీ రపి" ఎన్గిఱపడియే ఐశ్వర్యాదిగళుక్కు ప్రకాశకమాయ్, దయారసత్తై ప్రవిప్పిక్కిఱ ఉన్ తిరుముఖమండలశోభైయై ఆశ్రితర్గళాన ఎజ్గళుక్కు ముఱ్ఱూట్టాక అనుభవిప్పిత్తరుళ వేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్గళ్- ఇన్ద శ్లోకత్తాలే. "వశి శెయ్ ఉన్ తామరైక్కణ్ణుమ్ వాయుమ్ కైగళుమ్ పీతకవుడైయుమ్ కాట్టి, ఒశి శెయ్ నుణ్ణిడై యిళవాయ్చ్చియర్ నీ యుగక్కు నల్లవరొడు ముఴితరాయే" **(తిరువాయ్- 10-3-8)** ఎన్ఱు ఆఴ్వార్ అర్థిత్తపడియే ఇవరుమ్ ఇన్ద శ్లోకత్తాలే, ఉన్నుడైయ నిఖిలహేయప్రత్యనీక కల్యాణగుణైకతానమాన దివ్యమంగళవిగ్రహత్తై సేవిక్కప్పణ్ణి ఒరు నీరాగ కలన్దు పరిమాఱవేణు మెన్ఱు మాశైప్పడుగిఱార్గళ్ ఎన్ఱవుమామ్.

> వ్రజజనార్తిహన్ ! వీరయోషితాం నిజజనస్మయధ్వంసనస్మిత ।
> భజ సఖే ! భవత్కింకరీ స్మ నో జలరుహాననం చారు దర్శయ ॥

---

చోటే ఉండి శ్రీహస్తాన్ని చాచి వీరి శిరస్సులలో పెట్టగలవాడుకదా! -అని తలచి "ఇడజ్కొళ్ మూవులకుమ్ తొழு ఇరున్దరుళాయ్" (విశాలమైన ముల్లోకాలు కొలిచేటట్లు వేంచేసి ఉండు) అని, "కనివాయ్ శివప్ప నీ కాణ వారాయే" (ఎఱ్ఱని దొండపండువంటి అధరం అరుణిమను పొందేటట్లు దర్శించే రీతిలో నీవు కన్పించు) అని, "ఇమ్మడవులకర్కళ్ కాణ నీ యొరునాళ్ ఇరున్దిడాయ్ ఎజ్గళ్ కణ్ముకప్పే" (ఈ మూఢలోకంలోని వారు దర్శించేటట్లుగా ఒకనాడు నీవు మాకళ్ళముందు వేంచేయాలి) అని చెప్పే రీతిలో స్వామియొక్క దివ్యమంగళవిగ్రహ సేవే తమకు ప్రయోజనంగా తలచి ఉన్నవారు కాబట్టి, "నీవు వామనమూర్తి పద్ధతిలో ఉన్న చోటనే ఉండి (నీవు నీ) చేతిని చాస్తే అంగీకరించంసుమా! "ఉన్ కోయిల్ నిన్ఱు ఇజ్గనే పోన్దరుళి" (నీ కోవెలనుండి ఈ విధంగా వేంచేసి) మా నేత్రద్వయం చల్లబడేటట్లు మా ముందు నిలచి, నీ యొక్క, నిరవధికసౌందర్యాన్ని కల్గినదై, "ఐశ్వర్యం చ శుభాశ్రయత్వ మఖిలోపాస్యత్వ మానందితా, స్వాతంత్ర్యం నిజవైశ్వరూప్య మఖిలాంతర్యామితా శ్రీ రపి" (ఐశ్వర్యం, శుభాశ్రయత్వం, అన్నిలోకాలచే కొలువబడడం, ఆనందాన్ని పొంది ఉండడం, స్వాతంత్ర్యం, తన వైశ్వరూప్యం, అన్నిటికి అంతర్యామిగా ఉండడం, సంపద) అని చెప్పే తీరులో, ఐశ్వర్యాదులకు ప్రకాశకమై, దయారసాన్ని ప్రవింపజేసే నీ తిరుముఖమండల శోభను ఆశ్రితులైన మాకు పూర్ణభోజనంగా అనుభవింపజేయాలని ఈ శ్లోకంలో ప్రార్థిస్తున్నారు. "వశి శెయ్ ఉన్ తామరైక్కణ్ణుమ్ వాయుమ్ కైకళుమ్ పీతక వుడైయుమ్ కాట్టి, ఒళి శెయ్ నుణ్ణిడై ఇళవాయ్ చ్చియర్ నీ యుకక్కు నల్లవరొడుముழితరాయే" (వశీకరించే పద్మాలవంటి నీ నేత్రాలను, అధరాన్ని, శ్రీహస్తాలను, పీతాంబరాన్ని చూపించి, శైథిల్యాన్ని పొందినవారై, సూక్ష్మమైన నడుమును కల, యౌవనాన్ని కల్గిన గోపికలైన, నీవు ఆశపడే విలక్షణులైన స్త్రీలతో విహరించు) అని ఆழ్వార్లు ప్రార్థించినట్లే వీరుకూడా ఈ శ్లోకంలో "నీ నిఖిలహేయప్రత్యనీక కల్యాణగుణైకతానమైన దివ్యమంగళవిగ్రహాన్ని సేవింపజేసి, మాతో ఒకటిగా కలసి, వ్యవహరించాలి"అని ఆశపడుతున్నారనికూడా భావం.

వ్రజజనార్తిహన్ ! వీరయోషితాం నిజజనస్మయధ్వంసనస్మిత ! ।
భజ సఖే ! భవత్కింకరీస్మ నో జలరుహాననం చారు దర్శయ ॥

(వ్రజజనార్తిహన్) వ్రజజనఙ్గళుడైయ ఆర్తియై నశిప్పిక్కుమవనే ! వ్రజజనఙ్గళుడైయ దుఃఖత్తై ప్పోక్కి రక్షిప్పతఱ్కు వన్దవతరిత్తుమ్, అత్తై శెయ్యాదే మేన్ మేలుమ్ ప్రళయసముద్రత్తై ప్పోన్ఱ ఆర్తియై విళక్కి బాధిక్కిఱ దేవరీరుక్కు యా మెన్ శొల్లక్కడవోమ్ ? "వ్యక్తం భవాన్ వ్రజజనార్తిహరోఽభిజాతః" (భాగవతమ్-10-29-41) ఎన్ఱారిఱే ఇతుక్కు మున్బుమ్.

(వ్రజజనార్తిహన్) అన్ఱిక్కే, వ్రజజనార్తిహర నెన్గిఱ తిరునామత్తై ధరిత్తుమ్, దుఃఖసముద్రత్తిలే అలై ఎఱిగిఱ ఎఙ్గళై ఉపేక్షిక్కిఱదు, ఎఙ్గళుక్కిదు దుఃఖమాగా దెన్ఱు నినైవాలేయో ? "ఇణై ములై నముగ నుణ్ణిడై నుడఙ్గ తునియిరుమ్ కలవి శెయ్‌దాగమ్ తోయ్‌న్దు, తుఱన్దెమ్మై యిట్టగల్ కణ్ణన్ కళ్వన్ తనియిళమ్ శిఙ్గ మెమ్మాయన్ వారాన్ తామరైక్కణ్ణుమ్ శెవ్వాయుమ్ నీల ప్పునియిరుమ్ కుఴల్‌గళుమ్ నాన్గు తోళుమ్ పావియేన్ మనత్తే నిన్ఱీరుమాలో !" (తిరువాయ్-9-9-3) ఎన్గిఱపడియే దేవరీర్ కలన్దు విశ్లేషిత్త అన్ఱు తొడఙ్గి, మదియై క్కెట్టు, ఉన్ దివ్యమంగళవిగ్రహ శోభైయై ధ్యానిత్తుక్కొణ్డు, అత్తై సేవిక్కవేణు మెన్ఱు మభినివేశత్తాలే "కణ్ణుమ్ వాయుమ్ తువర్‌న్దు" (తిరువాయ్-8-5-2) ఎన్ఱుమ్, "వాశత్తడమ్బోల్ వరువానే యొరు నాళ్ కాణవారాయే" (తిరువాయ్- 8-5-1) ఎన్ఱుమ్, "కడిశేర్‌కణ్ణిప్పెరుమానే ! యెన్ఱెన్ఱేఙ్గి యఴుదక్కాల్, పడి శేర్ మకరక్కుఴైగళుమ్ పవళవాయుమ్ నాఱ్ఱోళుమ్ తుడిశేరిడైయు మమైన్దదోర్ తూనీర్ ముగిల్‌పోల్ తోన్ఱాయే" (తిరువాయ్- 8-5-3) ఎన్ఱుమ్, "ఉన్ కఴల్ కాణ వొరు నాళ్ వన్దు తోన్ఱాయే" (తిరువాయ్-8-5-6) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే దేవరీరై కూవిక్కూవి సేవిక్కైక్కుమ్ విరగిల్లామైయాలే పడుగిఱ అలమాప్పెల్లామ్ దేవరీర్ కణ్డదిల్లైయో? ఇవ్వలమాప్పు ఎఙ్గళాల్ వరుగిఱ దన్ఱు. ఉన్ వడివిన్ వైలక్షణ్యత్తాలే వరుగిఱదుకాణ్. "కట్కిలీ !" (తిరువాయ్-7-2-3) ఎన్ఱుమ్, "న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్"- "న మాంసచక్షుభి

---

(వ్రజజనార్తిహన్)- రేపల్లెలోని జనాల ఆర్తిని నశింపజేసేవాడా! రేపల్లె జనాల దుఃఖాన్ని పోగొట్టి రక్షించడానికి వచ్చి, ఆ పనిని చేయకుండా, ఇంకా ఇంకా ప్రళయసముద్రంవంటి ఆర్తిని వృద్ధి చేసి, బాధించే నీకు మేమేమి చెప్పగలం ? "వ్యక్తం భవాన్ వ్రజజనార్తిహరోఽభిజాతః" అని అన్నారుకదా ఇంతకుముందుకూడా!

(వ్రజజనార్తిహన్) లేక, వ్రజజనార్తిహరుడనే తిరునామాన్ని ధరించికూడా దుఃఖసముద్రంలో మునిగి ఉండే (వ్యాపించి ఉండే) మమ్ములను ఉపేక్షించడం, మాకు ఇది దుఃఖం కాదనే అభిప్రాయంతోనా? "ఇణై ములై నముగ నుణ్ణిడై నుడఙ్గ తుని యిరుమ్ కలవిశెయ్‌దాగమ్ తోయ్‌న్దు తుఱన్దెమ్మై యిట్టగల్ కణ్ణన్ కళ్వన్ తనియిళమ్ శిఙ్గ మెమ్మాయన్ వారాన్ తామరైక్కణ్ణుమ్ శెవ్వాయుమ్, నీలప్పునియిరుమ్ కుఴల్‌కళుమ్ నాన్గు తోళుమ్ పావియేన్ మనత్తే నిన్ఱీరుమాలో" (స్తనద్వయం కాఠిన్యాన్ని పోగొట్టుకొని మృదువుగా కాగా, సూక్ష్మమైన నడుము వణకగా, విశ్లేషదుఃఖాన్ని కల్గించే, అనేక విధాలైన సంశ్లేషాలన్ని కలుగజేసి, శరీరంలో ఏకీభవించి ఉండి, తరువాత విశ్లేషించి ఈవిధంగా మమ్ములను పడవేసి పోయిన శ్రీకృష్ణుడు, వంచకుడు, సాటిలేని మంచి వయస్సులో ఉన్న సింహంవంటివాడు, నాపట్ల వ్యామోహాన్ని కల స్వామి రావడం లేదు. స్వామి తామరనేత్రాలు, ఎఱ్ఱని అధరం, నల్లని చల్లని పొడుగైన కేశాలు, నాల్గు భుజాలు పాపి అయిన నా మనస్సులో నిలచి ఉండి బ్రద్దలు చేస్తున్నవి. ఇక నా ప్రాణాలను కాపాడుకొనే దారి ఏది ?) అనే తీరులో నీవు కలసి విశ్లేషించిన నాటినుండి మతిని పోగొట్టుకొని, నీ దివ్యమంగళవిగ్రహ శోభను ధ్యానిస్తూ, దానిని సేవించాలనే అభినివేశంతో "కణ్ణుమ్ వాయుమ్ తువర్‌న్దు", (నేత్రాలు, నోరు ఎండిపోయి) "వాశత్తడమ్బోల్ వరువానే యొరునాళ్ కాణవారాయే" (పరిమళించే తటాకంవలె వచ్చేవాడా! ఒకనాడు దర్శించేటట్లు రావయ్యా!) అని, "కడిశేర్ కణ్ణిప్పెరుమానే! ఎన్ఱెన్ఱేఙ్గి యఴుదక్కాల్ పడిశేర్ మకరక్కుఴై కళుమ్ పవళవాయుమ్ నాఱ్ఱోళుమ్, తుడిశేరిడైయు మమైన్దదోర్ తూనీర్ ముకిల్‌పోల్ తోన్ఱాయే"

రభివీక్షతే తమ్" (తైత్తి-నారా-1-3) ఎన్టుమ్, "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" (తైత్తి -ఆనంద) ఎన్టుమ్ శొల్లుగిఆపడియే అవాజ్మానసగోచరవైభవయుక్తనాయ్, పరమపదనిలయనానవన్ తోన్టిప్పూ ముదలాన పుష్పఙ్గళై ధరిత్తు, తాழ்న్ద కుழలోడుమ్, తిరువధరిత్తిలే విళఙ్గుగిన్ఱ కుழలోశైయోడుమ్ వరుగిఱ అన్ద సౌలభ్యత్తుక్కు ఎల్లై నిలమాన వేషత్తినుడైయ అழగు కణ్డు, "అనుగతా దృష్టిః" (రామా- అయో- 42-34) ఎన్గిఆపడియే అన్ద సౌందర్యత్తిలే మయఙ్గి నిన్ఱ కణ్ణాగైయాలే, ఇప్పడియాన విశ్లేషత్తిలే ఆరియిరుక్కప్పోమో? "వలఙ్గాదిల్‌మేల్ తోన్టి పూ్వ వణిన్దు మల్లికై వనమాలై మౌదల్‌మాలై, శిలఙ్గారత్తాల్ కుழల్ తాழవిట్టు తీఙ్గుழల్ వాయ్ మడుత్తూది యూది అలఙ్గారత్తాల్ వరు మాయప్పిళ్లై యழకు కణ్డెన్మగళాశైప్పట్టు విలఙ్గినిల్లాదెదిర్ నిన్టు కణ్డీర్ వెళ్వాళై కழన్దు మెయ్ మెలిగిన్ఱదే" (పెరియాழ్వార్- 3-4-9) ఎన్టార్‌గళితే. "అహం పున ర్దేవకుమారరూప మలంకృతం తం సుత మావ్రజన్తమ్, నన్దామి పశ్య న్నపి దర్శనేన భవామి దృష్ట్వా చ పున ర్యువేవ" (రామా-అయో-12-106) ఎన్గిఆపడియే అన్ద దివ్యసౌందర్యత్తై సేవిత్తు మయఙ్గి నిన్ఱ చక్రవర్తి, విశ్లేషమ్ వన్దవాతే, అస్సౌందర్యత్తైయే ధ్యానిత్తుక్కొణ్డు, అవనుడైయ సేవైక్కు విరోధియాన ఇన్ద జగత్తై పార్క్క అసహ్యమాయ్, ప్రాణఙ్గళై విట్టు ముడిన్దానితే. శ్రీచక్రవర్తియైప్పోలే పణ్ణాదే, దేవరీరై యా మివ్విభూతియిలే ఇరున్దు మఙ్గళాశాసనమ్ పణ్ణిక్కొణ్డు సేవిక్కుమ్బడి పణ్ణియరుళవేణు మెన్టు ప్రార్థిక్కిఱార్‌గళ్.

---

(సుగంధాన్ని కల్గినదై, మిక్కిలి కాంతిని కల్గినదైన తులసీమాలను ధరించిన సర్వేశ్వరా! అని పలుమార్లు పల్కి ఏడిస్తే, తిరుమేనికి తగినట్లున్న మకరకుండలాలు, పగడంవంటి పెదవి, నాల్గు భుజాలు, సూక్ష్మమైన నడుము, వీటితో చేరి ఉన్న నిర్మలమైన జలంతో నిండిన మేఘంవలె వచ్చి దర్శనమివ్వాలి.) అని, "ఉన్ కుழల్ కాణ వౌరునాళ్ వన్దు తోన్టాయే" (నీ కేశాలను దర్శించేటట్లు ఒకనాడు వచ్చి సాక్షాత్కరించాలి) అని చెప్పే రీతిలో తమను పిలచి పిలచి సేవించే ఉపాయం లేకపోవడంచేత పడే బాధ అంతా తాము చూడలేదా? ఈ బాధ మావల్ల వచ్చినది కాదు. నీ రూపవైలక్షణ్యంవల్ల వచ్చినది సుమా! "కట్కిలీ" (మాంసచక్షువులకు గోచరం కానివాడా!) అని, "న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్", (మాంసచక్షువుతో ఎవడూ ఇతనిని చూడడం లేదు) "న మాంసచక్షుభి రభివీక్షతే తమ్" (భౌతికనేత్రాలతో ఇతనిని చూడడంలేదు) అని, "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (ఎవని ఆనందగుణాన్ని పరిచ్ఛేదించి పలుకలేక వేదాలు వెనుదిరుగుతున్నాయో) అని చెప్పే రీతిలో వాక్కుకు, మనస్సుకు అందని వైభవాన్ని కలవాడై, పరమపదనిలయుడైనవాడు, "తోన్టిప్పూ" మొదలైన పుష్పాలను ధరించి, కిందకు వేలాడే కురులతో, పెదవిలో వెలిగే వేణునాదంతో వచ్చే ఆ సౌలభ్యానికి పర్యంత సీమ అయిన వేషంయొక్క అందాన్ని చూచి, "అనుగతా దృష్టిః" (నా చూపు రాముని అనుసరించింది) అనే రీతిలో ఆ సౌందర్యంలో వ్యామోహం చెందిన కన్నులు కావడంవల్ల, ఈ విధం అయిన విశ్లేషంలో సహించి ఉండేవారమేనా! "వలఙ్కాదిల్‌మేల్ తోన్టి పూ్వ వణిన్దు మల్లికై వనమాలై మౌదల్‌మాలై, శిలఙ్కారత్తాల్ కుழల్ తాழవిట్ట తీఙ్కుழల్ వాయ్ మడుత్తూది యూది, అలఙ్కారత్తాల్ వరు మాయప్పిళ్ళై యழకు కణ్డెన్ మకళాశైప్పట్టు, విలఙ్గి నిల్లాదెదిర్ నిన్టు కణ్డీర్ వెళ్వళై కழన్టు మెయ్ మెలిగిన్ఱదే" (కుడిచెవిలో శెఙ్గాన్దళ్‌పూవును అలంకారంగా ముడుచుకొని, అందమైన మల్లెలతో చేసిన మాలను, అడవిమల్లెలతో కూర్చిన మాలను అలంకరించుకొని, ఈ అలంకారంతో కేశాలు నడుము వరకు వేలాడగా అందరికి మాధుర్యాన్ని ప్రసాదించే వేణువును పెదవిలో పెట్టుకొని పలుమార్లు ఊది - ఇటువంటి అలంకారాలతో వచ్చే గోపాలత్వాన్ని కల్గినవాడు, దర్శించినవారి చిత్తాన్ని దోచేవాడు అయిన స్వామి అందాన్ని చూచి నా కుమార్తె ఆశపడి "ఇతడు చూచినవారిని క్లేశపరుస్తాడు'' అని చూపును మరల్చుకొని తొలగి ఉండకుండా, అతని అందాన్నే చూస్తూ అతనికి ఎదురుగా నిలచి ఉండి కృశించి చేతిగాజులను చేజార్చుకొని, శరీరాన్ని కృశింపజేసికొంటున్నది చూడండి.) అని అన్నారుకదా! "అహం పున ర్దేవకుమారరూప మలంకృతం తం సుత

**(వీర)** పరాభిభవనసామర్థ్యత్తైయుడైయవనే! **"అభియాతా ప్రహర్తా చ" (రామా- అయో- 1-29)** ఎన్గిఱతే అవన్ వీరమ్.

**(వీర)** దేవరీరుడైయ వీరత్వమ్ దాసవిరోధిగళై నశిప్పిత్తు దాసర్గళై రక్షిప్పతఱ్కు అల్లైయో ? దాసభూతరాన ఎఙ్గళై ఆర్తియాలే కుమిఱ్ఱి నీరుణ్డు నశిక్కుమ్బడి పణ్ణుగైయాలే దేవరీరుడైయ వీరత్వమ్ భక్తరై యఴిక్కైక్కే యుఱుప్పామ్బడి తోన్ఱుగిఱదితే. ఆగ, దేవరీరుడైయ వీరత్వమ్ **"భక్తానామ్" (జితంతే)** ఎన్గిఱపడియే సార్థకమామ్బడి పణ్ణి అరుళవేణు మెన్గిఱార్ ఎన్నవుమామ్ అన్ఱిక్కే, ఎఙ్గళై నలియ త్తేడుగిఱ పూతనాది దుష్టరాక్షసరెల్లారైయు మున్నుడైయ వీరత్వమ్ ప్రకాశిక్కుమ్బడి అనాయాసేన వధిత్తు, ఎఙ్గళై ఆనన్దత్తిలే మయఙ్గప్పణ్ణిన దేవరీర్ పిన్బు దాసర్గళాన ఎఙ్గళై ఉన్ విశ్లేషవ్యసనత్తాలే వధిక్కప్పార్క్కిఱాయే! ఉన్నై సేవియాతపడి తడైత్త కామక్రోధాదిగళై నశిప్పిత్తు, ఉన్నై యామ్ సేవిక్కుమ్బడి ఉపకరిత్త దేవరీర్ ఇన్ఱు విశ్లేషిత్తు వ్యసనసముద్రత్తిలే తళ్ళుగై అన్ద వీరత్వత్తుక్కు స్వరూపమాగాదుగాణ్! -ఎన్గిఱార్గళెన్ఱవుమామ్.

**(యోషితామ్)** ఎప్పోదు మున్నుడైయ సంశ్లేషత్తిలే ధరిత్తుమ్, విశ్లేషత్తిలే ప్రాణఙ్గళై ధరియాత అత్యంతమృదు స్వభావముడైయ స్త్రీగళుమాన ఎఙ్గళై శోకిప్పిక్కైయో ఉన్నుడైయ వీరత్తుక్కు ప్రకాశకమ్? అనన్యప్రయోజనఙ్గళుమాయ్, అనన్యార్హరుమాయ్, దేవరీరుడైయ **"పొఱ్ఱామరైయడియై పోఱ్ఱు"** గైయే ప్రయోజనమాన ఎఙ్గళై, ఇప్పడి

---

మాప్రజంతమ్, నందామి పశ్య న్నపి దర్శనేన భవామి దృష్ట్వా చ పున ర్యువేవ" (దేవకుమారునివంటి రూపాన్ని కలవాడు, అలంకరింపబడ్డవాడు, దగ్గరకు వచ్చేవాడు అయిన నా కుమారుడైన శ్రీరాముని మనస్సు అనే నేత్రంతో చూచినపుడే ఆనందిస్తున్నాను. నేరుగా చూస్తే తిరిగి యువకుడను కాగలను.) అనే రీతిలో ఆ దివ్యసౌందర్యాన్ని సేవించి మోహించిన దశరథచక్రవర్తి, విశ్లేషం కలుగగానే ఆ సౌందర్యాన్ని ధ్యానిస్తూ, అతని సేవకు విరోధియైన ఈ జగత్తును చూడడం అసహ్యం కాగా, ప్రాణాలను విడచి మరణించాడుకదా. శ్రీచక్రవర్తివలె (ప్రాణత్యాగం) చేయకుండా మిమ్ములను మేము ఈ విభూతిలో ఉండి మంగళాశాసనాన్ని చేస్తూ సేవించేటట్లు చేసి అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారు.

**(వీర)-** పరాభిభవనసామర్థ్యాన్ని, శత్రువులను జయించే సామర్థ్యాన్ని కలవాడా! **"అభియాతా ప్రహర్తా చ"** (శత్రువులవద్దకు ముందుగా తానే పెడతాడు, వారిని వధిస్తాడు) అనేరీతిలో కదా అతని వీరం. (ఉన్నది)

**(వీర)** నీ వీరత్వం దాసుల విరోధులను నశింపజేసి, దాసులను రక్షించడానికి కాదా! దాసభూతులమైన మమ్ములను ఆర్తితో మునిగి నీరు తాగి నశించేటట్లు చేయడంవల్ల నీ వీరత్వం భక్తులను నశింపజేయడానికే పనికివచ్చేటట్లు తోస్తున్నదికదా! అందువల్ల నీ వీరత్వం **"భక్తానామ్"** (భక్తులకోసం) అన్నట్లుగా సార్థకం అయేటట్లు చేసి అనుగ్రహించాలి- అని అంటున్నారనికూడా భావం. లేక, మమ్ములను బాధించాలని వెదకే పూతనాది దుష్టరాక్షసులను అందటినీ. నీవీరత్వం ప్రకాశించేటట్లు అనాయాసంగా వధించి, మమ్ములను ఆనందంలో మోహించేటట్లు చేసిన నీవు పిమ్మట దాసులమైన మమ్ములను నీ విశ్లేషవ్యసనంతో వధించాలని చూస్తున్నావే! నిన్ను సేవించేటట్లు ఉపకారం చేసిన నీవు ఇపుడు విశ్లేషించి, వ్యసనసముద్రంలో గెంటివేయడం ఆ వీరత్వానికి స్వరూపం కాదుసుమా ! అని అంటున్నారని కూడాభావం.

**(యోషితామ్)-** ఎప్పుడూ నీ సంశ్లేషంలో ప్రాణాలను ధరించి, విశ్లేషంలో ప్రాణాలను ధరించలేని అత్యంతమృదుస్వభావాన్ని కల స్త్రీలైన మమ్ములను శోకింపచేయడమా నీ వీరత్వానికి ప్రకాశకం! అనన్య ప్రయోజనలమై, అనన్యార్హలమై, తమ **"పొఱ్ఱామరైయడియై"** (బంగారం వలె స్పృహణీయమైన, తామర

విశ్లేషవ్యసనత్తిలే మూట్టి బాధిక్కిఱ ఇదు ఉన్నుడైయ వీరత్వత్తుక్కు అవద్యమ్ కాణ్. **"తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" (భగ- 9-22)** ఎన్గిఱ శ్రీసూక్తి పొయ్యామ్బడి పణ్ణుగిఱాయే ! అదు పురుషర్క్కొ*ఴి*య స్త్రీజనఙ్గళుక్కాగాదో?

**(యోషితామ్)** ఇరవుమ్ పగలుమ్ కణ్గళుక్కు తుయిలెన్టదు మిన్టిక్కే సకలేతరవిలక్షణమాన దేవరీరుడైయ దివ్యాయుధఙ్గళైయుమ్, నిత్యమంగళవిగ్రహత్తైయుమే ధ్యానిత్తుక్కొణ్డు ఉన్ విశ్లేషవ్యసనత్తాలే తళఱుగిఱ అనన్యార్హరుమాన ఎఙ్గళై ఉన్ తిరుముఖమండలత్తై సేవిత్తు ఆనన్దిక్కుమ్బడి పణ్ణలాగాదో? **"కఙ్గులుమ్ పగలుమ్ కణ్డుయిలఱియాళ్" (తిరువాయ్-7-2-1)** ఎన్గిఱపడియేయిఱే ఇవరుడైయ స్వభావమ్. పురుషరాయ్, అనన్యప్రయోజనపరాయిరుక్క వేణుమో!, ఉన్నై సేవిక్కైక్కు -ఎన్గిఱార్గళెన్టవుమామ్.

**(నిజజనస్మయధ్వంసనస్మిత)** ఆశ్రితర్కళుడైయ ప్రకృతివ్యామోహత్తై నశిక్కప్పణ్ణుమ్ స్మితత్తైయుడైయవనే! దాసీజనఙ్గళుమాన ఎఙ్గళుడైయ దుఃఖ మెల్లామ్ పోమ్బడి **"ఎన్ ము*ఱ్ఱ*త్తూడు పుగున్దు ముఱువల్ శెయ్దు నిన్టాయే" (పెరియ తిరు- 10-8-5)** ఎన్గిఱపడియే ఎఙ్గళ్ మున్టే తో*ఱ్ఱి* ముఱువల్ శెయ్యలాగాదో? ఇత్తాల్ - తఙ్గళుడైయ అజ్ఞానత్తై నీక్కి, జ్ఞానత్తై మేన్మేలు ముణ్డాక్కి, కరుణాప్రవంతియై ప్రవహిప్పిక్కిఱ స్మితయుతమాన ముఖారవిందత్తై సేవిక్క ఆశైప్పడుగిఱార్గళ్. తఙ్గళై అవనుక్కాక్కినదు స్మితమిఱే. తాముగన్దు అధరామృతత్తై యుణ్ణుమ్బోదు ప్రకాశిక్కుమదాన స్మితత్తై సేవిక్క ఆశైప్పడుగిఱార్గళ్.

---

వంటిపదాన్ని) కీర్తించడమే ప్రయోజనం అయిన మమ్ములను ఈ విధంగా విశ్లేషదుఃఖంలోకి తోసి బాధించడం నీ వీరత్వానికి దోషంసుమా! **"తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"** (నిత్యం నాపట్ల అనురాగాన్ని కలవారి యోగక్షేమాలను నేను నిర్వహిస్తాను) అనే శ్రీసూక్తి అబద్ధం అయేటట్లు చేస్తున్నావే! అది పురుషులకు తప్ప స్త్రీజనానికి కాదా!

**(యోషితామ్)-** రాత్రి, పగలు కంటికి నిద్ర అనేది లేకుండా మిగిలిన అన్నిటికంటే విలక్షణాలైన తమ దివ్యాయుధాలను, నిత్యమంగళవిగ్రహాన్ని మాత్రమే ధ్యానిస్తూ నీ విశ్లేషవ్యసనంతో తల్లడిల్లే అనన్యార్హులైన మమ్ములను నీ తిరుముఖమండలాన్ని సేవించి, ఆనందించేటట్లు చేయకూడదా! **"కఙ్గులుమ్ పకలుమ్ కణ్డుయిలఱియాళ్"** (రాత్రి, పగలు నిద్రించి ఎఱుగదు) అనే రీతిలో కదా వీరి స్వభావం. (ఉంటుంది) పురుషులై, అనన్యప్రయోజనపరులై ఉండాలా నిన్ను సేవించడానికి? అని అంటున్నారనికూడా భావం.

**(నిజజనస్మయధ్వంసనస్మిత!)-** ఆశ్రితుల ప్రకృతివ్యామోహాన్ని నశింపజేసే చిఱునవ్వును కలవాడా! దాసీజనమైన మా దుఃఖం అంతా పోయేటట్లు **"ఎన్ ము*ఱ్ఱ*త్తూడు పుకున్దు ముఱువల్ శెయ్దు నిన్టాయే"** (నా ముంగిట ప్రవేశించి చిఱునవ్వు నవ్వుతూ నిలిచావే) అనేటట్లు మా ముందుకు వచ్చి చిఱునవ్వు నవ్వరాదా! దీనిచేత- తమ అజ్ఞానాన్ని పోగొట్టిజ్ఞానాన్ని మరింతగా కల్గించి, కరుణాప్రవంతిని ప్రవహింప జేసే చిఱునవ్వును కల ముఖారవిందాన్ని సేవించాలని ఆశపడుతున్నారు. (అని తెలుస్తున్నది) తమను అతనికి వశం చేసినది చిఱునవ్వుకదా! తాము ఆశపడి అధరామృతాన్ని ఆస్వాదించేటపుడు ప్రకాశించే స్మితాన్ని సేవించాలని ఆశపడుతున్నారు.

**(భజ)** ఎజ్గళ్ గోష్ఠియిలే వన్దు పుకురవేణుమ్. అన్ద స్మితమ్ కాట్టిల్ ఎరిత్త నిలా ఆకామే, అన్ద స్మితత్తోడే ఎజ్గళ్ గోష్ఠియిలే వన్దు పుగున్దు అత్తై సేవిక్కైయే ప్రయోజనమాక నిఱ్కిఱ ఎజ్గళుక్కు అత్తై అనుభవిప్పిక్కవేణు మెన్గిఱార్గళ్. అవను మాశైప్పడుమ్ గోష్ఠియిఱే ఇదు. "గోపబృందైః బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్గీతకీర్తిః" **(భాగవతమ్-10-21-5)** ఎన్గుమ్, "తన్నేరాయిరమ్ పిళ్ళైకళోడు తళర్నడై యిట్టు వరువాన్" (పెరియాళ్వార్-**3-1-1**) ఎన్గుమ్, "కన్గుకళ్ మేయ్త్తు తన్ తోళరోడు కలన్దు" (పెరియాళ్వార్- **3-4-4**) ఎన్గుమ్, "పల్లాయర్ కుళా నడువే కోల చ్చెన్దామరైక్కణ్ మిళిర క్కుళలూది" (పెరియాళ్వార్ - **3-4-7**) ఎన్గుమ్ శొల్లానిన్గదిఱే. ఆగైయాలే, ఉనక్కు ధారకమాగ ఇగ్గోష్ఠియిలే వన్దాశ్రయిక్కవేణు మెన్దు ప్రార్థిక్కిఱార్గళెన్గవుమామ్. "జఙ్గమాని విమానాని హృదయాని మనీషిణామ్" ఎన్గుమ్, "విమలమతి రమత్సరః ప్రశాంతః శుభచరితోఽఖిలసత్వమిత్రభూతః, ప్రియహితవచనోఽస్తమానమాయో వసతి సదా హృది తస్య వాసుదేవః" (విష్ణు. పు. **3-7-23**) ఎన్గుమ్ శొల్లుగిఱపడియే భాగవతహృదయఙ్గళే తనక్కు ధారకమాగ నిత్యవాసమ్ పణ్ణు మవన్, అవర్తిరళిలే వన్దు ఆశ్రయిత్తవరై సేవియానో? అవనుడైయ అవతారత్తుక్కు కరుత్తు ఇదువేయిఱే. ఆగైయాలే **(భజ)** ఎన్దు శొల్లుగిఱార్గళ్.

**(సఖే)** ఎజ్గళుక్కు సఖానానవనే! స్నేహితర్గళై శోకత్తిలే విట్టు పార్క్కైయో సఖానానవనుక్కు స్వరూపమ్ ! "ద్వా సుపర్ణా సయుజా సఖాయౌ సమానం వృక్షం పరిషస్వజాతే" (ముణ్డక- **3-1-1**) ఎన్దు శ్రుతి శొల్లిఱ్ఱిఱే. ఇప్పడి సఖనాయ్, ప్రకృతిబాంధవర్గళ్ కైవిట్టు పార్త్తు నిఱ్కిఱవన్గుమ్ కైవిడాదే కూడ ఇరున్దు రక్షిక్కుమ్ నీ,

---

**(భజ)**- మా గోష్ఠిలోకి వచ్చి ప్రవేశించాలి. ఆ చిఱునవ్వు అడవి కాచిన వెన్నెల కాకుండా, ఆ చిఱునవ్వుతో మాగోష్ఠిలోకి వచ్చి ప్రవేశించి, దాన్ని సేవించడమే ప్రయోజనంగా ఉండే మాకు దాన్ని అనుభవింపజేయాలని అంటున్నారు. అతడు ఆశపడే గోష్ఠికదా ఇది ! "గోపబృందైః బృందారణ్యం స్వపదరమణం ప్రావిశత్ గీతకీర్తిః" (గోపబృందాలతో పాటు తన శ్రీచరణసంచారం చేత ఆనందించే బృందావనాన్ని వేణుగీతంచేత కీర్తిని కల శ్రీకృష్ణుడు ప్రవేశించాడు) అని, "తన్నేరాయిరమ్ పిళ్ళైకళోడు తళర్నడై యిట్టు వరువాన్" (తనతో పోలిన వేలాదిమంది బాలకులతో కలిసి తప్పటడుగులు వేస్తూ వస్తాడు) అని, "కన్గుకళ్ మేయ్త్తు తన్ తోళరోడు కలన్దు" (లేగదూడలను మేపి తన స్నేహితులతో కలిసి వచ్చి) అని, "పల్లాయర్ కుళానడువే కోలచ్చెన్దామరైక్కణ్ మిళిర క్కుళలూది" (అనేక వేలమంది సమూహంలో అందమైన ఎఱ్ఱని తామరలవంటి కన్నులు మెఱవగా వేణువును ఊది) అని చెప్పబడుతున్నది కదా ! అందువల్ల నీకు ధారకంగా ఈ గోష్ఠిలోకి వచ్చి ఆశ్రయించాలని ప్రార్థిస్తున్నారని కూడా భావం. "జంగమాని విమానాని హృదయాని మనీషిణామ్" (మహాత్ముల మనస్సులు కదిలే విమానాలు) అని, "విమలమతి రమత్సరః ప్రశాంతః శుభచరితోఽఖిలసత్వమిత్రభూతః, ప్రియహితవచనోఽస్తమానమాయో వసతి సదా హృది తస్య వాసుదేవః" (విమలమైన మనస్సును కలవాడు, అసూయ లేనివాడు, ప్రశాంతచిత్తాన్ని కలవాడు, పవిత్రచరిత్రను కలవాడు, అన్ని ప్రాణులపట్ల మైత్రిని కలవాడు, ప్రియమైన హితమైన వచనాన్ని పలికేవాడు, మాయ అనేది లేనివాడు ఎవడున్నాడో అతని హృదయంలో వాసుదేవుడు నివసిస్తాడు) అని చెప్పే రీతిలో భాగవతహృదయాలే తనకు ధారకంగా నిత్యవాసం చేసేవాడు, వారి గుంపులోకి వచ్చి ఆశ్రయించినవారిని సేవించడా? అతని అవతారానికి అర్థం ఇదేకదా! అందువల్ల **(భజ)** అని అంటున్నారు.

**(సఖే)**- మాకు సఖుడవైనవాడా! స్నేహితులను శోకంలో విడచి చూడడమేనా స్నేహితుడైనవానికి స్వరూపం! "ద్వాసుపర్ణా జా సయు సఖాయౌ సమానం వృక్షం పరిషస్వజాతే" (చక్కని ఱెక్కలను కల్గినవి, కలిసి ఉన్నవి, మైత్రిని కల్గినవి అయిన రెండు పక్షులు - అంటే - జీవాత్మ పరమాత్మలు ఒకే వృక్షాన్ని - అంటే - శరీరాన్ని

ఇప్పడి విడుగిఱాయే ! ఇతరప్రయోజనత్తై యాచిత్తు, "గోవిన్ద" (భార. ఉద్యో- 49) ఎన్ఱు ఒరుకాల్ కూవినవళై క్కుఱిత్తు మిగవుమ్ స్నేహిత్తుక్కొణ్డు ఎల్లామ్ శెయ్దు, "ఋణం ప్రవృద్ధ మివ మే హృదయా న్నాపసర్పతి" (భార. ఉద్యో- 49) ఎన్ఱు మిగవుమ్ శోకిత్త దేవరీర్, అనన్యప్రయోజనర్గళుమాయ్, ఒరు సహస్రనామత్తుక్కు త్తగుదియాన తిరునామఙ్గళాలే కూవిన ఎఙ్గళై కటాక్షిప్పదుమ్ శెయ్యాదే, ప్రత్యుక్తియైయుమ్ తారాదే, ఉదాసీనరాయ్పోలే యిరున్దాయే! "ఉన్నడియార్క్కెన్ శెయ్వనెన్ఱే యిరుత్తి నీ" (పెరియతిరు-53) ఎన్ఱు అభియుక్తర్ శొన్న శ్రీసూక్తిగళ్ పొయ్యో? అన్ఱిక్కే, "మమైవ దుష్కృతం కించి న్మహ దస్తి న సంశయః, సమర్థా వపి తౌ య న్మాం నావేక్షేతే పరన్తపౌ" (రామా. సుందర-38-48) ఎన్గిఱపడియే సఖనాయ్ యిరున్దువైత్తుమ్ ఎఙ్గళై ఉపేక్షిక్కిఱదు, యామ్ పణ్ణిన పాపప్రాచుర్యత్తాలేయో?

(భవత్కింకరీ స్మ) యామ్ దేవరీరుక్కు అనన్యప్రయోజనరాన అడియోఙ్గళ్ కాణుమ్. "న చ మాం యోఽభ్యసూయతి" (భగ-18-67) ఎన్గిఱపడియే ఉన్ విషయత్తిలే అసూయై పణ్ణాదొ*ళ్ళి*గైయేయన్ఱిక్కే, ఉన్ దివ్యమంగళవిగ్రహసౌన్దర్యముమ్, కల్యాణగుణఙ్గళుమ్ ఒరు తీఙ్గిన్ఱిక్కే నిత్యమాయ్ చ్చెల్లవేణు మెన్ఱు పల్లాణ్డు పాడుగైయే స్వభావమాన అడియోఙ్గళ్ కాణ్ యామ్. ఉన్ సేవైక్కు ప్రతిబంధకమాన పాప మేదేను ముణ్డానాలుమ్ "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" (భగ-18-66) ఎన్గిఱపడియే త్వత్ప్రాప్తిప్రతిబంధకఙ్గళాన పాపఙ్గళెల్లావ*ఱ్ఱై*యుమ్ నశిప్పిత్తు, ఉన్ సేవైయై ఎఙ్గళుక్కు క్కొడుత్తు, ఎఙ్గళుడైయ భయత్తై నివర్తిప్పిత్తు రక్షిక్కవల్లనల్లైయో నీ! ఎన్ఱు కరుత్తు.

---

ఆశ్రయించి ఉన్నాయి) అని వేదం చెప్పిందికదా! ఈవిధంగా స్నేహితుడవై, సహజబాంధవులు చేయి విడచి చూచి నిలచే సమయంలోకూడా చేయి విడవకుండా వెంట ఉండి రక్షించే నీవు ఈ విధంగా విడుస్తున్నావే! ఇతరప్రయోజనాన్ని ఆశించి, "గోవిందా!" అని ఒకసారి పిలిచిన ఆమెనుగూర్చి (ద్రౌపదిని గూర్చి) చాలా స్నేహాన్ని కల్గి ఉండి, అన్నీ చేసి, "ఋణం ప్రవృద్ధ మివ మే హృదయా న్నాపసర్పతి" (వడ్డీకి వడ్డీ పెరిగిన అప్పువలె నా హృదయం నుండి ద్రౌపది చేసిన ఆక్రందన పోవడంలేదు) అని చాలా శోకించిన నీవు అనన్యప్రయోజన, ఒక నామసహస్రానికి తగిన తిరునామాలతో పిలిచిన మమ్ములను కటాక్షించకుండా, సమాధానాన్ని పలుకకుండా, ఉదాసీనుడవై ఉన్నావే! "ఉన్నడి యార్క్కెన్ శెయ్వన్? ఎన్ఱే ఇరుత్తి నీ" (నీ దాసులకు "ఇంకా ఇంకా ఏంచేయాలి అని నీవు ఉంటావు") అని అభియుక్తులు పల్కిన శ్రీసూక్తులు అసత్యమా? లేక, "మమైవ దుష్కృతం కించిత్ మహ దస్తి న సంశయః, సమర్థా వపి తౌ యన్మాం నావేక్షేతే పరంతపౌ" (నేను చేసిన గొప్ప పాపమే ఏదో కొంచెం ఉన్నది సంశయం లేదు. అందువల్లనే శత్రువులను తపింపజేసే రామలక్ష్మణులిద్దరు సమర్థులైనా నన్ను ఉపేక్షిస్తున్నారు) అనే రీతిలో సఖుడవై ఉండి కూడా మమ్ములను నీవు ఉపేక్షించడం మేము చేసిన పాపప్రాచుర్యంవల్లనా?

(భవత్కింకరీ స్మ)- మేము నీకు అనన్యప్రయోజనులైన దాసులం సుమా! "న చ మాం యోఽభ్యసూయతి" (నాపట్ల ఎవడు అసూయను పొందుతున్నాడో) అన్నట్లు నీ విషయంలో అసూయను కల్గి ఉండకపోవడమే కాకుండా, నీ దివ్యమంగళవిగ్రహసౌందర్యం, కల్యాణగుణాలు ఏ హాని లేకుండా నిత్యంగా కొనసాగాలి -అని పల్లాండు పాడడమే స్వభావంగా కల్గిన దాసులంసుమా ! నీ సేవకు ప్రతిబంధకం అయిన పాపం ఏదైనా ఉన్నా "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" (నేను నిన్ను అన్ని పాపాలనుండి విముక్తుని చేస్తాను, శోకించవద్దు) అనే రీతిలో నీ ప్రాప్తికి అడ్డు అయిన పాపాలను అన్నిటినీ నశింపజేసి, నీ సేవను మాకు అనుగ్రహించి, మా భయాన్ని నివర్తింపజేసి, రక్షించగలవాడవుకావా నీవు!- అని భావం.

(నః) ఇప్పడి దేవరీరుడైయ విశ్లేషవ్యసనమ్ భరిక్కమాట్టామే, చంద్రికైయై అపేక్షిత్తు నిఱ్కుమ్ చక్రవాకమ్బోలే, ఉన్ దివ్యమంగళవిగ్రహత్తై సేవిక్కైయిల్ ఆర్తియుడైయోమాయ్, ఉన్ పక్కలిలే ఎఙ్గళుడైయ అభిమాన మెల్లామ్ సమర్పిత్తు నిన్ఱోమాయ్, అనన్యప్రయోజనరుమాయ్, ఎఙ్గళుడైయ అజ్ఞానత్తై నశిప్పిక్కిఱ దేవరీరుడైయ స్మితత్తైయే హృదయఙ్గళిల్ భావిత్తుక్కొణ్డు నిన్ఱ ఎఙ్గళుక్కు.

(జలరుహాననమ్) జలరుహమేయాన ఆననత్తై. జలరుహత్తైయుమ్, ఇవన్ తిరుముఖమండలత్తైయుమ్ ఇరణ్డాగ పిరిత్తు శొల్లమాట్టాదపడియిఱే ఇతినుడైయ సౌందర్య మిరుప్పదు. ఇత్తాల్- వైత్త కణ్ వాఙ్గాదపడియాన సౌకుమార్యాదిగళుక్కు నిలయమెన్ఱు శొల్లిఱ్ఱాయ్ఱ్ఱు. అన్ఱిక్కే, "జాయత ఇతి జః - జాన్ లాతి గృహ్ణాతీతి- జలమ్, రుహతీతి రుహం, జలం చ రుహం చ యత్ తజ్జలరుహాననమ్" - ఎన్ఱు సమాసమాయ్, ఉత్పన్నఙ్గళాన సకలచరాచరజంతుక్కళైయుమ్ తన్నిడత్తిలుణ్డాన సౌందర్యసౌకుమార్యాదిగళాలే పిచ్చేఱ్ఱుమ్బడి పణ్ణి తన్ వశమాక్కుగైక్కు వన్దవతరిత్త ముగత్తై- ఎన్ఱవుమామ్. "సర్వసత్త్వమనోహరః" (రామా-సుందర- 35- 8) ఎన్ఱుమ్, "మైయలేఱ్ఱి మయక్క ఉన్ ముగమ్ మాయమన్దిరమ్దాన్కొలో!" (నాచ్చియార్ 2-4) ఎన్ఱుమ్ అభియుక్తరనుసంధిత్తారిఱే. "ఉళ్ళమ్ విట్టూణ్ మఱన్దొழிన్దనరే" (పెరియాழ்వార్-3-4-1) ఎన్ఱుమ్, "రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే" (భగ-2-59) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే ప్రకృతిరసత్తై మఱప్పిత్తు తన్నై సేవిత్తవరై తన్ పక్కలిలే మగ్నమాక్కుమ్ ముగమిఱే. అన్ఱిక్కే, ఆచార్యరూపేణ వన్దవతరిత్త ముగమెన్ఱ వుమామ్.

---

(నః)- ఈ విధంగా నీ వియోగదుఃఖాన్ని భరించలేక, వెన్నెలను ఆశించే నిలచే చక్రవాకంవలె, నీ దివ్యమంగళ విగ్రహాన్ని సేవించడంలో ఆర్తిని కలవారమై, నీ విషయంలో మా అభిమానం అంతా సమర్పించి నిలచినవారమై, అనన్యప్రయోజనలమై, మా అజ్ఞానాన్ని పోగొట్టే దేవరవారి చిఱునవ్వునే హృదయాలలో భావిస్తూ ఉన్న మాకు- అని భావం.

(జలరుహాననమ్)- జలరుహమే (పద్మమే) అయిన ముఖాన్ని అని అర్థం. జలరుహాన్ని, ఇతని తిరుముఖ మండలాన్ని రెండుగా విడదీసి చెప్ప లేని రీతిలోకదా దీని సౌందర్యం ఉన్నది. ఇందువల్ల చూసిన చూపు తిరిగి తీసికోలేనట్లున్న సౌకుమార్యాదులకు నిలయం- అని చెప్పినట్లయింది. లేక, "జాయత ఇతి జః, జాన్ లాతి గృహ్ణాతీతి జలం, రుహతీతి రుహం, జలం చ రుహం చ యత్ తత్ జలరుహాననమ్" (పుడుతున్నది కనుక సకలచరాచరవర్గం "జః'' అనబడుతున్నది. అటువంటి చరాచరప్రాణికోటిని గ్రహిస్తున్నది కనుక "జలమ్'' అన బడుతున్నది. పుడుతున్నది కనుక ముఖం రుహమ్'' అనబడుతున్నది. "జలం, రుహమ్''కలసి "జలరుహమ్'' అని అనబడుతున్నది) అని సమాసాన్ని చెప్పి,, పుట్టిన సకలచరాచరజంతువులను తనవద్ద ఉన్న సౌందర్య సౌకుమార్యాదులతో పిచ్చెత్తించేటట్లు చేసి, తన వశం చేసికోవడానికై వచ్చి అవతరించిన ముఖాన్ని- అని కూడా చెప్పవచ్చు. "సర్వసత్త్వమనోహరః" (సకలప్రాణుల మనస్సును హరించేవాడు) అని, "మైయలేఱ్ఱి మయక్క ఉన్ ముకమ్ మాయమన్దిరమ్దాన్కొలో!" (వ్యామోహాన్ని కల్గించి, పిచ్చెక్కించడంలో నీ ముఖం మంత్ర చూర్ణమా!) అని అభిజ్ఞులు అనుసంధించారుకదా! "ఉళ్ళమ్ విట్టూణ్ మఱన్దొழிన్దనరే" (మనస్సు వీడి, తిండిని మఱచిపోయారుకదా) అని, "రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే" (లౌకిక విషయాసక్తికూడా అంతకంటే మధురమైన పరమాత్మను దర్శించి నివర్తిస్తున్నది) అని చెప్పే రీతిలో ప్రకృతిరసాన్ని (ఇహలోక భోగరసాన్ని) మఱపించి, తనను సేవించినవారిని తనపట్ల మగ్నంచేసే (ఆకర్షించే) ముఖంకదా. లేక, ఆచార్యరూపంలో వచ్చి అవతరించిన ముఖం- అనికూడా భావం.

**(చారు)** ప్రకృతికమలత్తై ఇమ్ముగత్తుక్కు ఉపమానమాక శొల్లమాట్టామైయాలే అత్తై వ్యావర్తిక్కిఱార్ - **"చారు"** ఎన్గిఱపదత్తాలే.

**(చారు)** అప్రాకృతమాయ్, సర్వవిలక్షణమాన సౌన్దర్యముడైయ తిరుముఖమణ్డలత్తై- ఎన్ఱపడి. **"శుఱ్ఱుు మొళివట్టమ్ శూழ்న్దు పరన్దెఙ్గుమ్ ఎత్తనై శెయ్యిలు మెన్మకన్ ముగమ్ నేరొవ్వాయ్" (పెరియాழ்వార్ - 1-4-3)** ఎన్ఱు పెరియాழ்వార్ శొన్నాప్పోలే ఇమ్ముకత్తుక్కు సామ్యమాగ ఒరు ప్రకృతివస్తువై చ్చొల్లప్పోగాదిఱే- ఇదు అప్రాకృతమాగైయాలే.

**(దర్శయ)** సేవిప్పిక్కవేణుమ్.

**(జలరుహాననం చారు దర్శయ)** ఘర్మతప్తనాయ్, తృషార్తనానవనుక్కు శీతలమాన జల మిడువారైప్పోలే, సంసారతాపతప్తరాయ్, ఉన్నుడైయ విశ్లేషవ్యసనత్తాలే మిగవు మవసన్నరాయ్, ఉన్ దివ్యమఙ్గళవిగ్రహ సేవైయిలుణ్డాన ఆర్తియాలే నిన్ఱవిడత్తిలే నిన్ఱమాట్టామే వినవుగిఱ ఎఙ్గళుడైయ శరీరఙ్గళుమ్, హృదయఙ్గళుమ్, నేత్రఙ్గళుమ్ కుళిరుమ్బడి మున్నే తోఱ్ఱవేణుమ్.

**(జలరుహాననం చారు దర్శయ)** ఉన్ తిరుముఖమణ్డలత్తినొళి కాట్టిల్ ఎరిత్త నిలా ఆగామే, సేవిక్కైక్కు ఆశైప్పడుగిఱ ఎఙ్గళుక్కు దర్శిప్పిక్క వేణు మెన్గిఱార్గళెన్ఱవుమామ్.

**(జలరుహాననం చారు దర్శయ)** **"ఊణ్ మఱన్దొழிన్దనరే" (పెరియాழ்వార్-3-4-1)** ఎన్గిఱపడియే ప్రాకృతభోజనత్తై మఱైన్దు, **"ఉణ్ణుమ్ శోరు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయు మెల్లామ్ కణ్ణన్" (తిరువాయ్- 6-7-**

---

**(చారు)-** ప్రకృతికమలాన్ని ఈ ముఖానికి ఉపమానంగా చెప్పలేకపోవడంచేత దాన్ని వ్యావర్తిస్తున్నారు (వేఱు చేస్తున్నారు) **"చారు"** అనే పదంతో.

**(చారు)-** అప్రాకృతమై, సర్వవిలక్షణం అయిన సౌందర్యాన్ని కల తిరుముఖమండలాన్ని- అని భావం. **"శుఱ్ఱుు మొళివట్టమ్ శూழ்న్దు పరన్దెఙ్గుమ్ ఎత్తనై శెయ్యిలుమ్ ఎన్ మకన్ ముకమ్ నేరొవ్వాయ్"** (చుట్టూ కాంతివలయం పరివేష్ఠించి, అంతటా వ్యాపించి, ఎంత చేసినా నా కుమారుని ముఖంతో ఓ చంద్రుడా ! నీవు సాటి రావు.) అని పెరియాழ்వార్లు పల్కినట్లే, ఈ ముఖానికి సామ్యంగా ఒక ప్రకృతి వస్తువును చెప్పడానికి వీలు లేదుకదా!- ఇది అప్రాకృతం కావడంవల్ల.

**(దర్శయ)-** సేవింపజేయాలి.

**(జలరుహాననం చారు దర్శయ)-** ఘర్మతప్తుడై (వేడిమిచే తపింపబడ్డవాడై), దాహంతో ఆర్తిని పొందినవానికి చల్లని నీరు ఇచ్చేవారివలె, సంసారంచేత తపింప బడ్డవారై, నీ విశ్లేషవ్యసనంతో చాలా దుఃఖించినవారై, నీ దివ్యమంగళవిగ్రహసేవలో ఉన్న ఆర్తితో ఉన్నచోట ఉండలేక అడిగే మా శరీరాలు, హృదయాలు, నేత్రాలూ చల్లబడేటట్లు మా ముందు ప్రత్యక్షం కావాలి.

**(జలరుహాననం చారు దర్శయ)-** **"ఊణ్ మఱన్దొழிన్దనరే"** (తిండిని మఱచిపోయారుకదా !) అనే రీతిలో ప్రాకృతభోజనాన్ని మఱచి, **"ఉణ్ణుమ్ శోరు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** (తినే తిండి, తాగే నీరు, ఆనందించే భోగ్యవస్తువులు అన్నీ శ్రీకృష్ణుడే) అని చెప్పే రీతిలో నీ కల్యాణగుణాలే ధారకం అయిన

1) ఎన్గిఱపడియే ఉన్ కల్యాణగుణఙ్గళై ధారకమాన ఎఙ్గళుక్కు ఉన్ కల్యాణగుణప్రవంతియై ప్రవహిప్పిక్కిఱ తిరుముఖమండలత్తై సేవిప్పిత్తు భుజిత్తోమాగ పణ్ణవేణు మెన్గిఱార్గళెన్నవుమామ్. అన్ద భోజనత్తాలన్ఱి ఇవర్కళుడైయ శరీరఙ్గళ్ ఇవ్విభూతియిలే నిల్లావిఱే.

(జలరుహాననం చారు దర్శయ) ఉన్ తిరుముఖమణ్డలత్తై క్కణ్గళుక్కు విషయమామ్బడి పణ్ణవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్గళెన్ఱవుమామ్. అవన్ తన్ ముగత్తై జ్ఞానత్తుక్కు విషయమాగ పణ్ణుగైయు ముణ్డిఱే. అప్పడియాగాదే, "కృష్ణం లోకయ లోచనద్వయ!" (ముకుందమాల) ఎన్గిఱపడియే కణ్ పడైత్తదుక్కు ప్రయోజనమాగ కణ్ణుక్కు తోఱ్ఱవేణు మెన్గిఱార్. "కాణ్బదెన్ఱుకొల్ కణ్గళే" (తిరువాయ్- 3-6-10) ఎన్ఱు ఆళ్వార్ ఆశైపట్టాప్పోలే, ఇవరుమ్ ఆశైప్పడుగిఱార్గళ్. "కట్కిలీ!" (తిరువాయ్- 7-2-3) ఎన్ఱుమ్, "న మాంసచక్షుభి రభివీక్షతే తమ్" (తైత్తి. నారా- 1-3) ఎన్ఱుమ్ ప్రమాణఙ్గళిరుక్క, కణ్గళాలే కాణప్పోమో ? ఎన్న? అదు స్వయత్నత్తాలే కాణ్బో మెన్బారై క్కుఱిత్తు శొల్లుగిఱపడి యన్ఱి ప్రపన్నర్క్కాగాదిఱే. "భక్తానాం త్వం ప్రకాశసే" (జితంతే-5) ఎన్ఱుమ్ శొల్లిఱ్ఱిఱే.

(జలరుహాననం చారు దర్శయ) "పరిత్రాణాయ సాధూనామ్" (భగ-4-8) ఎన్గిఱపడియే సాధుపరిత్రాణత్తుక్కాగ వన్దు పిఱన్దుమ్, ఇప్పడి ఉన్నై ఒళిత్తు నిన్ఱాయో? ఇదెన్న ఆశ్చర్యమ్! ఇత్తనై పేర్ సాధుక్కళ్ ఉన్నై సేవియామైయాలే, పడుగిఱ అలమాప్పెల్లామ్ కణ్డు, ఉన్ దివ్యముఖారవిందత్తై ప్రకాశిప్పిత్తు దర్శిప్పిక్క వేణు మెన్గిఱార్గళెన్ఱవుమామ్.

ఆఱామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

---

మాకు నీ కల్యాణగుణప్రవంతిని ప్రవహింపజేసే (నీ) తిరుముఖమండలాన్ని సేవింపజేసి భుజించినవారినిగా చేయాలి- అని అంటున్నారనికూడా భావం. ఆ భోజనంతో తప్ప వీరి శరీరాలు ఈ విభూతిలో నిలువవుకదా!

(జలరుహాననం చారు దర్శయ)- నీ తిరుముఖమండలాన్ని కన్నులకు విషయం అయేటట్లు చేయాలి- అని ప్రార్థిస్తున్నారనికూడా చెప్పవచ్చు. అతడు తన ముఖాన్ని జ్ఞానానికి విషయంగా చేయడంకూడా ఉన్నదికదా! ఆ విధంగా కాకుండా, "కృష్ణం లోకయ లోచనద్వయ !" (నేత్రద్వయమా ! శ్రీకృష్ణుని దర్శించండి) అనే రీతిలో కన్నులున్నందుకు ప్రయోజనంగా కంటికి కనుపించాలి - అని అంటున్నారు. "కాణ్బదెన్ఱుకొల్ కణ్గళే" (కన్నులు ఎపుడు దర్శిస్తాయో కదా) అని ఆళ్వార్లు ఆశపడినట్లే వీరుకూడా ఆశపడుతున్నారు. "కట్కిలీ !" (మాంస చక్షువులకు గోచరం కానివాడా !) అని, "న మాంసచక్షుభి రభివీక్షతే తమ్" (బాహ్యనేత్రాలతో అతనిని చూడడంలేదు) అని ప్రమాణాలుండగా, కన్నులతో చూడగలమా? అని అంటే, అది స్వప్రయత్నంతో దర్శిస్తామనేవారినిగూర్చి చెప్పినదే తప్ప, ప్రపన్నులనుగూర్చి కాదుకదా! "భక్తానాం త్వం ప్రకాశసే" (భక్తులకోసం నీవు ప్రకాశిస్తావు) అని చెప్పబడిందికదా!

(జలరుహాననం చారు దర్శయ)- "పరిత్రాణాయ సాధూనామ్" (సాధువుల రక్షణకోసం) అని చెప్పినట్లు సాధుపరిత్రాణంకోసం వచ్చి, జన్మించినా ఈ విధంగా నిన్ను మఱుగుపరచుకొని ఉన్నావా? ఇదేం ఆశ్చర్యం! ఇంతమంది సాధుజనాలు నిన్ను సేవించలేకపోవడంచేత పడే బాధను అంతా చూచి, నీ దివ్యముఖారవిందాన్ని ప్రకాశింపజేసి, దర్శింపజేయాలని అంటున్నారనికూడా భావం.

ఆఱవ శ్లోకం ముగిసింది

## ఏழாమ్ శ్లోకమ్

అవ :- కీழ் ఇరణ్డు శ్లోకఙ్గళాలే, అభయప్రదానత్తైయుమ్, దివ్యమఙ్గళ విగ్రహదర్శనత్తైయుమ్ ప్రార్థిత్తార్. ఇన్డు ఇవ్వళవే పోరాదుగాణ్; ఆశ్రితరుడైయ పాపత్తై నశిప్పిక్కత్తక్కవైయాయ్, సౌలభ్యగుణప్రకాశఙ్గళాయ్, సకలకల్యాణ నిలయఙ్గళాయ్, కామక్రోధనివర్తకఙ్గళాయ్, సకలజగత్తుక్కు ముపాయోపేయఙ్గళాయ్, వేదాన్తఙ్గళిలే విహరిక్కుఱ దేవరీరుడైయ తిరువడిత్తామరైగళై ఎఙ్గళుడైయ హృదయఙ్గళిలే నిత్యవాసమ్ పణ్ణుమ్బడి కటాక్షిత్తు, శబ్దాదివిషయమాన కామత్తై నివర్తిప్పిత్తరుళవేణుమెన్డు ప్రార్థిక్కిఱార్గళ్. "దివి వా భువి వా మమాస్తు వాసః నరకే వా నరకాంతక ! ప్రకామమ్, అవధీరితశారదారవిందౌ చరణౌ తే మరణేஉపి చింతయామి" (ముకుందమాల-6) ఎన్డు శ్రీ కులశేఖరప్పెరుమాళను సంధిత్తాప్పోలే దాసభూతరానవర్గళుక్కు సర్వదేశ- సర్వకాల- సర్వావస్థైగళిలుమ్ అనువర్త్తిక్కుమ్ వృత్తివిశేషమ్ సర్వేశ్వరనుడైయ పాదారవిందధ్యానమేయిఱే. అన్ఱిక్కే, కీழ் అవనుడైయ కరారవిందత్తై శిరోஉలంకారమాగవుమ్, ముఖారవిందత్తై నేత్రాలంకారమాగవుమ్ ప్రార్థిత్తు, ఇన్డు పదారవిందత్తై హృదయాలంకారమాగ ప్రార్థిక్కిఱార్గళెన్ఱవుమామ్. ఇవై మూన్ఱుమ్ అరవిన్దఙ్గళిఱే. "కరారవిందేన పదారవిందమ్ ముఖారవిందే వినివేశయంతమ్" (శ్రీకృష్ణకర్ణామృతమ్) ఎన్డు శొల్లప్పట్టదిఱే. అనన్యప్రయోజనరాన దాసర్క్కువైయిఱే అలంకారఙ్గళ్. మున్బు "కరసరోరుహమ్" ఎన్డు కరారవిన్దత్తై అనుసన్ధిత్తు, పిన్బు "జలరుహాననమ్" ఎన్డు ముఖారవిందత్తై చ్చొల్లి, ఇరణ్డు మనుసంధిక్కవే అన్ద ఇరణ్డిడత్తిలుముణ్డాన సౌందర్య సౌకుమార్యాదిగళాలే తువక్కుణ్డు, దాసభూతరానవర్ విழుమ్ తుఱైయాన పదారవిందత్తై "పదాంబుజమ్" ఎన్డు శొల్లుగిఱార్. "ముడిచ్చోదియాయ్ ఉనదు ముగచ్చోది మలర్న్దదువో?

---

## ఏడవ శ్లోకం

అవ :- పూర్వం రెండు శ్లోకాలతో, అభయప్రదానాన్ని, దివ్యమంగళవిగ్రహ దర్శనాన్ని ప్రార్థించారు. ఇపుడు ఈ నాడు ఇంతమాత్రమే చాలదు సుమా! ఆశ్రితుల పాపాలను నశింపజేయగల్గినవై, సౌలభ్యగుణాన్ని ప్రకాశింపజేసేవై, సకలకల్యాణ నిలయాలై, కామక్రోధాలను నివర్తింపజేసేవై, సకలజగత్తుకు ఉపాయోపేయాలై, వేదాంతాలలో విహరించేవి అయిన దేవరవారి శ్రీపాదపద్మాలను మా హృదయాలలో నిత్యవాసం చేసేటట్లు కటాక్షించి, శబ్దాదివిషయాలలోని అయిన కోరికను నివర్తింపజేయాలి- అని ప్రార్థిస్తున్నారు. "దివి వా భువి వా మమాస్తు వాసః నరకే వా నరకాంతక! ప్రకామమ్, అవధీరితశారదారవిందౌ చరణౌ తే మరణేஉపి చింతయామి" (ఓ నరకాంతకా! నా నివాసం స్వర్గంలో కానీ, భూమిలోకాని, నరకంలోకానీ, ఎక్కడయినా కానీ. నేను కోరేది ఏమంటే - శరత్కాలంలోని అరవిందాలను తలదన్నే నీ చరణాలను నేను మరణసమయంలో సైతం చింతించాలి) అని శ్రీకులశేఖరప్పెరుమాళ్ అనుసంధించినట్లే దాసభూతులైనవారికి సర్వదేశ-సర్వకాల- సర్వావస్థలలోను వెంటగా ఉండే వృత్తి (వ్యాపార) విశేషం సర్వేశ్వరుని పాదారవిందధ్యానమే కదా! లేక, పూర్వం అతని కరారవిందాన్ని శిరస్సుకు అలంకారంగాను, ముఖారవిందాన్ని నేత్రాలంకారంగాను ప్రార్థించి, ఇపుడు పదారవిందాన్ని హృదయాలంకారంగా ప్రార్థిస్తున్నారనికూడా భావం. ఈ మూడు అరవిందాలేకదా. "కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతమ్" (కరారవిందంతో పాదారవిందాన్ని ముఖారవిందంలో పెట్టుకొనేవానిని) అని చెప్పబడ్డాయి. అనన్యప్రయోజనులైన దాసులకు ఇవి కదా అలంకారాలు. పూర్వం "కరసరోరుహమ్" అని కరారవిందాన్ని అనుసంధించి, తరువాత "జలరుహాననమ్" అని ముఖారవిందాన్ని పల్కి, రెండూ అనుసంధించగానే ఆ రెండు చోట్ల ఉన్న సౌందర్యసౌకుమార్యాదులచే వశీకరింపబడి దాసభూతులైనవారు దిగే రేవు అయిన పదారవిందాన్ని "పదాంబుజమ్" అని చెబుతున్నారు. "ముడిచ్చోదియాయ్ ఉనదు ముకచ్చోది మలర్న్దదువో ?

అడిచ్చోది నీ నిన్ఱ తామరైయా యలర్న్దదువో ?" (తిరువాయ్- 3-1-1) ఎన్ఱు ఆళ్వారనుసంధిత్తాప్పోలే ఇదువుమ్. కరసరోరుహమ్ భయనివర్తకమ్. జలరుహాననమ్ దయాప్రకాశకమ్. పదాంబుజమ్ స్వరూపానురూపమాన వృత్తివిశేషత్తుక్కు భూమియాయిఱే ఇరుప్పదు. ఆగైయాలే అనుసన్ధిత్తార్గళ్.

ప్రణతదేహినాం పాపకర్షనం తృణచరానుగం శ్రీనికేతనమ్ ।
ఫణిఫణార్పితం తే పదాంబుజం కృణు కుచేషు నః కృంధి హృచ్ఛయమ్ ॥

**(ప్రణతదేహినామ్)** అహంకారమమకారఙ్గళ్ లేశము మిన్ఱిక్కే "త్వం మే" (భట్టర్ ముక్తకమ్) ఎన్ఱాల్ "అహం మే" ఎన్ఱై త్తవిర్న్దు, ఇతరశేషత్వత్తైయుమ్, ప్రయోజనాన్తరపరతైయుమ్, సాధనాన్తరఙ్గళైయుమ్ విట్టు, తన్నైయే ఉపాయమాగ అధ్యవసిత్తు, తన్ సన్నిధియిలే "స్వపాదమూలే పతితమ్" (భాగవతమ్-7-9-5) ఎన్ఱుమ్, "జటిలం చీరవసనం ప్రాంజలిం పతితం భువి" (రామా-అయో-100-1) ఎన్ఱుమ్ శొన్నాప్పోలే పూర్ణప్రపదనత్తోడే విళున్ద దేహికళుడైయ. "ప్రపద్యే పాదుకాం దేవీం పరవిద్యా మివ స్వయమ్, యా మర్పయతి దీనానాం దయమానో జగద్గురుః" (పాదుకాసహస్రమ్-95) ఎన్ఱు మభియుక్తరు మనుసంధిత్తారిఱే.

**(ప్రపద్యే)** సాధనాంతరత్యాగపూర్వకమాగ సిద్ధోపాయమాగ పఱ్ఱుకిఱేన్.

**(పాదుకాం దేవీమ్)** స్వయంప్రకాశకమాన భగవత్పాదుకాస్వరూపత్తై. అన్ఱిక్కే,

**(దేవీం పాదుకామ్)** అఖిలహేయప్రత్యనీక కల్యాణగుణైకతానమాన పాదుకాస్వరూపత్తై- ఎన్ఱవుమామ్.

---

అడిచ్చోది నీ నిన్ఱ తామరైయాయలర్న్దదువో?" (కిరీటకాంతిగా నీ ముఖకాంతి వికసించిందా? లేక, శ్రీపాదాల కాంతి నీవు నిలిచి ఉండే ఆసన పద్మంగా విరిసిందా ?) అని ఆళ్వార్లు అనుసంధించినట్లే ఇదికూడా! కరసరోరుహం భయాన్ని నివర్తింపజేస్తుంది. జలరుహాననం దయను ప్రకాశింపజేస్తుంది. పాదాంబుజం స్వరూపానికి తగిన కైంకర్యవిశేషానికి స్థానంగాకదా ఉంటుంది. అందువల్ల (దానిని) అనుసంధించారు.

ప్రణతదేహినాం పాపకర్షనం తృణచరానుగం శ్రీనికేతనమ్ ।
ఫణిఫణార్పితం తే పదాంబుజం కృణు కుచేషు నః కృంధి హృచ్ఛయమ్ ॥

**(ప్రణతదేహినామ్)**- అహంకారమమకారాలు కొంచెంకూడా లేకుండా, **"త్వం మే"** (నీవు నావాడవు) అంటే, **"అహం మే"** (నేను నావాడను) అనడం మాని, ఇతరశేషత్వాన్ని, ప్రయోజనాంతరాలలో ఆసక్తిని, సాధనాంతరాలను విడచి, తననే ఉపాయంగా నమ్మి, తన సన్నిధిలో **"స్వపాదమూలే పతితమ్"** (తన పాదాలచెంత పడినవానిని) అని చెప్పిన రీతిలో పూర్ణమైన శరణాగతితో ఆశ్రయించిన దేహులయొక్క (అని భావం). **"ప్రపద్యే పాదుకాం దేవీం పరవిద్యా మివ స్వయమ్, యా మర్పయతి దీనానాం దయమానో జగద్గురుః"** (కరుణించే జగద్గురువు అయిన భగవానుడు ఏ పాదుకాదేవిని పరవిద్యనువలె దీనులకు ప్రసాదిస్తున్నాడో, ఆ పాదుకాదేవిని ప్రపత్తి చేస్తున్నాను) అని అభియుక్తులు కూడా అనుసంధించారుకదా! (ఇపుడీ పాదుకా సహస్రశ్లోకం వ్యాఖ్యానింప బడుతున్నది)

**(ప్రపద్యే)**- సాధనాంతరాలను విడువడంతో పాటుగా సిద్ధోపాయాన్ని ఆశ్రయిస్తున్నాను.

**(పాదుకాం దేవీమ్)**- స్వయంప్రకాశకం అయిన భగవత్పాదుకాస్వరూపాన్ని - అని భావం. లేక,

**(దేవీం పాదుకామ్)**- అఖిలహేయప్రత్యనీక-కల్యాణగుణైకతానం అయిన పాదుకాస్వరూపాన్ని- అనికూడా భావం.

(పరవిద్యా మివ స్వయమ్) స్వయమాన తిరువష్టాక్షరియైప్పోలే ఉపాయమాగ పఱ్ఱుగిఱేనెన్ఱపడి.

(ప్రపద్యే పాదుకాం దేవీం పరవిద్యా మివ స్వయమ్) అఖిలకల్యాణగుణాకరమాయ్, స్వయంప్రకాశకమాన భగవత్పాదుకాస్వరూపత్తై, శబ్దాత్మకమాన తిరువష్టాక్షరియినుడైయ సర్వసౌలభ్యయుక్తమాన సాక్షాదవతార మెన్ఱు ప్రతిపత్తి పణ్ణుకిఱేనెన్ఱపడి.

(యామ్) ఎన్ద పాదుకాస్వరూపత్తై. ఇఙ్గు "యామ్" ఎన్ఱు శొల్లుగిఱదు శ్లాఘ్యతైయై ప్పఱ్ఱ. "ఇరుళ్ తరు మాఞాల" (తిరువాయ్- 10-6-1)మాన ఇన్ద విభూతియిలే ఇదు ఉపాయమాగ లభిక్కై, ప్రాణాపత్సమయత్తిలే మృతసంజీవినియై లభిత్తాప్పోలే కాణుమ్.

(అర్పయతి) అర్పిత్తానో. చేతనరక్షణార్థమాగ కొడుత్తానో- ఎన్ఱపడి. అన్ఱిక్కే, ప్రపన్నరానవర్గళ్, తఙ్గళై సర్వేశ్వరనుక్కు స్వమ్మాగ సమర్పిత్తాప్పోలే, అవనుమ్ తన్ తిరువడిగళై ఇవర్గళుక్కు స్వమ్మాగ క్కొడుత్తాన్- ఎన్ఱపడి. "ధనం మదీయం తవ పాదపంకజమ్" (స్తోత్రరత్నమ్-30) ఎన్ఱారిఱే ఆళవన్దార్.

(దీనానామ్) "న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ" (స్తోత్రరత్నమ్-22) ఎన్గిఱపడియే తమ్ పక్కలుపాయ మొన్ఱు మిన్ఱిక్కే, ఆకించనరుమ్, అనన్యగతిగళుమా యిరున్దవర్గళుక్కు. అవర్గళిఱే ఇత్తై యాచిక్కుమవర్గళ్.

(దయమానః) ఇప్పడి శెయ్తతు, "ఏవం సంస్కృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవే దుఃఖాకులే" (ముముక్షుప్పడివ్యాఖ్య-5 సూ) ఎన్గిఱపడియే సంసారత్తుక్కుళ్ళే విழுన్దు దుఃఖిక్కిఱ చేతనరుడైయ దుఃఖత్తై కాణమాట్టామే తానుమొక్క దుఃఖిక్కుమ్ ప్రకృతియాకైయాలేయిఱే.

---

(పరవిద్యా మివ స్వయమ్)- సాక్షాత్తు తిరు అష్టాక్షరివలె ఉపాయంగా ఆశ్రయిస్తున్నానని అర్థం.

(ప్రపద్యే పాదుకాం దేవీం పరవిద్యా మివ స్వయమ్)- అఖిలకల్యాణగుణాలకు ఆకరమై, స్వయంప్రకాశకం అయిన భగవత్పాదుకాస్వరూపాన్ని, శబ్దాత్మకం అయిన తిరు అష్టాక్షరియొక్క, సర్వసౌలభ్యంతోకూడిన సాక్షాదవతారం అనే నమ్మికను కల్గి ఉన్నాను- అని భావం.

(యామ్)- ఏ పాదుకాస్వరూపాన్ని, ఇచట "యామ్" అని చెప్పినది శ్లాఘ్యతను ఉద్దేశించి. "ఇరుళ్ తరు మాఞాలమ్" (అజ్ఞానప్రదం అయిన విశాలమైన భూమి) అయిన ఈ విభూతిలో ఈ ఉపాయం లభించడం, ప్రాణాపాయసమయంలో మృతసంజీవిని లభించినట్లు కదా!

(అర్పయతి)- అర్పించాడో. చేతనుల రక్షణకోసం ఇచ్చాడో- అని అర్థం. లేక, ప్రపన్నులైనవారు, తమను సర్వేశ్వరునకు సొత్తుగా సమర్పించినట్లే, అతడుకూడా తన శ్రీపాదాలను వీరికి సొత్తుగా ఇచ్చాడని భావం. "ధనం మదీయం తవ పాదపంకజమ్" (నాధనం అయిన నీ శ్రీచరణపద్మం) అని అన్నారుకదా ఆళవన్దార్.

(దీనానామ్)- "న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ" (కర్మ యోగానుష్ఠానాన్ని కాని జ్ఞానయోగానుష్ఠానాన్ని కాని చేయలేదు) అన్నట్లు తమ వద్ద ఏ ఉపాయం లేకుండా. అకించనులు వేఱే గతి ఏదీ లేనివారుగా ఉన్నవారికి అని అర్థం. వారేకదా దీన్ని యాచించేవారు.

(దయమానః) ఈ విధంగా చేసినది- "ఏవం సంస్కృతిచక్రస్థే భ్రామ్య మాణే స్వకర్మభిః, జీవే దుః ఖాకులే" (ఈవిధంగా సంసారచక్రంలో ఉన్నవాడు, తన కర్మలతో పరిభ్రమించేవాడు, దుఃఖాలచే బాధపెట్టబడ్డవాడైన జీవుని విషయంలో) అనే రీతిలో సంసారంలో పడి, దుఃఖించే చేతనుల దుఃఖాన్ని చూడలేక, తానుకూడా దుః ఖించే స్వభావం కలవాడు కాబట్టేకదా!

**(జగద్గురుః)** - సకలచేతనర్కళుక్కుమ్ తన్నై కిట్టవొట్టాత అజ్ఞానమూలమాన పాపత్తై నశిప్పిక్కుమవనాగైయాలే దయమానమనావాయ్క్కొణ్డు తన్ తిరువడిగళై పాపనాశనుత్తుక్కుడలాగ క్కొడుత్తానెన్ఱపడి.

**(ప్రణతదేహినామ్)** అన్ఱిక్కే, ఇఙ్గు ప్రణతశబ్దమ్ ప్రపత్తిక్కు సీమైయాన తదీయవిషయత్తిల్ పణ్ణుమ్ ప్రపత్తియై కాట్టుగిఱదు. **"మమ మద్భక్తభక్తేషు ప్రీతి రభ్యధికా భవేత్"** (కణ్ణినుణ్ శిఱుత్తాంబు వ్యాఖ్య-3వపా) ఎన్ఱుమ్, **"తద్భక్తై ర్వా సమాగమః"** (ఈడు-3-7 ప్రవేశమ్) ఎన్ఱుమ్, "సిద్ధి ర్భవతి వా నేతి సంశయోఽచ్యుత సేవినామ్, న సంశయోఽస్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్" ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే పాపఙ్గళెల్లామ్ నశిత్తు ప్రపత్తి ఫలిప్పదు భాగవతవిషత్తిల్ పణ్ణుమ్ ప్రపత్తియాలేయితే. "మద్భక్తం శ్వపచం వాపి నిందాం కుర్వంతి యే నరాః, పద్మకోటిశతేనాపి న క్షమామి వసుంధరే !" (వారాహే) ఎన్గిఱపడియే అవరై సేవియాదపోదు తన్ విషయత్తిలే ప్రపత్తియుణ్డానాలుమ్ క్షమియానితే. భాగవతవిషయత్తిల్ ప్రపత్తి యిల్లాదపోదు భగవద్విషయప్రపత్తియు మిల్లైయాయ్విడుమ్. అదుణ్డానవాతే ఇదు ప్రకాశిక్కుమ్కాణ్. **"మిత్రభావేన సంప్రాప్తమ్" (రామా-యుద్ధ-18-3), "మా మేకం శరణం వ్రజ" (గీతా- 18-66), "స్మర్తా విశ్వరూపం చ మా మజమ్" (వరాహచరమమ్), "సకృదేవ ప్రపన్నాయ" (రామా- యుద్ధ-18-32)**, ఎన్గిఱ శ్లోకఙ్గళుక్కిదువేయితే పొరుళ్. ఆగైయాలేయితే **"అడియార్క్కాట్పడుత్త విమలన్" (అమలనాది- 1)** ఎన్ఱుమ్, **"ఉన్నడియార్గళు౪క్కియ పాదతూళి పడుదలాల్ ఇవ్వులగమ్ పాక్కియమ్ శెయ్దదే!" (పెరియా౪్వార్-4-4-6)** ఎన్ఱుమ్, "కరున్దడముకిల్ వణ్ణనై క్కడైక్కొణ్డు కైతొ౪ుమ్ పత్తర్గళ్ ఇరున్ద వూరిలిరుక్కు మిమ్మానిడవరెత్తవఙ్గళ్

---

**(జగద్గురుః)** - సకలచేతనులను తనను దరి చేరనీయని, అజ్ఞానమూలం అయిన పాపాన్ని నశింపజేసేవాడు కాబట్టి దయను చూపే మనస్సు కలవాడై, తన శ్రీపాదాలను పాపనాశనానికి వీలుగా ఇచ్చాడని భావం. (ఇక మిగిలిన ప్రకృతశ్లోక భాగం వ్యాఖ్యానింపబడుతున్నది)

**(ప్రణతదేహినామ్)**- లేక, ఇక్కడ ప్రణతశబ్దం ప్రపత్తికి అవధి అయిన తదీయ (భాగవత) విషయంలో కల్గిఉండే ప్రపత్తిని తెలుపుతున్నది. **"మమ మద్భక్తభక్తేషు ప్రీతి రభ్యధికా భవేత్"** (నా భక్తులకు భక్తులైనవారి విషయంలో ప్రీతి మిక్కిలి ఎక్కువగా ఉంటుంది) అని, **"తద్భక్తై ర్వా సమాగమః"** (నా భక్తులతో సహవాసం సంసారమనే విషవృక్షం వల్ల లభించే అమృతఫలాలు రెండిటిలో ఒకటి) అని, **"సిద్ధిర్భవతి వా నేతి సంశయోఽచ్యుత సేవినామ్, న సంశయోఽస్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్"** (అచ్యుతుని సేవించేవారికి సిద్ధి కల్గుతుందా? లేదా? అనే సందేహం ఉండవచ్చు. కాని, ఆ అచ్యుతభక్తులను సేవించడంలో ఆసక్తిని కలవారి కార్యసిద్ధి కల్గడంలో సందేహం లేనే లేదు) అని చెప్పిన రీతిలో పాపాలన్నీ నశించి, ప్రపత్తి ఫలించేది భాగవతవిషయంలో చేసే ప్రపత్తివల్లనే కదా! **"మద్భక్తం శ్వపచం వాఽపి నిందాం కుర్వంతి యే నరాః, పద్మకోటిశతేనాపి న క్షమామి వసుంధరే!"** (శ్వపచుడు- అంటే - కుక్కమాంసాన్ని భక్షించేవాడైనా అతడు నా భక్తుడు అయితే, అతనిని నిందించిన మానవులను ఓ భూదేవీ! నేను కోట్లానుకోట్ల సంవత్సరాలకుకూడా నేను క్షమించను) అనే రీతిలో వారిని సేవించలేనపుడు తన విషయంలో ప్రపత్తి చేసినా క్షమించడుకదా! భాగవతవిషయంలో ప్రపత్తి లేనపుడు భగవద్విషయంలోని ప్రపత్తికూడా లేకుండాపోతుంది. అది ఉండగానే ఇది ప్రకాశిస్తుందికదా! **"మిత్రభావేన సంప్రాప్తమ్"**, (మిత్రభావంతో దరి చేరినవానిని) **"మామేకం శరణం వ్రజ"**, (నన్ను ఒక్కనిమాత్రమే శరణు పొందు) **"స్మర్తా విశ్వరూపం చ మా మజమ్"**, (విశ్వరూపుడను, కర్మజన్మరహితుడను అయిన నన్ను స్మరించేవాడు) అని, **"అడియార్క్కాట్పడుత్త విమలన్"** (భక్తులకు దాసునిగా చేసిన విమలుడు) అని, **"ఉన్నడియార్కళ్ ఉ౪క్కియ పాదదూళి పడుతలాల్ ఇవ్వులకమ్ పాక్కియమ్ శెయ్దదే"** (నా దాసులు తొక్కిన పాదధూళి పడడంవల్ల ఈ

శెయ్‌దార్‌కొలో ?" (పెరియాఴ్వార్ - 4-4-7) ఎన్ఱుమ్, "అవర్‌కణ్డీ రెమ్మై యాళుమ్ పరమరే" (తిరువాయ్-3-7-1) ఎన్ఱుమ్, "తిరుమాలడియార్‌గళై పూశిక్క నోఱ్ఱార్‌గళే" (తిరువాయ్-5-6-11) ఎన్ఱుమ్ ఆఴ్వార్‌గళెల్లారుమ్ భాగవతసంబన్ధత్తై కొణ్డాడినార్. ఇత్తాల్ -ఆచార్యసమాశ్రయణమ్ లభిత్తవర్‌గళుక్కు ఎన్ఱపడి. "చక్రాదిధారణం పుంసాం పరసంబంధవేదనమ్, పతివ్రతానిమిత్తం హి వలయాదివిభూషణమ్" (కూర్మపురాణమ్) ఎన్ఱు శొల్లానిన్ఱదిఱే. ఇదు ప్రపత్తిక్కు ప్రధానాఙ్గమిఱే. అవర్గళిఱే ప్రణతరానవర్‌గళ్.

(ప్రణతదేహినామ్) ఛండాల-వశిష్ఠవిభాగమిన్ఱిక్కే, ప్రణతరాన సకలదేహిగళుక్కుమెన్ఱవుమామ్. "సామాన్య మధిదైవతమ్" (జితంతే-2) దేహిగళుక్కు మధికారముణ్డిఱే. భగవత్ప్రణతిక్కు దేహిగళాక వమైయుమ్. మఱ్ఱొరు అధికారమ్ తేడవేణ్డా. "పశు ర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవసంశ్రయాః, తేనైవ తే ప్రయాస్యన్తి తద్విష్ణోః పరమం పదమ్" (పెరియతిరుమొఴివ్యాఖ్య-2-6ప్రవేశే) ఎన్ఱానిన్ఱదిఱే. "శరణ మాగుమ్ తన తాళడైన్దార్ క్కెల్లామ్" (తిరువాయ్-9-10-5) ఎన్ఱు ఆఴ్వారు మనుసంధిత్తరుళినార్. అప్రాప్తమాన విషయఙ్గళిలే పణ్ణుమ్ ప్రణతిక్కిఱే దేశనియమముమ్, కాలనియమముమ్, అధికారనియమముమ్, ప్రకారనియమముమ్ వేణ్డుగిఱదు. స్వరూపప్రాప్తమాన భగవద్విషయ ప్రణతిక్కు ఇవై వేణ్డా. "త్వదంఘ్రి ముద్దిశ్య కదాఽపి కేనచిత్ యథా తథా వాఽపి సకృత్కృతోఽంజలిః"

---

లోకం అదృష్టం చేసికొన్నది కదా!) అని, "కరున్దడైముకిల్ వణ్ణనై క్కడైక్కొణ్డు కైతొఴుమ్ పత్తర్‌కళ్ ఇరున్ద వూరిలిరుక్కు మిమ్మానిడవ రెత్తవఙ్గళ్ శెయ్‌దార్‌కొలో !" (నీలమేఘవర్ణుని శరణంగా ఆశ్రయించి చేతులను జోడించి నమస్కరించే భక్తులు ఉండే ఊరిలో నివసించే ఈ మానవులు ఏమి తపస్సులు చేశారో ! కదా) అని, "తిరుమాలడియార్‌కళై పూశిక్క నోఱ్ఱార్‌కళే" (శ్రియఃపతి దాసులను పూజించే నోము నోచినవారే) అని ఆఴ్వార్లు అందఱు భాగవతసంబంధాన్ని కీర్తించారు. ఇందువల్ల ఆచార్యసంబంధం లభించినవారికి- అని భావం. "చక్రాదిధారణం పుంసాం పరసంబంధవేదనమ్, పతివ్రతానిమిత్తం హి వలయాదివిభూషణమ్" (సుదర్శనచక్రాది లాంఛనాలను ధరించడం పరమాత్మతో సంబంధాన్ని కల్గి ఉండడాన్ని సూచిస్తుంది. వలయాలను - గాజులను ధరించడం పతివ్రతా లక్షణం కదా) అని చెప్పబడుతున్నదికదా! ఇది ప్రపత్తికి ప్రధానమైన అంగంకదా! వారేకదా ప్రణతులైనవారు. (ప్రపత్తి చేసినవారు)

(ప్రణతదేహినామ్)- ఛండాల- వశిష్ఠవిభాగం లేకుండా ప్రపత్తి చేసిన సకల జీవులకు- అని కూడా భావం. "సామాన్య మధిదైవతమ్" (భగవానుడు అందరికి సామాన్యమైన అధిదైవం) అనే రీతిలో సర్వసామాన్యమై, ప్రాప్తవిషయమైన భగవత్ప్రపత్తి చేయడంలో అందఱు జీవులకు అధికారం ఉన్నదికదా! భగవత్ప్రపత్తికి దేహులైతే (దేహం కల్గినవారైతే చాలు). వేఱొక అధికారం వెదుకవలసిన పని లేదు. "పశు ర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవసంశ్రయాః, తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పదమ్" (పశువు అయినా, మనుష్యుడైనా, పక్షి అయినా, ఎవరు శ్రీవైష్ణవుని ఆశ్రయిస్తారో, వారు ఆశ్రీవైష్ణవసంబంధంవల్ల ఆ విష్ణువుయొక్క పరమపదాన్ని చేరగలరు) అని అనబడుతున్నది కదా! "శరణ మాకుమ్ తనతాళ్ అడైన్దార్‌క్కెల్లామ్" (తన శ్రీచరణాలను ఆశ్రయించినవారికి శరణం కాగలడు) అని ఆఴ్వార్లుకూడా అనుసంధించారు. అప్రాప్తం అయిన విషయాలలో చేసే ప్రపత్తికి (ప్రణతికి) కదా దేశనియమం, కాలనియమం, అధికారినియమం, ప్రకారనియమమూ కావాలి. స్వరూపప్రాప్తం అయిన భగవద్విషయంలోని ప్రపత్తికి ఇవి ఏలీ అక్కఱలేదు. "త్వదంఘ్రి ముద్దిశ్య కదాపి కేనచిత్ యథా తథావాఽపి సకృత్ కృతోఽంజలిః" (నీ శ్రీచరణాలను ఉద్దేశించి ఎపుడైనా ఎవనిచే అయినా ఏదో విధంగా అయినా ఒక్కసారి చేయబడ్డ అంజలి) అని చెప్పబడినదికదా! విషయనియమమే అవశ్యకం. "అనన్యా శ్చింతయంతో మాం యే

**(స్తోత్రరత్నమ్-28)** ఎన్ఱు శొల్లప్పట్టదితే. విషయనియమమే వేణ్డువదు. "అనన్యా శ్చిన్తయంతో మాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానామ్ యోగక్షేమం వహామ్యహమ్" **(భగ- 9-22)** ఎన్ఱు తానే శొల్లివైత్తానితే.

**(ప్రణతదేహినామ్)** చరాచరాత్మక విభాగముమ్ ఛండాల వశిష్ఠవిభాగము మిన్ఱిక్కే, ప్రణతరాన సకలదేహిగళుడైయ పాపత్తై నశిప్పిక్కుమదాయ్- ఎన్ఱపడి. "స్థిరచరవృజినఘ్నః" ఎన్ఱు శొల్లానిన్ఱదితే. **(పాపకర్శనమ్)** త్రివిధమాన పాపత్తైయుమ్ నశిప్పిక్కుమదాయ్.

**(ప్రణతదేహినాం పాపకర్శనమ్)** తన్ పక్కల్ ప్రణతరాగవే నిలై నిన్ఱ త్రివిధమాన పాపవర్గముమ్ ముడిన్దు పోమ్బడియాయ్*గ్గ్రా* అతినుడైయ హేయప్రత్యనీకత్తై ఇరుక్కిఱపడి. ఇదుక్కు మున్బు చేతనన్ నిత్యసంసారియాయ్ పోన్ద నాళిలే ఇప్పాపవర్గత్తై క్కణ్డు తాన్ స్వరూప మెల్లా మురుమాయ్న్దు ఎప్పడి భయప్పట్టానో, ఇప్పోదు ఇవన్ తిరువడిగళిడత్తిల్ ప్రణతనాగవే అన్ద పాపవర్గఙ్గళెల్లామ్ ఇవన్ మున్బు పట్టదు పట్టు ముడిన్దు నిన్ఱనవితే, తిరువడిగళుడైయ స్వభావత్తాలే. "పోయ పిఴ్ఴైయుమ్ పుగుదరువా నిన్ఱనవుమ్ తీయినిల్ తూశాగుమ్" (తిరుప్పావై- 5) ఎన్ఱు ఆణ్డాళరుళిచ్చెయ్దాళ్. "తద్యథేషీక తూల మగ్నౌ ప్రోతం ప్రదూయతే ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" **(ఛాందోగ్య- 5- 24-3)** ఎన్ఱు శ్రుతియిల్ శొల్లానిన్ఱదితే. "నమస్యదార్తిక్షపణే కృతక్షణమ్" **(స్తోత్రరత్నమ్- 30)** ఎన్ఱు ఆళవన్దారుమనుసంధిత్తార్.

**(పాపకర్శనమ్)** ఇఙ్గు పాపమావదు భగవత్ప్రాప్తి ప్రతిబంధకమాన అజ్ఞాన మెన్ఱపడి. సకలపాపఙ్గళు మజ్ఞానకార్యమాయితే ఇరుప్పదు. ఆగ, తన్నిడత్తిల్ ప్రణతియాలే సకలవిధాజ్ఞానఙ్గళై నశిప్పిక్కు మెన్ఱబడి.

---

జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" (ఏ జనులు నన్ను ఒక్కనిమాత్రమే భావిస్తూ ఉపాసిస్తున్నారో, నిత్యం నాపట్ల భక్తిని కలవారి యోగక్షేమాలను నేను నిర్వహిస్తాను) అని తానే వచించాడుకదా!

**(ప్రణతదేహినామ్)**- చరాచరాత్మకవిభాగం, ఛండాల-వశిష్ఠ విభాగం లేకుండా ప్రపత్తి చేసిన సకలప్రాణుల పాపాన్ని నశింపచేసేదై- అని భావం. **"స్థిరచరవృజినఘ్నః"** (చరాచరాల పాపాలను నశింపజేసేవాడు) అని చెప్పబడుతున్నదికదా! **(పాపకర్శనమ్)**- మూడు విధాలైన పాపాలను నశింపచేసేదై- అని భావం.

**(ప్రణతదేహినాం పాపకర్శనమ్)**- తనపట్ల ప్రపత్తిని చేసినవారుకాగానే, స్థిరమైన, (ప్రారబ్ధ - సంచిత -ఆగాములనే) మూడు విధాలైన పాపసమూహాలు నశించిపోయేటట్లుగా దాని హేయప్రతిభటత్వం ఉన్నది. దీనికి ముందు చేతనుడు (తాను) నిత్యసంసారియై ఉన్న దినాలలో ఈ పాపవర్గాన్ని చూచి తాను స్వరూపం అంతా రూపుచెడి ఏవిధంగా భయపడ్డాడో, ఇపుడు ఇతని శ్రీపాదాలచెంత ప్రపత్తి చేయగానే ఆ పాపవర్గాలన్నీ ఇతడు ముందు పడినపాట్లు పడి నశించాయికదా- శ్రీపాదాల స్వభావంచేత. **"పోయ పిఴ్ఴైయుమ్ పుకుదరువా నిన్ఱనవుమ్ తీయినిల్ తూశాకుమ్"** (ప్రాక్తనదుష్కర్మలు, ఆగామి దుష్కర్మలు అన్నీ నిప్పులో పడిన దూదివలె రూపుమాసిపోతాయి) అని ఆణ్డాళ్ అనుగ్రహించారు. **"తద్యథేషీకతూల మగ్నౌ ప్రోతం ప్రదూయేత ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"** (నిప్పులో పడిన దూదిపింజవలె ఈ ప్రపన్నుని పాపాలు అన్నీ నశిస్తాయి) అని శ్రుతిలోకూడా చెప్పబడుతున్నదికదా! **"నమస్యదార్తిక్షపణే కృతక్షణమ్"** (నమస్కరించేవారి ఆర్తిని పోగొట్టడంలో దీక్షను కల్గినది) అని ఆళవన్దార్ కూడా అనుసంధించారు.

**(పాపకర్శనమ్)**- ఇక్కడ పాపం అనేదానికి భగవత్ప్రాప్తి ప్రతిబంధకం అయిన అజ్ఞానం- అని భావం. సకలపాపాలు అజ్ఞానకార్యంగా (అజ్ఞానంవల్ల ఏర్పడేవిగా) కదా ఉంటాయి. అందువల్ల తనపట్ల చేసే ప్రపత్తివల్ల

"ఒడుఙ్గవవన్గణ్ ఒడుఙ్గలు మెల్లామ్ విడుమ్" (తిరువాయ్- 1-2-9) ఎన్ఱు ఆழ்వారనుసంధిత్తరుళినారితే. "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే" (భగ-7-14) ఎన్ఱు భగవాన్ తానే అరుళిచ్చెయ్‌దాన్.

(ప్రణతదేహినాం పాపకర్శనమ్) ఇవ్వాక్యమ్ చరమశ్లోకార్థసంగ్రహమా యిరున్దపడి ఎన్ ? ఎన్ఱు నమ్మాచార్యర్ పలకాలు మరుళిచ్చెయ్‌వర్. "ప్రణతదేహినామ్" ఎన్దదు పూర్వవాక్యార్థసంగ్రహమాయ్, "పాపకర్శనమ్" ఎన్ఱు ఉత్తరవాక్యార్థసంగ్రహమాయితే యిరుప్పదు. ఇత్తాల్ - ప్రణతదేహఙ్గళుడైయ పాపత్తై నశిప్పిత్తక్క వస్తు, ప్రణతదేహిగళాన ఎఙ్గళుడైయ పాపత్తైయుమ్ పోక్కి, ఉద్దేశ్యత్తై త్తారాదో- ఎన్ఱు భావమ్.

(తృణచరానుగమ్) పశుక్కళ్ పిన్నే అనుసరిత్తు నడక్కుమదాయ్. ఇదువితే ఇవ్వస్తువినుక్కేற்றమ్. పరతత్త్వమాయ్, సకలచేతనాచేతనఙ్గళుడైయ పాపత్తై నశిప్పిక్కత్తక్క సహజశక్తియైయుడైయ వస్తువితే ఇప్పడి తృణచరఙ్గళై యనుగమిత్తదు. ఎత్తనై సౌలభ్యమో? ఎన్ఱు విద్దరాగిఱార్‌గళ్. "కన్ఱినమ్ మేయ్‌త్త కழలిణై" (తిరుమాలై-9) ఎన్ఱు అన్ద సౌలభ్యత్తైయే అనుసంధిత్తారితే ఆழ்వారుమ్.

(తృణచరానుగమ్) "కఱవైకళ్ పిన్ శెన్ఱు" (తిరుప్పావై-28) ఎన్గిఱపడియే ఇవ్వస్తువుక్కు తృణచరఙ్గళై ఎప్పోదు మనుగమిత్తు రక్షిక్కైయితే ఫలమ్. ఇఙ్గు తృణచరఙ్గళావన సంసారిగళ్ ఎఙ్గనే? ఎన్నిల్, తృణమ్ పోన్ఱ అసారమాన శబ్దాదివిషయఙ్గళైయే విరుమ్బి, అవற்றై భుజిక్కుమవరాగైయాలే సంసారిగళై తృణచరఙ్గళాగ చ్చొల్ల త్తట్టిల్లైయితే.

---

సకలవిధాలైన అజ్ఞానాలను నశింపచేస్తుందని భావం. "ఒడుఙ్గ అవన్‌కణ్ ఒడుఙ్గలు మెల్లామ్ విడుమ్" (ఆ భగవానుని విషయంలో అన్ని ఇంద్రియాలను చేరిస్తే జ్ఞానసంకోచాన్ని కల్గించే అవిద్యాదులన్నీ తీరుతాయి) అని ఆழ்వార్లు అనుసంధించారుకదా! "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే" (ఈ త్రిగుణాత్మకమైన, దివ్యమైన నా మాయ ఎవరికి దాటడానికి సాధ్యం కానిది. ఎవరు నన్ను ప్రపత్తి చేస్తారో వారే ఈ మాయను దాటుతున్నారు) అని భగవానుడు తానే అనుగ్రహించాడుకదా!

(ప్రణతదేహినామ్ పాపకర్శనమ్) ఈవాక్యం చరమశ్లోకార్థసంగ్రహంగా ఉన్న తీరు ఏమి? అని మన ఆచార్యులు పలు సార్లు అనుగ్రహించేవారు. "ప్రణతదేహినామ్" అన్నది పూర్వవాక్యార్థసంగ్రహంగా, "పాపకర్శనమ్" అన్నది ఉత్తరవాక్యార్థ సంగ్రహంగాకదా ఉంటుంది. ఇందువల్ల - ప్రపత్తిని చేసిన జీవుల పాపాన్ని నశింపజేయగల వస్తువు, ప్రపత్తిని చేసిన జీవులమైన మా పాపాన్ని సైతం పోగొట్టి, ఉద్దేశ్యాన్ని అనుగ్రహించకూడదా- అని భావం.

(తృణచరానుగమ్)- పశువుల వెనుక అనుసరించి నడిచేది - అని అర్థం. ఇదేకదా ఈ వస్తువునకు (భగవత్పాదాలకు) కల వైలక్షణ్యం. పరతత్త్వమై, సకలచేతనాచేతనాల పాపాన్ని నశింపజేయగల సహజశక్తిని కల్గిన వస్తువేకదా ఈ విధంగా తృణాచరాలను అనుసరించింది. ఎంత సౌలభ్యమో?- అని విద్దులవుతున్నారు. "కన్ఱినమ్ మేయ్‌త్త కழలిణై" (గో బృందాలను మేపిన భగవానుని శ్రీచరణద్వయం) అని ఆసౌలభ్యాన్నే అనుసంధించారుకదా ఆழ்వార్లు.

(తృణచరానుగమ్)- "కఱవైకళ్ పిన్ శెన్ఱు" (పాలిచ్చే గోవుల వెంట పోయి) అనే రీతిలో, ఈ వస్తువునకు (శ్రీపాదాలకు) తృణచరాలను ఎప్పుడూ అనుసరించి రక్షించడమే కదాఫలం. ఇక్కడ తృణచరాలు అంటే సంసారులే. ఏ విధంగా అంటే- తృణంవంటి అసారమైన శబ్దాదివిషయాలనే కోఱి, వాటిని అనుభవించేవారు కావడంవల్ల

అవర్గళై అనుగమిత్తు రక్షిక్కుమ్పడియా లే "తృణచరానుగమ్" ఎన్ఱు శొల్లుగిఱార్గళ్. "మగ్నానాం భవినాం భవార్ణవసముత్తారాయ" ఎన్గిఱపడియే భవార్ణవత్తిల్ నిమగ్నరాన సంసారిగళై రక్షిప్పదఱ్కు తానుమ్ కూడ విழுన్దు, అవర్గళై అనుసరిత్తు రక్షిక్కుమ్ స్వభావముడైయ "తిణ్ కழల్" (తిరువాయ్-1-2-10) యిఱే యిరుప్పదు. "సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం న స్త్రిధామన్! పాదాంభోజే వరద! భవతో భక్తినావం ప్రయచ్ఛ" (ముకుందమాల-14) ఎన్ఱు శ్రీకులశేఖరప్పెరుమాళు మనుసంధిత్తరుళినారిఱే.

(తృణచరానుగమ్) అన్ఱిక్కే, తృణ మెన్ఱు ఇక్షువాయ్, అత్తాలే "సర్వరసః" (ఛాందో-3-14-4) ఎన్ఱప్పడుగిఱ సర్వేశ్వరనాయ్, అవనైయే "ఉణ్ణుమ్ శోరు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయు మెల్లామ్ కణ్ణన్" (తిరువాయ్-6-7-1) ఎన్గిఱపడియే సర్వదేశ- సర్వకాల- సర్వావస్థైగళిలు మనుభవిత్తిరుక్కుమ్ పరమప్రపన్ననానవనై అనుగమిక్కుమదాయ్- ఎన్ఱపడి. "నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శినమ్, అనువ్రజామ్యహం నిత్యం పూయేయేత్యంఘ్రిరేణుభిః" ఎన్ఱు తానే అరుళిచ్చెయ్‌తానిఱే.

(తృణచరానుగమ్) స్వస్వాతంత్ర్యము, మహంకారలేశము మిన్ఱిక్కే తమ్మై తామ్ రక్షిప్పతఱ్కు అశక్తర్గళాయ్, తమ్ముడైయ సర్వరక్షణభారముమ్, ప్రవృత్తినివృత్తిగళెల్లామ్ పరాధీనమాయిరున్ద పశుక్కళైయే విరుమ్బి అనుగమిక్కు-మెన్ఱవుమామ్. ఇత్తాల్- స్వస్వాతంత్రమిన్ఱిక్కే, "పడియాయ్ కిడన్దున్ పవళవాయ్ కాణ్బేనే" (పెరుమాళ్-4-9) ఎన్ఱుమ్, "రాజ్యం చాహం చ రామస్య" (రామా-అర-10-9) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే అత్యంతపరతంత్రరాయిరున్ద పరమప్రపన్నరై అనుగమిక్కుమెన్ఱదాయ్ఱ్ఱు. ఇప్పడి సర్వాధికర్గళాన ఇవై ప్రపన్నరై అనుగమిక్కుమ్పడియాలే,

---

సంసారులను తృణచరాలుగా చెప్పడంలో అడ్డు లేదు. వారిని అనుసరించి రక్షించడంవల్ల "తృణచరానుగమ్" అని అంటున్నారు. "మగ్నానాం భవినాం భవార్ణవసముత్తారాయ" (సంసార సముద్రంలో మునిగిన సంసారుల ఉద్ధరణకోసం) అనే రీతిలో సంసారసముద్రంలో మునిగిన సంసారులను రక్షించడంకోసం తానుకూడ అందులో పడి, వారిని అనుసరించి, రక్షించే స్వభావం కల "తిణ్ కழల్" గా (దృఢం అయిన పాదాలుగా) కదా! ఉంటుంది. "సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం న స్త్రిధామన్! పాదాంభోజే వరద! భవతో భక్తినావం ప్రయచ్ఛ" (సంసారమనే గొప్ప సముద్రంలో మునిగి పోతున్న మాకు ఓ త్రిలోకనాథా! వరదా! నీ భక్తి అనే నావను ఆ సముద్రాన్ని దాటడం కోసం అనుగ్రహించు) అని కులశేఖరప్పెరుమాళ్‌కూడా అనుసంధించారుకదా!

(తృణచరానుగమ్)- లేక, తృణమంటే చెఱకు అని అర్థం చెప్పి, దానిచేత "సర్వరసః" అనబడే సర్వేశ్వరుడని అర్థం చెప్పి, అతనినే "ఉణ్ణుమ్ శోరు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్" (తినే అన్నం, తాగే జలం, అనుభవించే తాంబూలంవంటి భోగ్యవస్తువులు అన్నీ శ్రీకృష్ణుడే) అనే రీతిలో సర్వదేశ-సర్వకాల-సర్వావస్థలలోను అనుభవించే పరమప్రపన్నుడైనవానిని అనుసరించేదై- అని భావం. "నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శినమ్, అనువ్రజామ్యహం నిత్యం పూయేయేత్యంఘ్రిరేణుభిః" (దేనినీ అపేక్షించనివాడు, కాంతుడు, ఎవరిపట్ల వైరాన్ని లేనివాడు, సమదర్శి అయిన మునిని తన పాదరజస్సుతో పావనం చేస్తాడని నేను నిత్యం అనుసరిస్తాను) అని అంటూ తానే అనుగ్రహించాడుకదా!

(తృణచరానుగమ్)- స్వస్వాతంత్ర్యం, అహంకారలేశం లేకుండా తమను తాము రక్షించుకోవడానికి అశక్తులై, తమ సర్వరక్షణభారం, ప్రవృత్తినివృత్తులు అన్నీ పరాధీనమై ఉండే పశువులనే అభిమానించి అనువర్తిస్తుంది- అనికూడా భావం. ఇందువల్ల, స్వస్వాతంత్ర్యం లేకుండా, "పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే" (గడపగా పడి ఉండి నీ పగడపు మోవిని దర్శిస్తాను) అని, "రాజ్యం చాహం చ రామస్య" (నేను, రాజ్యం రెండూ రామునకు

"త్వదాశ్రితానామ్" (స్తోత్రరత్నమ్ -11) ఎన్గిఱ శ్లోకత్తిలే ఆళవన్దార్ అనుసంధిత్తపడియే సమస్తవైదికవిధిగళుమ్, జగత్సృష్టి- స్థితి -లయ సంసారవిమోచనాదిగళాన వ్యాపారఙ్గళెల్లామ్ ఇవరై పిన్ శెల్ల క్కడవైయాయితే ఇరుప్పదు.

(అనుగమ్) అవరుడైయ కృపైయై తాన్ లభిక్కైక్కు అవరై అనుసరిత్తు నడక్కుమ్బడి శొల్లుగిఱదు. తన్నై అవరనుగమిక్క, "ఉపస్థేయై రుపస్థితః" (రామా-ఆర- 10-9) ఎన్నుమవనుడైయ తిరువడియితే యిదు.

(శ్రీనికేతనమ్) ఇదు శ్రీనివాసమాయితే యిరుప్పదు. అత్తాలే శొల్లుగిఱార్గళ్. (శ్రీనికేతనమ్) ఇవళై యిట్టితే ఇవ్వస్తువై నిరూపిప్పదు. ఆశ్రితరై శొల్లుగిఱవిడత్తిలుమ్ "తిరుమాలడియార్" (తిరువాయ్- 5-6-11) ఎన్రితే శొల్లువదు. (శ్రీనికేతనమ్) ఇప్పడి ఎల్లామ్ శెయ్దదు, "సహధర్మచరీం శౌరేః సమ్మన్త్రితజగద్ధితామ్, అనుగ్రహమయీం వన్దే నిత్య మజ్ఞాతనిగ్రహామ్" (దయాశతకమ్-2) ఎన్నుమ్, "శ్రితాస్యన్యై స్సర్వైః" ఎన్నుమ్ శొల్లుగిఱపడియే కరుణాస్వరూపిణియాయ్, పురుషకారభూతైయాన పెరియపిరాట్టిక్కిరుప్పిడ మాగైయాలేయితే. "అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్" (రామా-అయో- 2-7-2) ఎన్నుమ్, "వనే నివత్స్యామి యథా పితు ర్గృహే తవైవ పాదా వుపగృహ్య సంయతః" (రామా- అయో) ఎన్ను మవళుక్కు నివాసమితే యిదు. "వడివిణై యిల్లా మలర్మగళ్ మఱ్ఱై నిలమగళ్ పిడిక్కుమ్ మెల్లడియై" (తిరువాయ్- 9-2-10) ఎన్గారితే ఆఴ్వారుమ్.

(శ్రీనికేతనమ్) అన్రిక్కే, కృపై ముదలాన సకలకల్యాణగుణనిలయ మెన్నవుమామ్. అన్రిక్కే, సకల జంతుక్కళుక్కుమ్ సకలసుఖఙ్గళ్ తరుగైక్కు నివాసభూమి ఎన్నవుమామ్. "మనోరథావాప్తిమహాసురద్రుమః" ఎన్ను శొల్లప్పట్టదితే. "శరణాగతసార్థవాహాశీలామ్" ఎన్ను మభియుక్తరు మనుసంధిత్తారితే.

---

శేషవస్తువులు) అనీ చెప్పే రీతిలో అత్యంతం పరతంత్రులై ఉండే పరమప్రపన్నులను అనుసరిస్తుందని అన్నట్లయింది. ఈ విధంగా అన్నిటికంటే గొప్పవి అయిన ఇవి (శ్రీపాదాలు) ప్రపన్నులను అనుసరించడంవల్ల "త్వదాశ్రితానామ్" అనే శ్లోకంలో ఆళవన్దార్ అనుసంధించిన రీతిలోనే, సమస్తవైదికవిధులు, జగత్సృష్టిస్థితి లయసంసారవిమోచనాదులైన అన్ని వ్యాపారాలు వీరిని అనుసరించవలసినవిగా కదా ఉంటాయి.

(అనుగమ్)- వారి కృపను తాను (భగవానుడు) పొందడానికి వారిని అనుసరించి నడిచే రీతిని చెబుతున్నది. తనను వారు అనుసరించగా, "ఉపస్థేయై రుపస్థితః" (నేను దరిచేరవలసినవారే నా దగ్గరకు వచ్చారు) అని పలికేవాని శ్రీపాదంకదా ఇది.

(శ్రీనికేతనమ్)- ఇది శ్రీనివాసంగాకదా ఉంటుంది. అందువల్ల "శ్రీనికేతనమ్" అని అంటున్నారు. (శ్రీనికేతనమ్) - ఈమెను పురస్కరించుకొనికదా ఈ వస్తువును (శ్రీపాదాలను) నిరూపించడం. ఆశ్రితులను చెప్పే చోటకూడా "తిరుమాలడియార్" (శ్రియఃపతి దాసులు) అనికదా చెప్పబడింది.

(శ్రీనికేతనమ్)- దీనిని అంతటిని చేసినది "సహధర్మచరీం శౌరేః సంమంత్రితజగద్ధితామ్, అనుగ్రహ మచయీం వందే నిత్య మజ్ఞాతనిగ్రహామ్" (కరుణారూపిణి, నిగ్రహం అనేది తెలియనిది, జగద్ధితాన్ని చక్కగా ఆలోచించేది, భగవానుని సహధర్మచారిణి అయిన లక్ష్మికి నమస్కరిస్తున్నాను) అని, "శ్రితాస్యన్యైః సర్వైః" (నీకంటే మిగిలిన అందఱు జీవులచే ఆశ్రయింపబడుతున్నావు) అని చెప్పే రీతిలో కరుణాస్వరూపిణియై, పురుషకారభూత అయిన లక్ష్మీదేవికి నివాసస్థానం కావడంచేతకదా! "అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్" (భూకంటకు లను - రాళ్ళను ముళ్ళను తొలగిస్తూ నీకు ముందు వెళ్ళగలను) అని, "వనే నివత్స్యామి యథా పితు ర్గృహే, తవైవ పాదా వుపగృహ్య సంయతః" (నీ శ్రీచరణాలను సేవిస్తూ నేను తండ్రి ఇంటిలోవలె వనంలో నివసిస్తాను)

(శ్రీనికేతనమ్) అన్టిక్కే, శ్రీ యెన్ఱు వేదమాయ్, అత్తై తనక్కు నివాసమాగవుమ్, అతుతనక్కు తాన్ నివాసమాగవుమ్ ఉడైయవనెన్ఱ పుమామ్. ఇత్తాల్ "చరణం పవిత్రం వితతం పురాణం యేన పూత స్తరతి దుష్కృతాని" (యజుర్వేదమ్-కాఠకమ్) ఎన్ఱుమ్, "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" (విష్ణుసూక్తమ్) ఎన్ఱుమ్ శ్రుతిప్రతిపాద్యమాయ్, "చరణకమలసంగాత్ రంగనాథస్య నిత్యం నిగమపరిమళం త్వం పాదుకే! నిర్వమంతీ, నియత మతిశయానా వర్తసే సావరోధం హృదయ మధివసంతీం మాలికాం వైజయంతీమ్" (పాదుకాసహస్రమ్-258) ఎన్గిఱపడియే నిగమత్తై స్రవిక్కిఱదెన్ఱు శొల్లవుమామ్. "శమదమగుణదాంతోదంతవైదేశికానాం శరణ మశరణానాం మాదృశాం మాధవస్య, పదకమల మిదం తే పాదుకే! రక్ష్య మాసీ దనుదయనిధనానా మాగమానాం నిధానమ్" (పాదుకాసహస్రమ్-397) ఎన్ఱుమ్, "విభావయన్త్యనన్యాః ప్రణవస్య ప్రణిధిం తమః ప్రణాదమ్" (పాదుకాసహస్రమ్) ఎన్ఱుమ్ శొల్లప్పట్టదిఱే. "అహ ముపరి సమస్తదేవతానా ముపరి మమైష విభాతి వాసుదేవః, తదిహ పరతరం న కించి దస్మా దితి వదసీవ పదావని ప్రణాదైః" (పాదుకా సహస్రమ్-397) ఎన్గిఱపడియే సకలదేవసారమాన అర్థమ్ స్థాపిత్తు వర్త్తిక్కైయితే ఇదుక్కు స్వరూపమ్. ఇదు ఆచార్యకృత్యత్తై నిర్వహిత్తు విళఙ్గానిన్ఱదే.

(ప్రణతదేహినాం పాపకర్షనం తృణచరానుగం శ్రీనికేతనమ్) ఆశ్రితర్గళై తన్ పక్కల్ నిన్ఱుమ్ విముఖరామ్బడి పణ్ణుగిఱ అహంకారత్తై నశిప్పిత్తు, సర్వసౌలభ్యమాన సిద్ధోపాయమాయ్, సకలవిరోధినిరసనపూర్వకమాగ స్వప్రాప్తియై

---

అని పలికే ఆమెకు నివాసంకదా ఇది. "వడివిణై యిల్లా మలర్ మకళ్ మఱ్ఱై నిలైమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై" (సాటి లేని రూపాన్ని కల లక్ష్మీదేవి, ఇంకా భూదేవి సంవాహనం చేసే మృదుపాదాలు) అని అన్నారుకదా ఆళ్వార్లు.

(శ్రీనికేతనమ్)- లేక, కృపమొదలైన సకలకల్యాణగుణనిలయం- అని కూడా భావం. "మనోరథావాప్తిమహాసురద్రుమః" (కోరికలను పొందడంలో గొప్ప కల్పవృక్షంవంటివాడు) అని చెప్పబడిందికదా! "శరణాగతసార్థవాహశీలామ్" (శరణాగతుల సమూహాన్ని నిర్వహించే స్వభావాన్ని కల్గినదానిని) అని అభియుక్తులు (శ్రీదేశికులు) కూడా అనుసంధించారు కదా!

(శ్రీనికేతనమ్)- లేక, శ్రీఅంటే వేదమై, దానిని తను నివాసంగాను, దానికి తాను నివాసంగాను కల్గినది- అనికూడా భావం. ఇందువల్ల "చరణం పవిత్రం వితతం పురాణం యేన పూత స్తరతి దుష్కృతాని" (ఏ చరణం చేత పవిత్రుడై పాపాలను దాటతాడో ఆచరణం పవిత్రమైనది, వితతమైనది, సనాతనమైనది) అని, "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" (మధువును స్రవించేది, ఉత్తమమైనది అయిన విష్ణువుయొక్క పదంలో) అని శ్రుతిచేత ప్రతిపాదింపబడినదై, "చరణకమలసంగాత్ రంగనాథస్య నిత్యం నిగమపరిమళం త్వం పాదుకే ! నిర్విశంతీ, నియత మతిశయానా వర్తతే సావరోధం హృదయ మధివసంతీం మాలికాం వైజయంతీమ్" (ఓ పాదుకా ! నిత్యం శ్రీరంగనాథునియొక్క శ్రీచరణపద్మాల సంబంధంవల్ల నీవు నిగమపరిమళాన్ని వెదజల్లుతూ అంతఃపుర జనంతో కూడిన ఆ రంగనాథుని వక్షస్సును అధివసించే వైజయంతీమాలికను మించి ఉన్నావు) అని చెప్పే రీతిలో నిగమాన్ని స్రవిస్తున్నదని కూడా చెప్పవచ్చు. "శమదమగుణదాంతోదంతవైదేశికానాం శరణమ శరణానాం మాదృశాం మాధవస్య, పదకమల మిదం తే పాదుకే! రక్ష్య మాసీ దనుదయనిధనానా మాగమానాం నిధానమ్" (ఓ పాదుకా! శమం, దమం మొదలైన సద్గుణాలకు చాలా దూరంలో ఉన్నవారు, ఏ గతి లేనివారు అయిన మావంటివారికి ఉపాయమై, జన్మనిధనాలు అనే రెండు లేని వేదాలకు నిధానమైన ఈ మాధవుని పాదానికి నీవు రక్షకమై ఉన్నావు) అని, "విభావయంత్యనన్యాః ప్రణవస్య ప్రణిధిం తవ ప్రణాదమ్" (ప్రణవానికి గొప్ప నిధి, అజ్ఞానాన్ని పోగొట్టేది అయిన పాదుకను అనన్యభక్తితో కొలుస్తున్నారు) అని చెప్పబడుతున్నదికదా! "అహ ముపరి

ప్రసాదిక్కత్తక్క దయాదిగుణఙ్గళుక్కు ఇరుప్పిడమాన తిరువడి- ఎన్ఱు శొల్లవుమామ్. ఇత్తాల్ రహస్యత్రయార్థప్రతిపాదక మెన్ఱపడి.

**(ఫణిఫణార్పితమ్)** విషపూరితమాయ్, అతిక్రూరమాన కాళియనుడైయ ఐన్దు తలైగళ్ మేలే పాయ్న్దు, అవై శిదైయ నృత్యమ్ పణ్ణినదాయ్- ఎన్ఱపడి. ఇదుక్కు ఫణియై కాణ్గవే అతినుడైయ ఫణఙ్గళై శిదైత్తు అత్తై నశిప్పిక్కైయిఱే కృత్యమ్. "ఐన్దలైయ పైన్నాగత్తలై ప్పాయ్న్దవనే వున్నై పల్లాణ్డు కూఱుదుమే" (తిరుప్పల్లాణ్డు-10) ఎన్ఱు ఇచ్చెయ్గైక్కు ప్రేమత్తాలే పణ్ణిన కృత్యమాగైయాలే అనుసంధిక్కిఱార్గళ్. ఇత్తాల్ - అతిభయంకరమాన అహంకారమాగిఱ విషత్తోడే విఞ్జియిరుక్కిఱ సంసారమాగిఱ భోగియుడైయ ఆత్మస్వరూపనాశకమాన, శబ్దాదిగళాన ప్రకృతివిషయఙ్గళాగిఱ భోగఙ్గళ్ ఉరుమాయ్న్దు పోమ్బడి పణ్ణువదాయ్ -ఎన్ఱపడి

**(తే పదాంబుజమ్)** "పతిం విశ్వస్యాత్మేశ్వరమ్" (తైత్తి. నారా- 11) ఎన్గిఱపడియే సర్వస్వామియాన దేవరీరుడైయ తిరువడిత్తామరైయై. (పదాంబుజమ్) సౌందర్య- సౌగన్ధ్య- సౌకుమార్యాదిగళాలే తామరై ఒరు పోలియాన తిరువడియై. ఇఙ్గు "తే" ఎన్గైయాలే తిరువడియుడైయ ఉద్దేశ్యత్వముమ్, అంబుజసామ్యత్తాలే, అనుద్దేశ్యమాయిరున్దదే యాకిలుమ్, విడవొణ్ణాద భోగ్యతాతిశయముమ్ శొల్లప్పట్టదాయ్త్తు. అత్తాలేయిఱే "మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా ! ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు" (తిరుప్పల్లాణ్డు-1) ఎన్ఱు పెరియాళ్వార్ ప్రథమత్తిలే మంగళాశాసనమ్ పణ్ణి, "పాదక్కమలఙ్గళ్

---

సమస్తదేవతానా ముపరి మమైష విభాతి వాసుదేవః, తదిహ పరతరం న కించి దస్మాదితి వదసీవ పదావని! ప్రణాదైః" (దేవతలకు అందరిపైన నేనున్నాను, నాపైన వాసుదేవుడున్నాడు. అందువల్ల వాసుదేవునికంటే పరతత్త్వం ఇంకొకటి లేదు - అని నీ ధ్వనులతో ఓ పాదుకా! తెలియజేస్తున్నట్లుగా ఉన్నావు) అనే రీతిలో సకలవేదసారమైన అర్థాన్ని స్థాపించి ప్రవర్తించడమేకదా దీనికి స్వరూపం. ఇది ఆచార్యకృత్యాన్ని నిర్వహించి ప్రకాశిస్తున్నదే!

**(ప్రణతదేహినాం పాపకర్శనం తృణచరానుగమ్ శ్రీనికేతనమ్)**- ఆశ్రితులను తనపట్లనుండి విముఖులు అయేటట్లు చేసే అహంకారాన్ని నశింపజేసి, సర్వసులభం అయిన సిద్ధోపాయమై, సకలవిరోధినిరసనపూర్వకంగా తన ప్రాప్తిని అనుగ్రహించగల్గే దయాదిగుణాలకు నివాసం అయిన శ్రీపాదం- అనికూడా చెప్పవచ్చు. ఇందువల్ల రహస్యత్రయార్థప్రతిపాదకం- అని భావం.

**(ఫణిఫణార్పితమ్)**- విషంతో నిండి, అతిక్రూరం అయిన కాళియుని అయిదు తలలపైకి దూకి అవి చితికిపోయేటట్లు నృత్యం చేసినదై -అని భావం. దీనికి (శ్రీపాదానికి) పామును చూడగానే దాని పడగలను చిదిమి, దాని నశింపజేయడమేకదా కృత్యం "ఐన్దలైయ పైన్నాకత్తలై ప్పాయ్న్దవనే! ఉన్నై పల్లాణ్డు కూఱుదుమే" (అయిదు తలలను కల కాళియునిపై దూకి నర్తించినవాడా! నీకు పల్లాండు పాడతాము) అని అంటూ ఈ లీలకు పల్లాండు పాడారుకదా ఆళ్వార్లు. ఆ రీతిలోనే వీరుకూడా తమను రక్షించడంకోసం సహజమైన ప్రేమచే చేసిన కృత్యం కాబట్టి అనుసంధిస్తున్నారు. ఇందువల్ల అతిభయంకరం అయిన అహంకారం అనే విషంతో వృద్ధి చెందిన సంసారం అనే సర్పంయొక్క, ఆత్మస్వరూపాన్ని నశింపజేసే శబ్దాదులనే (ప్రకృతి విషయాలనే) భోగాలు రూపుమాసిపోయేటట్లుగా చేయగలిగినదై- అని భావం.

**(తే పదాంబుజమ్)**- "పతిం విశ్వస్యాత్మేశ్వరమ్" (విశ్వానికి పతి, తనకు తానే ఈశ్వరుడు) అనే రీతిలో సర్వస్వామివి అయిన నీ శ్రీపాదపద్మాన్ని అని అర్థం.

**(పదాంబుజమ్)**- సౌందర్యసౌగంధ్య సౌకుమార్యాదులలో తామరపూవుతో ఏదో ఒక రీతిలో పోలికను కల్గిన శ్రీపాదాన్ని. ఇచట "తే" అనడంవల్ల శ్రీపాదాల ఉద్దేశ్యత్వం, అంబుజసామ్యంచేత అవి అనుద్దేశ్యమై

**వన్దు కాణీరే, పవళవాయీర్ వన్దు కాణీరే" (పెరియాళ్వార్- 1-2-1) ఎన్దు పిఱర్క్కు వన్దు సేవిక్కుమ్బడి ఉపదేశిత్తార్. "పైయత్తుయిన్ద పరమనడి పాడి" (తిరుప్పావై-2) ఎన్దుమ్, "అన్ఱివ్వులగమళన్దాయ్ అడి పోత్ఱి" (తిరుప్పావై- 24) ఎన్దు మాణ్డాళుమ్, "మాల్పాదమే యడైన్దు నాళు ముయ్మ్మినో" (తిరుచ్చన్ద- 81) ఎన్దు తిరుమழிశై ప్పిరానుమ్, "తిరుక్కమలపాదమ్ వన్దెన్ కణ్ణినుళ్ళన వొక్కిన్ఱదే" (అమలనాది-1) ఎన్దు తిరుప్పాణ్ ఆళ్వారుమ్, "పరమనాది ఎమ్బునిముకిల్ వణ్ణనెన్దెణ్ణి నిన్ఱిమైయోర్గళ్ పిరమనోడు శెన్ఱడితొழுమ్ పెరున్దగై ప్పిరిది శెన్ఱడై నెఞ్జే !" (పెరియ తిరు-1-2-8) ఎన్దు తిరుమజ్గైయాళ్వారుమ్, "పామ్బణైయాన్ పాతమ్ అడై యాழி నెఞ్జే ! యఱి" (ముదల్ తిరు-21) ఎన్దు పొయ్గైయాళ్వారుమ్, "తழలెడుత్త పోరాழி యేన్దినాన్ పొన్మలర్ చ్చేవడియే ఓరాழி నెఞ్జే ! యుగన్దు" (ఇరణ్డామ్ తిరు-7) ఎన్దు పూదత్తాళ్వారుమ్, "ఇన్ఱే కழల్ కణ్డేనేழ் పిఱప్పుమ్ యానఱుత్తేన్" (మూన్ఱామ్ తిరు-2) ఎన్దు పేయాళ్వారుమ్, "కత్తిన మ్మెయ్త్త వెన్ఱై కழలిణై పణిమినీరే" (తిరుమాలై-9) ఎన్దుమ్, "తుయరఱు శుడరడి తొழுదెழன్మననే !" (తిరువాయ్-1-1-1) ఎన్దుమ్, "తిరునారణన్దాళ్ కాల మ్బెఱ చ్చిన్దిత్తుయ్మ్మినో" (తిరువాయ్-4-1-1) ఎన్దుమ్- ఇప్పడి మఱ్ఱై ఆళ్వార్గళెల్లారుమ్ ఇత్తిరువడియిలే అభినివేశమ్ పణ్ణిప్పోన్దార్గళ్.**

**(కృణు కుచేషు నః) దేవరీర్ పక్కల్ అనన్యార్హదాసభూతరాయ్, "వడివిణై యిల్లా మలర్మగళ్ మఱ్ఱై నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై, కొడువినై యేనుమ్ పిడిక్క నీ యొరునాళ్ కూవుదల్ వరుదల్ శెయ్యాయే"**

ఉన్నదైనా, విడువలేని వాటి భోగ్యతాతిశయం చెప్పబడినది అయింది. అందువల్లనే కదా **"మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా! ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు"** (మల్లులను శాసించిన బలిష్ఠమైన బాహువులను కల మణివర్ణా! నీ అందమైన శ్రీచరణాలకు మంగళం) అంటూ పెరియాళ్వార్లు మొదటగా మంగళాశాసనాన్ని చేసి, **"పాదక్కమలజ్గళ్ వన్దు కాణీరే, పవళవాయీర్ వన్దు కాణీరే"** (పాదపద్మాలను వచ్చి చూడండి. పగడపు మోవిని చూడండి) అని ఇతరులకు (వారు) వచ్చి సేవించేటట్లు ఉపదేశించారు. **"పైయిత్తుయిన్ద పరమ నడి పాడి"** (ఆదిశేషునిపై తూగుతున్న పరమాత్మ శ్రీచరణాన్ని కీర్తించి) అని, **"అన్ఱివ్వులకు మళన్దాయ్ అడి పోత్ఱి"** (అపుడు ఈ లోకాలను కొలిచిన శ్రీచరణానికి మంగళం) అని గోదాదేవి **"మాల్ పాదమే యడైన్దు నాళుముయ్మ్మినో!"** (ఆశ్రితవ్యామోహాన్ని కల్గినవాని పాదాన్ని ఆశ్రయించి ఉజ్జీవించండి) అని తిరుమழிశైయాళ్వార్లు, **"తిరుక్కమలపాదమ్ వన్దు ఎన్ కణ్ణినుళ్ళన వొక్కిన్ఱదే"** (స్వామి శ్రీచరణకమలం వచ్చి నాకన్నుల లోపల నిలచి పోయిందే!) అని తిరుప్పాణ్ ఆళ్వార్లు, **"పరమ నాది యెమ్బునిముకిల్వణ్ణ నెన్దెణ్ణి నిన్ఱిమైయోర్కళ్ పిరమనోడు శెన్ఱడి తొழுమ్ పెరున్దకై పిరిది శెన్ఱడై నెఞ్జే!"** (పరమాత్మ, జగత్కారణభూతుడు, నా చల్లని మేఘంవంటివాడు - అని దేవతలు బ్రహ్మతో పాటు వచ్చి శ్రీచరణాలను సేవించే గొప్ప బదరిని చేరి ఓ మనసా! ఆశ్రయించు) అని తిరుమజ్గై యాళ్వార్లు, **"పామ్బణైయాన్ పాతమ్ అడైయాழி నెఞ్జే! యఱి"** (గంభీరమైన మనసా! ఆదిశేషశయనుని శ్రీచరణాన్ని ఆశ్రయించు. దీనిని తెలిసికో) అని పొయ్గై ఆళ్వార్లు, **"తழలెడుత్త పోరాழி యేన్దినాన్ పొన్మలర్ చ్చేవడియే ఓరాழி నెఞ్జే ! యుకన్దు"** (నిప్పులు వెలువరించే సుదర్శనాన్ని ఎత్తినవాని బంగారంవంటి, తామరపూవువంటి అందమైన శ్రీచరణాన్నే ఓ మనసా! ఆశపడి అనుసంధించు) అని పూదత్తాళ్వార్లు, **"ఇన్ఱే కழల్ కణ్డేనే ఏழ் పిఱప్పుమ్ యా నఱుత్తేన్"** (ఇపుడే భగవానుని శ్రీచరణాలను దర్శించాను. ఏడేడు జన్మలను నేను ఛేదించాను) అని పేయాళ్వార్లు, **"కత్తినమ్ మేయ్త్త వెన్ఱైకழలిణై పణిమినీరే"** (గోబృందాన్ని మేపిన జగత్పిత పాదద్వంద్వాన్ని సేవించండి) అని, **"తుయ రఱు శుడరడి తొழுదెழனన్మననే!"** (దుఃఖాన్ని తీర్చే, ప్రకాశించే భగవానుని శ్రీచరణాలను ఓ మనసా! నమస్కరించు) అని, **"తిరునారణన్తాళ్ కాలమ్బెఱ చ్చిన్దిత్తుయ్మ్మినో !"** (శ్రీమన్నారాయణుని శ్రీచరణాలను సర్వదా చింతించి ఉజ్జీవించండి) అని ఈ విధంగా మిగిలిన ఆళ్వార్లు కూడా ఈశ్రీపాదాల్లో అభినివేశాన్ని పొందారు.

(తిరువాయ్-9-2-10) ఎన్గిఱపడియే దేవరీరుడైయ తిరువడిగళిడత్తిలే అత్యంతాభినివేశత్తై ప్పణ్ణిక్కొణ్డిరుక్కిఱ ఎఙ్గళుడైయ హృదయఙ్గళిలే స్థావరప్రతిష్ఠైయామ్బడి వైక్క వేణుమెన్ఱు ప్రార్థిక్కిఱార్గళ్.

(తే పదాంబుజం కృణు కుచేషు నః) లోకఙ్గళిలే స్త్రీజనఙ్గళ్ భర్తృవిరహజమాన హృదయతాపమ్ శమిక్కైక్కు అత్యంతశీతలమాన తామరప్పూవై కుచఙ్గళిలే వైత్తు ధరిక్కుమాప్పోలే, ఎఙ్గళుక్కు వల్లభరాన దేవరీరుడైయ అత్యంతశీతలమాన తిరువడిత్తామరైయై విశ్లేషతాపత్తాలే అనుతపిక్కిఱ ఎఙ్గళుడైయ కుచఙ్గళిలే వైత్తు ధరిప్పిత్తరుళవేణుమెన్ఱు ప్రార్థిక్కిఱారాగవుమామ్. "అమృతస్యన్దిని పాదపంకజే" (స్తోత్రరత్నమ్-27) ఎన్ఱుమ్, "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" (విష్ణుసూక్తమ్) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే ఇదువుమ్ మధుస్యన్దియాయిత్తే యిరుప్పదు.

(ఫణిఫణార్పితం తే పదాంబుజం కృణు కుచేషు నః) కామమోహఙ్గళుక్కు నివాసభూమియాయ్, అతిభయంకరమాన సంసారమాగిఱ కాళియనుడైయ శబ్దాదిగళాగిఱ ఫణఙ్గళిలే యేఱి, నృత్యమ్ పణ్ణి, అవై శిదైక్కుమ్బడి పణ్ణిన దేవరీరుడైయ తిరువడిత్తామరైగళై క్కొణ్డు, అనన్యార్హదాసభూతరాన ఎఙ్గళుడైయ కామమోహఙ్గళిలే వైత్తు. అవఱ్ఱై దేవరీరుడైయ తిరువడిగళుక్కు శేషమామ్బడి పణ్ణవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్గళెన్ఱవుమామ్. పురుషర్గళుక్కు కామమోహజనకఙ్గళాగైయాలే కుచఙ్గళై ఇఙ్గు కామమోహఙ్గళాక నిరూపిక్క త్తట్టిల్లైయిత్తే, "తజ్జన్యత్వాత్తద్వ్యపదేశః" (లోకన్యాయమ్) ఎన్గిఱ న్యాయత్తాలే. ఇత్తాల్ - ఎఙ్గళుడైయ కామమోహాదిగళెల్లామ్ దేవరీరుడైయ తిరువడియిడత్తిలేయామ్బడి పణ్ణి అరుళవేణుమెన్ఱదాయ్ ఱ్ఱు. "తదర్పితాఖిలాచారస్సన్ కామ క్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్" (నారదభక్తిసూత్రాణి) ఎన్ఱు శ్రీమన్నారదభగవానాలే భక్తిసూత్రఙ్గళిలే శొల్లప్పట్టదిత్తే".

---

(కృణు కుచేషు నః) - నీ పట్ల అనన్యార్హదాసలై, "వడివిణై యిల్లా మలర్మకళ్ మఱ్ఱై నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై, కొడువినైయేనుమ్ పిడిక్క నీ యొరునాళ్ కూవుదల్ వరుదల్ శెయ్యాయే" (రూపంలో సాటి లేని లక్ష్మీదేవి, ఇంకా భూదేవి సంవాహనం చేసే మృదువైన శ్రీపాదాలను క్రూరకర్మలను చేసిన నేను కూడా సంవాహనం చేసేటట్లుగా పిలవడం, రావడం చేయవయ్యా!) అనే రీతిలో దేవరవారి శ్రీపాదాల చెంత అత్యంత అభినివేశాన్ని కల్గి ఉన్న మా హృదయాలలో స్థావరప్రతిష్ఠ అయేటట్లు పెట్టాలి - అని ప్రార్థిస్తున్నారు.

(తే పదాంబుజం కృణు కుచేషు నః)- లోకంలోని స్త్రీలు భర్తృవిరహంవల్ల కల్గిన హృదయతాపం తీరడంకోసం చాలా చల్లని తామరపూవును కుచాలపై పెట్టుకొని ధరించినట్లే, మాకు ప్రియుడవైన నీ, అత్యంతశీతలం అయిన శ్రీపాదపద్మాన్ని విశ్లేషతాపంతో అనుతపించే మా కుచాలలోపెట్టి ధరింపజేయాలని ప్రార్థిస్తున్నారని కూడా భావం. "మధుస్యందిని పాదపంకజే" (మధువును చిందించే శ్రీపాదపద్మంలో) అని, "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" (మధువును స్రవించే గొప్పదైన విష్ణువుయొక్క శ్రీపాదంలో) అని చెప్పే రీతిలో ఇదికూడా తేనెను స్రవించేదిగాకదా ఉంటుంది.

(ఫణిఫణార్పితం తే పదాంబుజం కృణు కుచేషు నః) -కామమోహాలకు నివాసభూమియై, అతిభయంకరం అయిన సంసారం అనే కాళియునియొక్క శబ్దాదులనబడే పడగలపైకి ఎక్కి, నాట్యం చేసి, అవి చితికిపోయేటట్లు చేసిన నీ శ్రీపాదాలను గొని అనన్యార్హదాసభూతలైన మా కామమోహాలకు విషయంగా చేసి, వాటిని దేవరవారి శ్రీపాదాలకు శేషం అయేటట్లుగా చేయాలని ప్రార్థిస్తున్నారనికూడా భావం. పురుషులకు కామమోహాలను కలుగజేసేవి కాబట్టి కుచాలను ఇక్కడ కామమోహాలుగా నిరూపించడంలో అడ్డు లేదుకదా!; "తజ్జన్యత్వాత్ తద్వ్యపదేశః" (దానినుండి పుట్టినందువల్ల దాని పేరుతో వ్యవహారం) అనే న్యాయంద్వారా. ఇందువల్ల మా కామమోహాదులన్నీ

**(కృణు కుచేషు నః)** అన్ఱిక్కే, దేవరీరుక్కు కామమోహజనకఙ్గళాన ఎఙ్గళుడైయ కుచఙ్గళిలే దేవరీరుక్కు ఉగప్పాగ ఉన్ తిరువడిత్తామరైగళై వైత్తు అలఙ్కరిక్కవేణు మెన్ఱు యాచిక్కిఱార్గళాగవుమామ్. **"రాధా పునాతు జగదచ్యుతదత్తచిత్తా మంథాన మాకలయతీ దధిరిక్తపాత్రే, తస్యా స్తనస్తబకచంచలలోలనేత్రో దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధే" (కృష్ణకర్ణామృతమ్)** ఎన్గిఱపడియే ఇవనై స్వవ్యాపారత్తిల్ నిన్ఱుమ్ మఱన్దు నిఱ్కుమ్బడి పణ్ణుగిఱ అవయవఙ్గళిఱే ఇవై. ఇవ్విడత్తిల్ కుచఙ్గళాగ శొన్నవై దాసభూతనానవనుడైయ జ్ఞానభక్తిగళ్. అనన్యార్హదాసభూతనానవనుడైయ జ్ఞానభక్తిగళేయిఱే సర్వేశ్వరనుక్కు ప్రీతివిషయఙ్గళాగిఱన. ఇత్తాల్- ఎఙ్గళుడైయ జ్ఞానభక్తిగళుక్కు దేవరీరుడైయ తిరువడిత్తామరైగళే విషయమామ్బడి కటాక్షిత్తరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్గళ్ . **"తిరుమోగూరాత్తన్ తామరైయడి యన్ఱి మ*ఱ్ఱి*ల మరణే" (తిరువాయ్- 10-1-6)** ఎన్గిఱపడియే దేవరీరుడైయ తిరువడిత్తామరైయై ఎఙ్గళుక్కు అరణాగ పణ్ణవేణు మెన్ఱు శొల్లుగిఱార్గళెన్ఱవుమామ్.

**(కృంధి హృచ్ఛయమ్)** ఎఙ్గళుడైయ హృదయత్తిలే కుడికొణ్డిరుక్కిఱ ప్రకృతివిషయమాన కామత్తై నశిప్పిత్తరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్గళ్. అవనుడైయ తిరువడిత్తామరై హృదయగతమాగవే, కామనుక్కు అతిలే నివసిక్క విరకుణ్డో ? **"మదన ! పరిహర స్థితిం మదీయే మనసి ముకున్ద పదారవిన్దధామ్ని, హరనయనకృశానునా కృశోఽసి స్మరసి న చక్రపరాక్రమం మురారేః" (ముకుందమాల-29)** ఎన్ఱు శ్రీకులశేఖరప్పెరుమాళ్ అనుసంధిత్తారిఱే.

**(కృంధి హృచ్ఛయమ్)** అన్ఱిక్కే, ఇప్పడి సకలేతరవిలక్షణమాయ్, అఖిలకల్యాణగుణాకరమాయ్, శ్రీనికేతనమాయ్, ప్రాప్తమా యిరున్ద దేవరీరుడైయ తిరువడిత్తామరైయై ఎఙ్గళుడైయ హృదయపంకజఙ్గళిలే

---

తమ శ్రీపాదాల విషయంలోనే అయేటట్లుగా చేసి అనుగ్రహించాలని అన్నట్లయింది. **"తదర్పితాఖిలాచార స్సన్ కామక్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్"** (అతని విషయంలో సమర్పించిన అన్న ఆచారాలను కలవాడై, అతని యందే క్రోధం, అభిమానం మొదలైన వానిని కల్గి ఉండాలి) అని శ్రీమన్నారదభగవానునిచేత భక్తిసూత్రాలలో చెప్పబడింది కదా!

**(కృణు కుచేషు నః)** -లేక, దేవరవారికి కామమోహాలను కల్గించే మా కుచాలలో దేవరవారికి సంతోషకరంగా నీ శ్రీపాదాలను పెట్టి అలంకరించాలని యాచిస్తున్నారని కూడా భావం. **"రాధా పునాతు జగదచ్యుతదత్తచిత్తా, మంథాన మాకలయతీ దధిరిక్తపాత్రే తస్యా స్తనస్తబకచంచలలోలనేత్రః దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధే"** (అచ్యుతుని విషయంలో సమర్పించిన మనస్సును కల్గినది, పెరుగు లేని పాత్రను చిలుకుతున్నది అయిన రాధ జగత్తును పావనం చేయుగాక. ఆమెయొక్క మొగ్గలవంటి స్తనాలలో చంచలమైన దృష్టిని శ్రీకృష్ణభగవానుడు కూడా పాలు పితికే భావనతో ఎద్దును కట్టివేశాడు) అనే రీతిలో ఇతణ్ణి తన వ్యాపారాలనుండి మఱచి నిలిచేటట్లు చేసే అవయవాలుకదా ఇవి. ఇక్కడ కుచాలని చెప్పినది దాసుని జ్ఞానభక్తులు. అనన్యార్హదాసభూతులైనవారి జ్ఞానభక్తులేకదా సర్వేశ్వరుని ప్రీతికి విషయాలు అవుతాయి. ఇందువల్ల మా జ్ఞానభక్తులకు నీ శ్రీపాదపద్మాలే విషయాలు అయేటట్లు కటాక్షించాలని ప్రార్థిస్తున్నారు. **"తిరుమోకూరాత్తన్ తామరైయడి యన్ఱి మ*ఱ్ఱి*ల మరణే"** (తిరుమోకూర్‌లోని ఆప్తుడైన స్వామి శ్రీచరణపద్మాలు తప్ప ఇంకొక రక్షకం లేదు) అనే రీతిలో నీ శ్రీపాదాలను మాకు రక్షకంగా చేయాలని అంటున్నారనికూడా భావం.

**(కృంధి హృచ్ఛయమ్)**- మా హృదయంలో నివాసం ఏర్పరచుకొని ఉన్న ప్రకృతివిషయం అయిన కామాన్ని నశింపజేయాలని ప్రార్థిస్తున్నారు. అతని శ్రీపాదాలు హృదయగతం కాగానే, మన్మథునకు అందులో (మనస్సులో) నివసించే వీలుందా? **"మదన ! పరిహర స్థితిం మదీయే మనసి ముకుందపదారవిందధామ్ని, హరనయనకృశానునా**

నిత్యవాసమామ్బడి కటాక్షిత్తు, దేవరీరుడైయ విశ్లేషవ్యసనత్తాలే "ఎన్నాళ్ యానున్నై యిని వన్దు కూడువనే!" (తిరువాయ్-3-2-1) ఎన్డుమ్, "తేర్ కడవియ పెరుమాన్ కనైకళ్లల్ కాణ్బదెన్దుకొల్! కణ్గళే" (తిరువాయ్-3-6-1) ఎన్డుమ్ శొల్లుగిఱపడియే ఎఙ్గళై కృశీభూతరాగ పణ్ణుగిఱ హృదయగతమాన దుఃఖత్తై పోక్కి, "మాణియాయ్ నిలఙ్కొణ్డ మాయన్ ఎన్నప్పన్ తన్ మాయఙ్గళే కాణు మెన్నెఞ్జుడైయే నెనక్కిని యెన్న కలక్క ముణ్డే ?" (తిరువాయ్-6-4-8) ఎన్గిఱపడియే దాసభూతరాన ఎఙ్గళై యుగప్పిత్తరుళవేణు మెన్డు ప్రార్థిక్కిఱార్ గళెన్డవుమామ్.

ఏழாమ్ శ్లోకమ్ ముற்றிற்று

## ఎట్టామ్ శ్లోకమ్

అవ :- ఇప్పడి దేవరీరుడైయ తిరువడిగళై ఎఙ్గళుడైయ హృదయఙ్గళిలే నిత్యవాసమామ్బడి పణ్ణి, కామక్రోధాదిగళై నశిప్పిత్తు ఎఙ్గళుక్కు, ధారకమాగ సకల జగన్మోహనమాన శ్రీసూక్తిగళాలే ప్రకాశిక్కిఱ ఉన్నుడైయ తిరువధరామృతపానత్తై పణ్ణువిత్తు, ఎఙ్గళై ఉజ్జీవిప్పిక్కవేణు మెన్డు ప్రార్థిక్కిఱారిన్ద శ్లోకత్తాలే, ఇవర్ గళ్ ఇత్తాల్లిన్ది జీవియార్ గళాగైయాలే. "ఉన్ వాయముదమ్ తన్దు" (తిరువాయ్-10-3-5) ఎన్డు నమ్మాழ்వార్ ప్రార్థిత్తపడియే ఇవరుమ్ ప్రార్థిక్కిఱార్ గళ్. "మా ముపేత్య పున ర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్, నాప్నువంతి మహాత్మానో సంసిద్ధిం పరమాం గతాః" (భగ-8-15) ఎన్గిఱపడియే తన్నై సేవిత్తవర్ గళుక్కు, దుఃఖాలయమాయ్, అశాశ్వతమా యిరున్ద

---

కృశోఽసి స్మరసి న చక్రపరాక్రమం మురారేః" (ఓ మదనా! ముకుంద పదారవిందాలకు నిలయం అయిన నామనస్సులో నివసించడం మానుకో. శివుని నేత్రాగ్నివల్ల ఇప్పటికే బక్కచిక్కి ఉన్నావు. మురారియొక్క సుదర్శనచక్రపరాక్రమాన్ని నీవు స్మరించడం లేదే.) అని శ్రీకులశేఖరప్పెరుమాళ్ అనుసంధించారుకదా!

**(కృంధి హృచ్ఛయమ్)-** లేక, ఈ విధంగా సకలేతరవిలక్షణమై, అఖిలకల్యాణగుణాలకు ఆకరమై, శ్రీనికేతనమై, ప్రాప్తమై ఉన్న నీ శ్రీపాదాలను మా హృదయాలలో నిత్యవాసం అయేటట్లు కటాక్షించి, నీ విరహక్లేశంచేత **"ఎన్నాళ్ యానున్నై యిని వన్దు కూడువనే !"** (ఏనాడు నిన్ను ఇక నేను కలవగలను ?) అని, **"తేర్ కడవియపెరుమాన్ కనైకళ్లల్ కాణ్బదెన్దుకొల్ ! కణ్గళే"** (అర్జున రథాన్ని నడపిన స్వామియొక్క శ్రీచరణాలను నా కన్నులు దర్శించడం ఎపుడో !) అని చెప్పేటట్లు, మమ్ములను కృశించినవారినిగా చేసే (మా) హృదయగతం అయిన దుఃఖాన్ని పోగొట్టి, **"మాణియాయ్ నిలఙ్కొణ్డమాయన్ ఎన్నప్పన్తన్ మాయఙ్గళే, కాణు మెన్నెఞ్జుడైయేన్ ఎనక్కిని యెన్న కలక్క ముణ్డే ?"** (బ్రహ్మచారిరూపుడై లోకాలను కొలిచిన ఆశ్చర్యచేష్టితుడైన, నా స్వామియొక్క ఆశ్చర్యకరలీలలను దర్శించే మనస్సును కలవాడనయ్యాను. ఇక నాకు ఏదుఃఖం ఉంటుంది?) అన్నట్లు దాసభూతలైన మమ్ములను సంతోషింపజేయాలని ప్రార్థించాలని అంటున్నారనికూడా భావం.

ఏడవ శ్లోకం ముగిసింది

## ఎనిమిదవ శ్లోకం

అవ :- ఈ విధంగా దేవరవారి శ్రీపాదాలను మా హృదయాలలో నిత్యవాసం అయేటట్లు చేసి, కామక్రోధాదులను నశింపజేసి, మాకు ధారకంగా సకలజగత్తును మోహింపజేసే శ్రీసూక్తులతో ప్రకాశించే నీ అధరామృతపానాన్ని చేయించి, మమ్ములను ఉజ్జీవింపజేయాలని ప్రార్థిస్తున్నారు- ఈ శ్లోకంలో- వీరు దీనితో తప్ప జీవించరు కాబట్టి, **"ఉన్ వాయముదమ్ తన్దు"** (నీ అధరామృతాన్ని అనుగ్రహించి) అని నమ్మాழ்వార్లు ప్రార్థించిన రీతిలోనే వీరుకూడా ప్రార్థిస్తున్నారు. **"మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్, నాప్నువంతి మహాత్మానో సంసిద్ధిం పరమాం**

పునర్జన్మత్తై నశిప్పిత్తు, అపునరావృత్తి లక్షణమాయ్, నిరతిశయానందయుక్తమాన పరమపదత్తై ప్రసాదిక్కు మమృతమిఱే యిదు.

మధురయా గిరా వల్గువాక్యయా బుధమనోజ్ఞయా పుష్కరేక్షణ ।
విధికరీ రిమా వీర! ముహ్యతీ రధరశీధునాఽప్యాయయస్వ నః ॥

**(మధురయా గిరా)** మధురమేయాన వాక్కాలే. మధురమెన్నుమ్, ఇవనుడైయ పేచ్చెన్నుమ్ ప్రత్యేకమాగ ఇరణ్డిల్లై కాణ్. మధుర మెల్లామ్ ఇవ్వడివుకొణ్డాప్పోలే కాణుమ్ ఇవనుడైయ పేచ్చిరుప్పదు. **"మధురా మధురాలాపా కి మాహ మమ భామినీ" (రామా. సుందర-66-15)** ఎన్ఱు మున్బు అవర్గళుడైయ పేచ్చిలినిమైక్కు తాన్ మోహిత్తాప్పోలే, ఇప్పోదు ఇవర్గళ్, అవన్ పేచ్చిలినిమైక్కు మోహప్పడుగిఱార్గళిఱే !

**(వల్గువాక్యయా)** మధురమానమాత్రమన్ఱిక్కే, అతిమనోహరమాన వాక్యఙ్గళాలే ప్రకాశితమాయ్ నిన్ఱదుకాణ్. **"ఇతి వేణురవం రాజన్! సర్వభూతమనోహరమ్" (భాగవతమ్-10-21-6)** ఎన్ఱు శొల్లప్పట్టదిఱే.

**(బుధమనోజ్ఞయా)** మధురమాగవుమామ్. మనోహరమాగవుమామ్. సజ్జనహృదయఙ్గళుక్కు ఆనన్దావహమాయిరాత నాక్యఙ్గళ్ ఇవ్విభూతియిలే కేట్టుప్పోన్దోమ్. అప్పడియో? ఎన్న, అప్పడి యల్ల. ప్రపన్నజనఙ్గళుడైయ హృదయఙ్గళుక్కానందావహమాయ్ ప్రకాశియానిన్ఱదు కాణ్ - ఎన్గిఱార్.

**(మధురయా గిరా వల్గువాక్యయా బుధమనోజ్ఞయా)** మధురమాయ్, మనోహరవాక్యయుక్తమాయ్, ప్రపన్నజనహృదయానందకరమాన వాక్కాలే. ఇవై యెల్లా మివనుక్కు వన్దదు- "మధురా మధురాలాపా" (రామా-

---

గతాః" (గొప్ప మనస్సును కలవారై గొప్ప సిద్ధిని పొందినవారై నన్ను చేరి, తిరిగి దుఃఖాలకు నిలయం, అశాశ్వతం అయిన జన్మను పొందరు) అనే రీతిలో తనను సేవించినవారికి దుఃఖానికి నిలయమై, అశాశ్వతమై ఉన్న పునర్జన్మను నశింపజేసి, అపునరావృత్తిలక్షణమై, నిరతిశయానందంతో కూడిన పరమపదాన్ని ప్రసాదించే అమృతంకదా ఇది.

మధురయా గిరా వల్గువాక్యయా బుధమనోజ్ఞయా పుష్కరేక్షణ ।
విధికరీ రిమా వీర! ముహ్యతీ రధరశీధునా ప్యాయయస్వ నః ॥

**(మధురయా గిరా)-** మధురమే రూపుచెందిన వాక్కుతో (అని అర్థం). మధురమని, ఇతని పలుకు అని ప్రత్యేకంగా రెండు లేవుసుమా! మధురం అంతా ఈ రూపం పొందినట్లుకదా ఇతని మాట ఉంటుంది. **"మధురా మధురాలాపా కి మాహ మమ భామినీ"** (మధురమైన రూపాన్ని కల్గినది, మధురంగా మాటలాడేది అయిన నా సీత ఏమన్నది?) అని ముందు వారి మాటలోని మాధుర్యానికి తాను మోహించనట్లే ఇపుడు వీరు అతని మాటలోని మాధుర్యానికి మోహపడుతున్నారుకదా!

**(వల్గువాక్యయా)-** మధురమైనది మాత్రమే కాకుండా, అతిమనోహరాలైన వాక్యాలతో ప్రకాశించినదై ఉంటుందిసుమా! **"ఇతి వేణురవం రాజన్! సర్వభూతమనోహరమ్"** (ఓ రాజా! ఈవిధంగా అన్ని ప్రాణుల మనస్సును హరించే వేణుధ్వనిని) అని చెప్పబడిందికదా !

**(బుధమనోజ్ఞయా)-** మధురంగా అని, మనోహరంగా - అని అర్థం. సజ్జనహృదయాలకు ఆనందాన్ని కల్గించేవిగా ఉండని వాక్యాలను ఈ లోకంలో వింటూ వచ్చాము. ఆ విధంగానా? అంటే, ఆవిధంగా కాదు. ప్రపన్నజనాల హృదయాలకు ఆనందాన్ని కల్గించేదై ప్రకాశిస్తున్నది సుమా -అని అంటున్నారు.

**(మధురయా గిరా వల్గువాక్యయా బుధమనోజ్ఞయా)-** మధురమై, మనోహరవాక్యంతో కూడినదై, ప్రపన్నజనాలకు ఆనందాన్ని కల్గించే వాక్కుతో (అని అర్థం.) ఇవి అన్నీ ఇతనికి కల్గినది. (ఏవిధంగా అంటే)

సుందర-66-15) ఎన్గప్పడుగిఱ పిరాట్టియోట్టై శేర్తియాలుమ్, "తోళిణై మేలుమ్ నన్ మార్పిన్ మేలుమ్ శుడర్ముడిమేలుమ్, తాళిణైమేలుమ్ పునైన్ద తణ్ణమ్ తుழாయుడై యమ్మాన్" (తిరువాయ్-1-917) ఎన్గుమ్, "విష్ణో ర్వక్షసి పాదయో ర్భుజయుగే స్వస్త్రీవ సంక్రీడసే" (వైజయంతీస్తవమ్) ఎన్గుమ్ శొల్లుగిఱపడియే అరక్షణముమ్ పిరియామే కూడియిరుక్కిఱ శ్రీవైజయంతీమాలికానిత్యసంశ్లేషత్తాలేయిఱే. అన్ఱిక్కే,

(మధురయా) "కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే, కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే" (రామా-అయో-31-24) ఎన్గిఱపడియే ఆత్మస్వరూపత్తుక్కు అత్యంతమధురమాన, శేషత్వస్వరూప పూర్వకకైంకర్య ప్రకాశమాన తిరుమంత్రార్థరహస్యత్తాలుమ్.

(వల్గువాక్యయా) అతిమనోహరమాయ్, ఉపాయోపేయగర్భితమాన ఇరణ్డు వాక్యజ్ఞళాలే కూడియిరుక్కిఱ మంత్రరత్నమాన ద్వయార్థప్రకాశత్తాలుమ్.

(బుధమనోజ్ఞయా) "స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ" (భగ-18-73) ఎన్గిఱపడియే ప్రపన్నజనజ్ఞళుక్కు ప్రియావహమాన ప్రపత్తిమార్గత్తై బోధిక్కిఱ చరమరహస్యార్థత్తాలుమ్ ప్రకాశిక్కిఱ. (గిరా) శ్రీసూక్తియాలే ఎన్గవుమామ్.

(ముహ్యతీః) ఇప్పడి యిరున్దుళ్ళ సర్వస్వామియాన దేవరీరుడైయ శ్రీసూక్తియాలే బాహ్య మెల్లామ్ మఱన్దు మోహిత్తోమ్. "తద్వర్ణయితు మారబ్దా స్మరంత్యః కృష్ణచేష్టితమ్, నాశకన్ స్మరవేగేన విక్షిప్తమనసో నృప!"

---

"మధురా మధురాలాపా" (మధురమైన రూపాన్ని కల్గినది, మధురంగా పలికేది) అనబడే పిరాట్టితోటి చేరిక చేతను, "తోళిణైమేలుమ్ నన్ మార్పిల్ మేలుమ్ శుడర్ముడిమేలుమ్ తాళిణైమేలుమ్ పునైన్ద తణ్ణన్తుழாయుడై యమ్మాన్" (బాహువులపై, గొప్ప వక్షఃస్థలంపై, ప్రకాశించే కిరీటంపై, శ్రీచరణద్వయిపై అలంకరించుకొన్న, చల్లని, అందమైన తులసీమాలను కల స్వామి) అని, "విష్ణో ర్వక్షసి పాదయో ర్భుజయుగే స్వయువతీవ సంక్రీడసే" (విష్ణువు వక్షస్సులో, పాదాలలో, భుజద్వంద్వంలో అతని వనిత అయిన లక్ష్మివలె క్రీడిస్తున్నావు) అని చెప్పే రీతిలో అరక్షణంకూడా విశ్లేషం లేకుండా కూడి ఉండే శ్రీవైజయంతీ వనమాలికయొక్క నిత్యసంశ్లేషంచేత కదా!

(మధురయా)- "కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే, కృతార్థోఽహం భవిష్యామి తవచార్థః ప్రకల్పతే" (నన్ను అనుచరునిగా చేసికో. ఇందులో ధర్మవైరుధ్యం ఏమీ లేదు. నీకు ప్రయోజనం కూడా సమకూరుతుంది) అనే రీతిలో ఆత్మస్వరూపానికి చాలా మధురం అయిన, శేషత్వమనే స్వరూపంతో కూడిన కైంకర్యానికి ప్రకాశకం అయిన తిరుమంత్రార్థమనే రహస్యంచేతను.

(వల్గువాక్యయా)- అతిమనోహరమై, ఉపాయోపేయగర్భితం అయిన రెండు వాక్యాలతో కూడిఉండే మంత్రరత్నమనే ద్వయంయొక్క అర్థప్రకాశంచేతను.

(బుధమనోజ్ఞయా)- "స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ" (సందేహం తీరినవాడనై ఉన్నాను. నీ మాటప్రకారం చేస్తాను) అనే రీతిలో ప్రపన్నజనులకు ప్రియాన్ని కల్గించే, ప్రపత్తిమార్గాన్ని బోధించే చరమరహస్యార్థం చేతను ప్రకాశించే (గిరా)- శ్రీసూక్తిచేత- అనికూడా భావం.

(ముహ్యతీః)- ఈ విధంగా ఉన్న సర్వస్వామిని అయిన నీ శ్రీసూక్తిచేత బాహ్యం అంతా మఱచిపోయి మోహించాము. "తద్వర్ణయితు మారబ్ధాః స్మరంత్యః కృష్ణచేష్టితమ్, నాశకన్ స్మరవేగేన విక్షిప్తమనసో నృప !"

(భాగవతమ్-10-21-4) ఎన్ఱు శొల్లప్పట్టదితే. "నుழైవనర్ నిఱ్పనరాకి యెఙ్గు ముళ్ళమ్ విట్టూణ్ మఱన్దొழிన్దనరే" (పెరియాழ்వార్-3-4-1) ఎన్ఱు పెరియాழ்వారనుసన్దిత్తార్. "అశ్రు ముముచు స్తరవో యథార్యాః" (భాగవతమ్-10-21-9) ఎన్ఱుమ్, "ఆకర్ణ్య వేణురణితం చ సకృష్ణసారాః, పూజాం దదు ర్విరచితాం ప్రణయావలోకైః" (భాగవతమ్-10-21-12) ఎన్ఱుమ్, "కృష్ణం నిరీక్ష్య వనితోత్సవరూపశీలం శృత్వా చ తత్క్వణితవేణుచిత్రగీతమ్, దేవ్యో విమానగతయః స్మరనున్నసారా భ్రశ్యత్ప్రసూనకబరా ముముహు ర్వినీవ్యః" (భాగవతమ్-10-21-13) ఎన్ఱుమ్, "సర్వభూతమనోహరమ్" (భాగవతమ్-10-21-7) ఎన్ఱుమ్ శొల్లప్పడుగిఱ అవనుడైయ శ్రీసూక్తి సర్వచేతనాచేతనఙ్గళుక్కు మోహమాన పడికణ్డాల్ ఇవర్గళై మోహిప్పిక్కమాట్టాదో ?

(పుష్కరేక్షణ) సౌందర్య- సౌగంధ్య- సౌకుమార్యాదిగళాలే తామరై ఒరు పోలియాన తిరునేత్రత్తై యుడైయవనే! అழగిదు! ఎఙ్గళై తోఱ్పిత్తు దాసభూతరాక్కుగైక్కు ఇరణ్డాయుధఙ్గళై ధరిత్తాయే !" ఎన్ఱు విద్ధరాగిఱార్. తన్నుడైయ శ్రీసూక్తిమాధుర్యత్తాలుమ్, కరుణాప్రవంతియై ప్రవిక్కిఱ తిరునేత్ర సౌందర్యత్తాలుమేయితే, ఇవన్ "అహం మే" (భట్టర్ముక్తకమ్) ఎన్ఱు తిరివార్రై జయిత్తు "దాసోఽహం" (రామా. సుందర-42-34) ఎన్ఱుమ్, "తవాస్మి దాసః" (కుమారసంభవమ్-5) ఎన్ఱుమ్ శొల్లుమ్బడి తనక్కు దాసభూతరామ్బడి పణ్ణుగిఱదు. "జితం తే పుండరీకాక్ష!" (జితంతే-) ఎన్ఱుమ్, "త్వత్సుందరస్మితనిరీక్షణతీవ్రకామతప్తాత్మనాం పురుషభూషణ! దేహి దాస్యమ్" (భాగవతమ్) ఎన్ఱుమ్,

---

(రాజా ! శ్రీకృష్ణుని లీలను స్మరిస్తూ దానిని వర్ణించాలని ఆరంభించినవారైన గోపికలు మన్మథావేశంచేత కకావికలైన మనస్సును కల్గినవారైనందువల్ల ఆవిధంగా వర్ణించలేకపోయారు) అని చెప్పబడిందికదా! "నుழைవనర్ నిఱ్పనరాకి యెఙ్గు ముళ్ళమ్ విట్టూణ్ మఱన్దొழிన్దనరే" (ప్రవేశించేవారు, నిలిచేవారై అంతటా మనస్సు విడిచి, తిండి మఱచిపోయారు కదా) అని పెరియాழ்వార్లు అనుసంధించారు. "అశ్రు ముముచు స్తరవో యథార్యాః" (ఆర్యులవలె వృక్షాలు ఆనందబాష్పాలను విడిచాయి) అని, "ఆకర్ణ్య వేణురణితంచ సకృష్ణసారాః పూజాం దదు ర్విరచితాం ప్రణయావలోకైః" (శ్రీకృష్ణునితో కూడుకొని, శక్తిని కల్గిన ఆగోపికలు వేణుధ్వనిని విని తమ ప్రేమతో కూడిన కటాక్షాలతో చేసిన పూజను సమర్పించారు) అని, "కృష్ణం నిరీక్ష్య వనితోత్సవరూపశీలం శృత్వా చ తత్క్వణితవేణు విచిత్రగీతమ్, దేవ్యో విమానగతయః స్మరనున్నసారా భృశ్యత్ప్రసూనకబరా ముముహు ర్వినీవ్యః" (స్త్రీలకు ఆనదాన్ని కల్గించే రూపాన్ని, శీలాన్ని కల శ్రీకృష్ణుని చూచి, అతనిచే చేయబడిన వేణువుయొక్క చిత్రమైన గీతాన్ని విని ఆకాశంలో విమానంలో పయనించే దేవతాస్త్రీలు మన్మథునిచేత అపహరింపబడ్డ శక్తిని కలవారై, తమ కేశపాశంనుండి జారిపడే పూలను కలవారై, వీడిన నీవీబంధాన్ని కలవారై మోహించారు) అని, "సర్వభూతమనోహరమ్" (సమస్తప్రాణుల మనస్సును హరించేది) అని చెప్పబడే అతని శ్రీసూక్తితో సర్వచేతనాచేతనాలు మోహనం అయిన తీరును చూస్తే, (ఆ శ్రీసూక్తి) వీరిని మోహింపజేయలేదా!

(పుష్కరేక్షణ)- సౌందర్య- సౌగంధ్య- సౌకుమార్యాదులతో తామర ఏదో ఒకవిధంగా పోలే శ్రీనేత్రాన్ని కలవాడా! చాలా బాగున్నది. మమ్ములను జయించి, దాసులను చేసికోవడం కోసం రెండు ఆయుధాలను ధరించావే!'' అని విద్ధులవుతున్నారు. తన శ్రీసూక్తిమాధుర్యంచేత, కరుణాప్రవంతిని ప్రవించే తిరునేత్రసౌందర్యం చేతనే కదా ఇతడు "అహం మే" అని తిరిగేవారిని జయించి, "దాసోఽహం" (నేను దాసుడను) అని, "తవాస్మి దాసః" (నీకు దాసుడనై ఉన్నాను) అని చెప్పే రీతిలో తనకు దాసభూతులయేటట్లు చేయడం. "జితం తే పుండరీకాక్ష!" (ఓ పుండరీకాక్ష ! నీకు ఓడిపోయాము) అని, "త్వత్సుందరస్మితనిరీక్షణతీవ్రకామతప్తాత్మనాం పురుషభూషణ! దేహి దాస్యమ్" (ఓ పురుషభూషణా! నీ అందమైన చిఱునవ్వును చూడాలనే తీవ్రమైన కోరికచేత తపింపబడ్డ

"తామరైకణ్గళ్ కొణ్డేర్దియాలో?" (తిరువాయ్-9-9-1) ఎన్టుమ్, "నిన్ శెజ్గని వాయిన్ కళ్వ! ప్పణిమొழி నినైదొరు మావి వేమాల్" (తిరువాయ్-9-9-4) ఎన్టుమ్ శొల్లప్పట్టదిఱే.

(పుష్కరేక్షణ) సర్వచేతనాచేతనఙ్గళైయుమ్ పవిత్రమాప్పడి పణ్ణక్కడవ, తీర్థమ్బోన్ఱ కటాక్షత్తై యుడైయవనే! ఎన్టవుమామ్. (మధురయా గిరా ...పుష్కరేక్షణ) ఇప్పడి ఇరున్దుళ్ల తిరునేత్ర సౌందర్యత్తైయుమ్, శ్రీసూక్తిమాధుర్యత్తైయు ముడైయవనాయ్, ఎజ్గళై కటాక్షిప్పదుమ్ శెయ్యాదే, శ్రీసూక్తియైయుమ్ తారాదే, ఇప్పడి స్వామియాన నీ యున్నై యొళిత్తు ఎజ్గళై బాధిప్పతఱ్కు ఎత్తనై పాపమ్ శెయ్దోమో ? విడాయర్ ముగత్తిలే అగ్నికణఙ్గళై విழுవార్పోలే యిరున్దదీ ఉన్ పడి!" ఎన్టు మోహిత్తు చ్చొల్లుగిఱార్గళెన్టవుమామ్.

(విధికరీః) దేవరీరుడైయ ఆజ్ఞాతిలంఘనమ్ పణ్ణినో మెన్టు ఇప్పడి విడుగిఱాయో? అప్పడి యన్టు కాణ్. "శ్రుతి స్మృతి ర్మమైవాజ్ఞా" (విష్ణుధర్మే-76-31) ఎన్గిఱపడియే దేవరీరుడైయ ఆజ్ఞారూపమాన వేదశాస్త్రోక్తవిధియై అనుసరిత్తు నడక్కుగిఱోమ్.

(విధికరీః) అన్టిక్కే, దేవరీరుక్కు అలంకారవిశేషత్తై యుణ్డాక్కి అత్తై సేవిత్తు ఉగక్కుమ్ దాసర్గమ్కాణ్ ఇదు. ఇప్పడి శెయ్గిఱాయే - ఎన్టు పழிయిడుగిఱారెన్టు శొల్లవుమామ్.

(ఇమాః) "పారీర్! దేవరీరుడైయ విశ్లేషవ్యసనత్తాలే ఎప్పడి యిరున్దోమో" ఎన్టు విరహమ్ తిన్ఱ ఉడమ్బుగళై క్కాట్టుగిఱార్గళ్ . "ఏహి పశ్య శరీరాణి ఋషీణాం భావితాత్మనామ్, హతానాం రాక్షసై ర్ఘోరైః బహూనాం బహుధా వనే" (రామా-ఆర- 6-16) ఎన్టు మున్బు దండకారణ్యవాసిగళాన ఋషిగళ్, పెరుమాళుక్కు రాక్షసర్గళాలే వధిక్కప్పట్ట బ్రాహ్మణశరీరఙ్గళై క్కాట్టి, అవరుడైయ అనుగ్రహత్తుక్కు పాత్రభూతరాయ్ సుఖిత్తార్గళిఱే.

---

మనస్సులను కల మాకు నీ దాస్యాన్ని ప్రసాదించు) అని, "తామరైక్కణ్గళ్ కొణ్డేర్దియాలో" (తామరలవంటి నేత్రాలతో చీల్చుతున్నది. అయ్యో) అని, "నిన్ శెజ్గనివాయిన్ కళ్వ! ప్పణిమొழி నినైదొరు మావి వేమాల్" (ఓ చోరుడా! నీ ఎఱ్ఱని దొండపండు వంటి పెదవినుండి వెలువడే సూక్తిని తలచినపుడంతా ప్రాణం వేగిపోతున్నదే! అయ్యో!) అని చెప్పబడిందికదా!

(పుష్కరేక్షణ)- సకలచేతనాచేతనాలను పవిత్రం అయేటట్లు చేయగల తీర్థవంటి కటాక్షాన్ని కలవాడా! అనికూడా భావం. (మధురయా గిరా...... పుష్కరేక్షణ)- ఈ విధంగా ఉన్న తిరునేత్రసౌందర్యాన్ని, శ్రీసూక్తి మాధుర్యాన్ని కల్గినవాడవై మమ్ములను కటాక్షించకుండా, శ్రీసూక్తిని అనుగ్రహించకుండా, ఈ విధంగా స్వామి అయిన నీవు నిన్ను మఱుగుపఱుచుకొని, మమ్ములను బాధించడానికి మేం ఎంత పాపాన్ని చేశామో! దాహం కలవారి ముఖంలో అగ్నికణాలు జల్లేటట్లు ఉన్నదిసుమా నీ తీరు!" అని మోహించి పల్కుతున్నారని కూడా భావం.

(విధికరీః)- నీ ఆజ్ఞను అతిక్రమించామని ఈ విధంగా మమ్మల్ని విడుస్తున్నావా? ఆ విధంగా చేయలేదు సుమా! "శ్రుతిస్మృతీ మమైవాజ్ఞా" (శ్రుతులు, స్మృతులు నా ఆజ్ఞలే) అనే రీతిలో నీ ఆజ్ఞారూపం అయిన వేదరూపశాస్త్రంలో చెప్పబడ్డ విధిని అనుసరించి నడుస్తున్నాం.

(విధికరీః)- లేక, నీకు అలంకారవిశేషాన్ని (గొప్ప అలంకారాన్ని) నిర్మించి, దాన్ని సేవించి సంతోషించే దాసవర్గంకదా ఇది! ఈవిధంగా చేస్తున్నావే! అని నిందిస్తున్నారని కూడా చెప్పవచ్చు.

(ఇమాః) నీ వ్యసనంవల్ల ఏవిధంగా ఉన్నామో? అని విరహంవల్ల కృశించిన శరీరాలను చూపిస్తున్నారు. "ఏహి పశ్య శరీరాణి ఋషీణాం భావితాత్మనామ్, హతానాం రాక్షసైః ఘోరైః బహూనాం బహుధా వనే" (ఋషులము, నిన్ను భావించేవారము, క్రూరులైన పలువురు రాక్షసులచేత అనేక రీతులలో అరణ్యంలో బాధపెట్టబడినవారము

(వీర) పరాభిభవనసామర్థ్యత్తైయుడైయవనే! ఇన్ద వీరత్వమ్, ఆశ్రితర్కళుడైయ విరోధిగళై నిరసిత్తు అవర్గళుక్కున్నై ప్రసాదిత్తు రక్షిప్పదఱ్కల్లెయో? అవర్గళై ఇప్పడి పిఱిన్దు విచారసముద్రత్తిలే తళ్ళి ప్పొకడుగైక్కో?

(ముహ్యతీః నః) ఇప్పడి దేవరీరుడైయ శ్రీసూక్తిమాధుర్యమ్ శెవిప్పడాదపడియాలుమ్, తిరునేత్రఙ్గళైయుమ్, తిరుముఖమణ్డలత్తైయుమ్ సేవియాదపడియాలుమ్, బాహ్య మెల్లామ్ మఱన్దు, మూర్చాక్రాంతరాయ్, అనన్యార్హదాసభూతరాయ్, అనన్యప్రయోజనరాన ఎఙ్గళై.

(అధరశీధునా ఆప్యాయయస్వ) వాయముదత్తాలే తృప్తరామ్బడి పణ్ణి ఉజ్జీవిప్పిక్కవేణుమ్. ఇఙ్గు అధరామృత మెన్దదు- సకలవేదరహస్యార్థ ప్రతిపాదకమాన శ్రీసూక్తి ఎన్దపడి. వాయాలే ప్రకాశిత్తు అమృతమాయిరున్దపడియాలే అప్పడి శొల్లలాగవుమామ్.

(అధరశీధునా ఆప్యాయయస్వ నః) "మా శుచః" (భగ-18-66) ఎన్ద శ్రీసూక్త్యమృతత్తాలే ఎఙ్గళై ఉజ్జీవిప్పిక్కవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్కళ్.

(విధికరీః ముహ్యతీః ఇమాః నః అధరశీధు నా ఆస్వాయయస్వ) ప్రయోజనాంతరత్తై అపేక్షిత్తు, అహంకార పరరాయ్, దురభిమానిగళాయిరున్ద దేవజాతిక్కమృతత్తై ప్రసాదిత్త నీ, దేవరీరుడైయ ఆజ్ఞానువర్తిగళాయ్, ఉన్నుడైయ దివ్యమంగళవిగ్రహసౌందర్యత్తాలే మోహాక్రాంతరాయ్, ఉన్నుడైయ విశ్లేషవ్యసనత్తాలే మిగవుమ్ కృశిత్తు, అనన్యప్రయోజనరాయ్, అనన్యార్హరాన ఎఙ్గళుక్కు ఉన్నుడైయ అధరామృతత్తై త్తరలాకాదో ? అత్తాలన్ఱి జీవిప్పో మల్లోమ్కాణ్ యామ్- ఎన్గిఱార్గళ్.

ఎట్టామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

అయిన మా శరీరాలను వచ్చి చూడు) అని పూర్వం దండకారణ్యవాసులైన ఋషులు శ్రీరామచంద్రునకు రాక్షసులచేత చంపబడ్డ బ్రాహ్మణశరీరాలను చూపి, వారి (శ్రీరాముని) అనుగ్రహానికి పాత్రులై సుఖించారుకదా!

(వీర)- పరాభిభవనసామర్థ్యాన్ని (శత్రువులను పరాభవించడంలోని సామర్థ్యాన్ని) కలవాడా! ఈ వీరత్వం ఆశ్రితుల విరోధులను నిరసించి, వారికి నిన్ను ప్రసాదించి రక్షించడానికేకదా! వారిని ఈ విధంగా విశ్లేషించి, విచారసముద్రంలో గెంటివేయడానికా!

(ముహ్యతీ నః)- ఈ విధంగా దేవరవారి శ్రీసూక్తిమాధుర్యం చెవికి సోకినందువల్ల, తిరునేత్రాలను, తిరుముఖమండలాన్ని సేవించలేనందువల్ల, మిగిలిన దానిని అంతా మఱచి మూర్ఛను పొందినవారమై, అనన్యార్హదాసభూతలమై, అనన్యప్రయోజనులైన మమ్ములను.

(అధరశీధునా ఆప్యాయయస్వ)- అధరామృతంతో తృప్తి చెందేటట్లు చేసి, ఉజ్జీవింపజేయాలి. ఇచట అధరామృతం అన్నది సకలవేదాలలోని రహస్యార్థప్రతిపాదకమైన శ్రీసూక్తి- అని భావం. నోటిద్వారా ప్రకాశించి, అమృతమై ఉన్న తీరు కాబట్టి ఆ విధంగా చెప్పవచ్చుననికూడా భావం. (అధరశీధునా ఆప్యాయయస్వ నః)- "మా శుచః" (శోకించవద్దు) అనే సూక్త్యమృతంతో మమ్మల్ని ఉజ్జీవింపజేయాలని ప్రార్థిస్తున్నారు.

(విధికరీః ముహ్యతీః ఇమాః నః అధరశీధునా ఆప్యాయయస్వ)- వేఱే ప్రయోజనాలను అపేక్షించి, అహంకార పరులై, దురభిమానులై ఉన్న దేవజాతికి అమృతం ప్రసాదించిన నీవు నీ ఆజ్ఞను అనుసరించి వర్తించేవారై, నీ దివ్య మంగళవిగ్రహ సౌందర్యం చేత మోహాక్రాంతలై, నీ వియోగదుఃఖంతో చాలా చిక్కి, అనన్యప్రయోజనలై, అనన్యార్హలైన మాకు నీ అధరామృతాన్ని ఇవ్వకూడదా! దానితో గాని జీవించలేముసుమా మేము - అని అంటున్నారు.

ఎనిమిదవ శ్లోకం ముగిసింది

## ఒన్బదామ్ శ్లోకమ్

అవ :- ఇన్ద శ్లోకత్తాలే, "దేవరీరుడైయ సకలేతరవిలక్షణమాన దివ్యకథామృత్తత్తై పానమ్ పణ్ణుగిఅవర్ అతిధన్యరెన్ఱు తత్కథామృత వైభవపూర్వకమాగ భాగవతవైభవత్తై కొణ్డాడి, ఇప్పడి త్వత్కథామృతత్తై పానమ్ పణ్ణుమవరే అతిధన్యరానాల్, దేవరీరై సేవిత్తు త్వదధరసుధైయై ప్రాపిక్కుమవరుడైయ ధన్యతైయై చ్చొల్లవేణుమో? ఆగైయాలేయిఱే యామ్ మున్బే "దృశ్యతామ్" ఎన్ఱు దేవరీరుడైయ సేవైయై ప్రార్థిత్తు, త్వత్సంశ్లేషపూర్వకమాన అధరామృతపానత్తై ప్రార్థిత్తోమ్. ఆగ, యామ్ ప్రార్థిత్తపడియే అరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్.

తవ కథామృతం తప్తజీవనం కవిభి రీడితం కల్మషాపహమ్ ।
శ్రవణమంగళం శ్రీమదాతతం భువి గృణంతి యే భూరిదా జనాః ॥

(తవ కథామృతమ్) అపహతపాప్మత్వాదిలక్షణలక్షితనాయ్, సర్వస్వామియాయ్, వకుత్త శేషియాన దేవరీరుడైయ కథై ఎన్గిఱ అమృతత్తై. ఇదువిఱే యథార్థామృతమ్. దేవర్గళుడైయ అమృతమ్ లవణసారమాయ్, అహంకారత్తై పణ్ణువిప్పదాయ్, పునర్జన్మత్తై యుణ్డాక్కుమాగైయాలే, అదు అమృతమెన్ఱు పేరిడుగైక్కు త్తగాదిఱే! "ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున, మా ముపేత్య తు కౌంతేయ! పునర్జన్మ న విద్యతే" (భగ- 8-16) ఎన్ఱు శొల్లప్పట్టదిఱే. "ఎన్ మాయప్పిఱవి మయర్వఱుత్తేనే" (తిరువాయ్- 1-7-3) ఎన్ఱు ఆழ్వారనుసంధిత్తాఱిరే.

(తవ కథామృతమ్) అన్ఱిక్కే, "ఆరావముదమాయ్" (తిరువాయ్- 2-5-5) ఎన్ఱుమ్, "అముదిలుమాత్త వినియన్" (తిరువాయ్-1-6-6) ఎన్ఱుమ్, "ఎన్నుడై యముదే!" (తిరువాయ్-) ఎన్ఱుమ్, "తూయ వముదై" (తిరువాయ్-1-7-3)

---

## తొమ్మిదవ శ్లోకం

అవ :- ఈ శ్లోకంతో "నీయొక్క, మిగిలినవాటికన్నిటికంటె విలక్షణం అయిన దివ్యకథామృతాన్ని పానం చేసేవారు చాలా ధన్యు''లని అంటూ, ఆ కథామృతవైభవంతో పాటు భాగవతవైభవాన్ని కీర్తించి, "ఈ విధంగా నీ కథామృతాన్ని పానం చేసేవారే అతిధన్యులైతే, నిన్ను సేవించి, నీ అధరసుధను పొందేవారి ధన్యతనుగూర్చి చెప్పాలా? అందువల్లనేకదా మేము ముందే "దృశ్యతామ్" అని తమ సేవను ప్రార్థించి, నీ సంశ్లేషంతో కూడిన అధరామృతపానాన్ని ప్రార్థించాము. అందువల్ల మేము ప్రార్థించిన తీరులోనే దానిని అనుగ్రహించా''లని (గోపికలు) ప్రార్థిస్తున్నారు.

తవ కథామృతం తప్తజీవనం కవిభి రీడితం కల్మషాపహమ్ ।
శ్రవణమంగళం శ్రీమదాతతం భువి గృణంతి యే భూరిదా జనాః ॥

(తవ కథామృతమ్)- అపహతపాప్మత్వాదిలక్షణాలచేత కలవాడవై, సర్వస్వామివై, ప్రాప్తశేషి అయిన నీకథ అనే అమృతాన్ని అని అర్థం. ఇదేకదా యథార్థమైన అమృతం. దేవతల అమృతం ఉప్పుసారమై, అహంకారాన్ని కల్గించేదై, పునర్జన్మను కల్గించేది కావడంవల్ల అది అమృతం అని పేరు పెట్టడానికి తగదుకదా! "ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున!, మా ముపేత్య తు కౌంతేయ! పునర్జన్మ న విద్యతే" (ఓ అర్జునా! బ్రహ్మలోకం వరకు ఉండే లోకాలు అన్నీ తిరిగి ఈ లోకానికి వచ్చేవి- పునరావృత్తిని కల్గినవి. కౌంతేయా! నన్ను పొందినట్లయితే మాత్రం పుట్టుక అనేది ఉండదు, నా ప్రకృతి సంబంధం వల్ల వచ్చిన జన్మవల్ల కల్గిన అజ్ఞానాన్ని ఛేదించాను) అని చెప్పబడింది కదా "ఎన్ మాయప్పిఱవి మయక్కఱుత్తేనే" అని ఆழ్వార్లుకూడా అనుసంధించారు కదా!

(తవ కథామృతమ్)- లేక, "ఆరావముదమాయ్" (అతృప్తామృతమై) అని, "అముదిలు మాత్త వినియన్" (అమృతంకంటే భోగ్యమైనవాడు) అని, "ఎన్నుడై యముదే!" (నా అమృతమా!) అని, "తూయ వముదై" (పవిత్రమైన

ఎన్టుమ్, "రసో వై సః" (తైత్తి-ఆనంద) ఎన్టుమ్ ఓదప్పడుగిఱ ఉన్నుడైయ కథై ఎన్గిఱ అమృతత్తై- ఎన్ఱవుమామ్. అమృతనానవనుడైయ కథై అమృతమాగ చ్చొల్ల త్తగుమిఱే. ఇన్ద అమృతత్తై ప్పరుగు నావుక్కు మఱ్ఱొరు విషయత్తిల్ రుచి పిఱవాదిఱే. "రామో రామో రామ ఇతి ప్రజానా మభవన్ కథాః" (రామా-యుద్ధ-131-10) ఎన్గిఱపడియే ఇదువే ధారకమాయుమ్, పోషకమాయుమ్, భోగ్యమాయుమ్ ప్రకాశిక్కుమిఱే.

(తవ కథామృతమ్) ఉన్నిలుమ్, చేతనరై ఇతరవిషయత్తిల్ నిన్టుమ్ మీళువిత్తు ఉన్ కైంకర్యత్తిలే మగ్నమాక్కవల్ల దేవరీరుడైయ కథై ఎన్గిఱ అమృత్తత్తై- ఎన్ఱవుమామ్. ఇఙ్గు కథామృత మెన్టు శొల్లప్పట్టదు సర్వేశ్వరనుడైయ స్వరూపరూపవిభూతిగుణమహదైశ్వరఙ్గళై పూర్ణమాగ ప్రతిపాదిత్తు, చేతనరై భగవత్కైంకర్యత్తిలే మూట్టుగిఱ ద్వయార్థామృతమిఱే. "రంగపతిపాదత్రాణకృత్యం బుధౌ, దృష్టం వేంకటదేశికేన గురుణా గుప్తం ద్వయార్థామృతం పీత్వా లేశత ఏవ వచ్మి సరసం శ్రీవైజయన్తీస్తవమ్" (వైజయంతీస్తవమ్) ఎన్టు నమ్ముడైయ పరమాచార్యరనుసంధిత్తార్. ఇప్పడియాగైయాలేయిఱే ఇదుక్కు మంత్రరత్నమెన్టు పేరా యిరుక్కిఱదు. "మంత్రరత్నానుసంధాన సంతతస్ఫురితాధరమ్" (పూర్వదినచర్య-9) ఎన్గిఱ శొల్లుగిఱపడియే ప్రపన్నర్క్కు సర్వదేశ- సర్వకాల- సర్వావస్థైగళిలుమ్ ధారకమాయ్, పోషకమాయ్, భోగ్యమాన అమృతమిఱే యిదు. ఆగైయాలేయిఱే తమ్ముడైయ అన్తిమదశైయిలే ముదలిగళడైయ తిరణ్డిరున్దు, "ఎఙ్గళుక్కు తఞ్జమాయ్ దేవరీరుక్కు ప్రియమాయిరుప్ప దొన్టై అరుళిచ్చెయ్య వేణు"మెన్టు కేట్క, "ఎల్లారుమ్ భాష్యత్తిలే వాసనై పణ్ణుగైయే నమక్కు ప్రియమ్, అతుక్కు మాట్టాదార్ తిరుమాలై ఎడుక్కైయుమ్ ప్రియతరమాయిరుక్కుమ్. అదెల్లార్క్కు మొక్కచ్చెయ్యప్పోగాదు. ద్వయత్తిలే వాసనై పణ్ణి విశ్వసిత్తిరుక్కై

---

అమృతం) అని, "రసో వై సః" (ఆ పరమాత్మ రసస్వరూపుడు) అని అభ్యసింపబడే నీకథ అనే అమృతాన్ని- అనికూడా భావం. అమృతం అయిన వాని కథను అమృతంగా చెప్పడం తగునుకదా! ఈ అమృతాన్ని తాగే జిహ్వకు వేఱొక విషయంలో రుచి కలుగదుకదా! "రామో రామో రామ ఇతి ప్రజానా మభవన్ కథాః" (రాముడు, రాముడు, రాముడు అని ప్రజల కథలన్నీ రామునిగూర్చియే) అనే రీతిలో ఇదే ధారకంగాను, పోషకంగాను, భోగ్యంగాను ప్రకాశిస్తుందికదా!

**(తవ కథామృతమ్)**- నీకంటెకూడా, చేతనులను ఇతరవిషయాలనుండి నివర్తింపజేసి, నీ కైంకర్యంలో మునిగేటట్లు చేయగల నీ కథ అనే అమృతాన్ని అని కూడా భావం. ఇచట కథామృతం అని చెప్పబడినది (ఏది అంటే) - సర్వేశ్వరుని స్వరూపరూపగుణవిభూతులనే మహదైశ్వర్యాలను పూర్ణంగా ప్రతిపాదించి, చేతనులను భగవత్కైంకర్యంలో లగ్నం చేసే ద్వయార్థామృతమే కదా! "రంగపతిపాదత్రాణకృత్యం బుధౌ, దృష్టం వేంకటదేశికేన గురుణా గుప్తం ద్వయార్థామృతమ్, పీత్వా లేశత ఏవ వచ్మి సరసం శ్రీవైజయంతీస్తవమ్" అని మన పరమాచార్యులు అనుసంధించారు. ఇందువల్లనేకదా దీనికి మంత్రరత్నమని పేరు ఉన్నది. "మంత్రరత్నానుసంధాన సంతతస్ఫురితాధరమ్" (మంత్రరత్నం అనుసంధానం చేత సదా స్ఫురించే అధరాన్ని కలవారిని) అని చెప్పే రీతిలో ప్రపన్నులకు సర్వదేశ-సర్వకాల- సర్వావస్థలలోను ధారకమై, పోషకమై, భోగ్యమైన అమృతంకదా ఇది. అందుచేతనేకదా తమ అంతిమదశలో ఆచార్యులందఱు కలసి, తమకు రక్షకంగా, మీకు ప్రియంగా ఉన్న ఒక విషయాన్ని అనుగ్రహించాలని అడుగగా, "అందఱు శ్రీభాష్యంలో సంస్కారాన్ని కల్గి ఉండడమే మాకు ప్రియం. దానికి శక్తులు కానివారు పూలమాలికలను సమర్పించడం ఇంకా ప్రియంగా ఉంటుంది. అవి అందఱికి చేయడానికి వీలు కాదు. ద్వయంలో సంస్కారాన్ని కల్గి, నమ్మికను కల్గి ఉండడం చాలా ప్రియతమంగా ఉంటుంది"- అని శ్రీభాష్యకారులు తమ శ్రీపాదాలను ఆశ్రయించినవారిని ఉద్దేశించి శాసించారు.

మిగవుమ్ ప్రియతమమాయిరుక్కుమ్" ఎన్ఱు శ్రీభాష్యకారరుమ్ తమ్ముడైయ తిరువడి ఆశ్రయిత్తవర్గళై క్కుఱిత్తు శాసిత్తార్.

(తవ కథామృతమ్) సర్వసౌలభ్యయుక్తరాయ్, చరమశేషిగళాన దేవరీరుడైయ కథామృతత్తై- ఎన్ఱపడియామ్. "పిబ మనః! శ్రీకృష్ణదివ్యౌషధమ్" (ముకుంద మాల-24) ఎన్గిఱపడియే దివ్యౌషధ మిదువేయిఱే.

(తప్తజీవనమ్) దేవర్గళుడైయ అమృతత్తుక్కు మిదుక్కుమ్ నెడు వాశి యుణ్డిఱే. అత్తై అనుసంధిక్కిఱార్- "తప్తజీవనమ్" ఎన్ఱు. (తప్తజీవనమ్) తప్తరానవర్గళుక్కు జీవనమాన అత్తై- ఎన్ఱపడి. అదావదు - సంసారతాపతప్తరాయ్ నశిక్కిఱ చేతనర్క్కు అన్ద తాప మెల్లామ్ పోక్కి చేతనర్క్కు శేషత్వస్వరూపమాన జీవనత్తై కొడుక్కవల్లదాయెన్ఱపడి "త్రిభువనీసంజీవనైకౌషధం భవభయప్రధ్వంసనైకౌషధమ్" (ముకుందమాల-24) ఎన్ఱు శొల్లప్పట్టదిఱే. దేవర్గళుడైయ అమృతమ్, జీవనత్తై త్తన్దు, సంసారత్తిలే వైక్కు మన్ఱి, ఇన్ద విశేష మిల్లైయే.

(కవిభి రీడితమ్) బ్రహ్మవిత్తుక్కళాలే స్తుతమాయిరుక్కిఱ అత్తై. "మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం.... భక్తాత్యన్తహితౌషధమ్" (ముకుందమాల-24) ఎన్ఱు శొల్లప్పట్టదిఱే. దేవర్గళుడైయ అమృతమ్ అహంకారపరరాన దేవర్గళుక్కే భోగ్యమన్ఱి ప్రపన్నజనఙ్గళుక్కు భోగ్యమాగామైయాలే, అదు ఇన్ద అమృతత్తుక్కు తుల్యమాగాదిఱే. "నివృత్తతర్షై రుపగీయమానాత్" (భాగవతమ్) ఎన్ఱు శొల్లానిన్ఱదిఱే.

(కల్మషాపహమ్) కల్మషఙ్గళెల్లావఱ్ఱైయు మపహరిక్కుమత్తై. కల్మషఙ్గళావన- అహంకార మమకారఙ్గళుమ్, తత్కార్యఙ్గళాన కామక్రోధాదిగళుమ్. ఇవఱ్ఱై అపహరిక్కు మెన్గైయాలే, ఇత్తై సేవిత్తవర్గళుక్కు అవై పిన్నాట్టాతపడి పణ్ణు మెన్ౙై. "వ్యామోహప్రశమౌషధమ్" (ముకుందమాల-24) ఎన్ఱు, "ఎన్ మాయప్పిఱవి మయర్వఱుత్తేనే"

---

(తవ కథామృతమ్)- సర్వసౌలభ్యాన్ని కల్గినవాడవై, చరమశేషి అయిన నీ కథామృతాన్ని- అని భావం. "పిబ మనః! శ్రీకృష్ణదివ్యౌషధమ్" అనే రీతిలో దివ్యౌషధం ఇదేకదా!

(తప్తజీవనమ్)- దేవతల అమృతానికి దీనికి మధ్య చాలా వ్యత్యాసం ఉన్నదిగదా. దానిని అనుసంధిస్తున్నారు. "తప్తజీవనమ్" అంటూ. (తప్తజీవనమ్)- తపింపబడినవారికి జీవనమైన దానిని- అని భావం. అనగా -సంసారతాపం చేత తపింపబడ్డవారై, నశిస్తున్న చేతనులకు ఆ తాపాన్ని అంతటినీ పోగొట్టి చేతనులకు శేషత్వస్వరూపం అయిన జీవనాన్ని ఇవ్వగలిగావు- అని భావం. "త్రిభువనీసంజీవనైకౌషధమ్ భవభయప్రధ్వంసనై కౌషధమ్" (ముల్లోకాలను ఉజ్జీవింపచేసే అద్వితీయమైన సంజీవనౌషధి సంసారమనే భయాన్ని పోగొట్టే అద్వితీయమైన మందు) అని చెప్పబడిందికదా! దేవతల అమృతం జీవనాన్ని ఇచ్చి, సంసారంలో పడవేస్తుంది తప్ప ఈ విశేషం లేదే !

(కవిభి రీడితమ్)- బ్రహ్మవేత్తలచేత స్తుతింపబడిన దానిని అని అర్థం. "మునిమనోవృత్తి ప్రవృత్త్యౌషధమ్- భక్తాత్యంతహితౌషధమ్" (మునుల మనోవ్యాపారాలను చక్కగా నడిపే ఔషధం, భక్తులకు మిక్కిలిగా హితాన్ని కల్గించే ఔషధం) అని చెప్పబడిందికదా! దేవతల అమృతం అహంకారపరులైన దేవతలకుతప్ప ప్రపన్నజనులకు భోగ్యం కానందువల్ల అది ఈ అమృతానికి సాటి కాదు కదా! "నివృత్తతర్షై రుపగీయమానాత్" (నశించిన పాపాలను కలవారిచే కీర్తింపబడుతున్నందువల్ల) అని చెప్పబడుతున్నది కదా !

(కల్మషాపహమ్)- కల్మషాలను అన్నిటినీ అపహరించేదానిని. కల్మషాలంటే - అహంకార, మమకారాలు, తత్కార్యాలైన కామక్రోధాదులును. వీటిని అపహరిస్తుంది అని అనడంచేత దీన్ని సేవించినవారికి అవి అనువర్తించకుండేటట్లు చేస్తుందని భావం. "వ్యామోహప్రశమౌషధమ్", (వ్యామోహాన్ని ఉపశమింపజేసే ఔషధం)

**(తిరువాయ్-1-7-3)** ఎన్ఱుమ్ శొల్లప్పట్టదితే. ఇన్ద విశేషమ్, దేవభోగ్యమాన అమృతత్తు క్కిల్లైయితే- అహంకార మమకారఙ్గళై అభివృద్ధమాక్కుకైయాలే.

**(శ్రవణమంగళమ్)** శ్రవణమాత్రత్తాలే మంగళఙ్గళ్ ఎల్లావఱ్ఱైయుమ్ మేల్‌మేలు మభివృద్ధమామ్బడి పణ్ణుమత్తై. ఇఙ్గు మఙ్గళఙ్గళావన- అద్వేషమ్ తుడఙ్గి పరమభక్తిప్రాప్తియళవు మిరుక్కత్తక్క దివ్యాత్మగుణఙ్గళ్. ఇగ్గుణఙ్గళ్ ఎల్లావఱ్ఱైయుమ్ శ్రవణమాత్రత్తాలే యుణ్డామ్బడి పణ్ణు అమృతమితే. "శ్రుత్వా గుణాన్ భువనసుందర ! శృణ్వతాం తే నిర్విశ్య కర్ణవివరై ర్హరతోఽంగతాపమ్" **(భాగవతమ్-10-52-37)** ఎన్ఱు పిరాట్టి అనుసంధిత్తాళితే.

**(శ్రీమత్)** శ్రీమానానవనుడైయ కథై యాగైయాలే ఇదువుమ్ శ్రీమత్తాయితే ఇరుక్కిఱదు. సర్వేశ్వరనుడైయ స్వరూపరూపగుణవిభూతి మహదైశ్వర్యఙ్గళైయుమ్. అప్పడి యిరున్దవనుడైయ కైంకర్యముమాగిఱ చేతనర్గళుడైయ శ్రీయై నిత్యమాగ యుట్కొణ్డిరుక్కైయాలే శ్రీమత్తాగ కథామృతత్తై స్తుతిక్కిఱార్‌గళ్. అన్ఱిక్కే, శ్రీమత్పదత్తై పూర్ణమాగ ధరిత్తుక్కొణ్డిరుక్కిఱపడియాలే శ్రీమత్తాగ శొల్లుగిఱారాగవుమామ్. అన్ఱిక్కే, సమస్తవేదాంతార్థఙ్గళోడుణ్డాన నిత్యసంబంధత్తాలే శ్రీమత్ -ఎన్ఱు శొల్లవుమామ్. ఇప్పడి యిరున్దుళ్ళ దేవరీరుడైయ కథామృతత్తై.

**(ఆతతం భువి గృణంతి యే)** యావర్ శిలర్ మహాభాగవతర్ "ఇరుళ్ తరు మాఞాలత్తిలే" **(తిరువాయ్-10-6-1)** "ఎమ్మానై చ్చొల్లి ప్పాడి యెழுన్దుమ్ పఱన్దుమ్" **(తిరువాయ్-3-5-1)** ఎన్ఱుమ్, "పేర్ పల శొల్లి ప్పిదఱ్ఱి పిత్తరెన్ఱే పిఱర్ కూఱ" **(తిరువాయ్-3-5-1)** ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే అత్యంతాభినివేశత్తోడే అఱై కులైయ త్తలై కులైయ "మాఞాలప్పరప్పెల్లామ్" ఇక్కథైయోడే వ్యాప్తమామ్బడి అనుసంధిప్పర్‌గళో !

---

"ఎన్ మాయప్పిఱవి మయర్వఱుత్తేనే" (ప్రకృతిసంబంధంవల్ల కల్గిన జన్మచేత ఏర్పడ్డ అజ్ఞానాన్ని ఛేదించాను) అని చెప్పబడిందికదా!- ఈవిశేషంకూడా దేవతలకు భోగ్యం అయిన అమృతానికి లేదుకదా!, (అది) అహంకార మమకారాలను వృద్ధిచేయడంవల్ల.

**(శ్రవణమఙ్గళమ్)**- విన్నంత మాత్రంలోనే అన్ని శుభాలను మరింతగా అభివృద్ధం చేసేదానిని. ఇక్కడ మంగళాలు ఏవి ? అనిఅంటే, అద్వేషం మొదలు పరమభక్తి కలిగేవరకు ఉండవలసిన దివ్యాత్మగుణాలు. ఈ గుణాలను అన్నిటినీ విన్నంతమాత్రంలోనే కల్గించగలిగే అమృతంకదా! "శ్రుత్వా గుణాన్ భువనసుందర ! శృణ్వతాం తే నిర్విశ్య కర్ణవివరైః హరతోఽంగతాపమ్" (భువనసుందర ! శరీరతాపాన్ని తీర్చే నీ గుణాలను కర్ణవివరాలతో పూర్ణంగా విని) అని పిరాట్టి అనుసంధించిందికదా!

**(శ్రీమత్)**- శ్రీమంతుడైనవాని కథ కాబట్టి ఇదికూడా శ్రీమత్ గానే ఉంటుంది. సర్వేశ్వరుని స్వరూపరూప గుణవిభూతులనే గొప్ప ఐశ్వర్యాలను - అని అర్థం. అవిధంగా ఉన్నవాని కైంకర్యం అనే చేతనుల సంపదను నిత్యంగా గ్రహించినందువల్ల "శ్రీమత్"గా కథామృతాన్ని స్తుతిస్తున్నారు. లేక, శ్రీమత్పదాన్ని పూర్ణంగా ధరించి ఉన్నందువల్ల శ్రీమత్తాగ అంటున్నారనికూడా భావం. లేక, సమస్తవేదాంతార్థాలలో ఉండే నిత్యసంబంధంచేత "శ్రీమత్" అని చెప్పవచ్చు. ఈవిధంగా ఉన్న నీ కథామృతాన్ని-

**(ఆతతం భువి గృణంతి యే)**- ఏ కొందఱు మహాభాగవతులు. "ఇరుళ్ తరు మాఞాలమ్" (అజ్ఞానాన్ని కల్గించే విశాలమైన భూమి) లో "ఎమ్మానై చ్చొల్లి ప్పాడి ఎழுన్దుమ్ పఱన్దుమ్" (మా స్వామిని కీర్తించి గానం చేసి లేచి నాల్గు వైపుల తిరిగి) అని, "పేర్ పల శొల్లి ప్పిదఱ్ఱి పిత్తరెన్ఱే పలర్ కూఱ" (భగవానుని పలు నామాలను పల్కి పలవరించి, పిచ్చివారు అని ఇతరులు అనేటట్లు) అని చెప్పేరీతిలో మిక్కిలి అభినివేశంతో, అత్యంత

**(భువి గృణంతి యే)** ఇఙ్గు యచ్ఛబ్దమ్ శ్లాఘ్యతైయై శొల్లుగిఱదు. అదావదు- "దుర్విషయపూరితఙ్గళాన కథైగళాలే కాలమ్ పోక్కుగిఱ ఇవ్విభూతియిలే, భగవత్కథైయాలే కాలక్షేపమ్ పణ్ణిప్పోరుగిఱ శిలరితే ఇవర్ !" ఎన్ఱు అవరుడైయ శ్లాఘ్యతైయై చ్చొన్నపడి.

**(భురిదా జనాః)** అవర్గళ్ పూర్వజన్మత్తిలే మిగవుమ్ పుణ్ణియమ్ శెయ్దు పిఱన్దార్గళ్. అవర్గళుడైయ వైభవాతిశయమ్ శొల్లప్పోగాదితే. "ఆశైవాయ్ చ్చెన్ఱ శిన్దైయరాగి యన్నై యత్త నెన్ పుత్తిరర్ పూమి వాశవార్ కుళలాళెన్ఱు మయఙ్గి మాళు మెల్లైక్కణ్వాయ్ తిఱవాతే! కేశవా! పురుషోత్తమా! ఎన్ఱుమ్ కేఴలాగియ కేడిలీ!" ఎన్ఱుమ్. పేశువారవరెయ్దుమ్ పెరుమై పేశువాన్ పుకిల్ నమ్బరమన్ఱే" ఎన్ఱు పెరియాళ్వార్ **(4-5-1)** భాగవతవైభవత్తై అనుసంధిత్తార్.

**(భూరిదా జనాః)** అన్ఱిక్కే, అవర్గళ్ సమస్తచేతనర్క్కుమ్ మిగవు ముత్కృష్టమాన దానమ్ పణ్ణినవర్గళ్-ఎన్ఱవుమామ్. అదావదు -జీవనఙ్గళై కొడుత్త మహోపకారర్- ఎన్ఱు భావమ్. అవర్ శెయ్ద మహోపకారత్తుక్కు ప్రత్యుపకారమ్ శెయ్యప్పోగాదితే. "యో దద్యా ద్భగవద్‌జ్ఞానమ్ కుర్యా ద్ధర్మోపసేవనమ్, కృత్స్నాం వా పృథివీం దద్యాత్ న తత్తుల్యం కదాచన" (శ్రీవచనభూషణ వ్యాఖ్య-**432** సూ) ఎన్ఱు పిరాట్టియు మనుసంధిత్తాళ్.

---

సంభ్రమంతో (నడుముకు కట్టిన బట్ట జారగా, జుట్టుముడి వీడగా) విశాలమైన భూమి అంతటా ఈ కథతోనే వ్యాపించేటట్లు అనుసంధిస్తారో,

**(భువి గృణంతి యే)**- ఇచటి యచ్ఛబ్దం శ్లాఘ్యతను చెబుతున్నది. అనగా- "దుర్విషయాలతో నిండిన కథలతో కాలాన్ని గడిపే ఈ విభూతిలో భగవత్కథలతో కాలక్షేపాన్ని చేసే విలక్షణులుకదా వీరు!'' అని వారి గొప్పతనాన్ని చెప్పిన తీరు (ఇది).

**(భూరిదా జనాః)**- వారు పూర్వజన్మలో చాలా పుణ్యాన్ని చేసి పుట్టారు. వారి వైభవాతిశయం చెప్పడానికి సాధ్యం కాదుకదా! "ఆశైవాయ్ చ్చెన్ఱ శిన్దైయరాకి యన్నె యత్తన్ ఎన్‌పుత్తిరర్ పూమి వాశవార్ కుళలాళ్ ఎన్ఱు మయఙ్గి మాళుమ్ ఎల్లై క్కణ్వాయ్ తిఱవాదే కేశవా! పురుడోత్తమా! వెన్ఱుమ్ కేఴలాకియ కేడిలీ! ఎన్ఱుమ్ పేశువారవరెయ్దుమ్ పెరుమై పేశువాన్ పుకిల్ నమ్బరమన్ఱే" (నాతల్లి, నా తండ్రి, నా కుమారులు, నా భూమి, పరిమళం నిండుగా కల కేశపాశాన్ని కల్గిన నా భార్య - అని నోరునొప్పిపుట్టేటట్లుపల్కి ఆశపోయిన దారిలో వెడలేమనస్సును కలవారై వ్యామోహాన్ని పొంది, ప్రాణంపోయేటపుడు వారిపేర్లను పెట్టి పిలువకుండా, కేశవా! పురుషోత్తమా! వరాహరూపి అయిన దోషరహితుడా! అని పలికే వారు పొందే ప్రయోజనాన్ని గూర్చి పల్కడం ఆరంభిస్తే అది పల్కిపూర్తి చేయడం మన తరం కాదు) అని పెరియాళ్వార్లు భాగవతవైభవాన్ని అనుసంధించారు.

**(భూరిదా జనాః)** -లేక, వారు సమస్తచేతనులకు చాలా ఉత్కృష్టమైన దానాన్ని చేసినవారు- అనికూడా చెప్పవచ్చు. అంటే- జీవనాలను ఇచ్చిన మహోపకారకులు అని భావం. వారు చేసిన మహోపకారానికి ప్రత్యుపకారాన్ని చేయ వీలు కాదుకదా! "యో దద్యాత్ భగవద్‌జ్ఞానం కుర్యా ద్ధర్మోపసేవనమ్, కృత్స్నాం వా పృథివీం దద్యాత్ న తత్ తుల్యం కదాచన" (భగవానునకు సంబంధించిన జ్ఞానాన్ని ఇచ్చేవాడు, ధర్మాన్ని సేవించేవారు ఎవరున్నారో వారికి భూమిని అంతటినీ ఇచ్చినా అది ఏనాటికీ చాలదు) అని పిరాట్టికూడా అనుసంధించింది.

**(తవ కథామృతం భువి గృణంతి యే భురిదా జనాః)**- "తేనుమ్ పాలుమ్ అముదమాయ్ తిత్తిక్కుమ్ తిరుమాల్‌తిరునామమ్" (తేనె, పాలు, అమృతంగా మధురమై ఉంటుంది శ్రియఃపతి తిరునామం) అనే రీతిలో,

**(తవ కథామృతమ్ భువి గృణంతి యే భూరిదా జనాః) - "తేనుమ్ పాలు మముదమాయ్ త్తిత్తిక్కుమ్ తిరుమాల్ తిరునామమ్" (పెరియతిరు- 6-10-6)** ఎన్గిఱపడియే, అతృప్తామృతమాయ్, పునరావృత్తియై అఱుక్కత్తక్క నిరుపాధికశేషియాన దేవరీరుడైయ స్వరూపరూపగుణవిభూతి మహదైశ్వర్యజ్గళై ప్రకాశియానిన్దుళ్ళ ద్వయార్థామృతత్తై ఇన్ద లోకమెల్లా ముజ్జీవిక్కుమ్బడి నవిన్దురైప్పార్ యవరేలుమ్ అవర్ ఎజ్గళుక్కు మహోపకారరాన స్వామిగళే- ఎన్దు **"పజ్గయక్కణ్ణనై పయిలుమ్ తిరువుడైయార్ యవరేలు మవర్ కణ్డీ రెమ్మై యాళుమ్ పరమరే" (తిరువాయ్- 3-7-1)** ఎన్దు అనుసంధిత్త ఆళ్వార్‌పడియే, భాగవతతిరువడిగళై ఉపాయమాగ అధ్యవసిక్కిఱార్‌గళ్- ఎన్దవుమామ్. **"అమృతస్థితి రీప్సితార్థలాభో నిధిసందర్శన మైంద్ర మాధిపత్యమ్, అపవర్గఫలాదయోఽపి పుంసాం న తులా మర్హతి సత్సమాగమస్య"** ఎన్దు ముణ్డిఱే.

ఒన్బదామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

## పత్తామ్ శ్లోకమ్

అవ :- వారీర్ ! గోపిమార్‌గళే ! మత్కథామృతవైభవమ్ ఉజ్గళాలే బహుముఖమాగ ఇన్దు కొణ్డాడప్పట్టదిఱే. అప్పడి ఇరున్దుళ్ళ ఎన్నుడైయ కథామృతత్తై **"అడియార్‌గళ్‌కుళ్లాజ్గళుడన్ కూడి"** అనుభవిత్తు ఆనన్దిత్తాలమైయాదో? పిన్బు ఎన్నై సేవిక్క వేణుమెన్ఱ అభినివేశ మెదుక్కాగ? అత్తాల్ వన్ద ప్రయోజన మిల్లైయే? ఎన్దు అవనుడైయ ఉద్దేశ్యమాగ తామ్ భావిత్తు. "అళ్గిదు ! సర్వజ్ఞరాన దేవరీర్ ఎజ్గళుడైయ హృదయభావత్తై నన్ఱాగ అఱిన్దపడి యెన్ ! దేవరీరుడైయ కథామృతత్తై పరుగిగిఱ భాగవతవైభవత్తై యనుసంధిత్తో మత్తనై యల్లదు, **"ఎన్నెజ్ఞినారు మజ్గే యొళ్లిన్దార్" (తిరువాయ్-?)** ఎన్దుమ్, **"మైన్దనై మలరాళ్‌మణవాళనై తుఞ్జుమ్బోదుమ్ విడాదు తొడర్ కణ్డాయ్!" (తిరువాయ్-1-10-4)** ఎన్దుమ్

---

అతృప్తామృతమై, పునరావృత్తిని ఉండదగిన నిరుపాధికశేషి అయిన నీ స్వరూపరూపగుణవిభూతి మహదైశ్వర్యాలను ప్రకాశింపజేస్తున్న ద్వయార్థామృతాన్ని ఈలోకం అంతా ఉజ్జీవించేటట్లు నేర్చి పలికేవారు ఎవరైనా వారు మాకు మహోపకారకులైన స్వాములే-) అని, **"పజ్గయక్కణ్ణనై పయిలుమ్ తిరువుడైయార్ యవరేలు మవర్ కణ్డీర్ ఎమ్మై ఆళుమ్ పరమరే"** (పుండరీకాక్షాన్ని గూర్చి పలికే సిరిని కలవారు ఎవరైనా వారే సుమా మమ్ములను పాలించే మహనీయులే) అని అనుసంధించిన ఆళ్వార్ల రీతిలోనే భాగవత శ్రీపాదాలను ఉపాయంగా నమ్ముతున్నారనికూడా చెప్పవచ్చు. **"అమృతస్థితి రీప్సితార్థలాభో నిధిసందర్శన మైంద్ర మాధిపత్యమ్, అపవర్గఫలాదయోఽపి పుంసాం న తులా మర్హతి సత్సమాగమస్య"** (కైవల్యం, కోరిన కోరికలను పొందడం, నిధిని దర్శించడం, ఇంద్రపదవి, మోక్షఫలం మొదలైనవి ఏవీ సత్పురుషుల కలయికతో సాటి రావు) అనికూడా ఉన్నదికదా!

తొమ్మిదవ శ్లోకం ముగిసింది

## పదవ శ్లోకం

అవ :- "ఓ గోపికలారా! నా కథామృతవైభవం మీచేత బహుముఖంగా ఈనాడు కీర్తింపబడిందికదా! ఆ రీతిలో ఉన్న నా కథామృతాన్ని **"అడియార్‌కళ్ కుళ్లాజ్గళుడన్ కూడి"** (దాసవర్గంతో కలసి) అనుభవించి ఆనందిస్తే చాలదా! తరువాత నన్ను సేవించవచ్చును'' అని అతని ఉద్దేశ్యంగా భావించి - "బాగున్నది!, సర్వజ్ఞుడవైన నీవు మా హృదయభావాన్ని బాగా అర్థం చేసికొన్న తీరు ఏమి? నీ కథామృతాన్ని పానం చేసే భాగవతవైభవాన్ని అనుసంధించాం, అంతే తప్ప. **"ఎన్నెజ్ఞినారు మజ్గే యొళ్లిన్దార్"** (నా మనస్సుగారు కూడా అక్కడికే వెళ్ళిపోయారు) అని, **"మైన్దనై మలరాళ్ మణవాళనై తుఞ్జుమ్బోదుమ్ విడాదు తొడర్ కణ్డాయ్"** (భోగ్యుడై, పద్మనివాసిని భర్తయైనవానిని నిద్రించేటపుడు కూడా విడువకుండా అనుసరించుసుమా) అని చెప్పే రీతిలో నీ లీలలో మగ్నమైన

శొల్లుగిఱపడియే ఉన్నుడైయ విలాసత్తిలే యాழ్ఙాల్‌పట్ట నెఞ్జుడైయోమాన ఎఙ్గళుక్కు అప్పడి కథాశ్రవణమాత్రత్తాలే ఆఱియిరుక్కప్పోమో? ఉన్నుడైయ దివ్యమఙ్గళవిగ్రహత్తై సేవిత్తు ఉగన్ద అడిమై పణ్ణినాలల్లదు ధరిక్కమాట్టాద ప్రకృతిగళోమా యిరున్దు, అడియిలే "దృశ్యతామ్" (భాగవతమ్) ఎన్ఱుమ్, "త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే" (భాగవతమ్) ఎన్ఱుమ్ విణ్ణప్పమ్ శెయ్‌ద వాక్యఙ్గళై విస్మరిత్తాయో? ఆగైయాలే ఎఙ్గళై తోఱ్పిత్త దేవరీరుడైయ దివ్యమంగళవిగ్రహత్తై సేవిక్కప్పణ్ణి, ఉన్ తిరువడిగళిల్ కైంకర్యత్తైయుమ్ ప్రసాదిత్తరుళవేణుమెన్ఱు ప్రార్థిక్కిఱార్. ఇవర్‌గళుక్కు అత్తాలల్లదు శాంతి పిఱవాదిఱే. "పెయ్యుమ్ పూఙ్గుழల్ పేయ్ ములై యుణ్డ పిళ్ళైతేఱ్ఱముమ్ పేర్‌న్దోర్ శాడిఱ శెయ్య పాద మొన్ఱాల్ శెయ్‌ద నిన్ శిఱుచ్చేవకముమ్, నెయ్యుణ్వార్‌త్తైయుళన్ఱు కోల్ కొళ్ల నీ యున్ తామరైక్కణ్గణీర్ మల్‌గ పైయవే నిలయుమ్ వన్దెన్నెఞ్జు యురుక్కుఙ్గళే" (తిరువాయ్- 5- 10-3) ఎన్గిఱపడియే అగ్గుణచేష్టితఙ్గళ్ ప్రపన్నరుడైయ నెఞ్జై పిచ్చేఱ్ఱుమ్బడి పణ్ణుమిఱే.

ప్రహసితం ప్రియ ! ప్రేమవీక్షితం విహరణం చ తే ధ్యానమంగళమ్ ।
రహసి సంవిదో యా హృదిస్పృశః కుహక ! నో మనః క్షోభయంతి హి ॥

(ప్రహసితమ్) అఖిలజగన్మోహనమాన మఱువలుమ్. ముదలడియిలే తఙ్గళై తోఱ్పిత్తు కుమిழు నీరుణ్ణ పృణ్ణిన చేష్టితమాగైయాలే అత్తై చ్చొల్లుగిఱార్. "ఎన్ ముఱ్ఱమ్ పుగున్దు ముఱువల్ శెయ్‌దు నిన్ఱీర్" (పెరియతిరు- 10-8-5) ఎన్గిఱపడియే ఇవనుక్కు అవర్గళుడైయ ముఱ్ఱత్తిలే పుగున్దు ముఱువల్ శెయ్‌గైయే పణియిఱే. అతు

మనస్సును కల్గిన మాకు ఆ విధంగా నీ కథాశ్రవణమాత్రంచేత భరించి, ఉండడం సాధ్యమా ? నీ దివ్యమంగళ విగ్రహాన్ని సేవించి, నీవు మెచ్చిన కైంకర్యాన్ని చేస్తే తప్ప ధరించలేని స్వభావాన్ని కలవారమై ఉండి, మొదటనే "దృశ్యతామ్" అని, "త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే" (నీలో ప్రాణాలు పెట్టుకొన్న నిన్ను వెదుకుతున్నారు) అని విన్నపించిన వాక్యాలను మఱచావా? అందువల్ల మమ్ములను వశం చేసికొన్న నీ దివ్యమంగళవిగ్రహాన్ని సేవింపజేసి, నీ శ్రీపాదాలలో కైంకర్యాన్ని అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారు. వీరికి అందువల్ల తప్ప(వేఱేవిధంగా) శాంతి కలుగదు కదా! "పెయ్యుమ్ పూఙ్కుழల్ పేయ్‌ములై యుణ్డ పిళ్ళైతేఱ్ఱముమ్, పేర్‌న్దోర్ శాడిఱ శెయ్య పాద మొన్ఱాల్ శెయ్‌త నిన్ శిఱుచ్చేవకముమ్ నెయ్యుణ్ వార్త్తైయుళ్ అన్ఱై కోల్ కొళ్ళ నీయుమ్ తామరైక్కణ్‌గళ్ నీర్ మల్‌క పైయవే నిలై యుమ్ వన్దు ఎన్నెఞ్జై యురుక్కుఙ్గళే" (పూలచే అలంకరించబడిన కేశాలను కల్గిన పిశాచి అయిన పూతన స్తన్యాన్ని ఆరగించిన బాల్యంలోని తెలివి, అద్వితీయుడైన శకటాసురుడు ఎగిరిపడి భగ్నం అయేటట్లు ఎట్టని, అద్వితీయ శ్రీచరణంతో చేసిన నీ చిన్ననాటి శౌర్యం, నేతిని ఆరగించావని గోపికలు పల్కినపుడు తల్లి యశోద నిన్ను దండించడానికై దండాన్ని ఎత్తగా నీవు నీతామరలవంటి నేత్రాలలో నీరు నిండగా భయపడి నిలిచిన సన్నివేశం - అన్నీ వచ్చి నా మనస్సును కఱగిస్తున్నవి) అనే రీతిలో ఆ గుణచేష్టితాలు ప్రపన్నుల మనస్సుకు పిచ్చెక్కేటట్లు చేస్తాయికదా!

ప్రహసితం ప్రియ! ప్రేమవీక్షితం విహరణం చ తే ధ్యానమంగళమ్ ।
రహసి సంవిదో యా హృది స్పృశః కుహక! నో మనః క్షోభయంతి హి ॥

(ప్రహసితమ్)- సకలజగత్తును మోహింపజేసే చిఱునవ్వు అని అర్థం. మొదటి దశలో తమను ఓడించి, తలమునకలు కావించి, నీరు తాగించిన లీలకాబట్టి దానినిగూర్చి పల్కుతున్నారు. "ఎన్ ముఱ్ఱమ్ పుకున్దు ముఱువల్ శెయ్‌దు నిన్ఱీర్" (నాముంగిటలో ప్రవేశించి చిఱునవ్వు నవ్వుతూ నిలుచున్నారు) అనే రీతిలో ఇతనికి వారి గుమ్మంలో ప్రవేశించి చిఱునవ్వు నవ్వడమే పనికదా! ఇది వీరి మనస్సులను కఱగించి, మోహింపజేసినందువల్ల

ఇవర్కళుడైయ నెఞ్జగళై యురుక్కి మోహిప్పిత్తపడియాలే అత్తైయే మున్ మున్నే అనుసన్ధిక్కిఱార్గళ్. "సుస్మితశ్రీముఖేన వ్రజపురవనితానాం వర్ధయన్ కామదేవమ్" (భాగవతమ్) ఎన్ఱు శొల్లానిన్ఱదిఱే.

(ప్రహసితమ్) సర్వస్వామిత్వత్తైయుమ్, దయారసత్తైయుమ్ ప్రకాశిప్పిత్తు, ఎఙ్గళుడైయ అజ్ఞానాంధకారత్తై పోక్కిన ముఱువలుమ్. ఇత్తై ఎఙ్గళాల్ ఎప్పడియాలుమ్ విస్మరిక్క విరగిల్లైయే! ఎఙ్గళై దేవరీరుక్కు స్వమ్మాగ ఎழுదిక్కొణ్డ కృత్యమిఱే ఇదు.

(ప్రహసితమ్) "ఆయప్పిళ్లై యழగు కణ్డు ఎన్మగళ్ అయర్క్కిన్ఱదే" (పెరియాழ్వార్ -3-4-7) ఎన్గిఱపడియే సర్వత్తైయుమ్ మఱైప్పిత్తు, అవశమాక్కి, ఎఙ్గళై ఉనక్కు స్వమ్మాగ ఎழுతి కొడుక్కైక్కు దేవరీరుడైయ దివ్యమంగళవిగ్రహసౌందర్య మొన్ఱుమే తక్క పరికరమా యిరుక్క, అతుక్కుమేలే "పవళవాయ్ ముఱువలుమ్ కాణ్బోమ్ తోழీ!" (పెరియాழ్వార్- 3-4-6) ఎన్గిఱపడియే చరాచరనివహమోహనజనకమాన ఇన్ద ముఱువలొన్ఱు మాయ్ ప్రకాశియానిన్ఱదే! ఎప్పడి అత్తై విస్మరిత్తిరున్దక్కడవోమ్" ఎన్గిఱార్గళెన్ఱవుమామ్.

(ప్రియ) ఎఙ్గళుక్కు మిగవుమ్ ప్రియనాయిరున్దవనే ! ఇత్తాల్ - తఙ్గళుక్కు ప్రియవస్తు ఇవనన్ఱి మఱ్ఱొన్ఱిల్లై ఎన్ఱు కరుత్తు. పిఱర్గళుక్కు ప్రియవిషయఙ్గళ్ పల వుణ్డిఱే. ఇవర్గళుక్కు ఇవనొన్ఱుమేయాయ్ఱ్ఱు ప్రియవిషయమ్. "కాలమేగత్తై యన్ఱి మఱ్ఱొన్ఱిలఙ్కతియే" (తిరువాయ్-10-1-1) ఎన్ఱుమ్, "ఆదిప్పిరాన్ నిఱ్క మఱ్ఱ త్తైయ్వమ్ నాడుదిఱే" (తిరువాయ్-4-10-1) ఎన్ఱుమ్, "ఎన్ కణ్ణన్ కణ్ణల్ల దిల్లైయోర్ కణ్ణే" (తిరువాయ్-2-2-1) ఎన్ఱుమ్, "ఇరామపిరానై యల్లాల్ మఱ్ఱుమ్ కఱ్పరో" (తిరువాయ్-7-5-1) ఎన్ఱు మధ్యవసిత్తిరుక్కువమర్గళిఱే. యివర్గళ్.

---

దాన్నే మునుముందుగా అనుసంధిస్తున్నారు. "సుస్మితశ్రీముఖేన వ్రజపురవనితానాం వర్ధయన్ కామదేవమ్" (చిఱునవ్వువల్ల కాంతిని కల్గిన ముఖంతో రేపల్లెలోని స్త్రీల కామాన్ని వర్ధిల్లచేస్తున్నవాడై) అని చెప్పబడుతున్నదికదా!

(ప్రహసితమ్)- సర్వస్వామిత్వాన్ని, దయారసాన్ని ప్రకాశింపజేసి, మా అజ్ఞానాంధకారాన్ని పోగొట్టిన చిఱునవ్వును. దీన్ని మాచేత ఏ రీతిలో అయినా మఱువడానికి వీలు లేదుకదా! మమ్మల్ని నీకు సొత్తుగా రాసి ఇచ్చిన (చేసిన) లీలకదా ఇది!

(ప్రహసితమ్)- "ఆయప్పిళ్ళై యழగు కణ్డు ఎన్ మకళ్ అయర్క్కిన్ఱదే" (గోపబాలుని అందాన్ని చూచి నా కూతురు తెలివి పోగొట్టుకొన్నదే) అనేటట్లు సర్వస్వాన్ని మఱపించి, అవశం చేసి, మమ్మల్ని నీకు సొత్తుగా రాసి ఇవ్వడానికి (నీ వశం చేయడానికి) నీ దివ్యమంగళవిగ్రహం ఒక్కటే తగిన సాధనంగా ఉండగా, దానికి పైన "పవళవాయ్ ముఱువల్ కాణ్బోమ్ తోழீ" (చెలీ! పగడపు మోవిని, చిఱునవ్వును సేవిద్దాం) అన్నట్లు చరాచర సమూహానికి మోహాన్ని కల్గించే ఈ చిఱునవ్వు ఒకటి ప్రకాశిస్తున్నదే! ఏ విధంగా దాన్ని విస్మరించి ఉండగలం!" అని అంటున్నారని కూడా చెప్పవచ్చు.

(ప్రియ)-మాకు చాలా ప్రియంగా ఉన్నవాడా! ఇందువల్ల తమకు ప్రియమైన వస్తువు ఇతడు తప్ప వేఱొకటి లేదని భావం. ఇతరులకు ప్రియమైన విషయాలు చాలా ఉన్నాయికదా! వీరికి ఇతడొక్కడే ప్రియమైన విషయం అయ్యాడు. "కాలమేగత్తై యన్ఱి మఱ్ఱొన్ఱిలఙ్కతియే" (కాలమేఘస్వామి తప్ప వేఱొక గతి లేదు) అని, "ఆదిప్పిరాన్ నిఱ్క మఱ్ఱై ద్దెయ్వమ్ నాడుదిఱే" (జగత్కారణభూతుడు, స్వామి ఉండగా ఇంకొకదైవాన్ని అన్వేషిస్తారా?) అని, "ఎన్కణ్ణన్ కణ్ణల్లదు ఇల్లైయోర్ కణ్ణే" (మన శ్రీకృష్ణుడు తప్ప ఇంకొక రక్షకుడు లేడు) అని, "ఇరామపిరానై యల్లాల్ మఱ్ఱుమ్ కఱ్పరో?" (అభ్యసించేవారు శ్రీరాముని తప్ప ఇంకొకరిని అభ్యసిస్తారా?) అని నమ్మి ఉన్నవారు కదావీరు!

(ప్రహసితం ప్రియ) తఙ్గళుక్కిప్పడి అత్యన్త ప్రియనాగిఱదు- "శెవ్వాయ్ ముఱువలు మాకులఙ్గళ్ శెయ్య" (తిరువాయ్-6-2-2) ఎన్గిఱపడియే తన్నుడైయ ప్రహసితత్తాలేయిఱే. ఆగ, ఇరణ్డుమ్ శేర అనుసన్దిత్తార్గళ్.

(ప్రేమవీక్షితమ్) గ్రీష్మార్దితనానవన్మేలే వర్షధారాపాతమ్బోలే సంసారతాపతప్తరుమాన ఎఙ్గళ్మేలే స్రవిక్కిఱ ప్రేమరసపూరితఙ్గళాన కటాక్షఙ్గళుమ్. ప్రహసితత్తై మఱక్కిలుమ్ ఇతై మఱక్క విడత్తిలుమ్, ఇతు విస్మరిక్క విరగిల్లైయే !

(ప్రహసితం ప్రియ! ప్రేమవీక్షితమ్) "ఎఙ్గళై కణ్డపోదే ముఱువల్ శెయ్దు, ప్రేమగర్భితకటాక్షపాతత్తాలే ఎఙ్గళుడైయ హృదయతాప మెల్లామ్ తీర్త్తు, ఆనన్దిప్పిక్కైయన్ఱిక్కే ప్రియనాన నీ ఇప్పడి దుఃఖిక్కుమ్బడి పణ్ణవల్లైయో? అవ్విరణ్డైయుమ్ సేవిత్తుగక్కత్తక్క యామ్, ఇప్పడి అవ్వనుభవత్తై ఇழన్దు దుఃఖిక్కైక్కే నోற్றோమే!" ఎన్గిఱార్గళాగవుమామ్. "పోకు నమ్బీ! ఉన్తామరై పురై కణ్ణిణైయుమ్ శెవ్వాయ్ ముఱువలుమ్ ఆకులఙ్గళ్ శెయ్య వழிదత్కే నోற்றோమే యామ్" (తిరువాయ్- 6-2-2) ఎన్ఱారిఱే ఆழ்వార్. అన్ఱిక్కే,

(ప్రహసితమ్ ప్రియప్రేమవీక్షితమ్) దేవరీరుడైయ ప్రహసితముమ్, దాసవిషయప్రేమత్తోడే ప్రకాశిక్కిఱ కటాక్షసౌన్దర్యముమ్, అరణ్యత్తిలే ప్రకాశిక్కిఱ నిలా ఆకామే ఎఙ్గళ్ మున్నే తోற్றుమ్బడి పణ్ణి అరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱారాగవుమామ్. "పవళమ్బోల్ కనివాయ్ శివప్ప నీ కాణ వన్దు నిన్ పన్నిలా ముற்றమ్. తవழ் కదిర్ ముఱువల్ శెయ్దు నిన్ తిరుక్కణ్ తామరై త్తయఙ్గ నిన్ఱరుళాయ్" (తిరువాయ్-9-2-5) ఎన్ఱు ఆழ்వార్ ప్రార్థిత్తారిఱే.

---

(ప్రహసితం ప్రియ)- తమకు ఈ విధంగా చాలా ప్రియుడు అయినది- "శెవ్వాయ్ ముఱువలుమ్ ఆకులఙ్గళ్ శెయ్య" (ఎఱ్ఱని నోరు, చిఱునవ్వు వ్యాకులపఱచగా) అనే రీతిలో తన ప్రహసితంవల్లకదా! అందువల్ల రెండింటిని (నేత్రద్వయిని, చిఱునవ్వును) చేర్చి అనుసంధించారు.

(ప్రేమవీక్షితమ్)- గ్రీష్మంచేత బాధపెట్టబడ్డవానిపైన వర్షధారాపాతంవలె సంసారతాపంచేత తపింపబడ్డ మాపైన స్రవించే ప్రేమరసపూరితాలైన కటాక్షాలను (అని భావం). ప్రహసితాన్ని మఱచినా దీన్ని మఱచే వీలు లేదే!

(ప్రహసితం ప్రియ! ప్రేమవీక్షితమ్)- మమ్మల్ని చూచినపుడే చిఱునవ్వును నవ్వి, ప్రేమ అంతర్భవించిన కటాక్షప్రసరణాలతో మా హృదయతాపాన్ని అంతటినీ తీర్చి, ఆనందింపజేయడమేకాక, ప్రియుడవైన నీవు ఈవిధంగా కూడా (మమ్మల్ని) దుఃఖింప జేస్తావా? ఆ రెండింటిని సేవించి ఆనందించతగిన మేము ఈ విధంగా ఆ అనుభవాన్ని పోగొట్టుకొని దుఃఖించడానికే నోచామా! -అని అంటున్నారనికూడా కావచ్చు. "పోకు నమ్బీ! ఉన్ తామరైపురై కణ్ణిణైయుమ్ శెవ్వాయ్ ముఱువలుమ్, ఆకులఙ్గళ్ శెయ్య అழிదత్కే నోற்றோమే యామ్" (ఓ గుణపూర్ణుడా! నీవు పో! పో! నీ తామర రేకులవంటి నేత్రద్వయం, ఎఱ్ఱని మోవి, చిఱునవ్వు ఆకులం చేయగా, మేము బాధపడడంకోసమే నోము నోచామే) అని అన్నారుకదా ఆழ்వార్లు. లేక-

(ప్రహసితం ప్రియ ప్రేమవీక్షితమ్)- నీ ప్రహసితం, దాసవిషయంలోని ప్రేమతో ప్రకాశించే కటాక్షసౌందర్యం అడవిలో ప్రకాశించే వెన్నెలకాకుండా, మాముందే ప్రకాశించేటట్లు చేసి అనుగ్రహించాలి -అని ప్రార్థిస్తున్నారని కూడాకావచ్చు. "పవళమ్బోల్ కనివాయ్ శివప్ప నీ కాణవన్దు నిన్ పన్నిలా ముற்றమ్, తవழ்కదిర్ ముఱువల్ శెయ్దు నిన్ తిరుక్కణ్ తామరై త్తయఙ్గ నిన్ఱరుళాయ్" (గొప్ప పగడంవలె స్నిగ్ధమైన దొండపండువంటి అధరం ఎఱ్ఱగా ప్రకాశించేటట్లు, నీ దంతాల వెన్నెల కాంతి అధరంలో స్ఫురించేటట్లు చిఱునవ్వు నవ్వి, దానిని మేము సేవించేటట్లుగా వేంచేసి, నీ తామరలవంటి నేత్రాలు ప్రకాశించేటట్లుగా వేంచేసి ఉండు) అని ఆழ்వార్లు ప్రార్థించారు కదా!

(విహరణం చ తే ధ్యానమంగళమ్) ధ్యానమాత్రత్తాలే సర్వమంగళావహమాయ్, సర్వశేషియాన దేవరీరుడైయ స్వచ్ఛందమాయ్, పరత్వస్థాపకమాన విహరణముమ్. ఇదువుమ్ దాసభూతర్గళుడైయ నెఞ్జురుగుమ్బడి పణ్ణుమితే. 'పదువై వార్తైయుళ్ ఏఱు పాయ్న్దదుమ్ మాయ మావినై వాయ్ పిళన్దదుమ్. మదువై వార్ కుழలార్ కురవై పిణైన్ద కుழకుమ్, అదు విదు వుదు వెన్నలావన వల్ల యున్ శెయ్గై నైవిక్కుమ్ ముదువైయ ముదల్వా ! ఉన్నై ఎన్ఱు త్తలైప్పెయ్వనే" (తిరువాయ్-5-10-2) ఎన్ఱు ఆழ్వారనుసంధిత్తారితే.

(విహరణం చ తే ధ్యానమంగళమ్) ఇఙ్గు చకారమ్ సముచ్చయార్థకమాయ్, విహరణత్తుక్కు ప్రధానమాన దివ్యమంగళవిగ్రహసౌందర్యత్తైయుమ్ నినైక్కిఱదు. ఇత్తాల్- శ్రియఃపతియాయ్, అవాప్తసమస్తకామనాయ్, సర్వశేషియాన దేవరీరుడైయ ధ్యానమాత్రత్తాలే ఆశ్రితర్కళుక్కు సర్వమఙ్గళఙ్గళైయుమ్ ప్రసాదిక్కుమదాన దివ్యమంగళవిగ్రహసౌందర్యముమ్, తత్ప్రయుక్తమాయ్ వరుమ్ విహరణఙ్గళు మెన్ఱపడి. "శోభయన్ దండకారణ్యం దీప్తేన స్వేన తేజసా, అదృశ్యత తతో రామో బాలచంద్రః ఇవోదితః" (రామా. ఆర-3-8-15) ఎన్గిఱపడియే ఉకవాతారైయుమ్ మోహిప్పిక్కవల్ల దివ్యమఙ్గళవిగ్రహసౌన్దర్యమ్ ప్రియజనఙ్గళాన ఇవర్గళై మోహిప్పిత్తపడి శొల్లవేణుమో?

(రహసి సంవిదో యా హృది స్పృశః) ఎఙ్గళుడైయ హృదయస్పర్శిగళాన నర్మాలాపఙ్గళుమ్. "ఐవాయవరణై మేలాழி ప్పెరుమానార్ మెయ్ వాశకమ్ కేట్టున్ మెయ్ నీర్మై తోఱ్ఱాయే !" (తిరువాయ్-2-1-6) ఎన్గిఱపడియే ఆశ్రితరుడైయ హృదయఙ్గళై యెழుతిక్కొళ్లవల్ల రహస్యవాక్యఙ్గళితే. అవై యావన- మంత్రరహస్యార్థ ప్రతిపాదకవాక్యఙ్గళ్.

---

(విహరణం చ తే ధ్యానమంగళమ్)- ధ్యానమాత్రంచేతనే అన్ని శుభాలను కల్గించేదై, సర్వశేషిఅయిన నీయొక్క స్వచ్ఛందమై, పరత్వస్థాపకం అయిన విహరణం కూడా. (అని భావం). ఇదికూడా దాసభూతులైనవారి మనస్సు కఱిగేటట్లు చేస్తుంది కదా! "వదువై వార్త్తైయుళ్ ఏఱు పాయ్న్దదుమ్, మాయ మావినై వాయ్ పిళన్దదుమ్, మదువై వార్ కుழలార్ కురవై పిణైన్ద కుழకుమ్, అదు విదు వుదు వెన్నలావనవల్ల యున్ శెయ్కై నైవిక్కుమ్ ముదువైయ ముదల్వా! ఉన్నై యెన్ఱు త్తలైప్పెయ్వనే" (నీళాదేవి వివాహప్రసంగంలో ఏడు ఎద్దుల పైనబడి మర్దించడం, మాయను కల్గిన కేశి అనే అశ్వం నోటిని చీల్చడం, తేనె ప్రవహించే కొప్పును కల గోపికలతో ఆడిన రాసక్రీడలో వారి చేతులను పట్టుకొని దరిచేర్చుకొన్న సామర్థ్యం. వీటిలో ఏదీ ఇది, అది, అనతిదూరంలో ఉన్నది (ఉతు) అని చెప్పదగినదిగా లేవు. నీ అన్ని లీలలు నన్ను బాధిస్తున్నాయి. జగత్కారణభూతుడా! నిన్ను ఎపుడు పొందగలను!) అని ఆழ్వార్లు అనుసంధించారుకదా!

(విహరణం చ తే ధ్యానమంగళమ్)- ఇక్కడి చకారం (అనుక్త) సముచ్చయార్థకమై, విహరణానికి ప్రధానం అయిన దివ్యమంగళవిగ్రహ సౌందర్యాన్ని స్మరింపచేస్తుంది. ఇందువల్ల, శ్రియఃపతివై, అవాప్తసమస్తకాముడవై, సర్వశేషివి అయిన నీయొక్క ధ్యానమాత్రంచేతనే ఆశ్రితులకు అన్ని మంగళాలను ప్రసాదించే దివ్యమంగళ విగ్రహసౌందర్యం, దానికి సంబంధించిన విహరణాలు- అని భావం. "శోభయన్ దండకారణ్యం దీప్తేన స్వేన తేజసా, అదృశ్యత తతో రామో బాలచంద్ర ఇవోదితః" (ప్రకాశించే తన తేజస్సుతో దండకారణ్యాన్ని దీపింపజేస్తూ శ్రీరామచంద్రుడు బాలచంద్రుని వలె ఉదయించాడు) అన్నట్లు అభిమానించనివారిని సైతం మోహింపజేయగల దివ్యమంగళ విగ్రహసౌందర్యం ప్రియజనాలైన వీరిని మోహింపజేసిన తీరునుగూర్చి చెప్పాలా!

(రహసి సంవిదో యా హృది స్పృశః) -మా హృదయాలను తాకే నర్మభాషణాలు కూడా. "ఐవాయ్ అరవణైమేల్ ఆழிప్పెరుమానార్ మెయ్ వాశకమ్ కేట్టు ఉన్మెయ్ నీర్మై తోఱ్ఱాయే" (అయిదు తలలను

(కుహక) మహామాయియానవనే! మున్బనుసంధిత్త ముఱువలోపాతియుమ్, ప్రేమపూరితమాన కటాక్షత్తోపాతియుమ్, దివ్యమంగళవిగ్రహత్తోపాతియుమ్, విహారణజ్గళోపాదియుమ్ ఇన్ద మాయైయుమ్, ఇవర్గళుడైయ నెజ్ఞై మయజ్గప్పణ్ణిన పడియాలే "కుహక !" ఎన్ఱు సంబోధిక్కిఱార్గళ్. "ఉరుగు మాల్ నెఞ్జ మున్ఱుయరిన్ పర మన్ఱి ఉరుగు మాల్ వేట్కైయు, మెన్ శెయ్‌గేన్ తొణ్డనేన్, తెరువెల్లామ్ కావి కమళ్ తిరుక్కాట్కరై మరువియ మాయన్దన్ మాయుమ్ నినైతొతే" (తిరువాయ్ -9-6-1) ఎన్ఱు నమ్మాళ్వారనుసంధిత్తారితే.

(నో మనః) మున్బు అనుసంధిత్త ఇవై ఎల్లామ్ కణ్డు, అనన్యార్హరుమాయ్, అనన్యగతిగళుమాన ఎజ్గళుడైయ నెజ్ఞై.

(మనః) ఉన్నై అరక్షణముమ్ పిరియమాట్టాద ఎజ్గళుడైయ నెజ్ఞై. "ఎన్నై నెగిళ్‌క్కిలు మెన్నుడైయ నన్నెఞ్జమ్‌తన్నై యగల్విక్క త్తానుమ్ కిల్లానిని" (తిరువాయ్-1-7-8) ఎన్ఱుమ్, "ఎన్నెఞ్జినారు మజ్గే యొళిన్దార్" (తిరువాయ్) ఎన్ఱుమ్ శొల్లప్పట్టదితే.

(క్షోభయంతి హి) క్షుభితమాగ శెయ్‌ద పడికణ్డాయే! (మనః క్షోభయంతి హి) ఉన్నై యల్లతఱియాత ఎజ్గళుడైయ నెజ్ఞై బాధిక్కిఱపడి శాల అళగియదా యిరున్దదుకాణ్!

---

కల ఆదిశేషునిపై వేంచేసి ఉండే స్వామి యథార్థసూక్తిని విని నీవు నీ శరీరంలోని సౌందర్యాన్ని కోల్పోయావా ?) అనేటట్లు ఆశ్రితుల హృదయాలను చీటీ వ్రాయించుకొనగల రహస్యవాక్యాలు కదా! అవి ఏవి? అంటే- మంత్రరహస్యార్థ ప్రతిపాదక వాక్యాలే.

**(కుహక)-** మహామాయావి అయినవాడా! అని భావం. ముందు అనుసంధించిన చిఱునవ్వువలె, విహారణాల వలె ఈ మాయకూడా వీరి మనస్సును మోహింపజేసినందువల్ల **"కుహక !"** అని సంబోధిస్తున్నారు. **"ఉరుకు మాల్ నెఞ్జ మున్ఱుయరిన్ పరమన్ఱి ఉరుకు మాల్ వేట్కైయుమెన్ శెయ్‌కేన్? తొణ్డనేన్, తెరువెల్లామ్ కావి కమళ్ తిరుక్కాట్కరై మరువియ మాయన్దన్ మాయుమ్ నినైతొతే"** (వీథులన్నిటిలోను కలువపూలు పరిమళించే తిరుక్కాట్కరై అనేదివ్యదేశంలో ఆదరంతో వేంచేసి ఉండే ఆశ్చర్యభూతుడైన కాని మాయను ఆశ్చర్యకరలీలలను భావించినపుడంతా నా మనస్సు కఱుగుతున్నది. అయ్యో! ఆత్మ సహించని రీతిలో అభినివేశం వృద్ధి అవుతున్నది. చపలుడను అయిన నేను ఏంచేయను? అయ్యో!) అని నమ్మాళ్వార్లు సైతం అనుసంధించారుకదా!

**(నో మనః)-** పూర్వం అనుసంధించిన వీటిని అన్నిటినీ చూచి అనన్యార్హులమై, నిన్ను తప్ప ఇంకొక గతిలేని మా మనస్సును.

**(మనః)** నిన్ను అరక్షణంకూడా విడిచి ఉండలేని మా మనస్సును. **"ఎన్నై నెకిళ్‌క్కిలుమ్ ఎన్నుడై నన్నెఞ్జమ్‌తన్నై యకల్‌విక్క త్తానుమ్ కిల్లా నిని"** (నన్ను తొలగద్రోసినా, నామంచి మనస్సును తొలగదోయడానికి ఇక స్వామి తాను సమర్థుడు కాడు) అని, **"ఎన్నెఞ్జినారు మజ్గే యొళిన్దార్"** (నామనస్సుగారు కూడా అక్కడే ఉండి పోయారు) అని చెప్పబడిందికదా!

**(క్షోభయంతి హి)-** క్షోభను కల్గినదానినిగా చేసిన తీరును చూచావా! **(మనః క్షోభయంతి హి)-** నిన్ను తప్ప (ఏదీ) తెలియని మా మనస్సును బాధించిన తీరు చాలా అందంగా ఉందిసుమా!

(హృది స్పృశః మనః క్షోభయంతి హి) "ఎజ్జళుడైయ హృదయత్తిలే ప్రియమాగ పుగున్దు నెఞ్జై కూఱాప్పుడి బాధిక్కిఱ ఇదు మిగవు మాశ్చర్యమాయిరున్దదే!" ఎన్ఱు విద్దరాకిఱార్. "తిరువరుళ్ శెయ్పవన్ పోల ఎన్నుళ్ పుగున్దు, ఉరువము మారుయిరు ముడనే యుణ్డాన్" (తిరువాయ్-9-6-5) ఎన్ఱు ఆ*ழ*్వారనుసంధిత్తారితే.

పత్తామ్ శ్లోకమ్ ము*ற்றி*ற்*று*

## పతినోరామ్ శ్లోకమ్

అవ :- కీ*ழ்*ే, "ముడియానే" ఎన్గిఱ తిరువాయ్మొ*ழி*యిలే ఆ*ழ*్వారుడైయ మనఃపూర్వకమాన కరణజ్గళెల్లామ్ సర్వేశ్వరనుడైయ దివ్యమంగళవిగ్రహ సౌందర్యత్తిలుమ్, కల్యాణగుణచేష్టితజ్గళిలుమ్ ప్రత్యేక ప్రత్యేకమాగ మగ్నమాన వెణ్ణనుసంధిత్తపడియే, ఇన్ద గోపిమార్గళుమ్, తజ్గళుడైయ సర్వేంద్రియజ్గళుమ్ అవనుడైయ దివ్యమజ్గళవిగ్రహసౌందర్య త్తిలుమ్, దివ్యగుణచేష్టితజ్గళిలుమ్ అగప్పట్టపడి అనుసన్దిత్తు, ఇన్ద శ్లోకత్తాలే "ఇప్పడి దేవరీర్ పక్కల్ అత్యంతాభి నివేశయుక్తరాయ్, సుమకోమలరాయ్", "తిరుమకళ్ మ*ற்று* నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై!" (తిరువాయ్-9-2-10) ఎన్గిఱపడియే, ఆకారత్రయసంపన్నరాయ్, మృదుస్వభాతరాన పిరాట్టిమార్కళుడైయ కైగళాలే సేవిక్కప్పడుమ్, పరమపదనిలయనాన యున్ తిరువడియై క్కొణ్డు పశుసంరక్షణత్తిలే మూట్టి, రాక్షసభూయిష్ఠమాన ఇన్ద "ఇరుళ్ తరు మాఞాలత్తిలే" (తిరువాయ్-10-6-1) నడప్పదే! అదుతనక్కు ఎన్న తీఙ్గు వరుగిఱదో! ఎన్ఱజ్ఞే కూప్పిడుగిఱార్. అన్ఱిక్కే, అత్యంతకోమలమాయ్, భక్తరక్షణపరాయణమాన దేవరీరుడైయ తిరువడిగళుక్కు దుర్మార్గరాన సంసారిగళాలే

---

(హృదిస్పృశః మనః క్షోభయంతి హి)- మా హృదయంలో ప్రియంగా ప్రవేశించి, మనస్సును ముక్కలు అయేటట్లు బాధించే ఈ తీరు చాలా ఆశ్చర్యంగా ఉన్నదే !'' అని (గోపికలు) విద్దలపుతున్నారు. "తిరువరుళ్ శెయ్పవన్పోల ఎన్నుళ్ పుకున్దు ఉరువముమ్ ఆరుయిరుమ్ ఉడనే ఉణ్డాన్" (అనుగ్రహించేవానివలె నాలోపల ప్రవేశించి, రూపాన్ని, ఆత్మను వెంటనే ఆరగించాడు) అని ఆ*ழ*్వార్లు (ఈ విధంగానే) అనుసంధించారు కదా!

పదవ శ్లోకం ముగిసింది

## పదకొండవ శ్లోకం

అవ :- పూర్వం, "ముడియానే" అనే తిరువాయ్మొ*ழி*లో ఆ*ழ*్వార్ల మనస్సుతో కూడిన కరణాలన్నీ సర్వేశ్వరుని దివ్యమంగళవిగ్రహసౌందర్యంలోను, కల్యాణగుణలీలలలోను ప్రత్యేక ప్రత్యేకంగా మగ్నం అయినవి అని అనుసంధించిన తీరులోనే, ఈ గోపికలుకూడా తమ సర్వేంద్రియాలూ అతని దివ్యమంగళవిగ్రహ సౌందర్యంలోను, దివ్యగుణచేష్టితాలలోను చిక్కుకొన్న తీరును అనుసంధించి, ఈ శ్లోకంలో "ఈ విధంగా నీపట్ల చాలా అభినివేశాన్ని కల్గినవారై, కుసుమకోమలలై, "తిరుమకళ్ మ*ற்று* నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై" (లక్ష్మీదేవి, మిగిలిన దేవేరులు సేవించే మృదుపాదాలను) అనే రీతిలో ఆకారత్రయసంపన్నలై, మృదుస్వభాన్ని కల దివ్యదేవేరుల శ్రీహస్తాలచేత సేవింపబడే, పరమపదనిలయుడవైన నీ శ్రీపాదాన్ని గొని, పశుసంరక్షణంలో ప్రవేశించి (లగ్నమై) రాక్షసభూయిష్ఠం అయిన ఈ "ఇరుళ్ తరు మాఞాలమ్" (అజ్ఞానాన్ని కల్గించే విశాలభూమి) లో నడవడమా! దానికి ఏమి హాని వస్తుందో! ఏమో!'' అని భయపడి ఆక్రందిస్తున్నారు. లేక, అత్యంతసుకుమారమై, భక్తరక్షణమే పరమోద్దేశ్యంగా కల నీ శ్రీపాదాలకు దుర్మార్గులైన సంసారులవల్ల ఏమి హాని కల్గుతుందో! అని భయపడి, దానికి మంగళాశాసనాన్ని చేయడమే ప్రయోజనంగా కల మమ్మల్ని ఈ విధంగా దుఃఖసముద్రంలో రూపుమాసి పోయేటట్లు విడిచివేస్తున్నావే! దీనికి హేతువు ఏది? అని అంటున్నారనికూడా కావచ్చు.

ఎన్న తీఙ్గు వరుగిఱదో? ఎన్ఱక్షై, అదుక్కు మఙ్గళఙ్గళాశాసిక్కైయే ప్రయోజనమాక ఉడైయ ఎఙ్గళై, ఇప్పడి దుఃఖ సముద్రత్తిలే ఉరుమాయ్న్ద పోమ్బడి విడుగిఱాయే? ఇతుక్కు హేతు ఎన్? ఎన్గిఱారాగవుమామ్.

చలసి యద్వ్రజాత్ చారయన్ పశూన్ నళినసుందరం నాథ! తే పదమ్ ।
శిలతృణాంకురై స్సీదతీతి నః కలిలతాం మనఃకాంత! గచ్ఛతి ॥

(చలసి యద్వ్రజాత్ చారయన్ పశూన్) పశుక్కళై నల్వழி నడప్పిత్తుక్కొణ్డు, వ్రజత్తిల్ నిన్ఱుమ్ పుఱప్పట్టు తిరియానిన్ఱదు ఎదువో, అదు విఱే ఇవర్గళ్ వయిఱు పిడిత్తుక్కొణ్డు కూప్పిడుగైక్కు హేతు. వ్రజత్తిలుళ్ళార్ ఆశ్రితర్గళాయ్, అస్థానే భయశఙ్కికళాయ్, అన్ద తిరువడియై రక్షిక్కుమవర్గళాగైయాలే అఙ్గిరున్ద కాలత్తుక్కు భయప్పడవేణ్డా. పశుసంరక్షణత్తిలే ఉద్యోగిత్తు, అవఱ్ఱై నల్వழి నడప్పిత్తుక్కొణ్డు మేయ్ప్పతఱ్కు. కానకఙ్గళ్దోఱుమ్ ఉలావుమ్బోదిఱే భయప్పడవేణ్డువదు. కానకమ్ ఇదుక్కు విరోధిగళ్ నడైయాడుగిఱ దేశమాగై యాలుమ్, అఙ్గు పరివుడైయా రొరుత్తరుమిల్లామైయాలుమ్, పశుసంరక్షణత్తిలే దీక్షిత్తు తన్నైతాన్ మఱన్దిరుక్కైయే ఇదుక్కు స్వభావమా యిరున్ద పడియాలుమ్, ఇవర్గళ్ కాప్పిట్టాలల్లతు అతుక్కు మఱ్ఱోరు తుణై యిల్లైయే. ఆగైయాలే, అదుక్కు మంగళాశాసనమ్ పణ్ణ ప్రవృత్తరాగిఱార్గళ్. "రూపసంహననం లక్ష్మీః సౌకుమార్యం సువేషతామ్, దదృశు ర్విస్మితాకారాః రామస్య వనవాసినః" (రామా-ఆర-1-12) ఎన్గిఱపడియే అవనుడైయ దివ్యమఙ్గళ విగ్రహత్తినుడైయ సౌందర్య-సౌకుమార్యఙ్గళుక్కు తోఱ్ఱు వనవాసిగళాన ఋషిగళెల్లారుమ్, పరమపదత్తిలే యిరున్దు నిత్యసూరి పరిషన్నిషేవ్యమాణమాన వస్తు ఇన్ద "ఇరుళ్ తరుమాఞాలత్తిలే" (తిరువాయ్-10-6-1) వన్దు పిఱన్దు, అతిలుమ్ పరివుడైయరాన ఆశ్రితర్గళిరున్ద దేశత్తిలిరుక్కై యన్ఱిక్కే క్రూరమృగరాక్షసభూయిష్ఠమాన ఇన్ద కానత్తిలే వన్దు

---

చలసి యద్వ్రజాత్ చారయన్ పశూన్ నళినసుందరం నాథ! తే పదమ్ ।
శిలతృణాంకురైః సీదతీతి నః కలిలతాం మనఃకాంత! గచ్ఛతి ॥

(చలసి యద్వ్రజాత్ చారయన్ పశూన్)- పశువులను చక్కని దారిలో నడిపిస్తూ, రేపల్లెనుండి బయలుదేరి తిరుగుతున్నదన్న ఏ విషయం ఉన్నదో, అదేకదా వీరు కడుపుపట్టుకొని ఆక్రందించడానికి (భయశంకను పొందడానికి) కారణం. (అయింది). రేపల్లెలో ఉండేవారు ఆశ్రయించిన వార్తై, అస్థానే భయాన్ని కలవార్తై, ఆ శ్రీపాదాలను రక్షించేవారు కావడంచేత అచట ఉన్న కాలానికి భయపడనక్కఱలేదు. పశుసంరక్షణలో ప్రయత్నించి, వాటిని సన్మార్గంలో నడుపుతూ మేపడంకోసం, అరణ్యం అంతటా సంచరించేటపుడుకదా భయపడాలి. అరణ్యం దీనికి (శ్రీపాదాలకు) విరోధులు సంచరించే చోటు అరణ్యం కావడంవల్ల, అక్కడ ప్రేమ కలవారెవ్వరూ లేనందువల్ల, పశుసంరక్షణలో దీక్షను కల్గి తనను తాను మఱచి ఉండడమే దీనికి (శ్రీపాదాలకు) స్వభావమై ఉన్నందువల్ల, వీరు రక్షపెట్టి, దీనికి మంగళాశాసనం చేయడానికి ప్రయత్నించినవారు అవుతున్నారు. "రూపసంహననం లక్ష్మీః సౌకుమార్యం సువేషతామ్, దదృశు ర్విస్మితాకారాః రామస్య వనవాసినః" (శ్రీరాముని అందమైన రూపాన్ని, కాంతిని, సౌకుమార్యాన్ని, అవయవాల అందమైన పొందికను వనవాసులైన ఋషులు ఆశ్చర్యాన్ని పొందినవార్తై దర్శించారు) అనే రీతిలో అతని దివ్యమంగళ విగ్రహంయొక్క సౌందర్యసౌకుమార్యాలకు జితులై, వనవాసులైన ఋషులందఱూ, పరమపదంలో ఉండి, నిత్యసూరి పరిషత్తుచేత సేవింపబడే వస్తువు (శ్రీపాదాలు) ఈ "ఇరుళ్ తరు మాఞాలమ్" (అజ్ఞానాన్ని కల్గించే ఈ విశాలభూమి)లోనికి వచ్చి జన్మించి, అందులోను ప్రేమను కలవార్తైన ఆశ్రితులున్న దేశంలో ఉండడం కాకుండా, క్రూరమృగాలతో నిండిన ఈ అరణ్యంలో వచ్చి సంచరిస్తున్నదే! దీనికి ఏం హాని వస్తుందో! అని భయపడి "మంగళాని ప్రయుంజానా ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః" (మంగళాలను

నడైయాడానిఱ్టదే! ఇదుక్కెన్న తీఙ్గు వరుగిఱదో? ఎన్ఱక్షై, "మఙ్గళాని ప్రయుంజానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః" (రామా-అర-1-11) ఎన్గిఱపడియే మఙ్గళాశాసనప్రవృత్తరానార్గళ్.

(చలసి యద్వ్రజాత్ చారయన్ పశూన్) ఇదు ఒరు క్షణముమ్ వ్రజత్తిల్ నిల్లాదితే. ఎప్పోదుమ్ కన్ఱుగ్రినఙ్గళై మేయ్ప్పతఱ్కే వ్రజత్తిల్ నిన్ఱుమ్ పుఱప్పట్టు ప్పోగైయే ఇదుక్కు స్వభావమాయితే ఇరుప్పదు. పడవీట్టైయుమ్, పిరాట్టియైయుమ్, తిరుత్తమ్బియారైయుమ్ విట్టు కానగత్తిలే మాయామృగత్తిన్ పిన్నే పోన తిరువడి తమ్ముడైయ ప్రవృత్తినివృత్తిగళెల్లామ్ ఇతినుడైయ అధీనమామ్బడి అత్యంతపరతంత్రఙ్గళాయ్, పరమసాధుక్కళాయ్, మిగవు మౌదార్యగుణముడైయ పశుక్కళ్ పిన్నే పోగ చ్చొల్లవేణుమో? "త్యక్త్వా సుదుస్త్యజసురేప్సితరాజ్యలక్ష్మీం. ధర్మిష్ఠ! ఆర్యవచసా యదగాదరణ్యమ్, మాయామృగం దయితయేప్సిత మన్వధావత్ వందే మహాపురుష! తే చరణారవిందమ్" ఎన్ఱు శొల్లానిఱ్టదితే.

(చలసి యద్వ్రజాత్ చారయన్ పశూన్) పశుసంరక్షణత్తిలే యుద్యోగిత్తు అదు పరమపదత్తిల్ నిన్ఱుమ్ పణ్ణమాట్టాదే, అతిల్ నిన్ఱుమ్ కాల్ వాఙ్గి, అంతర్యామియాయ్ రక్షిక్కప్పార్త్త విడత్తిలుమ్ లభియాతపడియాలే, అత్తై విట్టు క్షీరార్ణవత్తిలే వన్దవతరిత్తుమ్, అదు శెయ్యమాట్టాదే, "ఏష నారాయణ శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్" (హరివంశ-113-62) ఎన్గిఱపడియే అత్తైయుమ్ విట్టు శ్రీమధురైయిలే వన్దవతరిత్త విడత్తిలుమ్, అన్ద పశుసంరక్షణమ్ లభియామైయాలుమ్, పశుహింసకరాన క్రూరరాక్షసర్గళుక్కు

---

ప్రయోగిస్తూ దృఢవ్రతులైన ఆ ఋషులు శ్రీరాముని ఆదరించారు) అనే రీతిలో మంగళాశాసనం చేయడంలో ప్రవర్తించినట్లే, అత్యంతం ప్రేమను కలవారైన ఈ గోపికలుకూడా మంగళాశాసనం చేయడంలో ప్రవర్తిస్తున్నారు.

(చలసి యద్వ్రజాత్ చారయన్ పశూన్)- ఇది నీ శ్రీచరణాలు ఒక్క క్షణంకూడా రేపల్లెలో నిలువదుకదా! ఎప్పుడూ పశుసమూహాలను మేపడానికే రేపల్లెనుండి బయలుదేరి పోవడమే దీనికి స్వభావంగాకదా ఉన్నది. రాజధానిని, పత్నిని, తమ్ములను విడచి, అరణ్యంలో మాయామృగం వెంట పోయిన శ్రీపాదాలు, తమ ప్రవృత్తి-నివృత్తులన్నీ దీని (తిరువడి) అధీనాలు అయేటట్లు పూర్తిగా పరతంత్రాలై, పరమసాధువులై, చాలా ఔదార్యగుణాన్ని కల పశువుల వెనుక పోవడాన్నిగూర్చి చెప్పాలా! "త్యక్త్వా సుదుస్త్యజసురేప్సితరాజ్యలక్ష్మీం ధర్మిష్ఠ! ఆర్యవచసా యదగాదరణ్యమ్, మాయామృగం దయితయేప్సిత మన్వధావత్ వందే మహాపురుష! తే చరణారవిందమ్" (ధర్మిష్ఠుడైనవాడా! విడువడానికి ఏమాత్రం వీలుకానిది, దేవతలుసైతం కోరేది అయిన రాజ్యలక్ష్మిని వీడి తండ్రిమాట ప్రకారం వనానికి వెళ్ళినది, ప్రియురాలైన సీత అభీష్టాన్ని తీర్చడం కోసం మాయామృగం వెంట పరుగెత్తినది అయిన నీ శ్రీచరణారవిందాన్ని, ఓ మహాపురుషా! నమస్కరిస్తున్నాను) అని చెప్పబడుతున్నదికదా!

(చలసి యద్వ్రజాత్ చారయన్ పశూన్)- పశుసంరక్షణంలో ప్రయత్నించి, దాన్ని పరమపదంనుండి చేయలేక, అక్కడనుండి కాలు తీసి, అంతర్యామియై రక్షించాలని చూచినా (అది) లభించకపోవడంచేత, దానిని విడచి క్షీరార్ణవంలోకి వచ్చి అవతరించినా రక్షణను చేయలేక, "ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్" (పాలకడలిని నివాసంగా కల్గిన ఈ నారాయణుడు నాగపర్యంకాన్ని విడచి మధురాపురికి వచ్చాడు) అన్నట్లు దాన్నికూడా విడచి, శ్రీమధురలోకి వచ్చి అవతరించినా, ఆ పశుసంరక్షణం లభించకపోవడంచేతను, (మధుర) పశువులను హింసించేవారైన క్రూరరాక్షసులకు నివాసం కావడంచేతను, దానిని కూడా విడచి అన్ని విధాలుగానూ తన ప్రయత్నానికి సంకేతస్థానం అయిన రేపల్లెలోకి వచ్చి ప్రవేశించి, అందులోకూడా నిలవకుండా, ఎల్లప్పుడూ రేపల్లెను విడచి పశువులవెంట వాటిని అన్ని దిక్కులలోని చెదటి

నివాసమాగైయాలుమ్, అత్తైయుమ్ విట్టు సర్వవిధజ్గళాలుమ్ తన్నుడైయ ఉద్యోగత్తుక్కు సంకేతభూమియాన నందవ్రజత్తిలే వన్దు పుగున్దు, అతిలుమ్ నిల్లాదే, ఎప్పోదు మిత్తై విట్టు పశుక్కళ్ పిన్నే అవఱ్ఱై దిశైగళ్ దోఱుమ్ శితఱిప్పోగామే, మార్గత్తిలే నడప్పిత్తుక్కొణ్డు మేయ్ప్పదఱ్కు "కన్దు మేయ్త్తు విళైయాడు కోవలన్" (నాచ్చియార్- 4-8) ఎన్గిఱపడియే కానగజ్గళ్ తోఱు ములావుగిఱదితే యిత్తిరువడి. ఇదుక్కు ఎన్న తీజ్గు వరుగిఱదో ? ఎన్ఱు తళరుగిఱార్గళ్.

**(నళినసుందరమ్)** ఇదు అతికర్కశమాయ్, ఎత్తనై నోవు వరిలుమ్ సహిక్క సమర్థమెన్ఱు ఆరియిరుప్పోమో? సౌన్దర్య- సౌకుమార్య-సౌగన్ధ్య- మార్దవాదిగళాలే ఒరు స్పర్శమాత్రత్తాలే వాడ్రాత తన్మైయుడైయ తామరైపోన్ఱ తిరువడియితే.

**(నళినసుందరమ్)** ఒరుకాల్ సేవిక్క పావనత్వ- భోగ్యత్వజ్గళాలే విడవొణ్ణాద వడివఴ్గిఱతే. అత్తాలే ఇదుక్కెన్న తీజ్గు వరుకిఱదో? ఎన్ఱఞ్జి, ఇదు సర్వదేశ- సర్వకాల- సర్వావస్థైగళిలుమ్ సుఖమాగ విళజ్గవేణు మెన్ఱు యాచిత్తు మఙ్గళాశాసనప్రవృత్తరాగిఱార్గళ్.

**(నాథ)** ఎజ్గళుక్కు నాథనానవనే! ఇత్తాల్- సౌన్దర్యాదిగళిల్లావిడిలుమ్, విడవొణ్ణాద సంబంధమ్ శొల్లిఱ్ఱాయ్ఱ్ఱు.

**(తే పదమ్)** శ్రియఃపతియాయ్, అపహతపాప్మత్వాదిలక్షణలక్షితరాన దేవరీరుడైయ ఆశ్రితపాపనివర్తకమాయ్, సదా ధ్యేయమాయ్, సర్వశరణ్యమాన తిరువడి. "ధ్యేయం సదా పరిభవఘ్న మభీష్టదోహం తీర్థాస్పదం శివవిరించినుతం శరణ్యమ్, భృత్యార్తిహం ప్రణతపాల ! భవాబ్ధిపోతం వందే మహాపురుష ! తే చరణారవిందమ్" ఎన్ఱు శొల్లానిన్ఱదితే.

---

పోకుండా మార్గంలో నడుపుతూ మేపడానికై "కన్దు మేయ్త్తు విళైయాడు కోవలన్" (గోవులను మేపి క్రీడించే గోపాలుడు) అన్నట్లు అరణ్యంలో అంతటా సంచరిస్తున్నవికదా ఈ శ్రీపాదాలు. వీనికి ఏమి హాని వస్తుందో! అని తల్లడిల్లుతున్నారు.

**(నళినసుందరమ్)-** ఇది అతికర్కశమై, ఎన్ని బాధలు కలిగినా సహించగల్గినదని సమాధానపడగలమా? సౌందర్య-సౌకుమార్య- సౌంగధ్య-మార్దవాదులవల్ల ఒక స్పర్శమాత్రం అయినా సహించలేని స్వభావం కల తామరవంటి శ్రీపాదం కదా!

**(నళినసుందరమ్)-** ఒకసారి సేవిస్తే పావనత్వభోగ్యత్వాలతో విడువలేని రూపసౌందర్యంకదా! అందువల్ల దీనికి ఏమి చెడ్డ వస్తుందో! అని భయపడి, ఇది సర్వదేశ- సర్వకాల- సర్వావస్థలలోను భద్రంగా ప్రకాశించాలని యాచించి, మంగళాశాసనంలో ప్రవర్తించినవారు అవుతున్నారు.

**(నాథ)-** మాకు స్వామి అయినవాడా! ఇందువల్ల సౌందర్యాదులు లేకపోయినా, అవర్జనీయనీయమైన (స్వామిత్వ) సంబంధం చెప్పబడింది.

**(తే పదమ్)-** శ్రియఃపతివై, అపహతపాప్మత్వాదిలక్షణలక్షితుడవైన నీయొక్క ఆశ్రితుల పాపాలను నివర్తింపజేసేదై, సదా ధ్యానింపతగినదై, సర్వశరణ్యం అయిన శ్రీపాదం (అని భావం). **"ధ్యేయం సదా పరిభవఘ్న మభీష్టదోహం తీర్థాస్పదం శివవిరించినుతం శరణ్యమ్, భృత్యార్తిహం ప్రణతపాల! భవార్తిపోతం వందే మహాపురుష! తే చరణారవిందమ్"** (ఓ మహాపురుషా! శరణువేడిన వారిని పాలించేవాడా! సదాధ్యానింప తగినది, పరాభవాన్ని పోగొట్టేది, అభీష్టాలను అనుగ్రహించేది, తీర్థాలకు నెలవైనది, బ్రహ్మ, శివాదులచు స్తుతింప బడినది, శరణ్యమైనది,

**(శిలతృణాంకురై స్సీదతీతి నః కలిలతాం మనః కాంత ! గచ్ఛతి)** ఎఙ్గళుక్కు కాంతరాన దేవరీరుక్కు, ఎఙ్గళుడైయ కుచకుట్మలఙ్గళిలే విహరిక్కత్తక్క తిరువడిగళై క్కొణ్డు కర్కశభూసంచారమ్ తగుమో? సుమకోమలమాన దేవరీరుడైయ తిరువడి పార్త్త పార్త్త విడమెఙ్గుమ్ పుల్లుమ్ కల్లుమాయిరున్ద అన్ద కానగఙ్గళిలే తిరియుమ్బోదు అవైత్తాన్ మిగవుమ్ నలియప్పడానిన్డదే ! ఎన్ఱు తళర్న్దు, అతినిడత్తిలే మిగవుమ్ పరివుడైయోమాన ఎఙ్గళుడైయ నెఞ్జెప్పోదుమ్ సంచలితమాయ్ కుమిరుమ్బడి కణ్డాయే ! అన్ఱిక్కే,

**(శిలతృణాంకురైః ...గచ్ఛతి)** ప్రపన్నరుడైయ జ్ఞానభక్తిగళుక్కు విషయమాయ్, ప్రకాశిక్కత్తక్క తిరువడియై, మూర్ఖరాయ్, మందమతిగళాయ్, శబ్దాదిగళైయే విరుమ్బుమవరాయ్, **"జ్ఞానేన హీనః పశుభి స్సమానః" (తిరుప్పావైవ్యాఖ్య- 28వ పా.)** ఎన్గిఱపడియే జ్ఞానహీనరాగైయాలే పశుసమరాన సంసారిగళిరున్ద విడత్తిలే ప్రకాశిప్పిత్తు, అవర్కళై పిన్ తొడర్న్దు నలియుమ్బడి పణ్ణ అమైయుమో ? ఎప్పోదుమ్ ఉన్ తిరువడి విషయత్తిల్ మఙ్గళఙ్గళాశాసిక్కైయే ప్రయోజనమాయ్ నిన్ఱ ఎఙ్గళుడైయ నెఞ్జుక్కిదు కణ్డపోదే మిగవుమ్ దుఃఖహేతువానబడి శొల్లవేణుమో?- ఎన్గిఱార్గళెన్ఱవుమామ్. **"అఞ్జనవణ్ణనై యాయర్ కోలక్కొఴున్దినై మఞ్జన మాట్టి మనైగళ్ దోఱుమ్ తిరియామే, కఞ్జనై క్కాయ్న్ద కఴలడి నోవ కన్ఱిన్ పిన్ ఎన్ శెయ్య పిళ్ళైయై ప్పోక్కినే నెల్లే పావమే!" (పెరియాఴ్వార్- 3-2-1)** ఎన్ఱు వయిఱు పిడిక్కుమవర్గళితే ఇవర్గళ్. ఆగ, అత్తిరువడి, అసురరాక్షసర్గళాలే ఒరు తీఙ్గిన్ఱిక్కే, శెవ్విమాఱాదే, మఙ్గళమాయిరున్ద వేణుమెన్ఱు ఇఙ్గు నిన్ఱుమ్ మఙ్గళాశాసనమ్ పణ్ణుగిఱార్గళెన్ఱు శొల్లవుమామ్. **"వేమెమదుయిరఴల్ మెఴుకిలుక్కు..... మామణివణ్ణా! వున్ శెఙ్గమలవణ్ణ! మెన్ మలరడి నోవ నీ పోయ్ ఆమగిఴ్న్దుగన్దవై**

---

భృత్యుల ఆర్తిని తీర్చేది, సంసార సముద్రానికి నావ వంటిది అయిన నీ చరణారవిందానికి నమస్కరిస్తున్నాను) అని చెప్పబడుతున్నదికదా!

**(శిలతృణాంకురైః సీదతీతి నః కలిలతాం మనఃకాంత గచ్ఛతి)-** మాకు కాంతుడవైన నీకు, మా కుచకుట్మలాలలో (మొగ్గలవంటి కుచాలలో) విహరించతగిన శ్రీపాదాలను గొని, కఠినభూమిలో సంచరించడం తగునా? పూవువలె సుకుమారం అయిన నీ శ్రీపాదం చూచిన చోట అంతటా ముళ్ళు రాళ్ళతో నిండిన ఆ అరణ్యాలలో తిరిగేటపుడు అవి చాలా బాధపడుతున్నవి కదా!- అని బాధపడి, దాని విషయంలో చాలా ప్రేమను కల మామనస్సు ఎల్లప్పుడూ చాలా చలించినదై కుమిలే రీతిని చూచావా! అని భావం. లేక,

**(శిలతృణాంకురైః ....గచ్ఛతి)-** ప్రపన్నుల జ్ఞానభక్తులకు విషయమై, ప్రకాశింపదగిన శ్రీపాదాన్ని మూర్ఖులై, మందబుద్ధులై లౌకికవిషయాలనే కోరేవారై, **"జ్ఞానేన హీనః పశుభిః సమానః"** (జ్ఞానహీనుడు పశువుతో సమానం) అనే రీతిలో జ్ఞానహీనులు కావడంచేత పశువులతో సమానులైన సంసారులున్న చోట ప్రకాశింపజేసి, వారిని వెంబడించి, బాధపడేటట్లు చేయడం తగునా? ఎల్లప్పుడూ నీ శ్రీపాదాల విషయంలో మంగళాశాసనం చేయడమే ప్రయోజనంగా ఉన్న మా మనస్సుకు దీనిని చూడగానే చాలా దుఃఖహేతువు అయిన తీరునుగూర్చి చెప్పాలా!- అని అంటున్నారని కూడా చెప్పవచ్చు. **"అఞ్జనవణ్ణనై ఆయర్కోల క్కొఴున్దినై మఞ్జనమాట్టి మనైగళ్ తోఱుమ్ తిరియామే, కఞ్జనై క్కాయ్న్ద కఴలడి నోవ కన్ఱిన్పిన్ ఎన్ శెయ్య పిళ్ళైయై పోక్కినేన్ ఎల్లే! పావమే!"** (కాటుకవలె స్నిగ్ధమైన నల్లని తిరుమేనిని కలవాడై, గోపాలవేషాన్ని దాల్చి, వారికి నాథుడైన వానికి అభ్యంగనం చేయించి, ఇతరులు ఇళ్ళలో అంతటా తిరగడాన్ని చూడడం సహించలేక, మిక్కిలి క్రూరస్వభావాన్ని కల కంసుని తన్నడం వల్ల నొప్పి పుట్టిన వీర కడియాలను కల శ్రీచరణాలు నొప్పిపుట్టేటట్లుగా గోవులవెంట మృదుస్వభావాన్ని కల్గిన బాలుని ఏ ప్రయోజనం కోసంగా నేను పంపించాను ? అయ్యో ! నేను చేసిన పాపమేమి ?) అని కడుపుపట్టుకొనే వారు (బాధపడేవారు) కదా వీరు! అందువల్ల ఆ శ్రీపాదం అసురరాక్షసులవల్ల ఏ హాని లేకుండా, శోభ మాఱకుండా

మేయ్క్కిన్డ్రునోడశురర్కళ్ తడైప్పెయ్యిల్ ఎవఙ్గొలాజ్గే" (తిరువాయ్-10-3-7) ఎన్గనుసంధిత్త నమ్మాళ్వార్ పోలే కాణు మివరుమ్!

**(తే పదం సీదతీతి నః కలిలతాం మనః కాంత ! గచ్ఛతి)** మనోరమరాన దేవరీరుడైయ తిరువడిక్కు ఎన్న తీఙ్గు వరుమో? ఎన్గు ఎజ్గళుడైయ మనస్సు అస్వాస్థ్యత్తై ప్రాపిత్తు దుఃఖిత్తునిన్గదు గాణ్- ఎన్గపడి.

**(కలిలతాం మనఃకాంత! గచ్ఛతి)** మనోహరమాన దేవరీరుడైయ శోభైక్కు ఎన్ల తీఙ్గు వరుమో? ఎన్గు తళర్న్దు, అతుక్కు మఙ్గళఙ్గళాశాసిక్కై మనస్సానదుక్కు స్వరూపమెన్గవుమామ్. "పతిసమ్మానితా సీతా భర్తార మసితేక్షణా, అద్వార మనువవ్రాజ మంగళాన్యభిదధ్యుషీ" (రామా-అయో- 16-21) ఎన్గిఅపడియే రాజసభైక్కుపోగ పుఅప్పట్టు, పిరాట్టి, అంతఃపురత్తుక్కు వన్దు, అవళై సంశ్లేషిత్తు, తోళిల్ తోళ్‌మాలైయై వాఙ్గి అవళుడైయ కంఠప్రదేశత్తిలే వైత్తుగన్దునిన్ద పెరుమాళుడైయ దివ్యమఙ్గళవిగ్రహశోభైయై సేవిత్తు, అతుక్కు రాజభవనత్తిలే కణ్ణెచ్చెలియాలే ఎన్న తీఙ్గు వరుమో? ఎన్గు శఙ్కిత్తు, సింహద్వారత్తళవుమ్ అవరై పిన్ శెన్గు మంగళఙ్గళాశాసిత్తాళిఱే పిరాట్టి. అప్పడియే ఇవరుమ్, నళినసుందరమాన పెరుమాళుడైయ తిరువడిశోభైయై సేవిత్తవర్గళాగైయాలే, పుల్లుమ్, కఙ్కళుమాన కాననత్తిలే ఉలావుమ్బోదు అదుక్కు ఎన్న తీఙ్గు వరుమో ? ఎన్గు భయప్పట్టు, అదు నిత్యమాయ్ శెల్లవేణుమెన్గు మనోరథిక్కై స్వరూపమాగైయాలే మఙ్గళఙ్గళాశాసిత్తార్- ఎన్గు శొల్లవుమామ్.

పదినోరామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

---

మంగళంగా ఉండాలని, ఇక్కడనుండి మంగళాశాసనం చేస్తున్నారని కూడా చెప్పవచ్చు. **"వేమెమదుయిరళల్ మెళుకిలుక్కు..... మా మణివణ్ణా! ఉన్ శెఙ్గమల వణ్ణ మెన్ మలరడి నోవ నీ పోయ్, ఆమకిళన్దుకన్దవై మేయ్క్కిన్డ్రునోడు అశురర్కళ్ తడైప్పెయ్యిల్ ఎవఙ్కోల్ ఆజ్గే !"** (మా ఆత్మ అగ్నిసమీపంలోని మైనం వలె కరిగి దగ్ధమవుతున్నది. గొప్ప నీలమణివర్ణంవంటి వర్ణాన్ని కలవాడా! ఎఱ్ఱని తామరపూలవలె అందమైనదై, మృదువైన పుష్పంవలె సుకుమారమైన నీ శ్రీచరణాలు నొప్పి పుట్టేటట్లు నీవు పోయి ఆశగా గోవులను ఆదరించి మేపే సమయంలో నీతో కూడా అసురులు యుద్ధానికి సిద్ధపడితే అక్కడ ఏమి అనర్థమవుతుందో! ఏమో! అయ్యో!) అని అనుసంధించిన నమ్మాళ్వార్లవలె కదా వీరు (గోపికలు) కూడా!

**(తే పదం సీదతీతి నః కలిలతాం మనఃకాంత గచ్ఛతి)- (మా)** మనస్సును రమింపజేసే నీ శ్రీపాదానికి ఏమి హాని వస్తుందోనని మా మనస్సు అస్వస్థతను పొంది దుఃఖిస్తున్నదిసుమా- అని భావం.

**(కలిలతాం కాంత గచ్ఛతి)-** మా మనస్సును రంజింపజేసే నీ శోభకు ఏమి హాని కల్గుతుందోనని తల్లడిల్లి, దానికి మంగళాన్ని ఆశాసించడం మనస్సుకు స్వరూపం అనికూడా భావం. **"పతిసమ్మానితా సీతా భర్తార మసితేక్షణా, ఆద్వార మనువవ్రాజ మంగళాన్యభిదధ్నుషీ"** (భర్తచే సంమానింపబడ్డ తెల్లని నేత్రాలను కల సీత భర్తను ద్వారంవరకు అనుసరించి వచ్చింది) అనే రీతిలో రాజసభకు పోవాలని బయలుదేరి, పిరాట్టి అంతఃపురానికి వచ్చి, ఆమెను కౌగలించుకొని తన భుజాలలోని తోమాలను తీసి ఆమె కంఠప్రదేశంలో అలంకరించి, సంతోషించి, నిలచిన శ్రీరాముని దివ్యమంగళవిగ్రహశోభను సేవించి, దానికి రాజభవనంలో దృష్టిదోషంవల్ల ఏమి చెడ్డ వస్తుందో! ఏమో! అని సందేహించి, సింహద్వారంవరకు అతని వెంట వెళ్ళి, మంగళాన్ని ఆశాసించిందికదా పిరాట్టి. ఆ రీతిలోనే వీరుకూడా నళినసుందరం అయిన శ్రీరాముని శ్రీపాదాల శోభను సేవించినవారు కావడంవల్ల, ముళ్ళు రాళ్ళతో నిండిన కాననంలో తిరిగేటపుడు దానికి ఏమి హానివస్తుందో అని భయపడి, అది (శ్రీచరణాలు) నిత్యంగా ఉండాలని కోరుకోవడం స్వరూపం కాబట్టి మంగళాన్ని ఆశాసించారు- అనికూడా చెప్పవచ్చు.

పదకొండవ శ్లోకం పూర్తి అయినది

## పన్నిరణ్డామ్ శ్లోకమ్

అవ :- నమ్మా*ழ*్వార్, "ముడిచ్చోదియాయ్ ఉనదు ముగచ్చోది మలర్న్దదువో ?" (తిరువాయ్- 3-1-1) ఎన్ఱు తిరుముఖమణ్డలశోభైయై అనుసంధిత్తు, పిన్బు అతుక్కు త్తగుదియాన తిరువడిశోభైయై "అడిచ్చోతి నీ నిన్ఱ తామరైయా యలర్న్దదువో?" (తిరువాయ్-3-1-1) ఎన్ఱనుసంధిత్తాప్పోలే, ఇన్ద గోపిమార్గళుమ్, ఇప్పడి పుష్పహాసుకుమారమాన తిరువడియుడైయ సౌన్దర్య-సౌకుమార్యజ్గళై అనుసంధిక్కవే తిరుముఖసౌందర్యత్తైయుమ్ స్మరిత్తు, "సాయంతనసమయత్తిలే క*ఱ్ఱి*నజ్గళై వ్రజత్తిలే మీట్టుక్కొణ్డువరుకిఱపోతై అతినుడైయ అ*ழ*కు కణ్డు ఉగక్కు మెజ్గళుక్కు అత్తై సేవియాతపడి మఱైత్తు బాధిత్తాయే?" ఎన్ఱు మోహిత్తుచ్చొల్లుగిఱార్గళ్. "కన్ఱుకళ్ మేయ్త్తు త్తన్ తో*ழ*రోడు కలన్దుడన్ వరువానై తెరువిల్ కణ్డు వన్ఱు మివనై యొప్పారై నజ్గాయ్! కణ్డఱియేన్ ఏడి! వన్దు కాణాయ్, ఒన్ఱు నిల్లా వళై క*ழ*న్ఱు తుకిల్ ఏన్దిళములైయు మెన్ వశ మల్లవే" (పెరియా*ழ*్వార్ - 3-4-4) ఎన్ఱుమ్, "కణ్ణన్ మఞ్జళుమ్ మేనియుమ్ వడివు కణ్డాళ్ అరుకే నిన్ఱాళెన్ పెణ్ణోక్కి క్కణ్డాళ్ అతుకణ్డివ్వూరొన్ఱు పుణర్క్కిన్ఱదే" (పెరియా*ழ*్వార్- 3-4-3) ఎన్ఱుమ్ శొల్లుమవర్గళిఱే ఇవర్గళ్. అన్ఱిక్కే, "ఆశ్రితవిషయత్తిలుణ్డాన వ్యామోహత్తోడుమ్, వాత్సల్యాదిగుణజ్గళోడుమ్ ప్రకాశిత్తు, "మైయలే*ఱ్ఱి* మయక్క ఉన్ ముగమ్ మాయమన్దిరన్దాన్కొలో !" (నాచ్చియార్ తిరు. 2-4) ఎన్ఱాప్పోలే భక్తమోహనమాన తిరుముఖమణ్డలత్తై ఎజ్గళిడత్తిల్ నిన్ఱుమ్ కొణ్డుపోయ్, క్రూరరాన

---

## పన్నెండవ శ్లోకం

అవ :- నమ్మా*ழ*్వార్లు, "ముడిచ్చోదియాయ్ ఉనదు ముకచ్చోది మలర్న్దదువో ?" (నీముఖజ్యోతి నీ కిరీట కాంతిగా వికసించిందా ?) అని తిరుముఖమండలశోభను అనుసంధించి, పిమ్మట దానికి తగిన శ్రీపాదాల శోభను "అడిచ్చోది నీ నిన్ఱ తామరైయా యలర్న్దదువో" (నీపాదకాంతి నీవు నిలచి ఉండే ఆసనపద్మంగా విరిసిందా?) అని అనుసంధించినట్లే, ఈ గోపికలుకూడా ఈ విధంగా పుష్పహాసుకుమారం అయిన శ్రీపాదాల సౌందర్యసౌకుమార్యాలను అనుసంధించగానే, తిరుముఖసౌందర్యాన్ని స్మరించి, "సాయంకాలసమయంలో గోబృందాన్ని రేపల్లెకు తిరిగి తీసికొనివచ్చే సమయంలో దాని అందాన్ని చూచి సంతోషించే మాకు దాన్ని సేవించలేకపోయేటట్లు దాచి బాధించావే !'' -అని మోహించి పల్కుతున్నారు. "కన్ఱుకళ్ మేయ్త్తు త్తన్ తో*ழ*రోడు కలన్దుడన్ వరువానై తెరువిల్ కణ్డు ఎన్ఱు మివనై యొప్పారై నజ్గాయ్! కణ్డఱియేన్ ఏడి! వన్దు కాణాయ్, ఒన్ఱు నిల్లా వళై క*ழ*న్ఱు తుకిల్ ఏన్దిళములైయు మెన్ వశ మల్లవే" (లేగదూడలను కడుపునిండుగా మేపి, తనతోపాటు వచ్చే స్నేహితులతో కలసి వచ్చేవానిని వీథిలో దర్శించాను, స్త్రీత్వ పూర్తిని కల్గినదానా! ఏనాడూ ఇతనితో సాటివచ్చే వారిని చూచి ఎఱుగను. చెలీ ! వచ్చి చూడు. అతనిని చూచిన తరువాత ధరించిన బట్ట నడుముపై నిలువకుండా జారిపోతున్నది, చేతికి ధరించిన గాజులు బలంగా నిలిపినా ఏ మాత్రం నిలవడంలేదు. ఆవిర్భవించి, లేలేత దశలో ఉండే స్తనాలుకూడా నా వశంలో లేవు) అని, "కణ్ణన్ మఞ్జళుమ్ మేనియుమ్ వడివు కణ్డాళ్ అరుకే నిన్ఱాళెన్ పెణ్ణోక్కి క్కణ్డాళ్ అదు కణ్డివ్వూరొన్ఱు పుణర్క్కిన్ఱదే" (శ్రీకృష్ణుని శరీరానికి గొల్లవనితలు పూసిన పసుపును దానికి కాంతిని కల్గించే తిరుమేనిని అందమైన రూపాన్ని చూచి అతడు వచ్చే దారికి దగ్గరలో నిలచిన నా కుమార్తె అందఱు చూచినట్లే చూచింది. ఆశగా చూచింది. ఆమె ఈ విధంగా చూడడాన్ని గమనించి ఈ ఊరిలోని వారు ఒక సంబంధాన్ని ఆరోపించి పల్కుతున్నారే!) అనీ పలికేవారుకదా వీరు. లేక, "ఆశ్రితుల విషయంలో ఉండే వ్యామోహంతో, వాత్సల్యాదిగుణాలతో ప్రకాశించి, "మైయలే*ఱ్ఱి* మయక్క ఉన్ ముకమ్ మాయమన్దిరన్దాన్కోలో !" (మైకాన్ని కల్గించి, వ్యామోహ పఱచడానికి నీముఖం ఒక మంత్రచూర్ణమా?) అన్నట్లు భక్తులకు మోహాన్ని కల్గించే తిరుముఖమండలాన్ని, మావద్దనుండి తీసికొనిపోయి, క్రూరులైన అసురరాక్షసులు

అసురరాక్షసర్గళ్ వర్త్తిక్కిఱ కానగత్తిలే ప్రకాశిప్పిత్తుక్కొణ్డు నిన్రాయే ! అతుక్కెన్న తీఙ్గు వరుమో ? ఎన్రఞ్జి ఇఙ్గు నిన్రుమ్ అతుక్కుమ్ మఙ్గళాశాసన ప్రవృత్తరాగిఱార్గళెన్రవుమామ్. "కఞ్జన్ కఱుక్కొణ్డు నిన్మేల్ కరునిఱచ్చెమ్మయిర్ పేయై వఞ్జిప్పతఱ్కు విడుత్తానెన్బదోర్ వార్త్తైయు ముణ్డు, మఞ్జుతవళ్ మణిమాడ మతిళ్ తిరువెళ్ళఱై నిన్రాయ్ ! అఞ్జువన్ నీ యఙ్గు నిఱ్క అழకనే ! కాప్పిడ వారాయ్" (పెరియాழ్వార్- 2-8-6) ఎన్రు ఎప్పోదు మవనుక్కు కాప్పిడుమవర్గళితే ఇవర్గళ్. అన్రిక్కే, తిరువడియై తఙ్గళుక్కు రణాగ ఉపదేశిత్తదొన్రాగైయాలే, ఉపకారస్మృతియాలే అత్తైయుమ్ స్మరిత్తు అతినుడైయ శోభై నిత్యమాయ్ చ్చెల్లవేణుమెన్రు మనోరథిక్కిఱార్గళ్- ఎన్రవుమామ్.

దినపరిక్షయే నీలకుంతలైః వనరుహాననం బిభ్రదావృతమ్ ।
ఘనరజస్వలం దర్శయన్ ముహుః మనసి న స్మరం వీర ! యచ్ఛసి ॥

**(దినపరిక్షయే)** సూర్యప్రకాశమానదు పూర్ణమాగ నశిత్తునిన్ర సమయత్తిలే. అప్పోదాగ ఇవన్ కానగత్తిల్ నిన్రుమ్ పుఱప్పడానితే. అసురరాక్షసర్గళుడైయ ప్రవృత్తిక్కు నిదానమాన కాలమాగైయాలే అదు భయజనకమాగాదో ప్రియజనఙ్గళుక్కు! ఆగైయాలే మున్ మున్నే "దినపరిక్షయే" ఎన్రు శొల్లుకిఱార్గళ్. అన్రిక్కే, "యదా యదా హి" (భగ- 4-7) ఎన్రుమ్, "తతోఽఖిలజగత్పద్మ-బోధాయాచ్యుతభానునా, దేవకీపూర్వసంధ్యాయా మావిర్భూతం మహాత్మనా" (విష్ణు. పు-) ఎన్రుమ్, శొల్లుగిఱపడియే, ఇవన్ తోన్రుగిఱదు జగత్తెల్లామ్ జ్ఞానమన్రిరున్ద

---

తిరిగే అరణ్యంలో ప్రకాశింపజేస్తున్నావే! దానికి ఏమి హాని వస్తుందో ఏమో!" అని భయపడి ఇక్కడనుండి దానికి మంగళాశానం చేయడానికి ప్రారంభిస్తున్నారని కూడా చెప్పవచ్చు. "కఞ్జన్ కఱుక్కొణ్డు నిన్మేల్ కరునిఱచ్చెమ్మయిర్ పేయై వఞ్జిప్పదఱ్కు విడువిత్తా నెన్బదోర్ వార్త్తైయు ముణ్డు, మఞ్జు తవழ் మణిమాడ మదిళ్ తిరువెళ్ళఱై నిన్రాయ్! అఞ్జువన్ నీ యఙ్గు నిఱ్క అழకనే! కాప్పిడ వారాయ్" (మేఘాలు సంచరించే ఔన్నత్యాన్ని కల్గినది, నవరత్నాలను పొదిగిన భవనాలను కల్గినది, రక్షించగల్గిన కోటలను కల్గినది అయిన తిరువెళ్ళఱై దివ్యదేశంలో నిలచిఉండే స్వామీ! కంసుడు నీపై కోపాన్ని కల్గినవాడై, నల్లని వర్ణాన్ని, సాయం సమయంలోని ఆకాశంవలె ఎఱ్ఱని కేశాలను కల పిశాచిని నిన్ను వంచనతో చంపాలని పంపించాడనే ఒక వదంతి ఉన్నది. అందువల్ల నీవు భయాస్పదం అయిన అక్కడ ఉండడానికి భయపడుతున్నాను. సుందరుడా ! నీ అందానికి హాని కల్గకుండా ఉండేటట్లు నేను రక్ష పెట్టడానికి రావయ్యా!) అని ఎల్లప్పుడూ అతనికి రక్షను పెట్టేవారుకదా వీరు! లేక, శ్రీపాదాన్ని తమకు రక్షకంగా ఉపదేశింపబడింది కాబట్టి, ఉపకారస్మృతితో దాన్నికూడా స్మరించి, దాని శోభ నిత్యంగా కొనసాగాలని ఆశపడుతున్నారనికూడా చెప్పవచ్చు.

దినపరిక్షయే నీలకుంతలైః వనరుహాననం బిభ్రదావృతమ్ ।
ఘనరజస్వలం దర్శయన్ ముహుః మనసి నః స్మరం వీర ! యచ్ఛసి ॥

**(దినపరిక్షయే)**- సూర్యప్రకాశం పూర్తిగా నశించిన సమయంలో - అని అర్థం. అప్పటివరకు ఇతడు అరణ్యంలోనుండి తిరిగి రాడుకదా! అసురరాక్షసుల ప్రవృత్తికి నిదానం అయిన కాలం కాబట్టి అది భయాన్ని కల్గిస్తుంది కదా ప్రియజనానికి! అందువల్ల మునుముందుగా "దినపరిక్షయే" అని అంటున్నారు. లేక, **"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"** (ఎపుడెపుడు ధర్మానికి గ్లాని కలుగుతుందో, అధర్మానికి వృద్ధి కలుగుతుందో అపుడు ఓ అర్జునా! నన్ను సృష్టించుకొంటాను) అని, **"తతోఽఖిల జగత్పద్మబోధాయాచ్యుతభానునా, దేవకీపూర్వసంధ్యాయా మావిర్భూతం మహాత్మనా"** (అపుడు అఖిలజగత్తు అనే పద్మానికి వికాసం కల్గడంకోసం అచ్యుతుడనే సూర్యుడు దేవకి అనే పూర్వసంధ్యలో

సమయత్తిలేయాగైయాలే, ఇత్తాల్ చేతనర్గళెల్లామ్ స్వరూపజ్ఞాన మర్ర్రిరున్దు నశిక్కుమ్ సమయత్తిలే ఎన్లవుమామ్. "మగ్నానాం భవినాం భవార్ణవసముత్తారాయ నారాయణః" ఎన్లు ముణ్డిఱే.

(నీలకుంతలైః వనరుహాననం బిభ్రదావృతమ్) అళికులజ్గళాలే వ్యాప్తమాన తామరైమలర్పోలే కఱునిఱత్తై యుడైయ కుఴల్గళోడే ఆవృతమాయ్, సౌందర్యసౌకుమార్యాదిగళాలే ప్రకాశిక్కిఱ తిరుముఖమణ్డలత్తై దర్శిత్తుక్కొణ్డు. అన్రిక్కే, ఆశ్రితరిడత్తిల్ అత్యన్తవ్యామోహత్తాలే వ్యాప్తమాయ్, దయారసనిలయమాన తిరుముఖమణ్డలత్తై ధరిత్తుకొణ్డు- ఎన్లవుమామ్.

(ఘనరజస్వలం దర్శయన్ ముహుః మనసి న స్మరం వీర ! యచ్ఛసి) ఇప్పడి శోభావహమాయిరున్ద ముఖత్తై క్కొణ్డు, అదెల్లామ్ పోమ్బడి కానగత్తిలే విళైయాడి, పూమిప్పరప్పిల్ ఎల్లా ముళ్ళ పుఴుదియాలే వ్యాప్తమామ్బడి పణ్ణి, అత్తైయే ఎజ్గళుక్కు క్షణన్దోఱుమ్ దర్శిప్పిత్తు, ఎజ్గళుడైయ హృదయజ్గళిలే యత్తైయే స్మరిత్తుక్కొణ్డు విచారిక్కుమ్బడి పణ్ణుగిఱాయే! ఎన్గిఱార్గళ్. "పుఴుతి యళైన్ద పొన్ మేని ....నాణిత్తనైయు మిలాదాయ్ ! నప్పిన్నై కాణిల్చ్చిరిక్కుమ్ మాణిక్కమే! యెన్మణియే! మఞ్జన మాడ నీ వారాయ్" (పెరియాఴ్వార్-2-4-9) ఎన్లుమ్ ప్రార్థిత్తుక్కొణ్డు, అవనుక్కు మఞ్జనమాట్టి సేవిత్తుగక్కుమవర్గళిరే ఇవర్గళ్. ఇప్పడి ధూళిదూసరితమాయిరుక్క వొట్టువర్గళో ?

(ఘనరజస్వలమ్) కరుమ్ కుఴలాలే వ్యాప్తమాయ్, అళికులజ్గళాలే వ్యాప్తమాయ్ వికసిత్త తామరైప్పూప్పోలే ఇరున్దు, ఎజ్గళుడైయ నెఞ్జుక్కుమ్, కణ్ణుక్కుమ్ అత్యంతాహ్లాదకరమాయిరున్దవళవన్రిక్కే, గోధూళిధూసరితమాయుమ్,

---

ఆవిర్భవించాడు) అని చెప్పే రీతిలో ఇతడు ఆవిర్భవించడం జగత్తు అంతా జ్ఞానం లేకుండా ఉన్న సమయంలో కాబట్టి, దీనివల్ల చేతనులు అందఱు స్వరూపజ్ఞానం లేకుండా ఉండి నశించే సమయంలో అనికూడా చెప్పవచ్చు. "మగ్నానాం భవినాం భవార్ణవసముత్తారాయ నారాయణః" (సంసారంలో మునిగిన సంసారులను సంసార సముద్రంనుండి ఉద్ధరించడంకోసం శ్రీమన్నారాయణుడు అవతరిస్తాడు) అని ఉన్నదికదా!

(నీలకుంతలైః వనరుహాననం బిభ్రదావృతమ్)- తుమ్మెదసమూహాలచే వ్యాప్తం అయిన తామరపూవువలె నల్లని రంగును కల కురులతో ఆవరింపబడినదై, సౌందర్యసౌకుమార్యాదులతో ప్రకాశించే తిరుముఖమండలాన్ని దర్శిస్తూ (అని భావం). లేక, ఆశ్రితులపట్ల అత్యంతవ్యామోహంతో వ్యాప్తమై, దయారసనిలయం అయిన తిరుముఖమండలాన్ని ధరిస్తూ ఉండి- అనికూడా భావం.

(ఘనరజస్వలం దర్శయన్ ముహుః మనసి నః స్మరం వీర ! యచ్ఛసి)- ఈ విధంగా శోభావహమై ఉన్న ముఖాన్ని చూచి, అది (శోభ) అంతా పోయేటట్లు అరణ్యంలో క్రీడించి, భూమి విస్తీర్ణంలో ఉన్న దుమ్ముతో వ్యాప్తం అయేటట్లు చేసి, దానినే మాకు ప్రతిక్షణం దర్శింపజేసి, మా హృదయాలలో దాన్నే మేము స్మరిస్తూ విచారించేటట్లుచేస్తున్నావే!- అని అంటున్నారు. "పుఴుతి యళైన్ద పొన్ మేని నాణిత్తనైయు మిలాదాయ్! నప్పిన్నై కాణిల్చ్చిరిక్కుమ్ మాణిక్కమే! ఎన్ మణియే! మఞ్జన మాడ నీ వారాయ్" (ఏమాత్రం సిగ్గు అనేది లేనివాడా! మాణిక్యమా! నా నీలమణీ! బూడిద పూసుకొన్న అందమైన మేనిని నప్పిన్నై చూస్తే నవ్వుతుంది. అభ్యంగనం చేయడం కోసం రా) అని ప్రార్థిస్తూ, అతనికి అభ్యంజనం చేయించి సేవించి, సంతోషించేవారుకదా వీరు ! ఈవిధంగా ధూళిధూసరితంగా ఉంటే ఒప్పుకొంటారా!

(ఘనరజస్వలమ్)- నల్లని కురులతో వ్యాప్తమై, తుమ్మెదల గుంపుచేత వ్యాప్తమై, వికసించిన తామరపూవువలె ఉండి మా మనస్సుకు, కన్నులకు చాలా ఆహ్లాదకరంగా ఉండడమే కాకుండా, గోధూళిధూసరితంగానూ, మాకు

ఎజ్ఞళుక్కు మోహజనకమాయుమిరున్దదీ! ఎన్గిఱార్గళ్. "మైయలే*గ్రగ్రి* మయక్క యున్ ముగమ్ మాయమన్దిరమ్ తాన్కొలో!" (నాచ్చియార్ తిరు-2-4) ఎన్ఱు శొల్లప్పట్టదిఱే.

(ఘనరజస్వలమ్) ఇతుక్కు గోధూళియేయిఱే యలఙ్కారమా యిరున్దదు. జగదవనత్తుక్కాగ వన్దు పిఱన్దపడియాలే సర్వసౌలభ్యత్తై ప్రకాశిప్పిత్తుక్కొణ్డు, గోధూళిధూసరితమాయ్ క్కొణ్డు విళఙ్గినిన్ఱదే !- ఎన్గిఱార్గళ్ "కస్తూరీతిలకాంచితం కమలజేనారాధితం శ్రీసఖమ్" ఎన్గిఱపడియే కస్తూరీతిలకాంచితమాయ్, చతుర్ముఖనాలే ఆరాధిక్కప్పట్టు, ఆకారత్రయసంపత్తియుడైయ కించిత్జ్ఞరాన ఎజ్ఞళాల్ ఆరాధిక్కప్పట్టు, అతివిలిగళుమాన ఎజ్ఞళిడత్తిలే మిగవుమ్ స్నేహిత్తుక్కొణ్డు విళఙ్గినిన్ఱదే! ఎన్ఱు అన్ద సౌలభ్యగుణత్తుక్కు మోహిత్తుచ్చొల్లుగిఱార్గళ్ ఎన్ఱవుమామ్.

(నీలకుంతలై ర్వనరుహానసం బిభ్రదావృతం ఘనరజస్వలమ్) చేతనర్గళిడత్తిలుణ్డాన వ్యామోహత్తాలే, అవర్గళుడైయ రక్షణత్తుక్కాగ పిఱన్దు, అవర్గళుడైయ దోషఙ్గళై ఎల్లామ్ అలఙ్కారమాగ గ్రహిత్తు, దయాప్రకాశకమా యిరున్ద తిరుముఖమణ్డలత్తై ధర్శిత్తుక్కొణ్డెన్నవుమామ్

(దర్శయన్ ముహుః) ఇప్పడి యిరున్దుళ్ళ తిరుముఖమణ్డలత్తై ఎప్పోదుమ్ దర్శిప్పిత్తుక్కొణ్డు.

(మనసి నః) అనాదియాన కర్మవాసనాబలత్తాలే ప్రకృతివిషయప్రావణ్యత్తైయే పణ్ణుగిఱ ఎజ్ఞళుడైయ నెఞ్జిలే. అన్ఱిక్కే, దేవరీరుడైయ తిరుముఖమణ్డలసౌన్దర్యత్తుక్కు తన్నై సమర్పిత్తు క్కొణ్డు నిఱ్కిఱ ఎజ్ఞళుడైయ మనస్సిలే- ఎన్ఱవుమామ్.

---

మోహాన్ని కల్గించేదిగాను ఉన్నదే - అని అంటున్నారు. "మైయలే*గ్రగ్రి* మయక్క ఉన్ ముకమ్ మాయమన్దిరన్దాన్ కొలో" (పిచ్చెక్కించి వ్యామోహాన్ని కల్గించడంలో నీ ముఖం మాయాచూర్ణమా! ఏమి!) అని చెప్పబడింది కదా!

(ఘనరజస్వలమ్)- దీనికి గోధూళియేకదా అలంకారంగా ఉంటుంది. లోకరక్షణం కోసం వచ్చి జన్మించినది కాబట్టి సర్వసౌలభ్యత్వాన్ని ప్రకాశింపజేస్తూ, గోధూళిధూసరితమై ప్రకాశిస్తూ ఉన్నదే! అని అంటున్నారు. "కస్తూరీతిలకాంచితం కమలజేనారాధితమ్ శ్రీసఖమ్" (కస్తూరీతిలకంతో అలంకరింపబడినది, బ్రహ్మ ఆరాధింపబడినది, లక్ష్మీసఖమైనది) అన్నట్లు కస్తూరీతిలకంతో అలంకరింపబడినదై, బ్రహ్మచేత ఆరాధింపబడి, ఆకారత్రయసంపదను కల లక్ష్మీదేవివిషయంలో చాలా స్నేహం కల ఈ వస్తువు (శ్రీపాదం) ఇచట గోధూళిలో అలంకరింపబడినదై, కించిత్జ్ఞులైన మాచే ఆరాధింపబడి, అజ్ఞులైన మా విషయంలో చాలా స్నేహాన్ని కల్గి ప్రకాశిస్తున్నదే!- అని ఆ సౌలభ్యగుణానికి మోహించి పల్కుతున్నారనికూడా చెప్పవచ్చు.

(నీలకుంతలైః వనరుహాననం బిభ్రదావృతం ఘనరజస్వలమ్)- చేతనుల విషయంలో ఉన్న వ్యామోహంచేత, వారి రక్షణకోసం పుట్టి, వారి దోషాలను అన్నిటినీ అలంకారంగా గ్రహించి, దయను ప్రకాశింపచేసేదిగా ఉన్న తిరుముఖమండలాన్ని దర్శించి- అని కూడా భావం.

(దర్శయన్ ముహుః)- ఈ విధంగా ఉన్న తిరుముఖమండలాన్ని ఎప్పుడూ దర్శింపజేస్తూ.

(మనసి నః)- అనాది అయిన కర్మవాసనాబలంవల్ల ప్రకృతివిషయాలలోని ప్రావణ్యాన్నే కల్గిఉండే మా మనస్సులో అని భావం. లేక, తమ తిరుముఖమండలసౌందర్యానికి మమ్ములను సమర్పించుకొని నిలచిన మా మనస్సులో- అనికూడా భావం.

(మనసి నః) అకించనలై, అనన్యగతికలైన మా మనస్సులో అనికూడా చెప్పవచ్చు.

(మనసి నః) ఆకిఞ్చన్యరుమాయ్, అనన్యగతిగళుమాన ఎఙ్గళుడైయ నెఞ్జైలే- ఎన్ఱు శొల్లవుమామ్.

(స్మరం వీర! యచ్ఛసి) ఆశ్రితవిరోధినిరసనస్వభావనానవనే ! ఇప్పడి యిరున్ద ప్రకృతివాసనైయై అఱుత్త ఉన్ తిరువడిగళిలే కైంకర్యత్తై యాచిత్తు నిఱ్కుమ్బడి కటాక్షిత్తాయే!

(మనసి నః స్మరం వీర ! యచ్ఛసి) "చంద్రకాన్తాననం రామ మతీవ ప్రియదర్శనమ్, రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్" (రామా- అయో- 3-28) ఎన్గిఱపడియే ఆణ్గళైయుమ్ పెణ్ణుడై యుడుత్తుమ్బడి మోహత్తిలే మూట్టిన తిరుముఖసౌందర్యమ్, పెణ్గళుమాయ్, అనన్యార్హరుమాయ్, అగతిగళుమాన ఎఙ్గళుడైయ మనస్సై మోహిక్కప్పణ్ణ శొల్లవేణుమో?

(మనసి నః స్మరం వీర ! యచ్ఛసి) ఇప్పడి ఎఙ్గళుడైయ హృదయఙ్గళుక్కు మోహజనకమాయ్, ఎఙ్గళుడైయ కైగళాలే అలంకృతమాయ్, కాప్పుణ్డు విళఙ్గానిన్ఱుళ్ల తిరుముఖత్తై, అత్యన్తపరివుడైయరాన ఎఙ్గళుడైయ గోష్ఠియిల్ నిన్ఱుమ్ విశ్లేషిప్పిత్తు, అతినుడైయ సౌందర్యత్తై క్కాణ్గవే తఙ్గళుడైయ నేత్రఙ్గళిలే ఎఱిగళ్లై విழிక్కుమవరాన అసురరాక్షసర్గళిరున్ద కానగమ్పాల్ శెయ్దాయే! అదుక్కెన్న తీఙ్గు వరుమో? ఎఙ్గిరున్దాలు మదుక్కొరు తీఙ్గిన్ఱిక్కే మఙ్గళావహమాయిరున్దు విళఙ్గవేణు మెన్ఱు అదుక్కు మఙ్గళాశాసన ప్రవృత్తరాగిఱార్గళ్. "కచ్చి న్న తద్దేమసమానవర్ణం తస్యాననం పద్మసమానగంధి, మయా వినా శుష్యతి" (రామా-సుందర- 36-28) ఎన్ఱు క్లేశిత్త పిరాట్టియుడైయ స్వభావత్తైయుడైయరాయిరున్దార్గళితే ఇవర్గళుమ్. పెరియాழ்వార్ ఎదిరే విళఙ్గి నిన్ఱ వస్తువుక్కు మంగళాశాసనమ్ పణ్ణినార్. ఇవర్గళ్, తఙ్గళై విట్టు దూరమాగ నిఱ్కిఱ వస్తువుక్కు మఙ్గళాశాసనమ్ పణ్ణుగిఱారితే.

---

(స్మరం వీర ! యచ్ఛసి)- ఆశ్రితవిరోధులను నిరసించే స్వభావాన్ని కలవాడా! ఈ విధంగా ఉన్న మా ప్రకృతివాసనను నశింపజేసిన నీ శ్రీపాదాలలో కైంకర్యాన్ని యాచించి, నిలిచేటట్లు (మమ్ములను) కటాక్షించావే!

(మనసి నః స్మరం వీర యచ్ఛసి)- "చంద్రకాంతాననం రామ మతీవ ప్రియదర్శనమ్, రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్" (చంద్రుని కంటె అందమైన ముఖాన్ని కలవాడు, రూపం, గొప్పకల్యాణ గుణాలతో ప్రాణుల దృష్టిని, చిత్తాన్ని హరించేవాడైన శ్రీరాముని) అనే రీతిలో మగవాళ్ళను సైతం ఆడవేషాన్ని ధరించేటట్లు మోహంలో ముంచిన తిరుముఖసౌందర్యం స్త్రీలమై, అనన్యార్హలమై, నీవు తప్ప వేఱు గతి లేని మా మనస్సును మోహింపజేస్తుందని చెప్పాలా!

(మనసి నః స్మరం వీర యచ్ఛసి)- "ఈవిధంగా మా హృదయాలకు మోహజనకమై, మా చేతులతో అలంకరింపబడినదై, మంగళాశాసనం చేయబడి ప్రకాశిస్తున్న తిరుముఖాన్ని, చాలా ప్రేమను కలవారమైన మా గోష్ఠినుండి విశ్లేషింపజేసి, దాని సౌందర్యాన్ని చూడగానే తమ నేత్రాలలో నిప్పులను కురిపించేవారైన అసురరాక్షసులున్న అరణ్యం పాలుచేశావే ! దాని కేమి చెడ్డవస్తుందో ! ఎక్కడ ఉన్నా దానికే కీడు లేకుండా మంగళాన్ని కలిగి ఉన్నదై ప్రకాశించాలి"- అని దానికి మంగళాశాసనాన్ని చేయడానికి ప్రయత్నిస్తున్నారు. "కచ్చి న్న తద్దేమసమానవర్ణం తస్యాననం పద్మసమానగంధి ...... మయా వినా శుష్యతి" (బంగారు వర్ణంతో సమానమైన వర్ణాన్ని కల్గినది, పద్మసమానమైన గంధాన్ని కల్గినది అయిన శ్రీరామునిముఖం నా విరహంచేత వాడిపోతున్నది) అని బాధపడిన సీతాదేవి స్వభావాన్ని కలవారై ఉన్నారుకదా వీరు. పెరియాழ்వార్లు ఎదురుగా ప్రకాశించి నిలచిన వస్తువుకు మంగళాశాసనాన్ని చేశారు. వీరు తమను విడచి దూరంగా నిలచిన వస్తువునకు మంగళాశాసనాన్ని చేస్తున్నారుకదా!

పన్నెండవ శ్లోకం ముగిసింది

## పతిన్ మూన్ఱామ్ శ్లోకమ్

అవ :- ఆ*ழ்*వార్ తిరువాయ్‌మొ*ழி*యిలే ప్రాప్యవైలక్షణ్యజ్ఞాన మడియాగ వన్ద ప్రేమాతిశయమ్ కరై పురణ్డు, “తుయ రఱు శుడరడి తొ*ழு*దె*ழு* ఎన్మననే !” (తిరువాయ్-1-1-1) ఎన్ఱు పరమప్రాప్యమాన శ్రియఃపతియుడైయ తిరువడిసన్నిధియిలే, సర్వదేశ- సర్వకాల- సర్వావస్థోచిత ప్రీతికారితకైంకర్యత్తై ప్పణ్ణ క్కణిశిత్తు, అత్తై త్తరుమవన్ అవనే యాగైయాలే, “పెరుమాన్ కనైక*ழ*ల్ కాణ్బదెన్ఱుకొల్ కణ్గళే” (తిరువాయ్-3-6-10) ఎన్ఱుమ్, “ఉన్ తేనే మలరుమ్ తిరుప్పాదమ్ శేరు మాఱు వినైయేనే” (తిరువాయ్-1-5-5) ఎన్ఱుమ్, “అడియేనై పొరుళాక్కి యున్ పొన్నడిక్కీ*ழ்* పుకవైప్పాయ్” (తిరువాయ్-9-8-) ఎన్ఱుమ్, “ప*ழு*దిల్ తొల్ పుగ*ழ்* పామ్బణై ప్పళ్ళియాయ్! త*ழு*వు మాఱఱియే ననతాళ్గళే” (తిరువాయ్-9-3-9) ఎన్ఱుమ్, “వడివిణై యిల్లా మలర్మగళ్ మ*ற్ఱై* నిలమగళ్ పిడిక్కుమ్ మెల్లడియై, కొడువినై యేనుమ్ పిడిక్క నీ యొరునాళ్ కూవుదల్ వరుదల్ శెయ్యాయే” (తిరువాయ్-9-2-10) ఎన్ఱుమ్, “తొణ్డనేన్ ఉన్ క*ழ*ల్ కాణ వొరునాళ్ వన్దు తోన్ఱాయే” (తిరువాయ్-8-5-6) ఎన్ఱుమ్, “అడియేన్ ఉనపాదమ్ కూడు మాఱు కూఱాయే” (తిరువాయ్-6-10-1) ఎన్ఱుమ్, “అడియేన్ ఉన్నడి శేర్‌వణ్ణ మరుళాయే” (తిరువాయ్-6-10-2) ఎన్ఱుమ్, “అణ్ణలే ! యున్నడి శేర అడియేఱ్కావా వెన్నాయే” (తిరువాయ్-6-10-3) ఎన్ఱుమ్, “పూవార్ క*ழ*ల్గళ్ అరువినైయేన్ పొఱున్దు మాఱు పుణరాయే” (తిరువాయ్-6-10-4) ఎన్ఱుమ్, “ఉన పాదమ్ శేర్వదడియే

---

## పదమూడవ శ్లోకం

అవ :- ఆ*ழ்*వార్లు తిరువాయ్‌మొ*ழி*లో ప్రాప్యవైలక్షణ్యమూలంగా (ప్రాప్యభూతుడైన భగవానుని వైలక్షణ్యం కారణంగా) కల్గిన ప్రేమాధిక్యం అవధిని దాటి (తీరాన్ని దాటి), “తుయరఱు శుడరడి తొ*ழு*దు ఎన్మననే !” (ఓ నా మనసా! దుఃఖాన్ని తీర్చే, ప్రకాశించే భగవానుని పాదాలను ఆశ్రయించు) అని పరమప్రాప్యం అయిన శ్రియఃపతియొక్క శ్రీపాదాల సన్నిధిలో సర్వదేశ- సర్వకాల- సర్వావస్థలకు తగిన, ప్రీతికారితమైన కైంకర్యాన్ని చేయాలని ఆశపడి, దానిని ఇచ్చేవాడు అతడే కాబట్టి, “పెరుమాన్ కనైక*ழ*ల్ కాణ్బదెన్ఱుకొల్ కణ్గళ్” (లోకాలను కొలిచిన త్రివిక్రమస్వామి శబ్దించే కడియాలను కల శ్రీచరణాలను నా నేత్రాలు ఎపుడు దర్శిస్తాయో కదా) అని, “ఉన్ తేనే మలరుమ్ తిరుప్పాదమ్ శేరు మాఱు వినైయేనే” (తేనెను ప్రసవించే తామరలవంటి నీచరణాలను చేరే దారిని పాపిష్ఠివాడనైన నేను తెలిసేటట్లు చెప్పు) అని, “అడియేనై ప్పొరుళాక్కి ఉన్ పొన్నడిక్కీ*ழ்* పుకవైప్పాయ్” (దాసుణ్ణి అయిన నాకు సత్తను కల్గించి, నీ బంగారు పాదాలకింద ప్రవేశింపజేశావు) అని, “ప*ழு*దిల్ తొల్ పుక*ழ்* పామ్బణై ప్పళ్ళియాయ్! త*ழு*వుమాఱఱియేన్ ఉనతాళ్‌కళే” (ఏదోషం లేని, స్వాభావికమైన కల్యాణ గుణాలను కలవాడా! ఆదిశేషుని పర్యంకంగా కలవాడా! నీ శ్రీచరణాలను చేరే దారి తెలియలేను) అని, “వడివిణై యిల్లా మలర్ మకళ్ మ*ற్ఱై* నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై కొడువినై యేనుమ్ పిడిక్క నీ యొరునాళ్ కూవుదల్ వరుదల్ శెయ్యాయే” (రూపంలో సాటిలేని లక్ష్మీదేవి, మిగిలిన దేవేరులు సంవాహనం చేసే మృదుపాదాలను పాపిష్ఠివాడనైన నేను కూడా సంవాహనం చేసేటట్లుగా నీవు ఏదో ఒకనాడు నన్ను పిలవడం, నాదరికి రావడం చేయవా!) అని, “తొణ్డనేన్ ఉన్ క*ழ*ల్ కాణ వొరు నాళ్ వన్దు తోన్ఱాయే”, (దాసుణ్ణి అయిన నేను నీ పాదాలను సేవించేటటఉర్లి ఏదో ఒకనాడు వచ్చి సాక్షాత్కరించవా !) “అడియేన్ ఉనపాదమ్ కూడుమాఱు కూఱాయే” దాసుణ్ణి అయిన నేను నీ శ్రీచరణాలను చేరే దారి చెప్పవా) అని, (స్వామీ ! నీ శ్రీచరణాలను నేను చేరేటట్లుగా అయ్యో ! అయ్యో ! అని దయ చూపవా !) అని, “అడియేన్ ఉన్నడి శేర్ వణ్ణ మరుళాయే” (దాసుణ్ని అయిన నేను నీ పాదాలను చేరే తీరును చెప్పవా) అని, “పూవార్ క*ழ*ల్కళ్ అరువినైయేన్ పొఱున్దుమాఱు

నెన్నాళే" (తిరువాయ్-6-10-5) ఎన్నుమ్, "ఎన్నాళ్ ఉన్నడిక్కీ*ழ*డియేన్ మేవువదే" (తిరువాయ్-6-10-6) ఎన్నుమ్, "అన్దో ! అడియేననుపాద మకలకిల్లేన్ నిఱైయుమే" (తిరువాయ్-6-10-9) ఎన్నుమ్, "ఉన్నడిక్కీ*ழ்* అమర్న్దు పుకున్దేనే" (తిరువాయ్-6-10-10) ఎన్నుమ్, "అడియే నడి కూడువదెన్నుకొలో!" (తిరువాయ్-) ఎన్నుమ్, "కాణ్బదెఞ్ఞాన్నుకొల్ ...... మాణ్ కుఱళ్ కోలప్పిరాన్ మలర్తామరై ప్పాదఙ్గళే" (తిరువాయ్-5-9-6) ఎన్నుమ్ అనుసంధిత్తుక్కొణ్డు, అత్తై ప్రాపిక్కైక్కు ప్రాపకమాగ అవన్ తిరువడిగళిలే వి*ழ*ున్దు, "ఉ*ఱ్ఱే* నుగన్దు పణి శెయ్దునపాదమ్ పె*ఱ్ఱే*న్, ఈదే యిన్నుమ్ వేణ్డువదెన్దాయ్ !" (తిరువాయ్-10-8-10) ఎన్ఱు అ*ఱ్ఱై* ప్రాపిత్తు అనన్దిత్తాప్పోలే, ఇన్ద గోపిమార్గళుమ్, ప్రాప్యవైలక్షణ్యజ్ఞానత్తాలే ఆ*ఱ్ఱా*మై విఞ్జి, ఆఱామ్ శ్లోకత్తిలే "తే పదాంబుజం కృణు కుచేషు నః కృంధి హృచ్ఛయమ్" (భాగవతమ్) ఎన్ఱు తిరువడిగళై యుద్దేశిత్తు ప్రాప్యవిరోధినిరసనత్తుక్కుపాయమాగ ప*ఱ్ఱి*, ఇన్ఱు ఇన్ద శ్లోకత్తాలే, ప్రాప్యరుచియాలే తిరువడిగళై ప*ఱ్ఱు*గిఱార్. శ్రీనిలయమాయ్, అఖిలహేయప్రత్యనీక కల్యాణైకతానమాయ్, సర్వశేషియాన "తిణ్క*ழ*ల్"(తిరువాయ్ 1-2-10) ఆగైయాలే, ప్రాపకావస్థైయిలుమ్, ప్రాప్యావస్థైయిలు మత్యంతాభినివేశత్తోడే ప*ఱ్ఱు*గై యొ*ழ*ియ విడప్పోగాదిఱే. "అడియై యడైన్దుళ్ళన్దేఱి యీఱిలిన్బత్తిరువెళ్ళమ్ యాన్ మూ*ழ்*కినన్" (తిరువాయ్-2-6-8) ఎన్గిఱపడియే ఆశ్రయిత్త చేతనరై నిర్మలాంతఃకరణరాక్కి, ఆనందత్తిలే మయఙ్గప్పణ్ణువదొన్ఱిఱే. ఇతినుడైయ సర్వవైలక్షణ్యజ్ఞానమ్ పిఱన్దవాఱే, "తేఽంఘ్రిమూలం ప్రాప్తాః విసృజ్య వసతీ స్త్వదుపాసనాశాః" (భాగవతమ్) ఎన్గిఱపడియే తన్ సన్నిధిక్కు

---

పుణరాయే" (పూలను నిండుగా కల్గిన నీ పాదాలలో పాపిష్ఠివాడనైన నేను పొందికగా ఉండే రీతిని తెలుపవా !) అని, "ఉనపాదమ్ శేర్వదు అడియేన్ ఎన్నాళే" (దాసుడను నీ పాదాలను చేరడం ఏనాడో కదా !) అని, "ఎన్నాళ్ ఉన్నడిక్కీ*ழ்* అడియేన్ మేవువదే" (ఏనాడు నీ చరణాలను నేను సేవిస్తాను?) అని, "అన్దో! అడియేన్ ఉనపాదమ్ అకలకిల్లేన్ ఇఱైయుమే" (హంత ! నీ పాదాలను దాసుణ్ణి అయిన నేను క్షణం కూడా విడువలేనే) అని, "ఉన్నడిక్కీ*ழ்* అమర్న్దు పుకున్దేనే" (నీ శ్రీచరణాలక్రింద అమరి ప్రవేశించాను ఆహా!) అని, "అడియేన్ అడి కూడువదు ఎన్నుకొలో !" (దాసుడను నీ చరణాలను చేరడం ఎపుడో కదా!) అని, "కాణ్బదు ఎఞ్ఞాన్నుకొల్....మాణ్ కుఱళ్ కోలప్పిరాన్ మలర్తామరై ప్పాదఙ్గళే" (బ్రహ్మచారి, వామనుడు అందమైన రూపాన్ని కలవాడైన స్వామియొక్క తామరపుష్పాలవంటి పాదాలను దర్శించడం ఏ సమయంలోనే కదా!) అని అనుసంధిస్తూ దాన్ని పొందడానికి సాధనంగా అతని శ్రీపాదాలలో పడి, "ఉ*ఱ్ఱే*న్ ఉకన్దు పణిశెయ్దు ఉన్పాదమ్ పె*ఱ్ఱే*న్ ఈదే ఇన్నమ్ వేడువదెన్దాయ్ !" (నిన్ను పొందాను ఆనందంతో కైంకర్యం చేసి నీ శ్రీచరణాన్ని పొందాను. నా తండ్రీ! ఇదే నాకు ఇంకా కావలసినది) అని దాన్ని పొంది, ఆనందించినట్లే, ఈ గోపికలుకూడా ప్రాప్యవైలక్షణ్యంలో విరహం అతిశయించి, ఆఱవ శ్లోకంలో "తే పదాంబుజం కృణు కుచేషు నః కృంధి హృచ్ఛయమ్" (నీ పాదాంబుజాన్ని మా కుచాలపైపెట్టు. హృదయతాపాన్ని తీర్చు.) అని శ్రీపాదాలను ఉద్దేశించి ప్రాప్యవిరోధిని పోగొట్టుకోవడానికి ఉపాయంగా ఆశ్రయించి, ఇపుడు ఈ శ్లోకంలో ప్రాప్యరుచివల్ల శ్రీపాదాలను ఆశ్రయిస్తున్నారు. శ్రీనిలయమై, అఖిలహేయప్రత్యనీక కల్యాణైకతానమై, సర్వశేషి అయిన "తిణ్క*ழ*ల్" (దృఢమైన శ్రీపాదాలు) కావడంవల్ల ఉపాయావస్థలోను, ఉపేయావస్థలోను చాలా అభినివేశంతో ఆశ్రయించడంతప్ప, విడవడానికి సాధ్యం కాదుకదా! "అడియై యడైన్దు ఉళ్ళమ్ తేఱి ఈఱిలిన్బత్తిరువెళ్ళమ్ యాన్ మూ*ழ்*కినన్" (నీ శ్రీచరణాలను చేరి, మనస్సు తేటపడి, సాటి లేని మహానందసముద్రంలో మునిగాను.) అనే రీతిలో ఆశ్రయించిన చేతనులను నిర్మలమైన మనస్సును కలవారినిగా జేసి, ఆనందంలో మోహించేటట్లు చేస్తుందికదా! దీని సర్వవైలక్షణ్యజ్ఞానం (ఇది అన్నిటికంటే గొప్పది అనే జ్ఞానం) జనించగానే, "తేఽంఘ్రిమూలం ప్రాప్తాః విసృజ్య వసతీ స్త్వరుపాసనాశాః" (తమనివాసాలను

అయస్కాన్తమ్బోలే గ్రహిత్తుక్కిఱ సర్వాతిశయ మానదొన్ఱాగైయాలే "అగలగిల్లే నిఱైయు మెన్ఱు" (తిరువాయ్-6-10-10) తన్నై యుపాసిత్తు నిఱ్కుమ్బడి పణ్ణాగైయొழியు ఒరు క్షణముమ్ పిరియవొట్టాదితే. అన్ఱిక్కే, "తత శ్శిరసి కృత్వా తు పాదుకే భరత స్తదా, ఆరురోహ రథం హృష్టః శత్రుఘ్నేన సమన్వితః" (రామా-అయో) ఎన్గిఱపడియే స్వామియానవనుడైయ విశ్లేషత్తై ఆఱ్ఱవత్తాన పరికరమాగైయాలే, అవనుడైయ విశ్లేషవ్యసనత్తాలే కమర్ పిళన్ద నెఞ్జు పతమ్ శెయ్యుమ్బడి చరణసరోరుహత్తై తఙ్గళుడైయ నెఞ్జిలే ఎప్పోదుమ్ నిఱ్కుమ్బడి పణ్ణి యరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱారాగవుమామ్. అన్ఱిక్కే, శేషభూతరానవర్గళుక్కు సదాశ్రయణీయమాయ్, సకలేతరవిలక్షణమాయ్, ఉపాయోపేయభూతమాయ్, సకలదివ్యతిరుప్పతిగళిల్ పణ్ణుమ్ ప్రేమత్తుక్కు ఇదొన్ఱుమే యాస్పదమా యిరుక్కైయాలే అత్తై తమ్ తిరువుళ్ళత్తిలే నిత్యవాసమామ్బడి పణ్ణి యరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱారెన్నవుమామ్. 'మత్వా తృణాయ భరతో మణిపాదరక్షే! రామేణ తాం విరహితాం రఘురాజధానీమ్, త్వా మేవ సప్రణయ ముజ్జయినీ మవన్తీం మేనే మహోదయమయీం మధురా మయోధ్యామ్" (పాదుకాసహస్రమ్-104) ఎన్ఱక్కడవదితే. అన్ఱిక్కే, "అస్త్రభూషణతయైవ కేవలం విశ్వ మేతదఖిలం బిభర్తి యః, అక్లమేన మణిపాదుకే! త్వయా సోఽపి శేఖరతయైవ ధార్యతే" (పాదుకాసహస్రమ్-78) ఎన్గిఱపడియే సర్వేశ్వరనై ఒరు క్షణముమ్ పిఱియాదే అవనై శిరసా వహిత్తుక్కొణ్డు, అవనుడైయ సర్వప్రవృత్తిగళుక్కు ఆధారభూతమాయ్, అవనై జగత్తుక్కు భూరిదానమ్ పణ్ణుమ్ కరుణానిలయమాన

---

విడచి నీపాదమూలాన్ని చేరినవారై, నిన్ను సేవించడంలో ఆశను కలవారై) అనే రీతిలో తన సన్నిధికి అయస్కాంతం వలె ఆకర్షించి, సర్వాతిశయమైన అద్వితీయమైనది కాబట్టి, "అకలకిల్లేన్ ఇఱైయు మెన్ఱు" (క్షణం కూడా విశ్లేషించలేను) అని తనను ఉపాసించి నిలిచే రీతిలో చేయడంతప్ప, ఒక్క క్షణంకూడా విశ్లేషించనీయదుకదా! లేక, "తత శ్శిరసి కృత్వా తు పాదుకే భరత స్తదా, ఆరురోహ రథం హృష్టః శత్రుఘ్నేన సమన్వితః" (అనంతరం భరతుడపుడు పాదుకలను రెండిటిని తలపై పెట్టుకొని, సంతుష్టుడై, శత్రుఘ్నునితోపాటు రథాన్ని అధిరోహించాడు) అన్నట్లు స్వామి విశ్లేషాన్ని తీర్చగల సాధనం కనుక, అతని విశ్లేషవ్యసనంతో బీటలువారిన మనస్సు (అనే భూమికి) సస్యానుకూలమైన పదును కరుణావృష్టితో వచ్చేటట్లు చేసి అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారనికూడా చెప్పవచ్చు. లేక, శేషభూతులైన వారికి ఎల్లప్పుడూ ఆశ్రయణీయమై, సకలేతరవిలక్షణమై, ఉపాయోపేయభూతమై, అన్ని దివ్యతిరుపతులలో కల్గి ఉన్న ప్రేమకు ఇది ఒక్కటే స్థానంగా ఉండడంవల్ల, దాన్ని తమ మనస్సులో నిత్యవాసం అయేటట్లు చేసి అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారని కూడా చెప్పవచ్చు. **"మత్వా తృణాయ భరతో మణిపాదరక్షే! రామేణ తాం విరహితాం రఘురాజధానీమ్, త్వామేవ సప్రణయ ముజ్జయినీ మవన్తీం మేనే మహోదయమయీం మధురా మయోధ్యామ్"** (ఓ రత్నపాదుకా! భరతుడు, కైకేయివకం వల్ల దక్కినది, రాముడు లేకుండా ఉన్నది అయిన రఘుకుల ప్రభువుల రాజధానిని గడ్డిపోచతో సమానంగా ఎంచి నిరాకరించి, దానిని రాముడు రాముడు కూడా వద్దని అన్నపుడు ఉత్కృష్టతలో ప్రకాశించేదిగా తనను అపనింద నుండి రక్షించేదిగా, రామరాజ్యానికి మించిన గొప్ప అభ్యుదయాన్ని నిండుగా కల్గినదిగా, అందటికి అభిమానపాత్రమైనదిగా (ఎవరివల్ల జయించడానికి వీలు కానిదిగా ఉజ్జయినిగా, అవంతిగా, మహోదయగా, మధురగా, అయోధ్యగా) నిన్నే ప్రీతితో ఆ భరతుడు తలచాడు) అని చెప్పతగినది కదా! లేక, **"అస్త్రభూషణతయైవ కేవలం విశ్వమేత దఖిలం బిభర్తి యః, అక్లమేన మణిపాదుకే! త్వయా సోఽపి శేఖరతయైవ ధార్యతే"** (ఓ మణిపాదుకా! ఎవడు సమస్తవిశ్వాన్ని అనాయాసంగా ఆయుధాలు, అలంకారాల రూపంలో భరిస్తున్నాడో ఆ విశ్వాధారుడైన భగవానుడుకూడా నీచే ఏ శ్రమలేకుండా శిరోభూషణంగా ధరింపబడుతున్నాడు) అనే రీతిలో సర్వేశ్వరుణ్ణి ఒకక్షణంకూడా విడువకుండా అతణ్ణి శిరసా వహిస్తూ, అతని సర్వప్రవృత్తులకు ఆధారభూతమై, అతనిని జగత్తుకు గొప్ప దానంగా చేసే కరుణానిలయం

వస్తు వొన్షాగైయాలే, అదు తఙ్గళుడైయ హృదయఙ్గళిల్ సదా సన్నిధి పణ్ణవే సర్వేశ్వరనుడైయ సంశ్లేషమ్ లభిత్తు, ఎప్పోదుమ్ విశ్లేషమ్ వారాదెన్ఱు మధ్యవసాయత్తాలే, అతినుడైయ సన్నిధియై ప్రార్థిక్కిఱారెన్ఱు శొల్లవుమామ్. అన్ఱిక్కే, ద్వయోత్తరవాక్యత్తిల్ శొన్న పరమప్రాప్యమాన భగవత్కైంకర్యత్తుక్కు ఏకాంతమాన సిద్ధోపాయ మఙ్గే యాకైయాలే ఉపాయాధ్యవసాయ జ్ఞానత్తాలే అత్తై పృఱ్ఱుగిఱారెన్ఱవుమామ్. అన్ఱిక్కే, శేషిపక్కల్ శేషభూత నిళ్ళియుమ్ తుఱై యాగైయాలే ఆశ్రయిక్కిఱార్గళెన్ఱుమ్ శొల్లవుమామ్.

ప్రణతకామదం పద్మజార్చితం ధరణిమండనం ధ్యేయ మాపది ।
చరణపంకజం శంతమం చ తే రమణ ! నః స్తనేష్వర్పయాధిహన్ ॥

(ప్రణతకామదమ్) ఛండాల-వసిష్ఠాదివిభాగముమ్, దేవ- మనుష్యాదివిభాగము మిన్ఱిక్కే, "శరణాగత సార్థవాహశీలామ్"

(పాదుకాసహస్రమ్) ఎన్గిఱపడియే శరణాగతరానవర్కు వాంఛితఙ్గళై తరుమత్తై. "అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ" (రామా-యుద్ధ-18-32) ఎన్ఱు మవనోట్టై సహవాసత్తాలుమ్, తానాన తన్మైయాలుమ్ ఆశ్రితరైరక్షిత్తన్ఱి నిల్లాదిఱే. ఆచార్యరత్నహారత్తుక్కు నాయకక్కల్లాన శ్రీభాష్యకారర్పడియిఱే యిదుక్కుమ్.

(ప్రణతకామదమ్) అన్ఱిక్కే, అన్యప్రయోజనరాన ప్రపన్నజనఙ్గళుడైయ కామమాన తన్నిడత్తిల్ పణ్ణుమ్ కైంకర్యత్తై తరత్తక్కదాన- ఎన్ఱవుమామ్. అనన్యప్రయోజనరాన ఆశ్రితర్ ఇఱ్ఱై యన్ఱి మఱ్ఱొరు క్షుద్రవిషయత్తై

అయిన అద్వితీయవస్తువు కాబట్టి, అది తమ హృదయాలలో సదా సాన్నిధ్యాన్ని కల్గి ఉండగా, సర్వేశ్వరుని సంశ్లేషాన్ని పొంది, ఏనాడూ విశ్లేషం రాదు- అనే నమ్మకంతో దాని సన్నిధిని ప్రార్థిస్తున్నారనికూడా చెప్పవచ్చు. లేక, ద్వయోత్తర వాక్యంలో చెప్పిన, పరమప్రాప్యం అయిన భగవత్కైంకర్యానికి ఏకాంతం అయిన సిద్ధోపాయం అక్కడే (శ్రీపాదాలలో) కాబట్టి, ఉపాయధ్యవసాయజ్ఞానంలో దాన్ని ఆశ్రయిస్తున్నారనికూడా చెప్పవచ్చు. లేక, శేషివిషయంలో శేషభూతుడు (దిగే) ఆశ్రయించే చోటు (రేవు) కాబట్టి ఆశ్రయిస్తున్నారనికూడా అనవచ్చు.

ప్రణతకామదం పద్మజార్చితం ధరణిమండనం ధ్యేయ మాపది ।
చరణపంకజం శంతమం చ తే రమణ ! నః స్తనేష్వర్పయాధిహన్ ॥

(ప్రణతకామదమ్) - ఛండాల-వశిష్ఠాది విభాగం, దేవ-మనుష్యాది విభాగం లేకుండా, "శరణాగతసార్థవాహ శీలామ్" (శరణాగతుల బృందాన్ని నిర్వహించే స్వభావాన్ని కల్గినది)అనే రీతిలో శరణాగతులైనవారి కోఱికలను ఇచ్చేదానిని (అని భావం). "అభయం సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ" (ప్రాణులందఱికి అభయాన్ని ఇస్తాను. ఇది నావ్రతం) అని అతనితో సహవాసంచేతను, తన సహజ స్వభావంచేతను ఆశ్రితరక్షణం చేయకుండా నిలువలేదుకదా ! ఆచార్యరత్నహారానికి నాయకత్వం అయిన శ్రీభాష్యకారుల తీరుకదా దీనికి (కూడాఉన్నది).

(ప్రణతకామదమ్)- లేక, అనన్యప్రయోజనులైన ప్రపన్నజనుల కోఱిక అయిన, తన విషయంలో చేసే కైంకర్యాన్ని ఇవ్వగల్గినది - అని కూడా చెప్పవచ్చు. అనన్యప్రయోజనులైన ఆశ్రితులు దీనిని (శ్రీపాదం) తప్ప వేఱొక క్షుద్రవిషయాన్ని కోరరుకదా! "న కామయేఽన్యం తవ పాదసేవనా దకించనప్రార్థ్యతమా ద్వరం విభో! ఆరాధ్య క స్త్వాం హ్యపవర్గదం హరే ! వృణీత ఆర్యో పరమాత్మబంధనమ్" (ప్రభూ! ప్రార్థించదగిన నీ శ్రీచరణసేవకు మించి ఇంకొక వరాన్ని నేను దేనినీ కోరను. ఓ హరీ ! మోక్షప్రదాతవైన నిన్ను ఆరాధించి, తరువాత ఆర్యుడైనవాడెవడు ఆత్మకు బంధన రూపమైన ఇంకొక వరాన్ని దేనిని కోరతాడు?) అని, "ఐశ్వర్యం వాఽపి లోకానాం కామయే న త్వయా వినా" (నిన్ను కాదని లోకాల ఐశ్వర్యాన్నికూడా కోరను) అని, "నాడొఱుమ్ వీడిన్ఱియే తొళ్ళక్కూడుజ్కొల్

వాంఛిక్కమాట్టార్గళితే. "న కామయేఽన్యం తవ పాదసేవనా దకించనప్రార్థ్యతమా ద్వరం విభో ! ఆరాధ్య కస్త్వాం హ్యపవర్గదం హరే! వృణీత ఆర్యోఽ పరమాత్మబంధనమ్" ఎన్ఱుమ్, 'ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయా వినా" (రామా-అయో- 31-5) ఎన్ఱుమ్, "నాడొఱుమ్ వీడిన్ఱియే తొழுక్కూడుఙ్గొల్ నన్నుదలీర్ ! ఆడుఱు తీఙ్గరుమ్బుమ్ విళై శెన్నలుమాగి యెఙ్గుమ్ మాడుఉఱు పూన్దడమ్ శేర్వయల్ శూழ் తణ్తిరువల్లవాழ் నీడురైగిన్ఱ పిరాన్ నిలన్దావియ నీళ్కழలే" (తిరువాయ్-5-9-8) ఎన్ఱుమ్ శొన్నానిఱ్దిఱే. "న పారమేష్ఠ్యం న మహేంద్రధిష్ణ్యమ్ న సార్వభౌమం న రసాధిపత్యమ్, న యోగసిద్ధీ రపునర్భవం వా మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్" ఎన్ఱు మవన్తానే అరుళిచ్చెయ్దానిఱే.

(పద్మజార్చితమ్) శ్రీ త్రివిక్రమావతారత్తిలే "ఓఙ్గి యులకళన్ద" (తిరుప్పావై-3) ఎన్ఱుమ్, "విలాసవిక్రాన్తపరావరాలయమ్" (స్తోత్రరత్నమ్-30) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే తిరువులగళన్దరుళిగిఱ సమయత్తిలే ఊర్ధ్వలోకఙ్గళిలే శెన్ఱు, చతుర్ముఖనాలే ఆరాధిక్కప్పట్టదాన. శ్రీకృష్ణన్ తిరువడిగళై యాశ్రయిక్కిఱ ఇవర్, ఇప్పోదు శ్రీత్రివిక్రమాపదానత్తై చ్చొల్లువారెన్? ఎన్నిల్? సౌలభ్యాదికల్యాణగుణయోగముమ్, వరైయామైయుమ్, అతిమానుషచేష్టితఙ్గళుమ్, వడివழకుమ్ శ్రీకృష్ణావతారత్తోడొత్తిరుక్కైయాలే, అత్తై చ్చొల్లుగిఱార్. అన్ఱిక్కే, అప్పోదు శ్రీవామననాయ్, తిరువులగళన్దరుళినవన్తానే ఇప్పోదు వన్దవతరిక్కైయాలే శొల్లుగిఱారాగవుమామ్.

(పద్మజార్చితమ్) అన్ఱిక్కే, ఆదికవియాయ్, పద్మజనానచతుర్ముఖనాలే ఆధారిక్కప్పట్ట వస్తువిఱే, ఇప్పోదు ఇడక్కైయుమ్, వలక్కైయు మఱియాదవరాయ్, కించిత్జ్ఞరాన గోపీజనఙ్గళాలే ఆరాధిక్కప్పడానిన్ఱదు. "యా వై

---

నన్నుదలీర్! ఆడుఱు తీఙ్కఱుమ్బుమ్ విళై శెన్నెలు మాకి ఎఙ్గుమ్ మాడుఱు పూన్దడమ్ శేర్ వయల్ శూழ் తణ్తిరువల్లవాழ் నీడురైకిన్ఱ పిరాన్ నిలమ్ తావియ నీళ్కழలే" (అందమైన ఫాలాన్ని కల సఖులారా! అంతట ఊగిలాడడానికి తగిన, తీయని చెరకును, పండిన ఎఱ్ఱని దాన్యాన్ని కల్గినది, ప్రక్కప్రదేశంలో చేరి ఉండే పూలను కల్గిన తటాకాలను కూడి ఉండే క్షేత్రాలచేత పరివేష్ఠింపబడిన, చల్లనిదైన తిరువల్లవాழ్లో నిత్యవాసాన్ని చేసే ఉపకారకుడైన భగవానుని లోకాలను కొలిచిన దీర్ఘమైన శ్రీచరణాన్ని ప్రతిదినం ఎడతెగక ఆశ్రయించే అవకాశం ఉన్నదా!) అని చెప్పబడుతున్నదికదా! "న పారమేష్ఠ్యం న మహేంద్రధిష్ణ్యం న సార్వభౌమం న రసాధిపత్యమ్, న యోగసిద్ధీ రపునర్భవం వా మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్" (బ్రహ్మలోకాధి పత్యాన్ని, ఇంద్రపదవిని, సార్వభౌమత్వాన్ని కాని, రసాధిపత్యాన్నికాని, యోగసిద్ధినికాని, జన్మరాహిత్యాన్నికాని- నాపట్ల అర్పించిన ఆత్మను కలవాడు నన్ను కాదని ఇంకొక ఫలాన్ని దేనినీ కోరడు) అని అతడే స్వయంగా అనుగ్రహించాడుకదా!

(పద్మజార్చితమ్)- శ్రీత్రివిక్రమావతారంలో "ఓఙ్గి యులకళన్ద" (ఎదిగి లోకాలను కొలిచిన) అని, "విలాస విక్రాంతపరావరాలయమ్" (అనాయాసంగా ఊర్ధ్వ అధోలోకాలను కొలిచినవాడు) అని చెప్పే రీతిలో, లోకాలను కొలిచిన సమయంలో, ఊర్ధ్వలోకాలకు పోయి, చతుర్ముఖునిచేత ఆరాధింపబడినదైన శ్రీకృష్ణుని శ్రీపాదాలను ఆశ్రయించే వీరు, ఇపుడు త్రివిక్రమవృత్తాంతాన్ని గూర్చి చెబుతున్నారేమి? అని అంటే, సౌలభ్యాదికల్యాణగుణాల యోగం, తారతమ్యాన్ని పరీక్షించకపోవడం, అతిమానుషచేష్టితాలు, రూపసౌందర్యం (అనే అంశాలలో) శ్రీకృష్ణావతారంతో పోలి ఉండడంవల్ల దానిని (త్రివిక్రమావతారాన్ని) చెబుతున్నారు. లేక, అపుడు శ్రీవామనుడై లోకాలను కొలిచినవాడే (త్రివిక్రమావతారాన్ని) ఇపుడు వచ్చి అవతరించినందువల్ల చెబుతున్నారనికూడా చెప్పవచ్చు.

(పద్మజార్చితమ్)- లేక, ఆదికవియై, పద్మజుడైన చతుర్ముఖునిచేత ఆరాధింపబడ్డవస్తువు కదా, ఇపుడు కుడిచేయి ఏదో, ఎడమచేయి ఏదో తెలియనివారై, అల్పజ్ఞులైన గోపికలచేత ఆరాధింపబడుతున్నది. "యా వై

శ్రియాఽర్చిత మజాదిభి రాప్తకామైః, యోగీశ్వరై రపి యదాత్మని రాసగోష్ఠ్యామ్, కృష్ణస్య తద్భగవత శ్చరణారవిందం న్యస్తం స్తనేషు విజహుః పరిరభ్య తాపమ్" (భాగవతమ్ -10-47-62) ఎన్డుమ్, "ఆసా మహో ! చరణరేణుజుషా మహం స్యాం బృందావనే కిమపి గుల్మలతౌషధీనామ్, యా దుస్త్యజం స్వజన మార్యపథం చ హిత్వా భేజు ర్ముకుందపదవీం శ్రుతిభి ర్విమృగ్యామ్" (భాగవతమ్-10-47-61) ఎన్డుమ్ మహాభాగవతాగ్రేసరనాన శ్రీయుద్ధవనాలే కొణ్డాడప్పట్ట ఐశ్వర్యత్తై యుడైయవర్గళిఱే ఇవర్గళ్.

(పద్మజార్చితమ్) ఆశ్రయిత్త సమస్తచేతనర్గళిలుమ్ మున్నిఱ్కుమవనాగైయాలే శొల్లుగిఱార్.

(పద్మజార్చితమ్) అన్ఱిక్కే, చేతనసమష్టిరూపనాన చతుర్ముఖనాలే ఆరాధిక్కప్పడానిన్ఱదెన్ఱు శొన్న విత్తాలే, సకలచేతనర్గళాలు మారాధిక్కప్పడానిన్ఱదెన్ఱు శొల్లిఱ్ఱాయ్త్తు. అన్ఱిక్కే, "బ్రహ్మా మా మాశ్రితో రాజన్ ! నాహం కంచి దుపాశ్రితః" ఎన్గిఱపడియే దేవజ్యేష్ఠనాయ్, చతుర్ముఖనాయ్. అన్ఱిక్కే, బ్రహ్మాండాధిపత్యత్తాలే తనక్కు జనకవాన సర్వేశ్వరనుడైయ వైభవత్తై మఱైన్దు నిఱ్కుమ్బడి మిగవు మహంకారగ్రస్తనాయ్, వత్సాపహారత్తై పణ్ణి అపచారమ్ పణ్ణిన చతుర్ముఖనాలే ఆరాధిక్కప్పడుమదొழియ, స్త్రీగళుమాయ్, అనన్యప్రయోజనరుమాయ్, "తనక్కేయాగ వెనై క్కొళ్ళుమీదే" (తిరువాయ్-2-9-4) ఎన్గిఱపడియే తన్నుడైయ ఉగప్పుక్కే ఎజ్గళై స్వీకరిక్కవేణు మెన్ఱు

---

శ్రియాఽర్చిత మజాదిభి రాప్తకామైః యోగీశ్వరై రపి యదాత్మని రాసగోష్ఠ్యామ్, కృష్ణస్య తద్భగవత శ్చరణారవిందం న్యస్తం స్తనేషు విజహుః పరిరభ్య తాపమ్" (లక్ష్మిచే అర్చింపబడినది, కోరికలను పొందిన బ్రహ్మాదులచే, యోగీశ్వరులచే మనస్సులో అర్చింపబడినది అయిన ఆ శ్రీకృష్ణ భగవానుని చరణారవిందాన్ని గోపికలు రాసగోష్ఠిలో స్తనాలలో పెట్టుకొని ఆలింగనం చేసికొని విరహతాపాన్ని తీర్చుకొన్నారు.) అని, "ఆసా మహో! చరణరేణుజుషా మహం స్యాం బృందావనే కి మపి గుల్మలతౌషధీనామ్, యా దుస్త్యజం స్వజన మార్యపథం చ హిత్వా భేజు ర్ముకుందపదవీం శ్రుతిభి ర్విమృగ్యామ్" (ఈ గోపికల చరణరేణువులను సేవించే బృందావనంలోని లతలలో, పొదలలో ఏదయినా ఒకటిగా నేను కావాలి. ఈ గోపికలు విడువడానికి వీలు కాని బంధువులను (స్వజనాన్ని) ఆర్యమార్గాన్ని కూడా విడచి వేదాలచే అన్వేషింపబడే ముకుందుని పదవిని పొందారు) అని మహాభాగవతాగ్రేసరుడైన ఉద్ధవునిచేత కీర్తింపబడ్డ ఐశ్వర్యాన్ని కలవారుకదా వీరు.

(పద్మజార్చితమ్)- ఆశ్రయించిన సమస్తచేతనులలోను (బ్రహ్మ) అగ్రేసరుడు కావడంచేత (ఇక్కడ బ్రహ్మనుగూర్చి) చెబుతున్నారు.

(పద్మజార్చితమ్)- లేక, చేతనసమిష్టిరూపుడైన చతుర్ముఖునిచేత ఆరాధింపబడుతున్నదని చెప్పినందువల్ల సకలచేతనులచేతను ఆరాధింపబడుతున్నదని చెప్పినట్లయింది.లేక, "బ్రహ్మా మమాశ్రితో రాజన్ నాహం కంచిదుపాశ్రితః" (రాజా ! బ్రహ్మనన్ను ఆశ్రయించాడు. నేను మాత్రం ఇంకెవరినీ ఆశ్రయించలేదు) అని చెప్పే రీతిలో దేవతలలో మొదటివాడై, చతుర్ముఖుడై - అని అర్థం. బ్రహ్మాండాధిపతియైనవానికికూడ ఆశ్రయణీయం కావడంచేత అందఱిచేత పొగడబడతగిన- అని అనవచ్చు. లేక, బ్రహ్మాండాధిపత్యంచేత తనకు తండ్రి అయిన సర్వేశ్వరుని వైభవాన్ని మఱచి నిలచేటట్లుగా చాలా అహంకారగ్రస్తుడై, వత్సాపహారాన్ని చేసి అపచారపడిన చతుర్ముఖునిచేత ఆరాధింపబడేది తప్ప, స్త్రీలై, అనన్యప్రయోజనలై, "తనక్కేయాక ఎన్నై క్కొళ్ళుమీదే" (నీకోసమే నన్ను పరిగ్రహించు) అనే రీతిలో తన తృప్తికోసమే మమ్మల్ని స్వీకరించాలని అత్యంతప్రేమతో ప్రార్థించే మాయొక్క, "పతిసంయోగసులభమ్" (పతితో సంయోగానికి అనువైన) అనేటట్లు తన సంశ్లేషంతో ధరించి, అది లేకపోతే కృశించి, నశించేటట్లు చాలా మృదుస్వభావాన్ని కల్గినవై, జ్ఞానభక్తుల అవతారాలు అనదగినట్లున్న మొగ్గలవంటి

మత్యంతప్రేమత్తాలే ప్రార్థిక్కిఱ ఎజ్గళుడైయ, "పతిసంయోగసులభమ్" (రామా- అయో- 118-34) ఎన్గిఱపడియే తన్నుడైయ సంశ్లేషత్తాలే ధరిత్తు, అతిల్లా విడిల్ కృశిత్తు నశిక్కుమ్బడి అత్యంతమృదుస్వభావజ్గళాయ్, జ్ఞానభక్తిగళుడైయ అవతారజ్గళెన్నలామ్బడియాన కుచకుట్మలజ్గళాలే ఆరాధిక్కప్పడాదొ*ళ్ఞి*వదే! ఇదెన్న మందభాగ్యమో? ఎన్ఱు విద్ధరాగిఱార్- ఎన్ఱు శొల్లవుమామ్.

(పద్మజార్చితమ్) అన్ఱిక్కే, ఎజ్గళుడైయ గోష్ఠిక్కు నాయకియాయ్, పురుషకారభూతైయాయ్, "నారీణా ముత్తమా వధూః" (రామా. బాల-1-28) ఎన్గిఱపడియే ఉత్తమస్త్రీత్వ ముడైయళాన పెరియపిరాట్టియారాలే అర్చితమాయ్, ప్రకాశియానిన్ఱుళ్ళ- ఎన్ఱవుమామ్. "వడివిణై యిల్లా మలర్మగళ్ మ*ఱ్ఱై* నిలమగళ్ పిడిక్కుమ్ మెల్లడియై" (తిరువాయ్-9-2-10) ఎన్ఱు శొల్లానిన్ఱదితే. ఎజ్గళుక్కు నాయకియావనళోడే ప*ఴ*కి వైత్తుమ్ ఎజ్గళుక్కు దురారాధ్యమాయ్ ప్రకాశియానిన్ఱదే! ఎన్గిఱార్గళ్ ఎన్ఱవుమామ్.

(ధరణిమండనమ్) లోకజ్గళుక్కెల్లా మమూల్యాలంకారమాయ్ విళజ్గినిన్ఱ.

(పద్మజార్చితం ధరణిమండనమ్) "విలాసవిక్రాన్తపరావరాలయమ్" (స్తోత్రరత్నమ్-30) ఎన్గిఱపడియే ఊర్ధ్వాధోలోకజ్గళెల్లావ*ఱ్ఱై*యుమ్ తనక్కు శేషమాక్కిక్కొణ్డ తిరువడి -ఎన్ఱపడి. అవర్గళ్పక్కలొరు అభినివేశమిన్ఱిక్కే యిరుక్కచ్చెయ్‌దేయుమ్ తానఱిన్ద సంబంధమే ప*ఱ్ఱా*శాక, సురనరతిర్యగాది శరీరజ్గళిలే నిఱ్కిఱ చేతనర్గళెల్లారైయుమ్ తన్ కీ*ఴ్* శేర్త్తు రక్షిత్తు, అవర్గళుక్కు అలఙ్కారమాయ్ ప్రకాశిక్కిఱ తిరువడి, తన్నాలల్లదు

---

కుచాలతో ఆరాధింపబడకపోవడమా! ఇదేమి మందభాగ్యమో! అని (గోపికలు) విద్ధులవుతున్నారు- అనికూడా చెప్పవచ్చు.

(పద్మజార్చితమ్)- లేక, మాగోష్ఠికి నాయకియై, పురుషకారభూతయై, "నారీణా ముత్తమా వధూః" (స్త్రీలలో ఉత్తమస్త్రీ) అనే రీతిలో ఉత్తమస్త్రీత్వాన్ని కల లక్ష్మీదేవిచేత అర్చితమై, ప్రకాశిస్తున్న- అనికూడా అనవచ్చు. "వడివిణై యిల్లా, మలర్మకళ్ మ*ఱ్ఱై* నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై" (రూపంలో సాటిలేని లక్ష్మీదేవి, మిగిలిన భూదేవి మొదలైన దేవేరులు సంవాహనం చేసే మెత్తని పాదాలు) అని చెప్పబడుతున్నదికదా! మాకు నాయకియైన ఆమెతో (సుఖారాధ్యం అయిన) అలవాటుపడినా, మాకు దురారాధ్యమై ప్రకాశిస్తున్నదే !- అని అంటున్నారనికూడా భావం.

(ధరణిమండనమ్)- లోకాలకు అన్నిటికీ అమూల్యమైన అలంకారమై వెలుగుతున్న.

(పద్మజార్చితం ధరణిమండనమ్)- "విలాసవిక్రాంతపరావరాలయమ్" (అనాయాసంగా విక్రమించిన ఉన్నత-అధోలోకాలను కల్గినది) అన్నట్లు ఊర్ధ్వ-అధోలోకాలను అన్నిటిని తనకు శేషంగా చేసికొన్న, శ్రీపాదం- అనిఅర్థం. వారికి ఏ అభినివేశం లేకుండా ఉన్నా, తాను తెలిసిన సంబంధమే హేతువుగా, సురనరతిర్యగాది శరీరాలలో ఉండే చేతనులను అందఱిని తన క్రిందకు చేర్చి, రక్షించి, వారికి అలంకారమై ప్రకాశించే శ్రీపాదం, తనవల్ల తప్ప చెల్లని (తాను లేకుండా జీవించ లేని) మాకు అమూల్యమైన ఆభరణమై ఉండవలసి ఉండగా, ఆవిధంగా లేకుండా, అనన్యార్హలైన మమ్ములను తనక్రిందకు (తన సన్నిధికి) చేరకుండేటట్లు దూరంగా తోసివేస్తున్నదే! ఎంత మందభాగ్యాన్ని కలవారమై జన్మించామో! అని మోహించి అంటున్నారని కూడాచెప్పవచ్చు.

(పద్మజార్చితమ్ ధరణిమండనమ్)- నిత్యసూరులకు అందఱికీ నిర్వాహకయై, "అస్యేశానో జగతో విష్ణుపత్నీ" (ఈలోకానికి ఈశ్వరి, విష్ణువునకు పత్ని) అని, "ఆకారత్రయసంపన్నా మరవిందనివాసినీమ్" (ఆకారత్రయాన్ని

శెల్లాద ఎజ్జళుక్కు అనర్ఘాభరణమాయ్ నిఱ్కవేణ్డియిరుక్క అప్పడి యిరుక్కైయన్ఱిక్కే, అనన్యార్హరుమాన ఎజ్జళై తన్ కీర్త్తే శేరాతపడి దూరమాగ త్తళ్ళి ప్పాగడానిన్దదే! ఎత్తనై మందభాగ్యముడైయోమాయ్ పిఱన్దోమో? - ఎన్ఱు మోహిత్తు చ్చొల్లుగిఱార్గళెన్దవుమామ్.

(పద్మజార్చితం ధరణిమణ్డనమ్) నిత్యసూరిగళుక్కెల్లామ్ నిర్వాహకైయాయ్, "అస్యేశానా జగతో విష్ణుపత్నీ" (నీళాసూక్తమ్) ఎన్ఱుమ్, "ఆకారత్రయసంపన్నా మరవిందనివాసినీమ్" (ముక్తకమ్) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే పత్నీత్వప్రయుక్తమాన స్వరూపత్తైయుమ్, ఆకారత్రయసంపత్తియుముడైయవళుమాన పెరియపిరాట్టియారాలుమ్, ఆదికవియాయ్, దేవజ్యేష్ఠనాన చతుర్ముఖనాలు మారాధిక్కప్పట్టు ప్రకాశియానిఱ్కిఱ వస్తువితే. "ఇరుళ్ తరు మాఞాలత్తుళిని ప్పిఱవి యాన్ వేణ్డేన్" (తిరువాయ్-10-6-1) ఎన్ఱభియుక్తర్గళాల్ అఱువఱుత్తుప్పడి అసహ్యమాన ఇప్పూమియిలే "తతోఽఖిలజగత్పద్మబోధాయ" (విష్ణు.పు.) ఎన్గిఱపడియే సకలచేతన సంరక్షణత్తుక్కాగ వన్దు పిఱన్దు, అమూల్యాలఙ్కారమాయ్, ఇవర్గళోట్టై స్పర్శత్తుక్కు తానుగన్దు చరిత్తు విళఙ్గానిన్దదే!- ఎన్ఱు అతినుడైయ సర్వసౌలభ్యగుణత్తుక్కు ఈడు పడుగిఱారెన్దవుమామ్.

(ధ్యేయ మాపది) సర్వాపత్తుక్కళ్ నిన్ఱుమ్ మీట్చుగైక్కుపాయమాగ ధ్యేయ మెన్దపడి. "మహత్యాపది సంప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరిః" (ఈడువ్యాఖ్య-6-1ప్రవేశే) ఎన్ఱు. శొల్లుగిఱపడియే ప్రకృతిబాంధవర్గళెల్లారుమ్ కైవిట్టు పార్త్తిరున్ద ఆపత్సమయత్తిల్ అన్ద ఆపదైగళ్ నిన్ఱుమ్ రక్షిప్పతఱ్కుపాయమాగ ధ్యేయ మిత్తిరువడియేయితే. "అధరాహితచారువంశనాళా మకుటాలంబిమయూరపింఛమాలాః, హరినీలశిలావిభంగలీలాః ప్రతిభా స్సంతు మమాంతిమప్రయాణే" (గోపాలవింశతి -12) ఎన్ఱుమ్, "అవధీరితశారదారవిందౌ చరణౌ తే మరణేఽపి చింతయామి" (ముకుందమాల-6) ఎన్ఱుమ్ అభియుక్తర్గళాలనుసంధిక్కప్పట్టదితే. అన్ఱిక్కే, ఇఙ్గాపత్తాగ శొల్లత్తక్కదు

---

-అంటే - అనన్యార్హ శేషత్వ, అనన్య శరణత్వ, అనన్యభోగ్యత్వాలనే మూడు ఆకారాలను కల్గినది పద్మనివాసిని) అని చెప్పే రీతిలో పత్నీత్వసంబంధంచేత ఏర్పడ్డ స్వరూపాన్ని, ఆకారత్రయసంపత్తిని కల్గినదైన లక్ష్మీదేవిచేత, ఆదికవియై, దేవతలలో జ్యేష్ఠుడైన చతుర్ముఖునిచేతకూడ ఆరాధింపబడి ప్రకాశిస్తున్న వస్తువుకదా! "ఇరుళ్ తరు మాఞాలత్తుళ్ ఇని ప్పిఱవి యాన్ వేణ్డేన్" (అజ్ఞానాన్ని కల్గించే ఈ విశాలమైన భూమిలో ఇక జన్మను కోరను) అని అభియుక్తులచేత మిక్కిలి గర్హింపబడేటట్లున్న అసహ్యమైన ఈ భూమిలో "తతోఽఖిలజగత్పద్మ బోధాయ" (అపుడు సమస్తజగత్తు అనే పద్మానికి వికాసాన్ని కల్గించడం కోసం) అనే రీతిలో సకలచేతనుల సంరక్షణకోసం (ఈలోకానికి) వచ్చి జన్మించి, అమూల్యమైన అలంకారమై, (ఈ చేతనుల తోడి) సంబంధంకోసం తాను ఆశపడి, సంచరించి వెలుగుతున్నదే!- అని దాని సర్వసౌలభ్యగుణానికి అభినివేశాన్ని పొందుతున్నారని కూడాచెప్పవచ్చు.

(ధ్యేయ మాపది)- అన్ని ఆపదలనుండి నివర్తింపజేయడంకోసం ఉపాయంగా ధ్యానించతగినదని భావం. "మహత్యాపది సంప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరిః" (గొప్ప ఆపద కల్గినపుడు భగవానుడైన హరి స్మరించదగినవాడు) అని చెప్పే రీతిలో ప్రాకృతబంధువులందఱు చేయి విడచి చూస్తున్న ఆపత్సమయంలో ఆ ఆపదలనుండి రక్షించడానికి ఉపాయంగా ధ్యేయం ఈ శ్రీపాదమే కదా! "అధరాహితచారువంశనాళాః మకుటాలంబి మయూరపింఛమాలాః, హరినీలశిలావిభంగలీలాః ప్రతిభా స్సంతు మమాంతిమప్రయాణే' (అధరంలో పెట్టుకొన్న అందమైన వేణువును కల్గినవి, కిరీటంలో వేలాడే నెమలిపింఛాన్ని కల్గినవి, ఇంద్రనీలమణిఖండంవలె నల్లనివి అయిన కాంతులను (శ్రీకృష్ణుడు)గా అంతిమ కాలంలో దర్శించాలి)అని, "అవధీరితశారదారవిందౌ చరణౌ తే

ఆత్మయాథాత్మ్యస్వరూపనాశకమాన అహంకారముమ్, తత్కార్యమాన కామాదిగళెన్నపడి. అన్ద ఆపత్తిల్ నిన్ఱుమ్ మీట్టుగైక్కు ధ్యేయ మిదువేయిఱే. "పిడిత్తేన్ పిఱవి కెడుత్తేన్ పిణి శారేన్ మడిత్తేన్ మనైవాழ்క్కైయుళ్ నిఱ్పదోర్ మాయైయై, కొడిక్కోపుర మాడఙ్గళ్ శూழ் తిరుప్పేరాన్ అడిచ్చేర్వదెనక్కెళిదాయినవాఱే" (తిరువాయ్-10-8-3) ఎన్ఱు ఆழ்వారనుసన్ధిత్తార్. "చరణం పవిత్రం వితతం పురాణం యేన పూత స్తరతి దుష్కృతాని, తేన పవిత్రేణ శుద్ధేన పూతా అతిపాప్మాన మరాతిం తరేమ" (యజుర్వేదమ్ -కాఠకమ్) ఎన్ఱు శ్రుతియిల్ శొన్నపడియే అతిపాపకర్మఙ్గళిలే మూట్టు విక్కుఱ అహఙ్కారత్తిల్ నిన్ఱుమ్ తరిక్కైక్కు సిద్ధసాధన మిదువేయిఱే.

(చరణపంకజం శంతమం చ తే) పావనత్వ- భోగ్యత్వఙ్గళాగిఱ ఇరణ్డాకారఙ్గళాలే ప్రసిద్ధమాయ్, పాంథ జనఙ్గళుడైయ దృష్టియై అపహరిక్కుఱ సౌందర్య- సౌకుమార్యాదిగళాగిఱ ఇరణ్డాకారఙ్గళోడే ప్రసిద్ధమాయ్, వాత్సల్యాఖిలకల్యాణగుణోపేతమాయ్, సకలచేతనర్గళుడైయ ఆర్తియై శమిప్పిత్తు, ఆశ్రయణవేళైయే తుడఙ్గి అత్యన్తసుఖరూపమాయిరుక్కుఱ దేవరీరుడైయ తిరువడియై.

(తే చరణపంకజమ్) పావనత్వభోగ్యత్వాదిగళిల్లైయే యాగిలుమ్ విడవొణ్ణాద "మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృ ద్గతి ర్నారాయణః" (సుబాల-6) ఎన్ఱుమ్, "శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్

---

మరణేఽపి చంతయామి" (శరత్కాలంలోని తెల్లని తామరలను జయించిన స్వామిశ్రీచరణాలను మరణ సమయంలో కూడా చింతిస్తాను) అని అభియుక్తులచేత అనుసంధింపబడిందికదా! లేక, ఈ సందర్భంలో ఆపదగా చెప్పతగినది ఆత్మయొక్క యథార్థస్వరూపాన్ని నశింపజేసే ఆహంకారం, దాని కార్యాలైన కామాదులు - అని భావం. ఆ ఆపదలనుండి నివర్తింపజేయడానికి ధ్యానింపతగినది ఇదే కదా! **"పిడిత్తేన్ పిఱవి కెడుత్తేన్ పిణి శారేన్, మడిత్తేన్ మనైవాழ்క్కైయుళ్ నిఱ్పదోర్ మాయైయై, కొడిక్కోపురమాడఙ్గళ్ శూழ் తిరుప్పేరాన్ అడిచ్చేర్వదు ఎనక్కు ఎళిదాయినవాఱే"** (ధ్వజాలను కల గోపురాలతో, మేడలతో చుట్టబడి ఉండే తిరుప్పేర్ అనే దివ్యదేశంలో వేంచేసి ఉన్న సర్వేశ్వరుని శ్రీచరణాలను పొందడం నాకు సులభమైన తీరు ఆశ్చర్యకరం. అది ఏవిధంగా అంటే- నేను అతనిని ఆశ్రయించాను, జన్మను పోగొట్టుకొన్నాను, వ్యాధులను పొందను. సంసారజీవితంలో నిలచి ఉండడానికి కారణమైన గొప్ప మాయను నివర్తింపజేసికొన్నాను) అని ఆழ்వార్లు అనుసంధించారు. **"చరణం పవిత్రం వితతం పురాణం యేన పూత స్తరతి దుష్కృతాని, తేన పవిత్రేణ శుద్ధేన పూతాఽతిపాప్మాన మరాతిం తరేమ"** (పురాతనమైనది, పవిత్రతను కల్గించేది, మోక్షసాధనమైనది అయిన చరణం అంతటా వ్యాప్తమై ఉన్నది. ఏ చరణం చేత పవిత్రుడైన జీవుడు పాపాలను అన్నిటిని దాటగల్గునో, ఆ చరణంచేత మనం పవిత్రులమై శత్రువులవంటి పాపాలనుండి విముక్తులం కాగలము) అని శ్రుతిలో చెప్పబడ్డ రీతిలో అతిపాపకర్మలలో ప్రవర్తింపజేసే అహంకారంనుండి తరించడానికి సిద్ధోపాయం ఇదే కదా!

**(చరణపంకజం శంతమం చ తే)**- పావనత్వ- భోగ్యత్వాలనే రెండు ఆకారాలతో ప్రసిద్ధమై, బాటసారుల దృష్టిని అపహరించే సౌందర్య- సౌకుమార్యాదులనే గుణాలతో కూడి ఉన్న తామరపూవువలె ఉపాయోపేయాలైన రెండు ఆకారాలతో ప్రసిద్ధమై, వాత్సల్యం మొదలైన అన్ని కల్యాణగుణాలతో కూడినదై, సకలజీవుల ఆర్తిని ఉపశమింపజేసి, ఆశ్రయణసమయంనుండి అత్యంతం సుఖరూపంగా ఉండే తమ శ్రీపాదాన్ని. (అని భావం.)

**(తే చరణపంకజమ్)**- పావనత్వ- భోగ్యత్వాదులు లేకపోయినా, విడువలేని **"మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృ ద్గతి ర్నారాయణః"** (తల్లి, తండ్రి, తోబుట్టువు, నివాసం, శరణం, స్నేహితుడు, గతి నారాయణుడు) అని, **"శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలాయ్ తాయ్ తన్దైయు మవరే యిని యావారే"**

మేలాయ్ తాయ్ తన్దైయు మవరే యిని యావారే" (తిరువాయ్-5-1-8) ఎన్నుమ్ శొల్లుగిఱపడియే సర్వవిధబంధువాక దేవరీరుడైయ తిరువడిగ్గె.

**(చరణపంకజమ్)** "అడిచ్చోది నీ నిన్ఱ తామరైయా యలర్న్దదువో ?" (తిరువాయ్-3-1-1) ఎన్గిఱపడియే చరణత్తుక్కుమ్, పంజకత్తుక్కుమ్ వాశి తెరియాతపడియాలే చరణమాగియ పంకజత్తై- ఎన్ఱు శొల్లుగిఱార్ గళాగవుమామ్.

**(చరణపంకజమ్)** "మధులుబ్ధో యథా భృంగః" ఎన్గిఱపడియే మధులుబ్ధమాన మధుపత్తుక్కు మధుప్రవాహత్తై స్రవిక్కిఱ తామరైప్పోలే, జ్ఞానలుబ్ధనాన ఇన్ద చేతననుక్కు జ్ఞానామృతప్రవాహత్తై స్రవిక్కిఱపడియాలే, "చరణపంకజమ్" ఎన్ఱు శొల్లుగిఱరాగవుమామ్. "అమృతస్య ధారా బహుధా దోహమానం మహస్వత్, జ్యోతిష్మత్ భ్రాజమానం చరణం నో లోకే సుధితాం దధాతు" (యజుర్వేదం-కాఠకమ్) ఎన్ఱు శ్రుతియిల్ శొల్లప్పట్టదిఱే.

**(తే చరణపంకజమ్)** ఆశ్రితర్రై రక్షిత్తన్ఱి నిల్లా దేవరీరుడైయ తిరువడిగళ్. "తిణ్ కழల్" (తిరువాయ్-1-2-10) ఎన్గిఱపడియే ఆశ్రితర్రై ఒరుకాలుమ్ నழువవిడాద తిరువడిగళ్. "అవన్ విడిలుమ్ తిరువడిగళ్ విడా" (ముముక్షుప్పడి) దెన్ఱు పిళ్ళైలోకాచార్యరరుళిచ్చెయ్‌దారిఱే. అవన్ కృపైక్కుమ్, కర్మత్తుక్కుమ్ పొదువాగైయాలే విడుగైక్కు విషయ ముణ్డిఱే. ఇదు కేవలకృపా మాత్రప్రసన్నమాగైయాలే అజ్గు చ్చొల్లలావదిల్లైయే.

**(శంతమం చ తే)** ఎజ్గళుక్కే సుఖరూపమాయిరుక్కై యన్ఱిక్కే, సర్వశేషియాన దేవరీరుక్కుమ్ సుఖరూపమాయిరుక్కిఱ వస్తువిఱే. అదావదు- "అసన్నేవ" (తైత్తి. ఆనంద) ఎన్గిఱపడియే అసత్ప్రాయరాయిరున్ద

---

(చేపలవంటి కన్నులను కల భార్య, గొప్ప సంపద, మంచి సంతానం ఇంకా తల్లి, తండ్రి కూడా వారే, మిగిలిన బంధువులు కూడా వారే) అని చెప్పే రీతిలో సర్వవిధబంధువైన నీ శ్రీపాదాన్ని.

**(చరణపంకజమ్)- "అడిచ్చోది నీ నిన్ఱ తామరైయా యలర్న్దదువో ?"** (పాదకాంతి నీవు నిలచిన ఆసన పద్మంగా విరిసిందా ?) అని చెప్పే రీతిలో చరణానికి, పంకజానికి తేడా తెలియనందువల్ల చరణమనే పంకజాన్ని అని అంటున్నారని కూడాచెప్పవచ్చు.

**(చరణపంకజమ్)- "మధులుబ్ధో యథా భృంగః"** (ఏవిధంగా తుమ్మెద మధువులో లోభాన్ని కల్గి ఉంటుందో) అనే రీతిలో మధువులో (తేనెలో) గొప్ప ఆశను కల తుమ్మెదకు మధువును స్రవించే తామరపూవువలె, జ్ఞానంలో లోభం కల ఈ చేతనునకు జ్ఞానామృతప్రవాహాన్ని స్రవిస్తున్నందున **"చరణపంకజమ్"** (శ్రీచరణమనే పద్మం) అని అంటున్నారని కూడా అనవచ్చు, **"అమృతస్య ధారా బహుధా దోహమానం మహస్వత్, జ్యోతిష్మత్ భ్రాజమానం చరణం నో లోకే సుధితాం దధాతు"** (జ్ఞానాన్ని బహుధా కల్గించే ఆ చరణం మనకు ఆధిభౌతిక - ఆధ్యాత్మిక సుఖాలను ఇచ్చుగాక !) అని శ్రుతిలో చెప్పబడిందికదా!

**(తే చరణపంకజమ్)-** ఆశ్రితులను రక్షిస్తే తప్ప నిలువలేని నీ శ్రీపాదాలు. **"తిణ్ కழల్"** (దృఢమైన శ్రీచరణాలు) అన్నట్లు ఆశ్రితులకు ఏ సమయంలోను చ్యుతి కలుగనీయని శ్రీపాదాలు. "అతడు విడిచినా శ్రీపాదాలు విడువ"వని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించారుకదా! అతడు (భగవానుడు) కృపకు, కర్మకు రెండింటికి సమానం కాబట్టి విడువడానికి విషయం ఉన్నదికదా! ఇది కేవలకృపామాత్రప్రపన్నం కనుక ఆవిధంగా చెప్పే అవకాశం లేదే !

**(శంతమం చ తే)-** మాకు మాత్రమే సుఖరూపంగా ఉండడం కాకుండా, సర్వశేషివి అయిన నీకుకూడా సుఖరూపంగా ఉండే వస్తువుకదా! అంటే - **"అస న్నేవ స భవతి"** (భగవానుడు లేడనేవాడు సత్త లేనివాడే

చేతనర్గళై "సన్త మేనం తతో విదుః" (తైత్తి-ఆనంద) ఎన్గిఱపడియే సత్తా్వయరాక్కి, శేషిక్కు స్వమ్మాగ కొడుక్కైయిఱే. "ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని, మా మప్రాప్యైవ కౌంతేయ ! తతో యాంత్యధమాం గతిమ్" (భగ-16-20) ఎన్ఱుమ్, "బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" (భగ-7-19) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే ఇప్ప లోకత్తిల్ ఒరు చేతననైయుమ్ తనక్కాళాగ కిడైయాదపడియాలే శోకిక్కిఱవవనుక్కు, సకలచేతనర్గళైయుమ్ తిరుత్తి శేషభూతరాక్కి దుఃఖత్తై నివర్త్తిప్పిత్తు, ఆనందత్తై యుణ్డాక్కుమ్బడియాలే అప్పడి శొల్ల త్తట్టిల్లైయిఱే.

(రమణ) ఎఙ్గళుక్కు మన్మథనానవనే! ఎఙ్గళుక్కు రమణనాయిరున్దువైత్తు ఆనందిప్పిక్కైయన్ఱి విడుగైయో ఉన్ స్వరూపమ్!

(న స్తనేష్వర్పయాధిహన్) 'ఉనక్కే నా మాట్చెయ్‌వోమ్, మఱ్ఱై నమ్ కామఙ్గళ్ మాఱ్ఱు" (తిరుప్పావై-29) ఎన్గిఱపడియే ఇతరవిషయఙ్గళై విట్టు దేవరీరుక్కే ఆనందావహమాగ కైంకర్యమ్ పణ్ణుగైయే ప్రయోజనమాగ నినైక్కుగిఱ అనన్యప్రయోజనరాన ఎఙ్గళుడైయ స్తనఙ్గళిలే అర్పిత్తు దుఃఖత్తై పోక్కాయ్ - ఎన్గిఱార్.

(తే చరణపంకజం రమణ నః స్తనేష్వర్పయాధిహన్) ఎఙ్గళుక్కు రమణనాన దేవరీరుడైయ విశ్లేషవ్యసనత్తాలే అగ్నికణఙ్గళై కొళిత్తినాప్పోలే దహిక్కప్పట్టు ఉరుమాయ్‌న్దు కిడక్కిఱ ఎఙ్గళుడైయ స్తనఙ్గళిలే అత్యంతశీతలమాయ్, పావనత్వాదికల్యాణగుణఙ్గళాలే ప్రకాశిక్కిఱ దేవరీరుడైయ చరణసరసిజత్తై వైత్తు తాపోపశమనమ్ పణ్ణవేణు మెన్ఱు

---

కాగలడు) అనే రీతిలో అసత్తులవలె ఉండే చేతనులను "సంత మేనం తతో విదుః" (భగవానుడున్నాడని తెలిసినవాడు సత్తను కలవాడని విజ్ఞులు గ్రహిస్తాయి) అన్నట్లు సత్తను కలవారినిగా చేసి, శేషికి సొత్తుగా అర్పించడమే కదా! "ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని, మా మప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాం గతిమ్" (అర్జునా ! ఆసురమైన జాతిని పొందిన వారై మూఢులు ప్రతిజన్మలో నన్ను పొందకుండా ఇంకా ఇంకా అధమగతిని పొందుతారు) అని, "బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" (పలుజన్మల తరువాత జ్ఞాని నన్ను పొందుతున్నాడు) అని చెప్పే రీతిలో ఈ లోకంలో ఒక చేతనుడు అయినా తనకు దాసుడుగా లేకపోవడంచేత శోకించే అతనికి, సకలచేతనులను సంస్కరించి, శేషభూతులుగా జేసి, దుఃఖాన్ని పోగొట్టి, ఆనందాన్ని కల్గించడంవల్ల ఆ విధంగా చెప్పడంలో అడ్డు లేదు కదా!

**(రమణ)-** మాకు మన్మథుడవైనవాడా! మాకు మన్మథుడవైయుండి, ఆనందింపజేయకుండా విడువడమా నీ స్వరూపం!

**(నః స్తనేష్వర్పయాధిహన్)- "ఉనక్కే నామ్ ఆట్చెయ్‌వోమ్"**, (నీకే కైంకర్యాన్ని చేస్తాము) **"మఱ్ఱై నఙ్కామఙ్గళ్ మాఱ్ఱు"** (మిగిలిన మాకోరికలను పోగొట్టు) అనే రీతిలో ఇతరవిషయాలను విడచి నీకే ఆనందం కల్గించేటట్లు కైంకర్యాన్ని చేయడమే ప్రయోజనంగా తలచే అనన్యప్రయోజనాలైన మా స్తనాలలో అర్పించి, దుఃఖాన్ని పోగొట్టు- అని అంటున్నారు.

**(తే చరణపంకజం రమణ! నః స్తనేష్వర్పయాధిహన్)-** మాకు రమణుడవైన నీ విశ్లేషదుఃఖంచేత అగ్నికణాలను వెలిగించినట్లు దహింపబడి, రూపుమాసి ఉన్న మా స్తనాలలో అత్యంతం శీతలమై, పావనత్వాది కల్యాణగుణాలతో ప్రకాశించే నీ పాదపద్మాన్ని పెట్టి, తాపాన్ని ఉపశమింపజేయాలని ప్రార్థిస్తున్నారు. లోకంలో స్త్రీలు భర్తృవిరహం తీరడానికి చాలా చల్లనివి అయిన ఈ తామరలను స్తనాలలోపెట్టుకొని, ప్రాణాలను నిలుపుకొనేటట్లు, అనన్య ప్రయోజనలైన వీరుకూడా నాథుడైన నీని **"తేనే మలరుమ్"** (తేనెను స్రవించే) (తేనెను స్రవించే) శ్రీపాదపద్మాలను

**ప్రార్థిక్కిఱార్‌గళ్. లోకత్తిల్ స్త్రీజనఙ్గళ్ భర్తృవిరహమ్ తీరుగైక్కాగ అత్యంతశీతలమాన ఇన్ద తామరైగళై స్తనఙ్గళిలే వైత్తు ప్రాణఙ్గళై ధరిక్కుమాప్పోలే, అనన్యప్రయోజనరాన ఇవర్‌గళుమ్ నాథనాన ఇవనుడైయ "తేనే మలరుమ్" (తిరువాయ్-1-5-5) తిరువడిత్తామరైగళై తఙ్గళుడైయ స్తనఙ్గళిలే వైత్తు ధరిక్కప్పార్‌క్కిఱారితే. ఆత్మయాథాత్మ్య స్వరూపజ్ఞానముడైయార్‌క్కు ఇన్ద సరసిజత్తాలన్ఱి మఱ్ఱోరు సరసిజత్తాల్ హృదయతాపమ్ తీరుమో? "ఉన్ తామరైయడి యన్ఱి మఱ్ఱిల మరణే" (తిరువాయ్-10-1-6) ఎన్ఱారితే ఆழ்వార్. అన్ఱిక్కే, దేవరీరుక్కు అతిప్రియావహఙ్గళాన ఎఙ్గళుడైయ సన్తఙ్గళై ఉన్ తిరువడిత్తామరైగళాల్ అలంకృతమాక్కి యానన్దిత్తరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱారాగవుమామ్. ఇఙ్గు స్తవఙ్గళాగ చ్చొల్లప్పట్టదు అనన్యప్రయోజననాన చేతననుడైయ జ్ఞానభక్తిగళితే. ఇవఱ్ఱై పఱ్ఱియితే సర్వేశ్వరనాన్దిప్పదు. ఇవఱ్ఱుక్కు ధారకమ్ శేషియినుడైయ చరణకమలసేవైయే యాగైయాలే ఇవ్విరణ్డుమ్ సర్వేశ్వరన్ తిరువడిగళై సేవిత్తన్ఱినిల్లావితే. ఆగైయాలే ఎఙ్గళుడైయ జ్ఞానభక్తిగళుక్కు నాథరాన దేవరీరుడైయ తిరువడిత్తామరైగళై ఎప్పోదుమ్ విషయమాక్కి, అతిన్ సన్నిధియిల్ పణ్ణుమ్ సర్వదేశ- సర్వకాల- సర్వావస్థైయిలుమ్ సర్వవిధమాన దాసవృత్తిగళై ప్రసాదిత్తరుళవేణుమెన్ఱు ప్రార్థిక్కిఱార్‌గళ్. "అవరై ప్పిరాయన్దొడఙ్గి యెన్ఱు మాతరిత్తెழுన్ద వెన్ తడములైకళ్ తువరైప్పిరానుక్కే శఙ్గఱ్పిత్తు తొழுతువైత్తే నొల్లై విదిక్కిఱ్ఱియే" (నాచ్చియార్ -1-4) ఎన్ఱ ఆణ్డాళైప్పోలే ఇవరుమ్ తఙ్గళుడైయ ములైగళై అవనుడైయ తిరువడిగళ్‌సన్నిధియిల్ కైంకర్యత్తుక్కాగ సమర్పిత్తిరున్దార్‌గళెన్ఱవుమామ్. అన్ఱిక్కే, "చరణశబ్ద స్తనూపలక్షణా" ఎన్గిఱపడియే చరణశబ్దమ్ దివ్యమఙ్గళవిగ్రహత్తై చ్చొల్లుగిఱదాయ్, ఎఙ్గళ్ హృదయత్తిల్ ఎప్పోదుమ్ దేవరీరుడైయ ప్రపన్నజనావనమాన దివ్యమఙ్గళవిగ్రహత్తై సాక్షాత్కరిత్తు నిఱ్కుమ్బడి పణ్ణి కైంకర్యఙ్గళై ప్రసాదిత్తరుళ వేణుమెన్ఱు శొల్లుగిఱారెన్ఱవుమామ్. "కోల మేని కాణవారాయ్ కూవియుమ్ కొళ్ళాయే" (తిరువాయ్-**

---

తమ స్తనాలలో పెట్టుకొని ధరించాలని చూస్తున్నారుకదా! ఆత్మయాథాత్మ్యజ్ఞానాన్ని కలవారికి ఈ తామరవల్ల తప్ప వేఱొక పద్మంవల్ల హృదయతాపం తీరుతుందా? **"ఉన్ తామరైయడి యన్ఱి మఱ్ఱిల మరణే"** (నీ శ్రీచరణ పద్మం ఇంకొక రక్షకం లేదు) అని అన్నారుకదా ఆழ்వార్లు. లేక, నీకు ప్రియాన్ని కల్గించేవి అయిన మా స్తనాలను నీ శ్రీపాదపద్మాలచేత అలంకరింపబడినవిగా జేసి, ఆనందించాలి- అని ప్రార్థిస్తున్నారనికూడా చెప్పవచ్చు. ఇక్కడ స్తనాలుగా చెప్పబడ్డవి- అనన్యప్రయోజనులైన (భగవత్కైంకర్యం తప్ప వేఱు ప్రయోజనంలేని) చేతనుల జ్ఞానభక్తులేకదా! వీటినిబట్టేకదా సర్వేశ్వరుడు ఆనందించేది. నీటికి ధారకం శేషియొక్క చరణకమలసేవే కాబట్టి-ఈ రెండు సర్వేశ్వరుని శ్రీపాదాలను సేవిస్తే తప్ప నిలువలేవుకదా! అందువల్ల మా జ్ఞానభక్తులకు నాథుడవైన నీ శ్రీపాదాలను ఎల్లప్పుడూ విషయంగా చేసి, దాని సన్నిధిలో చేసే సర్వదేశ- సర్వకాల- సర్వావస్థలలో సర్వవిధాలైన కైంకర్యాలను అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారు. **"అవరై ప్పిరాయ న్దొడఙ్గి యెన్ఱు మాతరిత్తెழுన్ద వెన్ తడ ములైకళ్ తువరైప్పిరానుక్కే శఙ్కఱ్పిత్తు తొழுదువైత్తే నొల్లై విదిక్కిఱ్ఱియే"** (బాల్యంనుండి ఆరంభించి శ్రీకృష్ణుని విషయంలోనే ఆశపడి వృద్ధిచెందిన నా పృథుస్తనాలను ద్వారకానాథునకే అనుభవించదగినవి అని తలచి నమస్కరించాను. ఈ మనోరథాన్ని నీవు శీఘ్రంగా పూర్తిచేయాలి) అన్న గోదాదేవివలె వీరుకూడా (గోపికలు) తమ స్తనాలను అతని శ్రీపాదసన్నిధిలోని కైంకర్యం కోసం సమర్పించారనికూడా భావం. లేక, **"చరణశబ్ద స్తనూపలక్షణా"** అనే రీతిలో చరణశబ్దం దివ్యమంగళవిగ్రహాన్ని చెబుతున్నదని పల్కి, మా హృదయంలో ఎల్లప్పుడూ నీయొక్క ప్రపన్నజనరక్షకం అయిన దివ్యమంగళవిగ్రహాన్ని సాక్షాత్కరించి నిలచేటట్లు చేసి, కైంకర్యాలను అనుగ్రహించాలని అంటున్నారనికూడా చెప్పవచ్చు. **"కోలమేని కాణ వారాయ్ కూవియుమ్ కొళ్ళాయే"** (అందమైన నీ తిరుమేనిని దర్శించేటట్లుగా నీవు రావు. నన్ను నీవద్దకు పిలుచుకొనవు) అని అన్నారుకదా ఆழ்వార్లు. లేక, ఇక్కడ **"చరణపంకజమ్"** అని చెప్పబడినది ద్వయమంత్రమనికూడా అనవచ్చు. (**"చరణౌ"** అని) చరణశబ్దాన్ని

**4-7-1)** ఎన్ఱవుమామ్. చరణశబ్దత్తై యుట్కొణ్డిరుక్కైయాలుమ్, అతినిడత్తిల్ ప్రపత్తియై బహుముఖమాగ విధిక్కైయాలుమ్, తన్నై ఉపాసిత్తార్క్కు సర్వేశ్వరనై సకలచేతనర్ మున్నిఱ్కుమ్బడి పణ్ణుగైయాలుమ్, సర్వేశ్వరనుడైయ దివ్యమఙ్గళవిగ్రహస్వరూపమాయిరున్ద పడియాలుమ్, "శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి" ఎన్గిఱపడియే ఇఱ్ఱై పఱ్ఱినాలల్లదు సర్వేశ్వరన్ ముగమ్ కొడామైయాలుమ్, చరణపంకజత్తుక్కు చ్చొన్న విశేషణఙ్గళెల్లామ్ ఇతుక్కు మనురూమాయిరున్దపడియాలుమ్, ఇత్తై చరణమెన్న త్తట్టిల్లైయిఱే. ఆగ, స్వామియాన దేవరీర్, ఎఙ్గళుక్కు సర్వదేశ- సర్వకాల- సర్వావస్థైయిలుమ్ మంత్రరత్నమాన ద్వయమంత్రనిష్ఠైయై యుణ్డాక్కి అరుళవేణు మెన్ఱు ప్రార్థిత్తారాయ్ఱ్ఱు. అన్ఱిక్కే, చరణశబ్దమ్ ఆచార్యరై క్కాట్టుగైయాలే సంసారత్తిలే యఴున్ద దేవరీరై విశ్లేషిత్తు వినవుగిఱ ఎఙ్గళుక్కు అన్ద విశ్లేషవ్యసనమ్ తీఱి, దేవరుడైయ కైంకర్యత్తుక్కాళాగైక్కాగ, ఎఙ్గళుడైయ హృదయకోశత్తిలే దేవరీరుక్కు చరణస్థానరాన ఆచార్యరుడైయ దివ్యమఙ్గళవిగ్రహధ్యానత్తై యుణ్డాక్కి యరుళవేణుమెన్ఱు ప్రార్థిక్కిఱారెన్ఱవుమామ్. ద్వయమంత్రార్థ-నిష్ఠైయావదు ఇదిఱే. "ఆచార్యా దిహ దేవతాం సమధికా మన్యాం న మన్యామహే" (న్యాసతిలకమ్ -?) ఎన్ఱు మభియుక్తర్శ్రీసూక్తి యుణ్డిఱే.

పతిన్ మూన్ఱామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

## పతినాలామ్ శ్లోకమ్

అవ :- కీఴే, స్వామియనుడైయ చరణసరోజత్తై తమ్ముడైయ స్తనఙ్గళిలే వైత్తు విరహతాపమ్ తీరుమ్బడి పణ్ణి యరుళవేణుమెన్ఱు ప్రార్థిత్తార్. తమక్కు ధారకమాగ అవనుడైయ అధరామృతత్తై ఆశైప్పడుగిఱార్- ఇన్ద శ్లోకత్తాలే. ఇతరరుడైయ అనుభవత్తై క్కణ్డు పెరియ ఆనందత్తోడే యిరుక్కుమవర్, తా మత్తై అనుభవిత్తు ఆనన్దిక్క ఆశైప్పడారో?

---

అంతర్భవించుకొని ఉన్నందువల్ల, దాని విషయంలో ప్రపత్తిని పలు రీతుల్లో విధించినందువల్ల, తనను ఉపాసించినవారికి సర్వేశ్వరుని సకలచేతనులముందు నిలుచునేటట్లు చేస్తున్నందువల్ల, సర్వేశ్వరుని దివ్యమంగళ విగ్రహరూపం అయినందువల్ల, "శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి" (శబ్ద బ్రహ్మలో నిష్ణాతుడైనవాడు పరబ్రహ్మను పొందుతాడు) అన్నట్లు దీనిని ఆశ్రయిస్తే తప్ప సర్వేశ్వరుడు (తన) ముఖాన్ని చూపనందువల్ల, చరణపంకజానికి చెప్పిన విశేషణాలు అన్నీ దీనికి కూడా తగినవై ఉన్నందువల్ల దీనిని (ద్వయాన్ని) చరణం అని అనడంలో అడ్డు లేదుకదా! అందువల్ల, స్వామివి అయిన నీవు మాకు సర్వదేశ-సర్వకాల- సర్వావస్థలలోను మంత్రరత్న మనబడే ద్వయ మంత్రనిష్ఠను కల్గించి, అనుగ్రహించాలని ప్రార్థించారు. లేక, చరణశబ్దం ఆచార్యుని తెలుపుతుంది కనుక, సంసారంలో మునిగి, నిన్ను విశ్లేషించి బాధపడే మాకు ఆ విశ్లేషవ్యసనం తీఱి, నీ కైంకర్యానికి దాసులుగా కావడంకోసం మా హృదయకోశంలో నీకు చరణస్థానీయులైన ఆచార్యుల దివ్యమంగళవిగ్రహధ్యానాన్ని కల్గించి, అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారనికూడా భావం. ద్వయమంత్రార్థనిష్ఠ అంటే ఇదేకదా! "ఆచార్యా దిహ దేవతాం సమధికా మన్యాం న మన్యామహే" (ఆచార్యునకు మించిన ఇంకొకరిని పరదేవతగా మేము లెక్కించము) అని అభియుక్తుల శ్రీసూక్తికూడా ఉన్నదికదా.

పదమూడవ శ్లోకం ముగిసింది

## పదునాల్గవ శ్లోకం

అవ :- పూర్వం స్వామియొక్క చరణపద్మాన్ని తమ స్తనాలలో పెట్టి విరహతాపం తీరేటట్లు చేయాలని ప్రార్థించారు. తమకు ధారకంగా అతని అధరామృతాన్ని ఆశపడుతున్నారు - ఈ శ్లోకంతో. ఇతరుల అనుభవాన్ని

"ఉన్నోడుడనే యొరుకడలిల్ వాழ்వారై ఇన్నారినైయారెన్టెణ్ణువారిల్లై కాణ్. మన్నాగి నిన్ఱ మదుశూదన్ వాయముదమ్ పన్నాళు ముణ్గిన్ఱాయ్ పాఞ్చజన్నియమే!" (నాచ్చియార్-7-5) ఎన్ఱక్కడవదిఱే. అన్ఱిక్కే, కీழ், అప్రాకృతమాయ్, అఖిలకల్యాణగుణకరమాయ్, శ్రీనికేతనమాన దివ్యమఙ్గళవిగ్రహత్తై తమ్ముడైయ సుమకోమలఙ్గళాన జ్ఞానభక్తిగళుక్కు విషయమాక్క వేణుమెన్ఱు ప్రార్థిత్తు, ఇన్ఱు పరమపురుషార్థసమృద్ధ్యైకసాధనమాయ్, సంసారనివర్తకమాయ్, వేదాన్తవిశదీకరణప్రవృత్తమాయ్, ఆశ్రితర్గళై అమృతరాక్కవల్ల శ్రీసూక్తియాగిఱ అమృతత్తై తన్దరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱారెన్ఱవుమామ్. ప్రపన్నజనఙ్గళుక్కు ధారకమాగ శొల్లప్పట్టదు స్వామియినుడైయ శ్రీసూక్తియేయిఱే.

సురతవర్ధనం శోకనాశనం స్వరితవేణునా సుష్ఠు చుంబితమ్ ।
ఇతరరాగవిస్మారణం నృణాం వితర వీర! న స్తేఽధరామృతమ్ ॥

(సురతవర్ధనమ్) ఆనందవర్ధకమాయ్. అదావదు- పరమపురుషార్థలక్షణమాన భగవత్కైంకర్యత్తుక్కు వర్ధక మెన్ఱపడి. ఆత్మస్వరూపత్తుక్కు ఆనందమావదు భగవత్కైంకర్యమిఱే. "అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్" (రామా-అయో-27-7) ఎన్ఱు సర్వదేశ-సర్వకాల-సర్వావస్థైగళిలుమ్ స్వామియానవనై అనుగమిత్తు, అవన్ తిరువడిసన్నిధియిల్ పణ్ణుమ్ అశేషశేషవృత్తిగళే ఆత్మస్వరూపత్తుక్కానందమెన్ఱు శొల్లప్పట్టదిఱే. "య స్త్వయా సహ స స్వర్గః" (రామా-అయో-20-18) ఎన్ఱు ముణ్డిఱే. మఱ్ఱవెల్లామ్ స్వరూపనాశకఙ్గళాయ్, హేయమాన ప్రకృతివిషయఙ్గళాగైయాలే అవఱ్ఱై ఆనందమెన్ఱు శొల్లప్పోగాదిఱే. "రసంగ్ హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి" (తైత్తి-ఆనంద) ఎన్ఱు

---

చూచి గొప్ప ఆనందంతో ఉండేవారు తాముదానిని అనుభవించి, ఆనందించాలని ఆశపడరా? "ఉన్నోడుడనే యొరు కడలిన్ వాழ்వారై ఇన్నా రినైయా రెన్టెణ్ణువారిల్లై కాణ్, మన్నాకి నిన్ఱ మదుశూదన్ వాయముదమ్ పన్నాళు ముణ్కిన్ఱాయ్ పాఞ్చజన్నియమే!" (ఓ పాంచజన్యమా ! ఒకే సముద్రంలో నీతోపాటుగా ఉజ్జీవించే పలువురిని ఒక పదార్థంగా లెక్కించేవారు ఎవరూ లేరు. నీవొక్కడవే సర్వస్వామిగా ఉన్నావు. మధుసూదనుని అధరామృతాన్ని పలు దినాలుగా ఆస్వాదిస్తున్నావు) అని చెప్పదగినదికదా! లేక, పూర్వం అప్రాకృతమై, అఖిలకల్యాణగుణాలకు స్థానమై, శ్రీదేవికి నిలయం అయిన దివ్యమంగళవిగ్రహాన్ని తమ పూవువలె సుకుమారం అయిన జ్ఞానభక్తులకు విషయంగా చేయాలని ప్రార్థించి, ఇపుడు పరమపురుషార్థసమృద్ధికి అద్వితీయం అయిన సాధనమై, సంసారాన్ని పోగొట్టేదై, వేదాంతాలను విశదీకరించడంలో ప్రయత్నించినదై, ఆశ్రితులను మరణం లేనివారినిగా చేయగల శ్రీసూక్తి అనే అమృతాన్ని అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారనికూడా భావం. ప్రపన్నజనులకు ధారకంగా చెప్పబడినది స్వామియొక్క శ్రీసూక్తేకదా!

సురతవర్ధనం శోకనాశనం స్వరితవేణునా సుష్ఠు చుంబితమ్ ।
ఇతరరాగవిస్మారణం నృణాం వితర వీర! న స్తే ఽధరామృతమ్ ॥

(సురతవర్ధనమ్)- ఆనందవర్ధకమై. అనగా- పరమపురుషార్థలక్షణం అయిన భగవత్కైంకర్యానికి వర్ధకం- అని భావం. ఆత్మస్వరూపానికి ఆనందం అంటే భగవత్కైంకర్యమేకదా ! "అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్" (దర్భలను, ముళ్ళను తొలగిస్తూ నీకు ముందు వెళ్ళగలను) అని సర్వదేశ-సర్వకాల- సర్వావస్థలలోను స్వామి అయినవానిని అనుసరించి, అతని శ్రీపాదాల సన్నిధిలో చేసే అశేషశేషవృత్తులే ఆత్మస్వరూపానికి ఆనందం అని చెప్పబడ్డాయి కదా! "య స్త్వయా సహ స స్వర్గః" (నీతో ఉండడమే స్వర్గం) అని ఉన్నదికదా! మిగిలినవన్నీ స్వరూపనాశకాలై, హేయాలైన ప్రకృతివిషయాలు కావడంవల్ల వాటిని ఆనందం అని చెప్పరాదుకదా! "రసగ్ హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి" (రసస్వరూపుడైన పరమాత్మను పొంది ఆనందాన్ని కలవాడు అవుతున్నాడు)

శ్రుతియిల్ శొల్లప్పట్టదు. ఆగ, ఇత్తాల్, భగవత్కైంకర్యమెన్గిఱ ఆనన్దత్తై మేల్మేలన అభివృద్ధమావ్బడి పణ్ణువదా యెన్గపడి.

(శోకనాశనమ్) శోకత్తై ముదలోడే అఱుక్కత్తక్కదాయ్. ఇఙ్గు శోక మావదు - సంసారబంధనమితే. "సంసారసాగరం ఘోర మనంతక్లేశభాజనమ్" (జితంతే) ఎన్గు సంసారత్తై అనంతక్లేశభాజనమాగ శొల్లుగైయాలే శోకమాగచ్చొల్ల త్తట్టిల్లైయితే. భగవత్కైంకర్యమే ఆత్మావుక్కు ఆనందమామ్బొదు ఇదు శోకమాగాదో? "నిరయో య స్త్వయా వినా" (రామా-అయో-20-18) ఎన్గనుసంధిత్తారితే, ఇతినుడైయ దుఃఖప్రాచుర్యత్తై యఱివార్. "జీవే దుఃఖాకులే" (అహిర్బుధ్న్య-) ఎన్గిఱపడియే సంసారమ్ దుఃఖత్తై యుణ్డాక్కుమన్ఱి ఆనందావహమాయిరాదే. ఆగ, ఇప్పదత్తాలే సంసారసంబంధత్తై వేరోడే పోమ్బడి పణ్ణుమదాయ్- ఎన్గపడి.

(సురతవర్ధనం శోకనాశనమ్) దేవర్గళుడైయ ఆనందత్తై యుణ్డాక్కుమ్బొదుమ్ దుఃఖత్తై విళైక్కుమితే. ఇన్ద అమృతమ్ సకలేతరవిలక్షణమాగైయాలే దుఃఖత్తై సవాసనమాగ పోమ్బడిపణ్ణి అనశ్వరమాన ఆనందత్తై విళైక్కుమ్.

(సురతవర్ధనం శోకనాశనమ్) భగవత్కైంకర్యమాగిఱ ఆనందత్తై అభివృద్ధమామ్బడిపణ్ణి, అనాదియాగ పీడిక్కిఱ సంసారమాగిఱ శోకత్తై నశిప్పిక్కుమదాయ్ - ఎన్గపడి. "పెరుమ్ తున్బమ్ వేరఱ నీక్కి నిన్ తాళిణైక్కీழ் చ్చేర్త్తు" (తిరువాయ్-) ఎన్నానిన్గదితే. తేజస్సు వ్యాప్తమామ్బొదు తమిస్ర మడఙ్గుమాప్పోలేయితే ఇదువుమ్. "ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చ నేతి" (తైత్తి-ఆనంద) ఎన్గక్కడవదితే.

---

అని శ్రుతిలో చెప్పబడింది. అందువల్ల దీనిచేత భగవత్కైంకర్యం అనే ఆనందాన్ని మరింతగా అభివృద్ధి చెందేటట్లుగా చేసేదై- అని భావం.

(శోకనాశనమ్)- శోకాన్ని సమూలంగా ఛేదించగలినదై (అని భావం). ఇచట శోకం అంటే -సంసార బంధమేకదా! "సంసారసాగరం ఘోర మనంతక్లేశభాజనమ్" (సంసారం ఘోరమైన సాగరం, అంతులేని క్లేశాలకు నిలయం) అని సంసారాన్ని అంతులేని క్లేశానికి స్థానంగా చెప్పడంవల్ల శోకం అని అనడంలో అడ్డు లేదుకదా! భగవత్కైంకర్యమే ఆత్మకు ఆనందం అయినపుడు ఇది శోకంకాదా! "నిరయో య స్త్వయా వినా" (నీ విరహమే నరకం) అని అనుసంధించారుకదా, దీని దుఃఖప్రాచుర్యాన్ని తెలిసినవారు (సీతాదేవి). "జీవే దుఃఖాకులే" (సంసార దుఃఖాలచే మిక్కిలి క్లేశపడిన జీవుని విషయంలో) అనే రీతిలో సంసారం దుఃఖాన్ని కల్గిస్తుంది తప్ప ఆనందాన్ని కల్గించేదిగా ఉండదే! అందువల్ల ఈ పదంచేత సంసారబంధాన్ని సమూలంగా పోయేటట్లు చేసేదై (వ్యక్తం అవుతున్నది.)- అని భావం.

(సురతవర్ధనం శోకనాశనమ్)- దేవతల అమృతానికి, ఈ అమృతానికి చాలా తేడా ఉన్నదికదా! దేవతల అమృతం ఆనందాన్ని కల్గించేటపుడుకూడా దుఃఖాన్ని కల్గిస్తుందికదా! ఈ అమృతం మిగిలిన అన్నిటికంటె విలక్షణం కాబట్టి దుఃఖాన్ని సవాసనగా పోయేటట్లు చేసి, నశించే స్వభావం లేని ఆనందాన్ని కల్గిస్తుంది.

(సురతవర్ధనం శోకనాశనమ్)- భగవత్కైంకర్యం అనే ఆనందాన్ని అభివృద్ధం అయేటట్లు చేసి, అనాదిగా పీడిస్తున్న సంసారమనే శోకాన్ని నశింపజేసేదై - అని భావం. "పెరున్తున్బమ్ వేరఱ నీక్కి నిన్ తాళిణైక్కీழ் చ్చేర్త్తు" (గొప్ప దుఃఖాన్ని సమూలంగా ఛేదించి, నీ శ్రీచరణాల వద్దకు చేర్చి) అని అనబడుతున్నదికదా! తేజస్సు వ్యాపించినపుడు చీకటి నశించేటట్లే, ఇదికూడా. "ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చ నేతి" (పరమాత్మ యొక్క ఆనందగుణాన్ని తెలిసినవాడు ఇక దేనివల్ల భయపడడు) అని చెప్పవలసి ఉన్నది కదా!

**(స్వరితవేణునా సుష్ఠు చుంబితమ్)** తన్నాలే అనుభవిక్కప్పడుగిఱ వస్తువినుడైయ వైభవత్తై సర్వతోదిక్కమాగ వ్యాప్తమావ్పడి ధ్వనిక్కిఱ తిరుక్కు*ఴ*లాలే పూర్ణమాగ పరుగప్పడుమదాయ్. అన్రిక్కే, స్వామియినుడైయ శేషిత్వత్తైయుమ్, చేతనరిడత్తిలుళ్ళాన శేషత్వత్తైయుమ్, అనన్యగతిత్వముమ్, అనన్యభోగ్యత్వము ముపన్యసిక్కిఱ తిరుక్కు*ఴ*లాలే పూర్ణమాగ అనుభవిక్కప్పడుమదాయ్ -ఎన్రవుమామ్. ఇత్తాల్ - తిరుక్కు*ఴ*లినుడైయ ఐశ్వర్యత్తుక్కు ఈడుపడుకిఱార్. **"పదినాఆామాయిరవర్ దేవిమార్ పార్త్తిరుప్ప మదు వాయిల్ కొణ్డాప్పోల్ మాదవన్తన్ వాయముదమ్, పొదువాగ వుణ్బదనై ప్పుక్కు నీ యుణ్డక్కాల్ శిదైయారో వున్నోడు శెల్వ ప్పెరుమ్ శజ్గే!" (2-3-1)-** ఎన్ర పెరియా*ఴ్వా*ర్ తిరుమగళ్పోలే ఇవరుమ్.

**(స్వరితవేణునా సుష్ఠు చుంబితమ్)** అన్రిక్కే, సకలచేతనరైయుమ్ అపరాధఙ్గళై పొఱుత్తు రక్షిక్కవేణుమెన్రు అవన్ శెవియిలే ధ్వనిక్కిఱ తిరుక్కు*ఴ*లాలే పూర్ణమాగ అనుభవిక్కప్పడుమదాయ్ ఎన్రవుమామ్. సకలచేతనర్గళై క్షమిత్తు రక్షిక్కవేణు మెన్రు ప్రార్థిత్త భగవద్రామానుజర్ పడియితే ఇదుక్కుమ్.

**(స్వరితవేణునా సుష్ఠు చుంబితమ్)** అవనుడైయ అధరామృతత్తై పరుగుమ్పోదెల్లామ్ ధ్వనిక్కైయే ఇదుక్కు పణియితే. హేయమాన సంసారత్తై విట్టు, పరమపదత్తై ప్రాపిత్తు, భగవదనుభవత్తై పెఱ్ఱు, "అహ మన్న" (తైత్తి-ఆనంద) మెన్రు ధ్వనిక్కిఱ ముక్తర్పడియితే ఇదుక్కుమ్. ఇత్తాల్ -తిరుక్కు*ఴ*లాలే అనుభవిక్కప్పడుగిఱదాగైయాలే ఇవర్గళుక్కిదు పరమప్రాప్య మాగిఱ దెన్రు కరుత్తు. ఆచార్యరుచిపరిగృహీతమాన అర్థమితే ప్రపన్నజనఙ్గళుక్కనుభావ్య

---

**(స్వరితవేణునా సుష్ఠు చుంబితమ్)** - తనచేత అనుభవింపబడుతున్న వస్తువుయొక్క వైభవాన్ని అన్ని దిక్కులలోను వ్యాపించేటట్లు ధ్వనించే వేణువుతో పూర్ణంగా పానం చేయబడేదై- అని భావం. లేక, స్వామియొక్క శేషిత్వాన్ని, చేతనుల విషయంలో ఉన్న శేషత్వాన్ని, అనన్యగతిత్వాన్ని, అనన్యభోగ్యత్వాన్ని ఉపన్యసించే వేణువుతో పూర్తిగా అనుభవింపబడేదై- అని కూడా భావం. ఇందుచేత వేణువుయొక్క ఐశ్వర్యానికి అభినివిష్టులవుతున్నారు. **"పదినాఆామాయిరవర్ దేవిమార్ పార్త్తిరుప్ప మదువాయిల్ కొణ్డాప్పోల్ మాదవన్తన్ వాయముదమ్, పొదువాక వుణ్బదనై ప్పుక్కు నీ యుణ్డక్కాల్ శిదైయారో వున్నోడు శెల్వ ప్పెరుమ్ శజ్గే !"** (గొప్ప సంపదను కల పాంచజన్యమా! పదహారువేల మంది దేవేరులు చూస్తూ ఉండగా భక్తులంతా కలిసి ఆస్వాదించదగిన భగవానుని అధరామృతాన్ని నీవు ఒక్కడవే ప్రవేశించి, తేనెను భుజించినట్లుగా, భుజిస్తే నీతో మిగిలినవారు విభేదించరా?) అనే పెరియా*ఴ్వా*ర్ల తిరుమకళ్ (పుత్రిక) వలె వీరుకూడా. (అంటున్నారు)

**(స్వరితవేణునా సుష్ఠు చుంబితమ్)**- లేక, సకలచేతనులను (వారి) అపరాధాలను సహించి రక్షించాలని అతని చెవిలో ధ్వనించే వేణువుచేత పూర్ణంగా అనుభవింపబడేదై- అని కూడా చెప్పవచ్చు. సకలచేతనులను క్షమించి, రక్షించాలని ప్రార్థించిన భగవద్రామానుజుల తీరుకదా దీనిదికూడా.

**(స్వరితవేణునా సుష్ఠు చుంబితమ్)**- అతని అధరామృతాన్ని పానం చేసేటపుడు అంతా ధ్వనించడమేకదా దీనికి పని. హేయమైన సంసారాన్ని విడచి, పరమపదాన్ని చేరి భగవదనుభవాన్ని పొంది, **"అహ మన్నమ్"** (నేను భగవానునకు భోగ్య వస్తువును) అని ధ్వనించే ముక్తుల తీరుకదా దీనిదికూడా. ఇందుచే, వేణువుచేత అనుభవింప బడుతున్నది కావడంచేత వీరికిది పరమప్రాప్యం అవుతున్నదని భావం. ఆచార్యరుచిపరిగ్రహీతం అయిన వస్తువేకదా ప్రపన్నజనులకు అనుభవింపతగినది అవుతుంది. లేక, వేదస్వరాలను ఊదే వేణువుచేత పూర్ణంగా అనుభవింపబడేదై- అని కూడా చెప్పవచ్చు. అంటే, సకలోపనిషత్తుల అర్థాన్ని ప్రతిపాదించడంలో ప్రాధాన్యం కల్గిన తిరువష్టాక్షరీ మహామంత్రార్థంతో ప్రకాశించే శ్రీసూక్తి- అని భావం.

మాగిఱదు. అన్ఱిక్కే, వేదస్వరఙ్గళై ఊదుకిఱ తిరుక్కుழలాలే పూర్ణమాగ అనుభవిక్కప్పడుమదాయ్- ఎన్ఱు శొల్లవుమామ్. అతావదు- సకలోపనిషదర్థప్రతిపాదనపరమాన తిరువష్టాక్షరీమంత్రార్థత్తాలే ప్రకాశిక్కిఱ శ్రీసూక్తి- ఎన్ఱపడి.

(ఇతరరాగవిస్మారణం నృణామ్) ఎప్పోదుమ్ శబ్దాదివిషయరాగత్తిలే మణ్డి త్తిరిగిఱ చేతనర్క్కుమ్ అన్ద ప్రకృతివిషయరాగత్తై విస్మరిక్కుమ్పడి పణ్ణువదాయ్. "రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే" (భగ.2-59) ఎన్నానిఱ్ఱతిఱే. "స్థితేఽరవిందే మకరందనిర్భరే మధువ్రతో నేక్షురకం హి వీక్షతే" (స్తోత్రరత్నం-28) ఎన్గిఱపడియే అత్యంత మధురమాయ్, తన్నై అనుభవిక్కుమవర్క్కు పునరావృత్తియైయుమ్, అతినికృష్టమాన కైవల్యానుభవత్తైయు మఱుక్కత్తక్కదాగైయాలే ఇతరరాన బ్రహ్మాదిగళిడత్తిల్ ప్రావణ్యత్తై విస్మరిక్కుమ్పడి పణ్ణవఱ్ఱాయ్ ఎన్ఱవుమామ్. "యే యజన్తి తు మాం భక్త్యా తేషాం ముక్తి ర్న సంశయః" ఎన్ఱక్కడవదిఱే. "తేనుమ్ పాలుమ్ నెయ్యుమ్ కన్నలు మముదు మొత్తే" (తిరువాయ్-2-3-1) ఎన్ఱుమ్, "అముదమాయ్ తిత్తిక్కుమ్" ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే అత్యంతమధురమాన ఇత్తై ప్పరుగుమవర్ విషసదృశమాన ఇతరపదార్థత్తై నావిలే వైప్పర్గళో? "మఱ్ఱొన్ఱుమ్ వేణ్డా" (పెరుమాళ్ తిరు- తనియన్) ఎన్ఱారిఱే ఇతినుడైయ మాధుర్యత్తై అఱివార్. "భోగా ఇమే విధిశివాదిపదం చ కిం చ స్వాత్మానుభూతి రితి యా కిల ముక్తి రుక్తా, సర్వం తదూషజలజోష మహం జుషేయ హస్త్యద్రినాథ! తవ దాస్యమహారసజ్ఞః" (వరదరాజ- 81) ఎన్ఱు ఆழ్వాన్ అనుసంధిత్తాన్.

(వితర వీర! నఽస్తే ధరామృతమ్) అతిధూర్తనాన మన్మథనాలే బాధిక్కప్పట్టు, ఉరుమాయ్న్దు నిన్ఱ అబలైగళాన ఎఙ్గళుక్కు సత్తాధారకమాగ వీరరాన దేవరీరుడైయ తిరువధరామృతత్తై తన్దరుళవేణుమెన్ఱు ప్రార్థిక్కిఱార్. "ఉన్

---

(ఇతరరాగవిస్మారణం నృణామ్)- ఎల్లప్పుడూ శబ్దాదివిషయరాగంలో మునిగి తిరిగే చేతనులకు ఆప్రాకృతవిషయాలలోని ఆసక్తిని విస్మరించేటట్లు చేసేదై, "రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే" (ఈ జీవుని లౌకిక భోగవాంఛ పరమాత్మను దర్శించిన తరువాత నివర్తిస్తుంది) అని అనబడుతున్నదికదా! "స్థితేఽరవిందే మకరందనిర్భరే మధువ్రతో నేక్షురకం హి వీక్షతే" (మకరందంతో నిండిన పద్మంలో ఉండే తుమ్మెద అల్పరసాన్ని కల క్షుద్రమైన పూవును చూడదు) అనే రీతిలో అత్యంతమధురమై, తనను అనుభవించేవారికి పునరావృత్తిని, అత్యంతం నికృష్టం అయిన కైవల్యానుభవాన్ని మఱపింపజేయగల్గినది కాబట్టి, ఇతరులైన బ్రహ్మాదుల విషయంలో ప్రావణ్యాన్ని మఱచేటట్లు చేయగలిగేదై- అనికూడా భావం. "యే యజంతి తు మాం భక్త్యా తేషాం ముక్తి ర్నసంశయః" (ఎవరు నన్ను భక్తితో ఆరాధిస్తారో వారికి ముక్తి కల్గుతుంది. సందేహం లేదు) అని అనబడుతున్నది కదా! "తేనుమ్ పాలుమ్ కన్నలుమ్ అముదు మొత్తే" (తేనెతో, పాలతో, కలకండతో, అమృతంతో సాటివచ్చేవాడు) అని "అముదమాయ్ తిత్తిక్కుమ్" (అమృతమై తీయగా ఉంటాడు)అని చెప్పే రీతిలో అత్యంతం మధురం అయిన దీన్ని పానం చేసేవారు విషంతో పోలిన ఇతరపదార్థాన్ని నాలుకపై పెట్టుకుంటారా? "మఱ్ఱొన్ఱుమ్ వేణ్డా" (ఇక ఏదీవద్దు) అని అన్నారుకదా దీని మాధుర్యాన్ని తెలిసినవారు. (తిరుప్పాణ్ ఆழ్వార్లు) "భోగా ఇమే విధిశివాదిపదం చ కించ స్వాత్మామభూతి రితి యా కిల ముక్తి రుక్తా, సర్వం తదూషజలజోష మహం జుషేయ హస్త్యద్రినాథ! తవ దాస్యమహారసజ్ఞః" (ఈ లౌకిక భోగాలను, బ్రహ్మ శివడుమొదలైన వారి పదవులను, ఇంకాకైవల్యమనబడే ముక్తి -ఇవన్నీ ఉప్పునీటితో సమానంగా నీదాస్యమనే మహారసం యొక్క రుచిని తెలిసినవాడనైన నేను ఓ వరదరాజస్వామీ! తలుస్తాను) అని కూరేశులుకూడా అనుసంధించారు.

(వితర వీర! న స్తేఽధరామృతమ్)- చాలా ధూర్తుడైన మన్మథునిచేత బాధింపబడి, రూపు చెడిఉన్న, అబలల మైన మాకు సత్తాధారకంగా వీరుడవైన నీ అధరామృతాన్ని అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారు. "ఉన్

వాయముదమ్ తన్దు" (తిరువాయ్-10-3-5) ఎన్డు ఆళ్వార్ ప్రార్థిత్తపడియేయితే ఇదువుమ్. అన్రిక్కే, "సంసారమరుకాంతారే దుర్వ్యాధివ్యాఘ్రభీషణే" (దేవరాజాష్టకమ్) ఎన్గిఱపడియే ఆత్మస్వరూపత్తై పూర్ణమాగ నశిప్పిక్కవల్ల దుర్వ్యాధిగళాగిఱ అహంకార- మమకారఙ్గళాలుమ్, కామక్రోధాదిగళాలుమ్, సప్తవ్యసనాదిగళాలుమ్, అతిభీషణమాన సంసారత్తిలే ఇరున్దు ఉరుమాయ్న్దు, "న ధర్మనిష్ఠోఽస్మి" (స్తోత్రరత్నమ్-22) ఎన్గిఱపడియే ఉపాయాంతరశూన్యరాయ్ నిఱ్కిఱ అనన్యార్హరాన ఎఙ్గళుక్కు సత్తాధారకమాగ ఆజాతజయరాన దేవరీరుడైయ సర్వోపనిషత్సారభూతమాన తిరువష్టాక్షరీమహామంత్రార్థప్రదమాన శ్రీసూక్తియై తన్దరుళవేణు మెన్డు ప్రార్థిక్కిఱారాగవుమామ్. "గతి రష్టాక్షరో నృణా మపునర్భవకాంక్షిణామ్" ఎన్నానిన్దదితే.

(వితర వీర! న స్తేఽధరామృతమ్) వీరరాన దేవరీర్క్కనన్యార్హరుమాన దాసవర్గత్తై ప్రకృతిశత్రువిన్ కైయిలే పొగట్టు పార్త్తు నిఱ్కై స్వరూపమో? దేవరీరుడైయ వీరత్వమ్ ప్రకాశమాగ అడియోఙ్గళై అమృతరాక్కవల్ల దేవరీరుడైయ శ్రీసూక్తియై తన్దరుళవేణుమ్. అదావదు- "సకృదేవ" (రామా-యుద్ధ-18-32) ఎన్గిఱ శ్లోకత్తిలుమ్, "సర్వధర్మాన్" (భగ-18-66) ఎన్గిఱ శ్లోకత్తిలుమ్, "మిత్రభావేన సంప్రాప్తమ్" (రామా-యుద్ధ-18-3) ఎన్గిఱ శ్లోకత్తిలుమ్ శొన్న శ్రీసూక్తిన్‌పడియే ఎఙ్గళుక్కు సత్తాధారకమాగ అభయప్రదానత్తై పణ్ణుగిఱ ఒరు శ్రీసూక్తియై తన్దరుళవేణు మెన్డు ప్రార్థిక్కిఱారాగవుమామ్. అదువితే ఇవర్‌గళుక్కు భయనివర్తకమ్. భయాపహారియానవనుడైయ శ్రీసూక్తియాగైయాలే భయప్పడవేణ్డా. "య ఏష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే, అథ సోఽభయం గతో భవతి" (తైత్తి. ఆనంద) ఎన్డు శ్రుతియిల్ శొల్లానిన్దదితే.

---

వాయముదమ్ తన్దు" (నీ అధరామృతాన్ని అనుగ్రహించు) అని ఆళ్వార్లు ప్రార్థించిన తీరుకదా ఇదికూడా. లేక, "సంసారమరుకాంతారే దుర్వ్యాధివ్యాఘ్రభీషణే" (దుర్వ్యాధులనే పెద్ద పులులతో భయంకరమైన సంసారమనే ఎడావనంలో) అనేటట్లు ఆత్మస్వరూపాన్ని పూర్తిగా నశింపజేయగల దుర్వ్యాధులనే అహంకార-మమకారాలచేతను, కామక్రోధాదులచేతను, సప్తవ్యసనాలచేతను అతిభయంకరం అయిన సంసారంలో ఉండి రూపు మాసి "న ధర్మనిష్ఠోఽస్మి" అనే రీతిలో ఉపాయాంతరశూన్యలై ఉండే అనన్యార్హులైన మాకు సత్తాధారకంగా నీయొక్క, సర్వోపనిషత్ సారభూతం అయిన తిరువష్టాక్షరీ మహామంత్రార్థాన్ని ప్రసాదించే శ్రీసూక్తిని అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారనికూడా కావచ్చు. "గతి రష్టాక్షరో నృణా మపునర్భవకాంక్షిణామ్" (జన్మరాహిత్యాన్ని కోరేవారికి గతి అష్టాక్షరి) అని అనబడుతున్నదికదా!

(వితర వీర! న స్తేఽధరామృతమ్)- వీరుడవైన నీకు అనన్యార్హులమైన దాసవర్గాన్ని ప్రకృతి అనే శత్రువుచేతిలో పడవేసి చూస్తూ ఉండడం స్వరూపమా? నీ వీరత్వం ప్రకాశించేటట్లు దాసభూతలమైన మమ్ములను మరణం లేనివారినిగా చేయగల నీ సూక్తిని అనుగ్రహించాలి. అంటే- "సకృదేవ" అనే శ్లోకంలోను, "సర్వధర్మాన్" అనే శ్లోకంలోను "మిత్రభావేన" అనే శ్లోకంలోను చెప్పిన శ్రీసూక్తిరీతిలో మాకు సత్తాధారకంగా అభయప్రదానాన్ని చేసే ఒక శ్రీసూక్తిని అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారనికూడా కావచ్చు. అదేకదా వీరి భయాన్ని నివర్తింపజేసేది. భయాన్ని తీర్చేవానియొక్క శ్రీసూక్తి కావడంచేత భయపడనక్కరలేదు. "య ఏష ఏతస్మిన్ అదృశ్యేఽనాత్మ్యేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే, అథ సోఽభయం గతో భవతి" (రూపం లేనివాడు, కంటికి కానరానివాడు, తనకు అని ఒక ఆధారాన్ని లేనివాడు అయిన ఈ పరమాత్మలో సంసారభయం తీరడం కోసం స్థిరమైన భక్తియోగాన్ని ఎవడు పొందుతున్నాడో, అతడు అపుడు భయం తీరినవాడవుతున్నాడు) అని శ్రుతిలోకూడా చెప్పబడుతున్నదికదా!

(తేఽధరామృతమ్) దేవరీరుడైయ శ్రీసూక్తియై అధరత్తిల్ నిన్ఱుమ్ వెళియిడప్పట్టదాగైయాలుమ్, అనుభవిక్కిఱవర్గళై అమృతరాగ ప్పణ్ణుగైయాలుమ్ అవనుడైయ శ్రీసూక్తియై అమృతమాగ చ్చొల్ల త్తట్టిల్లైయే. "తజ్జన్యత్వా త్తద్వ్యపదేశః" యిఱే.

పతినాలామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

## పతినఞ్జామ్ శ్లోకమ్

అవ :- ఇప్పడి తఙ్గళుక్కు సాక్షాత్కారమాగవేణు మెన్ఱు అవనై ప్రార్థిత్తదు లభియామైయాలే, దేవరీర్ కఱ్ఱినఙ్గళై మేయ్ప్పతఱ్కు పగలెల్లామ్ వ్రజత్తిల్‌నిన్ఱుమ్ పుఱప్పట్టు కానగత్తిలే ఉలావుమ్పోదు అన్ద విశ్లేషత్తిలోరు త్రుటియై యుగమాగ పారిత్తుక్కొణ్డు, అత్యంతదుఃఖత్తోడే తిరిగిఱ యామ్, రాత్రియిలే అవ్విఴ వెల్లామ్ తీరి ఎఙ్గళుడైయ కణ్ణిణైగళ్ కుళిరుమ్బడి, వ్రజత్తిల్ పశుక్కళోడే వన్దు పుకున్దు విళఙ్గుగిన్ఱ దేవరీరుడైయ దివ్యమంగళవిగ్రహత్తై నిర్విఘ్నమాగ సేవియాతపడి ఎఙ్గళుడైయ కణ్గళుక్కు తిరోధాయకమాగ పక్ష్మఙ్గళై స్పష్టిత్తు బ్రహ్మ మిగవుమ్ మందబుద్ధియాయ్, దుఃఖత్తై విళైత్తానిఱే. నేత్రఙ్గళుక్కు పక్ష్మఙ్గళిల్లైయాగిల్, అంతరాయ మొన్ఱు మిన్ఱిక్కే పూర్ణమాగ సేవిక్కై లభిక్కుమిఱే. ఇప్పోదు అదువుమన్ఱిక్కే దేవరీరై యొరుకాలుమ్ సేవియాదపడి ఎఙ్గళిడత్తిల్ నిన్ఱుమ్ విశ్లేషిప్పిత్తాన్. అఴగిదు! "ద్రవన్తి దైత్యాః ప్రణమన్తి దేవతాః (మాంగల్యవివృద్ధిస్తోత్రమ్) ఎన్గిఱ న్యాయముమ్ ఎఙ్గళిడత్తిల్ వ్యత్యస్తమాయిఱ్ఱే"- ఎన్ఱు బ్రహ్మవిన్ పక్కల్ కుపితరాయ్ అవనై పఴియిడుగిఱార్గళ్. ప్రాప్యవైలక్షణ్యజ్ఞానమడియాగ అతిల్ త్వరై విఞ్జి ప్రాప్యసిద్ధియిల్ సర్వ మనుకూలమాయుమ్, అదు సిద్ధియాదపోదు సర్వముమ్ ప్రతికూలమాయుమ్ తోఱ్ఱుమిఱే. భగవత్సన్నిధియిల్ "తత్సుత స్త్వత్ప్రభావోఽసా వక్రూరో యత్ర యత్ర సః, దేవోఽభివర్తతే తత్ర

---

(తేఽధరామృతమ్)- నీ శ్రీసూక్తిని అధరంనుండి వ్యక్తం అయనది కావడంచేతను, అనుభవించేవారిని మరణం లేనివారినిగా చేయడంచేతను, అతని శ్రీసూక్తిని అమృతంగా చెప్పడంలో అడ్డు లేదు. "తజ్జన్యత్వాత్ తద్వ్యపదేశః" (ఒక వస్తువునుండి పుట్టినది కావడంవల్ల ఆ వస్తువుపేరుతోనే వ్యవహారం చేయడం) కదా!

పధ్నాల్గవ శ్లోకం ముగిసింది

## పదిహేనవ శ్లోకం

అవ :- ఈ విధంగా తమకు సాక్షాత్కరించాలని అతనిని ప్రార్థించినది లభించకపోవడంవల్ల, నీవు గోసమూహాన్ని మేపడంకోసం పగలంతా రేపల్లెనుండి బయలుదేరి, వనంలో సంచరించేటపుడు, ఆ విశ్లేషంలోని ఒక త్రుటిని యుగంగా తలుస్తూ అత్యంతదుఃఖంతో తిరిగే మేము, రాత్రిలో ఆ బాధ అంతా తీరి మా నేత్రద్వయం చల్లబడేటట్లు, రేపల్లెలోకి పశువులతో వచ్చి ప్రవేశించి, ప్రకాశిస్తున్న నీ దివ్యమంగళవిగ్రహాన్ని నిర్విఘ్నంగా సేవించలేనట్లు మా కన్నులకు అడ్డుగా కనుఱెప్పలను సృష్టించి, బ్రహ్మ చాలా మందబుద్ధియై దుఃఖాన్ని కలుగచేశాడుకదా! నేత్రాలకు కనుఱెప్పలు లేకపోతే, అడ్డు ఏమీ లేకుండా పూర్ణంగా సేవించడం లభిస్తుందికదా! ఇపుడు అదికూడా లేకుండా, నిన్ను ఒక్కసారికూడా సేవించలేనట్లు మానుండి విశ్లేషింపజేశాడు. బాగున్నది. "ద్రవంతి దైత్యాః ప్రణమంతి దేవతా" (దైత్యులు పారిపోతున్నారు, దేవతలు నమస్కరిస్తున్నారు) అనే న్యాయం మా విషయంలో తాఱుమాఱు అయిందే!- అని బ్రహ్మ విషయంలో కుపితలై, అతనిని నిందిస్తున్నారు. ప్రాప్య వైలక్షణ్యజ్ఞానమూలకంగా ఆ ప్రాప్యంలో త్వర అతిశయించి, ప్రాప్యసిద్ధి కల్గితే అంతా అనుకూలంగాను, అది సిద్ధించనపుడు అంతా ప్రతికూలంగాను తోస్తుందికదా! భగవత్సన్నిధిలో "తత్సుత స్త్వత్ప్రభావోఽసా వక్రూరో

నోపతాపా న మారికాః" (భాగవతమ్) ఎన్ఱు శ్లాఘిత్తవర్దామే భగవద్విశ్లేషత్తిల్ "అక్రూరః క్రూరహృదయః శీఘ్రం ప్రేషయతే హయాన్, ఏవ మార్తాసు యోషిత్సు కృపా కస్య న జాయతే" (భాగవతమ్) ఎన్ఱారిఱే. "నెఞ్జమే! నల్లై నల్లై యున్నై ప్పెఱ్ఱాల్ .... మైన్దనై మలరాళ్ మణవాళనై తుఞ్జుమ్బోదుమ్ విడాదు తొడర్ కణ్డాయ్" (తిరువాయ్-1-10-4) ఎన్ఱు సర్వేశ్వరనై విడాదే పిన్‌తొడర్న్దు అడిమైశెయ్‌గిఱ పడియాలే అతినోట్టై తమక్కుణ్డాన సంబన్దత్తై క్కొణ్డాడి, "మణిమాయన్ కవరాద మడనెఞ్జాల్ కుఱైవిలమే" (తిరువాయ్-4-8-2) ఎన్ఱు సర్వేశ్వరనై విశ్లేషిత్తు నిన్ఱ అతినుడైయ సంబన్దత్తై త్యజిత్తారిఱే ఆళ్వార్. అన్ఱిక్కే, ప్రాప్యసిద్ధియిల్ విళమ్బాసహతైయాలే పతఱుకిఱార్‌గళెన్ఱవుమామ్.

అటతి యద్భవా నహ్ని కాననం తృటి యుగాయతే త్వా మపశ్యతామ్ ।
కుటిలకుంతలం శ్రీముఖం చ తే జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దృశామ్ ॥

(అటతి యద్భవా నహ్ని కాననమ్) దేవరీర్ పశుక్కళై మేయ్‌ప్పతఱ్కు పగలెల్లామ్ వ్రజత్తిల్ నిన్ఱుమ్ పుఱప్పట్టు, కైయుమ్ శెఙ్గోలుమాయ్, దివ్యమఙ్గళవిగ్రహతేజస్సై దశదిశావకాశ మఱ వ్యాపరిత్తుక్కొణ్డు జగన్మోహనమాన తిరుక్కుழలి నోశైయోడే కానగత్తిలే ఉలావుమ్బోదు. పగలిలేయిఱే ఇవన్ పశుక్కళై మేయ్‌ప్పతఱ్కు పోగిఱదు. శుద్ధసాత్వికసమయత్తిలే చేతనర్క్కు స్వరూపయథాత్మ్యజ్ఞానత్తై యుణ్డాక్కి రక్షిప్పతఱ్కు. సంసారత్తిలే వేదార్థత్తై ఉపన్యసిత్తుక్కొణ్డు చరిత్తుమ్బోదు- ఎన్ఱవుమామ్. "సంసారమరుకాంతారే" (దేవరాజాష్టకమ్) ఎన్ఱానిఱ్ఱదిఱే.

---

యత్ర యత్ర సః, దేవోఽభివర్షతే తత్ర నోపతాపా న మారికాః" (అక్రూరుడు ఎక్కడ ఉంటాడో అక్కడ అతని ప్రభావం వల్ల దేవుడు వర్షిస్తాడు, అక్కడ తాపాలు ఉండవు, శిశుమరణాలుండవు) అని శ్లాఘించినవారే భగవద్విశ్లేషంలో "అక్రూరః క్రూరహృదయః శీఘ్రం ప్రేషయతే హయాన్, ఏవ మార్తాసు యోషిత్సు కృపా కస్య న జాయతే" (క్రూరహృదయాన్ని కల అక్రూరుడు వేగంగా అశ్వాలను తోలుతున్నాడు. ఈ విధంగా ఆర్తులైన స్త్రీల పట్ల ఎవని కృప కలుగదు!) అని అన్నారుకదా! "నెఞ్జమే! నల్లై నల్లై యున్నై పెఱ్ఱాల్ ... మైన్దనై మలరాళ్ మణవాళనై తుఞ్జుమ్బోదుమ్ విడాదు తొడర్ కణ్డాయ్" (మనసా! మంచిది మంచిది. నిన్ను అనుకూలంగా పొందిన తర్వాత ఏమి సాధ్యం కాదు? భోగ్యుడై, లక్ష్మీ భర్త అయిన స్వామిని నిద్రించేటపుడు కూడా విడువకుండా అనుసరించు) అని సర్వేశ్వరుని విడవకుండా వెంబడించి, దాస్యం చేసే రీతివల్ల దానితో తమకున్న సంబంధాన్ని కీర్తించి, "మణిమాయన్ కవరాద మడనెఞ్జాల్ కుఱైవిలమే" (నీలమణివర్ణుడు, ఆశ్చర్యభూతుడైన స్వామిపట్ల అభినివేశం లేని మూఢమనస్సుతో పనిలేదు) అని అంటూ సర్వేశ్వరుని విశ్లేషించినదాని సంబంధాన్ని విడిచారుకదా ఆళ్వార్లు. లేక, ప్రాప్యసిద్ధిలో ఆలస్యాన్ని సహించలేనందువల్ల తల్లడిల్లుతున్నారు- అని కూడా చెప్పవచ్చు.

అటతి యద్భవా నహ్నికాననం త్రుటి యుగాయతే త్వా మపశ్యతామ్ ।
కుటిలకుంతలం శ్రీముఖం చ తే జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దశామ్ ॥

(అటతి యద్భవా నహ్నికాననమ్)- నీవు పశువులను మేపడంకోసం పగలంతా రేపల్లెనుండి బయలుదేరి చేతిలో శెఙ్గోల్‌ను (ముల్లుకఱ్ఱను అడ్డులేని అధికారానికి సూచకం) ధరించి, దివ్యమంగళవిగ్రహ తేజస్సును పది దిక్కులలోని అవకాశం అంతా వ్యాపింపజేస్తూ, జగత్తును మోహింపజేసే వేణుధ్వనితో అరణ్యంలో సంచరించే సమయంలో అని అర్థం. పగటివేళలో కూడా ఇతడు పశువులను మేపడానికి పోవడం. శుద్ధసాత్త్వికసమయంలో చేతనులకు స్వరూపయాథాత్మ్య జ్ఞానాన్ని కల్గించి, రక్షించడంకోసం సంసారంలో వేదార్థాన్ని ఉపన్యసిస్తూ సంచరించేటపుడు - అని కూడా చెప్పవచ్చు. "సంసారమరుకాంతారే" అని చెప్పబడుతున్నదికదా!

(తృటి యుగాయతే త్వా మపశ్యతామ్) అప్పోదు దేవరీరై సేవియాద ఎజ్గళుక్కొరు తృటియుగమాయ్ నిన్రదుకాణ్. "ఆమరువినై నిరై మేయ్క్క నీ పోక్కొరు పగలాయిర మూ*ఴి*యాలో!" (తిరువాయ్-10-3-1) ఎన్రారితే ఆ*ఴ్వా*ర్.

(కుటిలకుంతలం శ్రీముఖం చ తే జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దృశామ్) ఇప్పడి దేవరీరై పగలెల్లామ్ విశ్లేషిత్త ఇ*ఴ*వెల్లామ్ తీరుమ్బడి. రాత్రియిలేయుమ్, దేవరీరుడైయ కుటిలకున్తలయుక్తమాయ్, సకలకల్యాణగుణభాజనమాయ్, శోభావహమాన తిరుముఖమండలత్తై సేవిత్తునిన్ర ఎజ్గళుడైయ నేత్రజ్గళుక్కు పూర్ణమాగ సేవియాదపడి తడైత్తుగిఱ పక్ష్మజ్గళై సృష్టిత్తు బ్రహ్మ మందబుద్ధియాయ్, మిగవు మపకారమ్ పణ్ణినానితే -ఎన్రు బ్రహ్మావై నిన్దిక్కిఱార్. ఇదెల్లామ్ నిమేషమాత్ర మప్యంతరత్తైయుమ్ సహియాత ప్రకృతిగళాగైయాలేయితే. పక్ష్మజ్గళ్ నేత్రజ్గళుక్కు సర్వథా రక్షకజ్గళే యాగిలుమ్, భగవదనుభవత్తుక్కు క్షణన్దోఱుమంతరాయత్తై విళైవిక్కైయాలే, ఇవర్గళుక్కు అవై అసహ్యమాయ్ నిన్రనవితే. సర్వచేతనర్గళుక్కుమ్ సుఖావహనాయ్, ప్రాణనాగ శొల్లప్పడుగిఱ గంధవహనై ధూర్త నెన్రారితే శ్రీసీతావిశ్లేషత్తిలే శ్రీ చక్రవర్తితిరుమగనార్

(పద్మకేసరసంసృష్టః) సర్వప్రాణిగళుక్కుమ్ ప్రాణహేతువాన కా*ఱ్ఱు* తానే ఎన్నై సర్వస్వాపహారమ్ పణ్ణానిన్రతీ!" ఎన్గిఱార్.

(పద్మకేసరసంస్పృష్టః) ఇక్కా*ఱ్ఱి*న్ కార్యమ్ కణ్డాయే! ధూళియై కణ్గళిలే వి*ఴు*మ్బడిపణ్ణి అతిక్రూరమాగ చౌర్యత్తై పణ్ణానిన్రదుకాణ్.

---

(త్రుటి యుగాయతే త్వా మపశ్యతామ్)- అపుడు నిన్ను సేవించని మాకు క్షణం యుగమై ఉన్నదిసుమా! "ఆమరు వినై నిరైమేయ్క్క నీ పోక్కొరు పకల్ ఆయిర మూ*ఴి*యాలో" (స్నేహంతో గుంపుగా ఉండే గోవులను మేపడం కోసం నీవు పోయే ఒక పగలు వేయి యుగాలుగా తోస్తున్నది. అయ్యో !) అని అన్నారుకదా ఆ*ఴ్వా*ర్లు.

(కుటిలకుంతలం శ్రీముఖం తే జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దశామ్)- "ఈవిధంగా నిన్ను పగలంతా విడచి ఉన్న దుఃఖం అంతా తీరేటట్లు, రాత్రిలోకూడా నీ కుటిలకుంతలాలతో కూడినదై, సకలకల్యాణగుణాలకు స్థానమై, శోభావహమైన తిరుముఖమండలాన్ని సేవించి నిలచిన మా నేత్రాలకు పూర్ణంగా సేవించలేనట్లు అడ్డుపడుతున్న కనుటెప్పలను సృష్టించి, బ్రహ్మ మందబుద్ధియై, మిక్కిలి అపకారాన్ని చేశాడు''- అనికదా బ్రహ్మను నిందిస్తున్నారు. ఇది అంతా నిముషమాత్రం అయినా అంతరాయాన్ని సహించలేని స్వభావం కలవారు కాబట్టికదా! కనుటెప్పలు నేత్రాలకు అన్నివిధాల రక్షకాలే అయినా భగవదనుభవానికి ప్రతిక్షణం అంతరాయాన్ని కల్గించడంవల్ల, వీరికి అవి అసహ్యంగా ఉన్నాయికదా! చేతనులకు అందటికీ సుఖాన్ని కలిగించేవాడై, ప్రాణంగా చెప్పబడే గంధవహుణ్ణి (వాయువును) ధూర్తుడని అన్నాడుకదా శ్రీసీతావిశ్లేషంలో శ్రీరాముడు. (ఇపుడు శ్రీరాముడు వాయువును నిందించిన శ్రీరామాయణశ్లోకం వ్యాఖ్యానింపబడుతున్నది)

(పద్మకేసరసంస్పృష్టః)- ప్రాణులందటికీ ప్రాణహేతువు అయిన వాయువే నన్ను సర్వస్వాపహారాన్ని చేస్తున్నదే! అని అంటున్నారు.

(పద్మకేసరసంస్పృష్టః)- ఈ గాలి చేసే పనిని చూచావా ! ధూళిని కన్నులలో పడేటట్లుచేసి, అతిక్రూరం అయిన దొంగతనాన్ని చేస్తున్నదిసుమా !

**(పద్మకేసరసంస్పృష్టః)** పద్మజైయానవళ్ మందభాగ్యనాన ఎన్నై కైవిట్టపడియాలే పద్మకేసరజ్గళుమ్ ఎనక్కు ప్రతికూలిక్కుమ్బడి కణ్డాయే!

**(పద్మకేసరసంస్పృష్టః) "పాదారుంతుద మేవ పంకజరజః" (శ్రీగుణరత్న-42)** ఎన్గిఅపడియే అవళ్తనక్కుమ్ బాధకమానదు అవళ్ విట్టపోదుమ్ ఎనక్కు బాధకమాగ చ్చొల్లవేణ్డావితే.

**(పద్మకేసరసంస్పృష్టః)** ఇతినుడైయ రాజస మిరుక్కుమ్బడి ఎన్? మహారాజనాన ఎన్నైయుమ్ మదిక్కిఅతిల్లైయే! ఇదుక్కడి కంటకికళోట్టై సంసర్గమితే.

**(పద్మకేసరసంస్పృష్టః)** ఇ*ఱ్ఱై* కా*ఱ్ఱె*న్ఱిరున్దోమ్. ఇతు భయంకరమాన కేసరియా యిరున్దదీ!

**(పద్మకేసరసంస్పృష్టః)** తనక్కుమేలే మ*ఱ్ఱొ*రువరై సహాయమాగ క్కొణ్డు ఎన్నై నలియప్పుకానిష్టదే! రూపవాన్కళితే అసహాయశూరరావార్ ! ఇతు తనక్కు 'రూప మిల్లామైయాలే తుణై తేట్టమాయిరుక్కుమే.

**(పద్మకేసరసంస్పృష్టః)** వ*ழி*పఱిక్కారర్ తజ్గళై కైయాలే స్పృశిత్తు ఇన్నార్ ఎన్ఱఱియామైక్కుమ్ ధూళనమ్ పణ్ణి వరుకిఱాప్పోలే వరుకిఱతుకాణ్.

**(పద్మకేసరసంస్పృష్టః)** పరిమళత్తై ఆశిత్తు, అరుకే శెన్రపోతే బాధిత్తు సర్వస్వాపహారమ్ పణ్ణుమ్ వ*ழி*పఱిక్కారర్ సమాధియాయ్ నడక్కిఅదు. ఇప్పడి బాధకమాయ్ వన్దదాకిల్, అఱిన్దు అరుకే వారాదపడి పరిహరిక్కలాగాదో- ఎన్ఱ,

---

**(పద్మకేసరసంస్పృష్టః)**- పద్మజ (లక్ష్మీదేవి - అంటే - సీతాదేవి) మందభాగ్యుణ్ణి అయిన నన్ను చేయివిడచి నందున పద్మకేసరాలుకూడా నాకు ప్రతికూలించే తీరును చూచావా !

**(పద్మకేసర సంస్పృష్టః)- "పాదారుంతుద మేవ పంకజరజః"** (తామరపూవు పుప్పొడి పాదాలకు బాధను కల్గించేదే) అనే రీతిలో ఆమెకుకూడా బాధకం అయినది ఆమె విడచినపుడు కూడా నాకు బాధకం అవుతుందని చెప్పనక్కఅలేదుకదా!

**(పద్మకేసరసంస్పృష్టః)** -దీని రాజసం (రజః సంబంధం) ఉన్న తీరు ఏమి? మహారాజు అయిన నన్నుకూడా లెక్కపెట్టడం లేదే! దీనికి కారణం కంటకులతో (పుప్పొడికాడలతో గల) సంబంధమే కదా!

**(పద్మకేసరసంస్పృష్టః)** - ఇది గాలి అని భావించాము. ఇది భయంకరం అయిన కేసరిగా ఉన్నదే ! (కేసరాలనే పుప్పొడికాడలను కల్గినది)

**(పద్మకేసరసంస్పృష్టః)** - (వాయువు) తనతో ఇంకొకరిని (పద్మకేసరాలను) సహాయంగా గొని, నన్ను బాధించడం ప్రారంభించిందే. రూపవంతులేకదా అసహాయశూరులు అవుతారు. దీనికి రూపం లేనందువల్ల సహాయం కావాలికదా! (గాలికి రూపంలేదు కదా)

**(పద్మకేసరసంస్పృష్టః)** - దారిదోపిడీచేసేవారు తమను చేతితో తాకినవారు వీరనితెలియకుండా ఉండడంకోసం ధూళి పూసికొని వచ్చేటట్లు వస్తున్నది సుమా!

**(పద్మకేసరసంస్పృష్టః)** - పరిమళాన్ని ఆశించి, దగ్గరకు రాగానే బాధించి, సర్వస్వాన్ని అపహరించే దారిదోపిడీదారుల రీతిలో నడుస్తున్నది. ఈ విధంగా బాధకంగా వచ్చినది అయితే, తెలిసికొని దగ్గరకు రాకుండేటట్లు అడ్డుపెట్టవచ్చునుకదా? అని అంటే,

(వృక్షాంతరవినిఃసృతః) ఎన్గిఱార్. మార్గత్తిలే కణ్డు పరిహరిక్క వొణ్ణాతపడి మరజ్గళిలే వన్దు పతి కిడన్దు నడువే పుఱప్పడ క్కణ్డతిత్తనై

(వృక్షాంతరవినిఃసృతః), మహారాజాక్కళ్ వెయ్యిల్ పొఱామల్ నిழలిలే వరుమాప్పోలే ఇతువుమ్ వృక్షజ్గళినుడైయ నిழలిలే వారానిన్దతుకాణ్.

(వృక్షాంతరవినిఃసృతః) వழிప్పోకిఱవర్గళ్ వరుమ్తనైయుమ్ వృక్షజ్గళిలే యిరున్దు, అవర్కళ్ సన్నిహితరాన వాఱే బాధిక్క ప్పుఱప్పడుమాప్పోలే ఇరుక్కిఱతిఱే. ఇప్పడి బాధక మెన్ఱఱిన్దపోదు నమ్మై కొణ్డకలుమిత్తనైయన్రో. ఎన్న,

(నిఃశ్వాస ఇవ సీతాయాః) ముఖం పழకినాప్పోలే యిరుక్కైయాలే అతువుమ్ శెయ్య ప్పోకిఱతిల్లై.

(నిఃశ్వాస ఇవ సీతాయాః) ఎనక్కుయిర్ పఱ్ఱాన మైథిలియుడైయ నిఃశ్వాసమ్బోలే యిరుక్కైయాలే అవళ్తాన్ వృక్షజ్గళిలే ఒళిత్తు నిన్దు వరుకిఱాళో? ఎన్గిఱ నశైయాలే పోకప్పోకిఱతిల్లై. “ఆమోద ముపజిఘ్రంతౌ స్వనిఃశ్వాసానువాదినమ్” (రఘువంశే-1) ఎన్దు నిశ్శ్వాసత్తుక్కు పరిమళ ముణ్డెన్దు శొల్లప్పట్టదిఱే. అన్దిక్కే, అవళ్ పద్మినియాగైయాలే పద్మగంధత్తుక్కిరుప్పిడమాగ చ్చొల్ల త్తట్టిల్లైయిఱే.

(నిఃశ్వాస ఇవ సీతాయాః) స్పర్శనమాయ్ బాధిక్కిఱతుక్కు మేలే స్మారకమాయుమ్ బాధిక్కిఱతుకాణ్

(నిఃశ్వాస ఇవ సీతాయాః) వழிప్పఱికారర్ మార్గస్థరై కైకழியప్పోకామే తువక్కువ్బడి, పణ్డు కణ్డఱియుమాప్పోలే ఇరున్దు, ఉమ్ముడైయ ఊర్ “శొల్లీర్, పేర్ శొల్లీర్” ఎన్దు ముక మఱివు శొల్లి మయజ్గప్పణ్ణి, మార్గమధ్యత్తిలే బాధిక్కుమాప్పోలే యిరున్దతీ ఇతువుమ్!

---

(వృక్షాంతరవినిఃసృతః) మహారాజులు ఎండను సహించలేక, నీడలో వచ్చేటట్లు ఇదికూడా వృక్షాల నీడలో వస్తున్నదిసుమా!

(వృక్షాంతరవినిఃసృతః)- (దోపిడీ చేసేవారు) దారిలో పోయేవారు (బాటసారులు) తమవద్దకు వచ్చేంతవరకు వృక్షాల నీడలో (దాగి) ఉండి, వారు దగ్గర కాగానే బాధించడానికి బయలుదేరినట్లే ఉన్నదికదా! ఇట్లు బాధకం అని తెలిసినపుడు చూచి తప్పుకొనండి, అంతేకదా అని అంటే,

(నిఃశ్వాస ఇవ సీతాయాః)- నాకు ప్రాణాధారం (పరిచితం) అయిన సీతయొక్క నిఃశ్వాసంవలె ఉండడంచేత ఈమె ఈ చెట్లలో దాగిఉండి వస్తున్నదా! అనే ఆశతో పోబోవడంలేదు. “ఆమోద ముపజిఘ్రంతౌ స్వనిః శ్వాసానువాదినమ్” (తమ నిశ్శ్వాసాన్ని అనుకరించే సుగంధాన్ని అఘ్రాణిస్తూ) అని నిశ్శ్వాసానికి పరిమళం ఉన్నదని చెప్పబడిందికదా! లేక, ఈమె పద్మిని కాబట్టి పద్మగంధానికి ఆకరంగా చెప్పడంలో అడ్డు లేదుకదా!- (అని భావం.)

(నిఃశ్వాస ఇవ సీతాయాః) - స్పర్శిస్తూ బాధించడానికి మించి సీతాదేవి నిఃశ్వాసాన్ని స్మరింపజేస్తూ కూడా బాధిస్తున్నది సుమా!

(నిఃశ్వాస ఇవ సీతాయాః) - దారిదోపిడిచేసేవారు మార్గంలో ఉన్నవారిని చేయి విడవకుండా వశీకరించుకొనే రీతిలో, పూర్వం చూచి, పరిచయం ఉన్నట్లే ఉండి, మీ ఊరు చెప్పండి, పేరు చెప్పండి- అని ముఖపరిచయం చేసికొని, మోహింపజేసి, మార్గమధ్యంలో బాధించేటట్లే ఇదికూడా. (మోహింపజేసి, బాధిస్తున్నది)

**(పద్మకేసరసంస్పృష్టః)** ఎన్రైయాలే సౌగంధ్యమ్ శొల్లిర్ఱు.

**(వృక్షాంతరవినిఃసృతః)** ఎన్రైయాలే శీతలత్వముమ్, మందత్వముమ్ శొల్లప్పట్టతాయ్‌ర్ఱు. ఇప్పడిప్పట్ట కార్ఱు తోన్ఱినవళవో? ఎన్నిల్,

**(వాతి)** ఎన్గిఱార్. అరణ్యప్రదేశ మెల్లామ్ తానామ్బడివ్యాపిత్తు ఉలావానిన్ఱదుకాణ్.

**(వాతి)** ఇప్పడి బాధకమెన్ఱు విట్టప్పోగాతపడి తాన్ సంపాదిత్త గంధత్తాలే తువక్కానిన్ఱదు. ఇతు గంధవాహమితే!

**(వాతి)** వళ్ళిపటిక్కారర్ కార్యమ్ కైపుగున్ద సమనన్తరత్తిలే యొరు క్షణముమ్ నిల్లాతే, పరకు పరకెన్ఱు సంచరిక్కుమాప్పోలే యిరుక్కిఱతితే ఇతువుమ్. ఇప్పడి బాధకమాగ వన్దు తోర్ర్రి యులావుగిఱదు ఏదు? ఎన్నిల్,

**(వాయుః)** ఎన్గిఱార్

**(వాయుః)** సర్వచేతనజాతత్తుక్కు ముజ్జీవనత్తుక్కుడలాన కార్ఱుక్కిడీర్ ఇప్పడి నలియానిన్ఱదు.

**(వాయుః)** "భీషాస్మాద్వాతః పవతే" (తైత్తి-ఆనంద) ఎన్గిఱపడియే, ఇవర్ క్కఞ్జి త్తిరికిఱ కార్ర్రితే ఇప్పోదు ఇవర్తన్నైయు మఞ్జప్పణ్ణి త్తిరికిఱదు.

**(వాయుః)** యారేనుమ్ తుడర్న్దు పిడిక్కప్పుక్కాల్ ఉడమ్బోదుడమ్బు తాక్కానిఱ్కచ్చెయ్‌దే కైక్కు పిడిక్కొడాదే సఞ్చరిక్కుమ్ వళ్ళిపటిక్కారర్‌పడియితే ఇదుక్కుమ్. ఎత్తై అపహరిత్తతు? ఎన్టిల్? **(మనోహరః)** ఎన్గిఱార్.

---

**(పద్మకేసరసంస్పృష్టః)** - అని అనడంవల్ల సౌగంధ్యం చెప్పబడింది.

**(వృక్షాంతరవినిఃసృతః)**- అని అనడంవల్ల చల్లగా ఉండడం, మెల్లగా ఉండడం చెప్పబడినట్లయింది. ఈ విధంగా గాలి తోచడం మాత్రమేనా? అంటే,

**(వాతి)**- అని అంటున్నారు. అరణ్యప్రదేశం అంతా తానే అయేటట్లు వ్యాపించి, సంచరిస్తున్నదిసుమా!

**(వాతి)**- ఈరీతిలో బాధకం అని విడిచి పోకుండేటట్లు తాను సంపాదించిన గంధంతో వశీకరించు కొంటున్నది. ఇది గంధవాహంకదా!

**(వాతి)**- దారిదోపిడీ చేసేవారు (కార్యం చేతికి చిక్కగానే) పని పూర్తికాగానే ఒక్కక్షణం కూడా నిలువకుండా, వేగంగా వెళ్ళిపోయేటట్లే, ఉన్నదే ఇదికూడా. (వేగంగా వెళ్ళిపోతున్నది) ఈ విధంగా బాధకంగా వచ్చి తోచి, సంచరిస్తున్నది ఏది? అని అంటే-

**(వాయుః)**- అని అంటున్నారు.

**(వాయుః)** - సకలప్రాణిసమూహానికి ఉజ్జీవించడానికి కావలసిన గాలికదా ఈ విధంగా బాధిస్తున్నది.

**(వాయుః)**- **"భీషాస్మా ద్వాతః పవతే"** అనే రీతిలో వీరికి భయపడి సంచరించే గాలికదా ఇపుడు వీరినికూడా (శ్రీరాముని) భయపెట్టి తిరుగుతున్నది.

**(వాయుః)**- ఎవరైనా వెంటబడి పట్టుకోబోతే, శరీరంతో శరీరం తాకుతున్నపుడే చేతికి పట్టు దొరకనీయకుండా సంచరించే దారిదోపిడిదారుల తీరుకదా దీనికిని ఉన్నది. దేనిని అపహరించింది ? అని అంటే- **(మనోహరః)**- అని అంటున్నారు.

(మనోహరః) వழிపఱిక్కారర్‌పోలే మేలెழுన్దతట్టియిలే ఉళ్ళుళ్ళతడైయ అపహరిక్కిఱతితే.

(మనోహరః) వழிపఱిక్కారర్ కణ్ణుక్కు విషయమానవై ఎల్లావற்றైయుమ్ అపహరిక్క సమర్థర్‌గళన్ఱి, కణ్ణుక్కు విషయమాగాద మనస్సై అపహరిక్కమాట్టార్‌గళితే. ఇన్ద కాற்று అవర్‌పడియుమన్ఱిక్కే, అతిసూక్ష్మమాయ్, జ్ఞానాశ్రయమాయ్, ప్రధానమాన మనస్సై అపహరిత్తుదుకాణ్ ! ఎన్ శెయ్యక్కడవేన్ ? ఎన్ఱారితే.

(కుటిలకుంతలం శ్రీముఖం చ తే) దేవరీరుడైయ, ఆశ్రితవ్యామోహయుక్తమాయ్, దయాప్రకాశకమాన తిరుముఖమండలత్తై!- ఎన్నవుమామ్.

(జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దృశామ్) పూర్ణమాగ సేవిత్తు నిన్ఱ ఎఙ్గళుడైయ నేత్రఙ్గళుక్కు అన్ద సేవైయిల్ అన్తరాయఙ్గళాగ పక్ష్మఙ్గళై సృష్టిత్తవన్ జడనితే. నిమేషమాత్రమాన దేవరీరుడైయ విశ్లేషత్తై సహియాత మృదుప్రకృతిగళాన ఎఙ్గళై ఇప్పడి విశ్లేషిత్తాయే- ఎన్గిఱ భావత్తోడే శొల్లుగిఱార్.

పదినఞ్జామ్ శ్లోకమ్ ముற்றிற்று

## పతినాఱామ్ శ్లోకమ్

అవ :- ఇప్పడి దేవరీరుడైయ సేవైయిల్ సుఖత్తైయుమ్, అతిల్లాదపోదు దుఃఖత్తైయు ముడైయోమాయ్‌క్కొణ్డు పుఱమ్బుణ్డాన పற்றுక్కళై యడైయ వాసనయోడే విట్టు, దేవరీరుడైయ సన్నిధియిల్ కైంకర్యత్తైయే కణిశిత్తు వన్ద ఎఙ్గళై ఇప్పడి విడత్తగుమో ? ఇతరవిషయఙ్గళిల్ నశై యற்று, "త్యక్త్వా దారాం శ్చ పుత్రాం శ్చ రాఘవం శరణం

---

(మనోహరః) - దారిలో కొల్లగొట్టేవారివలె పైపైన ఉన్నదానిని కాక, లోలోపల ఉన్నదానిని అంతటిని పూర్తిగా అపహరిస్తున్నదికదా !

(మనోహరః)- దారిదోపిడీదారులు కంటికి కనుపించేవాటిని అన్నిటిని అపహరించే సమర్థులు తప్ప, కంటికి విషయం కాని మనస్సును అపహరించలేరు కదా! ఈ గాలి వారి పద్ధతిలోకూడా కాకుండా, అతిసూక్ష్మమై, జ్ఞానాశ్రయమై, ప్రధానమైన మనస్సును అపహరించిందిసుమా! ఏం చేయగలను? అని అన్నారుకదా ! (శ్రీరామచంద్రుడు) (ఇక ఇపుడు ప్రకృతశ్లోకం వివరింపబడుతున్నది)

(కుటిలకుంతలం శ్రీముఖం చ తే)- నీయొక్క, ఆశ్రితవ్యామోహంతో కూడినదై, దయాప్రకాశకం అయిన తిరుముఖమండలాన్ని- అనికూడా అనవచ్చు.

(జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దశామ్)- పూర్ణంగా సేవించి, నిలచిన మా నేత్రాలకు ఆ సేవలో అంతరాయాలుగా ఱెప్పలను సృష్టించినవాడు జడుడుకదా! నిమిషమాత్రం అయిన నీ విశ్లేషాన్ని సహించని మృదుస్వభావాన్ని కల మమ్ములను ఈ విధంగా విశ్లేషించావే! అనే భావంతో చెబుతున్నారు.

పదిహేనవ శ్లోకం ముగిసింది

## పదహారవ శ్లోకం

అవ :- ఈ విధంగా నీ సేవలో సుఖాన్ని, అది లేనపుడు దుఃఖాన్ని కల్గినవారమై, బయటగల (బాహ్య) సంబంధాలను అన్నిటినీ సవాసనగా విడిచిపెట్టి, మీ సన్నిధిలో కైంకర్యాన్నే అభిలషించి వచ్చిన మమ్ములను ఈ విధంగా విడువడం తగునా? ఇతరవిషయాలలో ఆశ పోయి, "త్యక్త్వా దారాం శ్చ పుత్రాం శ్చ రాఘవం శరణం గతః" (భార్యను, పుత్రులను విడచి శ్రీరాముని శరణుపొందాడు) అనిన రీతిలోను, "సన్న్యాసయోగా ద్యతయః శుద్ధసత్త్వాః"

గతః" (రామా-యుద్ధ-17-14) ఎన్ఱాప్పోలేయుమ్, "సన్న్యాసయోగా ద్యతయః శుద్ధసత్త్వాః" (తైత్తి-నారా- 10-10) ఎన్ఱాప్పోలేయుమ్ వన్దున్ తిరువడి అడైన్ద ఎఙ్గళై ఇప్పడి బాధిక్కవల్లనల్లయే! "మా మేక మేవ శరణ మాత్మానం సర్వదేహినామ్, యాహి సర్వాత్మభావేన మయ్యస్యాహ్యకుతోభయః" ఎన్ఱ దేవరీరుడైయ శ్రీసూక్తియై పొయ్యాగాదపడి పార్క్కవేణ్డావో? ఎన్గిఱార్.

**(మామ్)** పిరాట్టిక్కు వల్లభనాయ్, అవాప్తసమస్తకామనాయ్, అఖిలకల్యాణగుణాకరనాయ్, సర్వస్వామియాయ్, వేదైకవేద్యనాయిరున్దువైత్తు, ఆశ్రితవాత్సల్యైకవివశనాయ్, ఇప్పడి చరాచరనివహగోచరమాన సౌలభ్యవేషత్తోడే ఇవ్విభూతియిలే వన్దవతరిత్త ఎన్నై.

**(మామ్)** అన్ఱిక్కే, జ్ఞానార్థియాయ్, తన్ తిరువడిగళిలే విழுన్ద శ్రీయుద్ధవనుక్కు, ఉపనిషత్సారభూతమాన అర్థత్తై ఉపన్యసిత్తుక్కొణ్డు విళఙ్గుగిన్ఱ తన్నుడైయ ఆచార్యవిగ్రహత్తై కాట్టుగిఱారెన్ఱు శొల్లవుమామ్.

**(మా మేక మేవ)** ఎన్నై ఒరువనైయే. ఇత్తాల్ పరవ్యూహఙ్గళైయుమ్, దేవతాంతర్యామిత్వత్తైయుమ్ తవిర్క్కిఱదు.అన్ఱిక్కే, దుష్కరముమాయ్, స్వరూపవిరోధియుమాన సాధనఙ్గళై విట్టు, అత్యన్తసులభనాయ్, నిరపేక్షనాయ్, అవ్యవహితసాధనభూతనాన ఎన్నై ఒరువనైయే- ఎన్ఱవుమామ్.

**(మా మేక మేవ శరణం యాహి)** ఎన్నై ఒరువనైయే ఉపాయమాగ పఱ్ఱు. ఇన్ద 'ఏక' శబ్దమ్ 'యాహి' ఎన్గిఱ పదత్తిల్ శొన్ఱ స్వీకారత్తిలుపాయభావత్తై తవిర్క్కిఱదు. "నీ స్వీకరిక్కై ఉపాయ మల్ల, ఎన్నైయే ఉపాయమాగ స్వీకరి" ఎన్ఱపడి. ఉపాయమల్లాద పోదు స్వీకరిక్కై ఎదుక్కు? ఎన్నిల్? అదు "చైతన్యకార్యమ్, రాగప్రాప్తమ్, అప్రతిషేధద్యోతకమ్". (ముముక్షుప్పడి) ఆగైయాలే వేణుమ్.

---

అన్నట్లును వచ్చి నీ శ్రీపదాలను ఆశ్రయించిన మమ్ములను ఈ విధంగా బాధించదగినవాడవు కావే! "మా మేక మేవ శరణ మాత్మానం సర్వదేహినామ్, యాహి సర్వాత్మభావేన మయ్యస్యాహ్యకుతోభయః" (సమస్తశరీరులకు ఆత్మ అయిన నన్ను ఒక్కనిమాత్రమే అనన్యంగా శరణు పొందు. నాయందు అతనికి ఏ విధమైన భయంలేకుండా పోతుంది.) అన్న నీ శ్రీసూక్తిని అసత్యం కాకుండేటట్లు చూడవద్దా! -అని అంటున్నారు. (ఇపుడు ఈ ప్రమాణశ్లోకం వ్యాఖ్యానింపబడుతున్నది)

**(మామ్)-** పిరాట్టికి ప్రియుడనై, అవాప్తసమస్తకాముడనై, అఖిలకల్యాణగుణాకరుడనై, సర్వస్వామినై, వేదంచేత మాత్రం తెలియదగినవాడనై యుండి, ఆశ్రితవాత్సల్యైకవివశుడనై, ఈ విధంగా చరాచరప్రాణి సమూహానికి కన్పించే సౌలభ్యవేషంతో ఈ లోకంలోకి వచ్చి అవతరించిన నన్ను.

**(మామ్)-** లేక, జ్ఞానాన్ని అర్థించేవాడై, తన శ్రీపాదాలలో పడిన ఉద్ధవునకు ఉపనిషత్ సారభూతం అయిన అర్థాన్ని ఉపన్యసిస్తూ వెలుగుతున్న తన ఆచార్యరూపాన్ని చూపుతున్నాడనికూడా చెప్పవచ్చు.

**(మా మేక మేవ)** - నన్ను ఒక్కని మాత్రమే. ఇందుచేత (ఈపదంచేత) పరవ్యూహాలను, దేవతాంతర్యామిత్వాన్ని వ్యావర్తించాలి. లేక, దుష్కరమై, స్వరూపవిరోధులైన సాధనాలను విడచి, అత్యంతం సులభుడనై, నిరపేక్షుడనై, అవ్యవహితసాధనమైన నన్ను ఒక్కని మాత్రమే- అనికూడా చెప్పవచ్చు.

**(మా మేక మేవ శరణం యాహి)-** నన్ను ఒక్కని మాత్రమే ఉపాయంగా ఆశ్రయించు. ఈ "ఏక" శబ్దం **"యాహి"** అనే పదంలో చెప్పిన స్వీకారంలోని ఉపాయభావాన్ని నిషేధిస్తుంది. నీవు స్వీకరించడం ఉపాయం కాదు. నన్నే ఉపాయంగా స్వీకరించు- అని భావం. ఉపాయం కానపుడు స్వీకరించడం దేనికి? అని అంటే, "అది చైతన్యకార్యం, రాగప్రాప్తం అప్రతిషేధద్యోతకం''. అందువల్ల శరణాగతి చేయాలి.

**(ఆత్మానం సర్వదేహినామ్)** సర్వదేహిగళుక్కు మంతరాత్మావాయ్ నిన్ఱ ఎన్నై.

**(యాహి సర్వాత్మభావేన)** "సర్వచేతనర్గళుక్కు మాత్మావాయ్ నిన్ఱాన్" ఎన్గిఱ భావత్తోడే ఎన్నై ఉపాయమాగ స్వీకరి. ఇత్తాల్ సకలదేహిగళుక్కు మాత్మా యానాగైయాలే ఉనక్కు ప్రవృత్తినివత్తిరూపమాన కర్మత్తిలే కర్తృత్వ మిల్లై. ఆగ, "సర్వకర్మఙ్గళిలుమ్ కర్తృత్వరూపాహంకారత్తై పరిత్యజిత్తు, సర్వకర్మఙ్గళిలుమ్ కైంకర్యబుద్ధి పణ్ణి, ఎన్నైయే ఉపాయమాగ స్వీకరి" ఎన్ఱపడి. ప్రపన్ననానవనుక్కు "కర్మ కైఙ్కర్యత్తిలే పుగు" (ముముక్షుప్పడి) మిఱే. ఇత్తాల్ చరమశ్లోకత్తిన్‌పడియే శొల్లి*ఱ్ఱా*య్*ఱ్ఱు*

**(యాహి సర్వాత్మభావేన)** సర్వవిధబంధుత్వభావత్తాలే ఎన్నైయే ఉపాయమాగ- ప*ఱ్ఱు* ఎన్ఱపడి. **"పితా చ రక్షకః" "శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః, స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చాద్యమనూదితః"** (నవవిధసంబంధమ్) ఎన్గిఱ శ్లోకత్తిలే శొన్నపడియే సర్వవిధమాన ఎన్నుడైయ బంధుత్వభావత్తాలే ఉపాయమాగ స్వీకరి -ఎన్ఱపడి. అతిలే శొన్న ఆత్మభావమ్ శొన్ఱపోతే, మ*ఱ్ఱై* భావఙ్గళుమ్ శొల్లప్పట్టనవాయ్*ఱ్ఱు*.

**(మయ్యస్యాహ్యకుతోభయః)** సర్వజ్ఞనాయ్, సర్వశక్తియుక్తనాన ఎన్నాలే సర్వవిధమాన భయమ్ కెట్టు సుఖిప్పాయ్. **"భయానామపహారి"**యాన ఎన్నైయే ఉపాయమాగ ప్ప*ఱ్ఱు*మవనుక్కు భయమిరుక్కుమో? ఎన్నై ఉపాయమాగ ప్ప*ఱ్ఱ*వే అభయఙ్గతనామిఱే. ఇప్పడి ఎన్నైయే ఉపాయమాగ ప్ప*ఱ్ఱు*వార్క్కు దుఃఖత్తై ప్పోక్కి రక్షిప్పన్ యాన్- ఎన్ఱు మహాభాగవతరోడే స్వయమాగ చ్చొల్లి, అప్పడి శెయ్యాదే అడియోఙ్గళై దూరమాగ త్తళ్ళి ఆనందిత్తు నిన్ఱాయే! ఇదెన్న ఆశ్చర్య మెన్గిఱార్.

---

**(ఆత్మానం సర్వదేహినామ్)**- సకలదేహులకు అంతరాత్మనై ఉన్న నన్ను.

**(యాహి సర్వాత్మభావేన)**- సకలచేతనులకు ఆత్మగా నిలచి ఉన్నాడు- అనే భావంతో నన్ను ఉపాయంగా స్వీకరించు. ఇందువల్ల సకలదేహులకు ఆత్మను నేను కనుక నీకు ప్రవృత్తి- నివృత్తిరూపకర్మలలో కర్తృత్వం లేదు. అందువల్ల, అన్ని కర్మలలో కర్తృత్వరూపమైన అహంకారాన్ని విడచి, అన్ని కర్మలలో నా కైంకర్యబుద్ధిని కల్గి, నన్నే ఉపాయంగా స్వీకరించు- అని భావం. ప్రపన్నుడైనవానికి కర్మ కైంకర్యంలోకి చేరుతుందికదా! ఇందువల్ల (ఇక్కడ) చరమశ్లోకంలోని అర్థమే చెప్పబడింది.

**(యాహి సర్వాత్మభావేన)**- సర్వవిధబంధుత్వ భావనతో నన్నే ఉపాయంగా ఆశ్రయించు- అని భావం. **"పితా చ రక్షకః శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః, స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చాద్యమనూదితః,"** (భగవానుడు నాకు తండ్రి, రక్షకుడు, శేషి, భర్తజ్ఞేయుడు, స్వామి, ఆధారం, ఆత్మ- అని అష్టాక్షరిలో తెలుపబడింది) అనే శ్లోకంలో చెప్పిన రీతిలోనే సర్వవిధమైన నా బంధుత్వభావనతో ఉపాయంగా స్వీకరించు- అని భావం. అందులో (నవవిధసంబంధంలో) చెప్పిన ఆత్మభావం చెప్పినపుడే మిగిలిన భావాలన్నీ చెప్పబడినవి అయ్యాయి. (సంబంధాలు అన్నీ చెప్పబడ్డాయి)

**(మయాస్యాహ్యకుతోభయః)**- సర్వజ్ఞుడనై, సర్వశక్తులతో కూడినవాడనైన నావల్ల అన్ని విధాలైన భయాలు నశించి సుఖిస్తావు. **"భయానా మపహారి"** (భయాలను తీర్చేవాడను) అయిన నన్నే ఉపాయంగా ఆశ్రయించినవానికి భయం ఉంటుందా? నన్ను ఉపాయంగా ఆశ్రయించగానే అభయంగతుడు (అభయాన్ని పొందినవాడు) అవుతాడు కదా! ఈవిధంగా నన్నే ఉపాయంగా ఆశ్రయించేవారికి దుఃఖాన్ని పోగొట్టి రక్షిస్తాను నేను- అని మహాభాగవతులతో స్వయంగా పల్కి, ఆ విధంగా చేయకుండా దాసభూతలైన మమ్ములను దూరంగా గెంటివేసి ఆనందిస్తున్నావే! ఇదేం ఆశ్చరం! అంటున్నారు.

పతిసుతాన్వయభ్రాతృబాంధవాన్ అతివిలంఘ్య తే హ్యచ్యుతాగతాః ।
గతివిద స్తవోద్గీతమోహితాః కితవ! యోషితః క స్త్యజే న్నిశి ॥

**(పతిసుతాన్వయభ్రాతృబాంధవా నతివిలంఘ్య)** దేవరీరుడైయ కైంకర్యత్తుక్కాళాగాదే ప్రకృతివిషయత్తిలే మూట్టి, ఇన్ద ఐహికవిషయఙ్గళిలుమ్ రక్షకరన్ఱిక్కే ఆపత్సమయఙ్గళిలే కైవిట్టు నిఱ్కు మాభాసబంధుక్కళాన భర్తావైయుమ్, కుమారర్గళైయుమ్, వంశత్తిలే యుళ్లారైయుమ్, సోదరర్గళైయుమ్, బాంధవర్గళైయుమ్ సవాసనమాగ విట్టు. స్త్రీజనఙ్గళుక్కు భర్తాక్కళ్ రక్షకరల్లరెన్నుమిడమ్ నళన్ పక్కలిలుమ్, పాండవరిడత్తిలుమ్ కాణలామ్. కుమారర్ రక్షకరల్లరెన్నుమిడమ్ రుద్రన్ పక్కలిలుమ్, కంసన్ పక్కలిలుమ్ కాణలామ్. భ్రాతాక్కళ్ రక్షరల్లరెన్నుమిడమ్ వాలి పక్కలిలుమ్, రావణన్ పక్కలిలుమ్ కాణలామ్. అన్వయత్తిలుళ్లారుమ్, బంధుక్కళుమ్ రక్షకరల్లరెన్ఱు మిడమ్ దుర్యోధనాదిగళిడత్తిల్ కాణలామ్. ఇవర్గళెల్లారుమ్ కాదలిన్ఱిక్కే, సద్వస్తువై ఇవర్విడత్తిలే కణ్డమాత్రత్తిలే అపహరిక్కపార్త్తు బాధిక్కుమవరన్ఱి రక్షిక్కమాట్టారిఱే. ఆగైయాలేయిఱే "కొణ్డ పెణ్డిర్ మక్కళు*ఱ్ఱార్* శు*ఱ్ఱ*త్తవర్ పిఱరుమ్ కణ్డదోడు పట్టదల్లాల్ కాదల్ మ*ఱ్ఱు* యాదు మిల్లై" (తిరువాయ్-9-1-1) ఎన్ఱు నమ్మా*ళ్వా*రరుళి చ్చెయ్దదు. ఇప్పడిప్పట్ట ఆభాసబంధుక్కళాగైయాల్ అవర్గళెల్లారైయుమ్.

**(అతివిలంఘ్య)**సవాసనమాగ విట్టు. అన్ఱిక్కే,

**(అతివిలంఘ్య) "ఉత్పపాత గదాపాణిః" (రామా.యుద్ధ-16-17)** ఎన్ఱు శొన్నాప్పోలే, అవరగళిడత్తిలుణ్డాన భగవద్విరోధత్తై కణ్డమాత్రత్తాలే మిగవు మసహ్యమాయ్, హేయవస్తువైయుమ్, కంటకఙ్గళైయుమ్ కణ్డవన్ తుళ్లి

---

పతిసుతాన్వయభ్రాతృబాంధవాన్ అతివిలంఘ్య తే హ్యచ్యుతాగతాః ।
గతివిద స్తవోద్గీతమోహితాః కితవ! యోషితః కస్త్యజే న్నిశి ॥

**(పతిసుతాన్వయభ్రాతృబాంధవా నతివిలంఘ్య)-** నీ కైంకర్యానికి దాసుడు కాకుండా, లౌకికవిషయంలో లగ్నం చేయించి. ఈ ఐహికవిషయాలలోకూడా రక్షకులు లేక, ఆపద వచ్చినపడు చేతిని విడచిపెట్టే ఆభాసబంధువులైన భర్తను, పుత్రులను, వంశంలో ఉన్నవారిని, సోదరులను, బంధువులను, సవాసనగా విడచి (అనిభావం). స్త్రీలకు భర్తలుకూడ రక్షకులు కారనే విషయం నలుని విషయంలో, పాండవుల విషయంలో చూడవచ్చు. కుమారులుకూడ రక్షకులుకారనే విషయం రుద్రుని విషయంలో, కంసుని విషయంలో చూడవచ్చు (భాతలుకూడ (తోబుట్టువులు) రక్షకులు కారనే విషయం వాలివిషయంలో, రావణుని విషయంలో చూడవచ్చు. వంశంలో ఉన్నవారు, బంధువులు కూడా రక్షకులుకారనే విషయం దుర్యోధనాదులపట్ల చూడవచ్చు. వీరందఱు ప్రేమ లేకుండా, మంచి వస్తువును ఇతని దగ్గఱ చూడగానే అపహరించాలని చూచి బాధించేవారే తప్ప రక్షించరుకదా! అందువల్లనేకదా **"కొణ్డపెణ్డిర్ మక్కళు*ఱ్ఱార్* శు*ఱ్ఱ*త్తవర్ పిఱరుమ్, కణ్డదోడు పట్టదల్లాల్ కాదల్ మ*ఱ్ఱు* యాదు మిల్లై"** అని నమ్మా*ళ్వా*ర్లు అనుగ్రహించారు. ఇటువంటి ఆభాసబంధువులు కావడంవల్ల వారిని అందటిని అని అర్థం.

**(అతివిలంఘ్య)-** సవాసనగా విడచి (అని అర్థం). లేక,

**(అతివిలంఘ్య)- "ఉత్పపాత గదాపాణిః"** (గదను ధరించినవాడై ఆకాశంలోకి ఎగిరాడు) అని అన్నట్లు వారిపట్ల ఉన్న భగవద్విరోధాన్ని చూచినంతలోనే చాలా అసహ్యమైన, హేయమైన వస్తువును, ముళ్ళను చూడగానే అదిరిపడి, ఎగిరిపడి వచ్చేటట్లు కనుపించకుండా లఘించామునుమా! అని అంటున్నారని కూడా చెప్పవచ్చు. వారంతా నీ సన్నిధిని మేము చేరకుండేటట్లు అడ్డుకోవడంచేత, వారితో గల సంబంధాన్ని గెంటి పారవేసి, వారి

లంఘిత్తు వరుమాప్పోలే, కాణాదపడి లంఘిత్తోమ్ కాణ్ ! ఎన్గిఱార్గళెన్నపుమామ్. అవర్గళెల్లారుమ్ దేవరీరుడైయ సన్నిధియైయుమ్ కిట్టాదపడి తడైక్కైయాలే, అవరోడుణ్డాన సంబంధత్తై త్తళ్లి ప్పాకట్టు, అవరుడైయ వాక్యఙ్గళెల్లామ్ కీழ్పడుత్తి. ఆభాసబంధురూపమాన సంసారత్తై పూర్ణమాగ లంఘిత్తు వన్దోమ్ కాణ్ ! ఎన్ఱు శొల్లుగిఱార్గళెన్నపుమామ్. "పరిత్యక్తా మయా లంకా మిత్రాణి చ ధనాని చ" (రామా-యుద్ధ-19-5) ఎన్ఱుమ్, "అహం తావ న్మహారాజే పితృత్వం నోపలక్షయే" (రామా-యుద్ధ-58-31) ఎన్ఱుమ్ శొన్నపడియే భగవద్విషయత్తుక్కు ఆళాగాదపోదు సర్వరుమ్ త్యాజ్యరిఱే.

(తే హ్యచ్యుతా గతాః) ఆభాసబంధుక్కళ్పడి యన్ఱిక్కే, సర్వవిధబంధువాయ్, ఆశ్రితరై ఒరుకాలుమ్ నழువవిడాద అత్యంతప్రియరాన దేవరీరుడైయ సన్నిధియై వన్దడైన్దోమ్.

(పతి సుతాన్వయభ్రాతృబాంధవా నతివిలంఘ్య తే హ్యచ్యుతాగతాః) "పితృమాతృసుత భ్రాతృదారమిత్రా దయోఽపి వా, ఏకైకఫలలాభాయ సర్వలాభాయ కేశవః" (తిరుప్పావైవ్యాఖ్యానమ్-3వ పా) ఎన్గిఱపడియే హేయమాన ప్రకృతిఫలత్తై త్తరుమవరై విట్టు, ఆత్మావుక్కు అనర్ఘఫలమాయ్, పరమపురుషార్థలక్షణమాన మోక్షత్తై త్తరుమవరాన దేవరీరై వన్దడైన్దోమ్ -ఎన్ఱు శొల్లవుమామ్.

(అచ్యుతాగతాః) ఎప్పోదుమ్ చ్యుతియిన్ఱిక్కే ఇరున్దు, ఆశ్రితరై ఒరుకాలుమ్ నழువవిడాద దేవరీరై వన్దడైన్ద అబలైకళాన ఎఙ్గళై ఇప్పడి విడత్తగుమో ? ఎన్గిఱ భావత్తోడే శొల్లుగిఱార్గళెన్నపుమామ్.

(ఆగతాః హి) యా మిరున్ద విడత్తై త్తేడి దేవరీర్ వర ప్రాప్తమాయిరుక్క, దేవరీరుడైయ సన్నిధిక్కు యామ్ వన్దోమ్. కణ్డాయే ! ఎఙ్గళుడైయ ప్రాప్యత్వరై ఇరున్ద విడత్తే ఇరుక్కవొట్టుకిఱతిల్లైయే! ఇప్పడి వన్ద ఎఙ్గళై "అర్చితా

---

మాటలను అన్నిటిని అధఃకరించి, ఆభాసబంధురూపమైన సంసారాన్ని పూర్తిగా దాటి వచ్చాముసుమా- అని అంటున్నారని కూడా అనవచ్చు. "పరిత్యక్తా మయా లంకా మిత్రాణి చ ధనాని చ" (నేను లంకను, మిత్రులను, ధనాన్ని వదలిపెట్టాను) అని,"అహం తావ న్మహారాజే పితృత్వం నోపలక్షయే" (నేను దశథుని తండ్రిగా భావించడం లేదు) అని పల్కిన రీతిలోనే భగవద్విషయానికి (భగవంతుడనే విషయానికి) దాసులు కానపుడు అందఱూ విడువతగినవారేకదా!

(తే హ్యచ్యుతా గతాః)- ఆభాసబంధువుల తీరు కాకుండా, సర్వవిధబంధువై, ఆశ్రితులకు ఒకసారికూడా చ్యుతి కలుగనీయని అత్యంతప్రియుడవైన నీ సన్నిధికి వచ్చి చేరాము.

(పతిసుతాన్వతయభ్రాతృబాంధవా నతివిలంఘ్య తే హ్యచ్యుతాగతాః)- "పితృమాతృసుతభ్రాతృదార మిత్రాదయోఽపి వా, ఏకైకఫలలాభాయ సర్వలాభాయ కేశవః" (తండ్రి, తల్లి, కుమారుడు, సోదరుడు, భార్య, మిత్రులు మొదలైనవారు ఏదో ఒక్కఫలం కోసమే. కేశవుడు అన్ని లాభాలను కల్గిస్తాడు) అనే రీతిలో హేయమైన ప్రకృతిఫలాన్ని ఇచ్చే వారిని వీడి, ఆత్మకు విలువ కట్టడానికి వీలులేని ఫలం అయిన పరమపురుషార్థరూపం అయిన మోక్షాన్ని ఇచ్చేవాడవైన నీవద్దకు వచ్చి ఆశ్రయించాము- అని చెప్పవచ్చును.

(అచ్యుతాగతాః)- ఏనాడూ పతనం లేకుండా ఉండి, ఆశ్రితులకు ఒక్కసారి కూడా చ్యుతి కలుగనీయని నీవద్దకు వచ్చి ఆశ్రయించిన అబలలమైన మమ్ములను ఈ విధంగా విడువవచ్చునా?- అనే భావంతో చెబుతున్నారు- అనికూడా అనవచ్చు.

(ఆగతాః హి)- మేమున్న చోటును వెదకి, నీవు రావలసి ఉండగా, నీ సన్నిధికి మేము వచ్చాము. చూచావా! మా ప్రాప్యత్వర ఉన్నచోట ఉండనీయడం లేదు! ఈ విధంగా వచ్చిన మమ్ములను "అర్చితా శ్చైవ హృష్టా శ్చ

శ్చైవ హృష్టా శ్చ భవతా సర్వథా వయమ్, పద్భ్యా మభిగమా చ్చైవ స్నేహసందర్శనేన చ, భుజాభ్యాం సాధు పీనాభ్యాం పీడయన్ వాక్య మబ్రవీత్" (రామా. అయో-50-41) ఎన్గిఱపడియే వరవుక్కు ఉగన్దు ఎజ్గళుడైయ ఇழవుమ్, దేవరీరుడైయ ఇழవుమ్ తీర సంశ్లేషిత్తు, "మా శుచః" (భగ-18-66) ఎన్బారు శ్రీసూక్తి సాయిక్కలాగాదో?

(ఆగతాః హి) దేవరీర్ "రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" (లక్ష్మీతంత్రమ్- 17-78) ఎన్గిఱపడియే రక్ష్యాపేక్షైయోడే ఇరున్దు, అనేకావతారజ్గళ్ పణ్ణి నిఱ్కిఱ సమయత్తిలే, చరమావతారమాన ఇన్ద అవతారత్తిలే ప్రకృతిప్రాకృతజ్గళిల్ నశై యఱ్ఱు, "అహం మే" (భట్టర్ముక్తకమ్) ఎన్ఱై తవిర్న్దు ఉన్ తిరువడి అడైన్ద ఎజ్గళై విడ ప్పార్త్తాయే! "అధునా లబ్ధం తు నోపేక్ష్యతామ్" (క్షమాషోడశీ) ఎన్గిఱార్గళెన్ఱవుమామ్.

(తే ఆగతా హి) అతిలుమ్ ఎజ్గళుక్కొరు ప్రయోజనత్తుక్కాగవన్ఱిక్కే, "ఉనక్కే నామాట్చెయ్వోమ్" (తిరుప్పావై-29) ఎన్గిఱపడియే దేవరీరుడైయ ప్రయోజనత్తుక్కాగ వన్దోమ్ కాణ్. అవనుక్కు పల్లాణ్డు పాడుగైయే ప్రయోజనమితే ఇవర్గళుక్కు.

(గతివిద స్తవోద్గీతమోహితాః) ఇప్పడి సర్వత్తైయుమ్ విట్టు దేవరీరుడైయ తిరువడియై అడైన్దదు ఎజ్గళుడైయ తెళివాలేయో? అన్ఱు. సకలచరాచరచేతనజాతత్తినుడైయ గతియై అఱిన్దవరాయ్, అఱ్ఱై ఇవర్గళుక్కు నన్ఱాగ కాట్టక్కడవ ప్రాప్యప్రాపకభూతరాన దేవరీరుడైయ సకలజగన్మోహమాన ఉద్గీతైయాలే తెళివుఱ్ఱు మోహిత్తు వన్దడైన్దోమ్కాణ్. ఇజ్గు, ఉద్గీతై ఎన్గిఱదు ప్రణవత్తై. తిరువష్టాక్షరి ఎన్ఱవుమామ్. "దేహాసక్తాత్మబుద్ధి ర్యది భవతి పదం సాధు విద్యా త్తృతీయమ్, స్వాతంత్ర్యాంధో యది స్యా త్ప్రథమ మితరశేషత్వధీ శ్చే ద్ద్వితీయమ్. ఆత్మత్రాణోన్ముఖ

---

భవతా సర్వథా వయమ్, పద్భ్యా మభిగమాచ్చైవ స్నేహసందర్శనేన చ", (పాదాలతో నడచి వచ్చినందువల్ల, స్నేహాన్ని ప్రదర్శించినందువల్ల నీచే చక్కగా మేము పూజింపబడ్డాము; ఆనందాన్ని పొందాము) "భుజాభ్యాం సాధు పీనాభ్యాం పీడయన్ వాక్య మబ్రవీత్" (బలిష్ఠాలైన బాహువులతో చక్కగా కౌగలించుకొని మాటను పలికాడు) అనే రీతిలో రాకకు సంతోషించి, మా నష్టం, నీకష్టం తీరేటట్లు సంశ్లేషించి, "మా శుచః" వంటి ఒక శ్రీసూక్తిని అనుగ్రహించరాదా!

(ఆగతాః హి)- నీవు "రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" (రక్ష్యభూతుని అపేక్షను ఎదురుచూస్తాడు) అనే రీతిలో రక్ష్యాపేక్షతో వచ్చి, అనేకఅవతారాలను ఎత్తినసమయంలో చివరి అవతారం అయిన ఈ అవతారంలో ప్రకృతి-ప్రాకృతవిషయాలలో ఆశ నశించి, "అహం మే" అనడం మానివేసి, నీ శ్రీపాదాలను చేరిన మమ్ములను విడవాలని చూచావే ! "అధునా లబ్ధం తు నోపేక్ష్యతామ్" (ఇపుడు లభించిన దానిని ఉపేక్షించకు) అని అంటున్నారనికూడా అనవచ్చు.

(తే ఆగతా హి)- అందులోను, మాకొక ప్రయోజనంకోసం కాకుండా, "ఉనక్కే నామాట్చెయ్వోమ్" (నీకే మేము కైంకర్యం చేస్తాము) అనే రీతిలో నీ ప్రయోజనంకోసం వచ్చాముసుమా! అతనికి పల్లాణ్డు పాడడమే ప్రయోజనంకదా వీరికి!

(గతివిద స్తవోద్గీతమోహితాః)- ఈవిధంగా సర్వాన్ని విడచి,నీ శ్రీపాదాలను ఆశ్రయించినది మా జ్ఞానంవల్లనా! కాదు. సకలచరాచరచేతనసమూహంయొక్క గతి లేని స్థితిని తెలిసినవాడవై, దానిని వీరికి చక్కగా చూపించదగిన ప్రాప్య- ప్రాపక భూతుడవైన నీ సకలజగత్తును మోహింపజేసే ఉద్గీతంవల్ల తెలివిని పొంది, మోహించి వచ్చి ఆశ్రయించాముసుమా! ఇక్కడ "ఉద్గీత" అన్నది ప్రణవాన్ని తెలుపుతుంది. తిరువష్టాక్షరి అనికూడా అనవచ్చును. "దేహాసక్తాత్మబుద్ధి ర్యది భవతి పదం సాధు విద్యా త్తృతీయం స్వాతంత్ర్యాంధో యది స్యాత్ ప్రథమ మితర శేషత్వధీశ్చే ద్ద్వితీయమ్, ఆత్మత్రాణోన్ముఖ శ్చే న్నమ ఇతి చ పదం బాంధవాభాసలోలః శబ్దం నారాయణాఖ్యం

శ్చే న్నమ ఇతి చ పదం బాంధవాభాసలోలః శబ్దం నారాయణాఖ్యం విషయచలపలధీ శ్చే చ్చతుర్థీం ప్రపన్నః" (అష్టశ్లోకీ-4) ఎన్గిఱపడియే ఇతినుడైయ జ్ఞానత్తాలేయితే ప్రకృతివ్యామోహమ్ పోయ్, భగవద్విషయవ్యామోహ మభివృద్ధ మాకిఱదు. "నిన్ తిరువెట్టెழుత్తు మోదువార్గళ్ వల్లర్ వాన మాళవే" (తిరుచ్చన్ద-77) ఎన్టార్గళితే.

(గతివిద స్తవోద్గీతమోహితాః) ఎఙ్గళుడైయ గతియై అఱిన్దోమ్. దేవరీరుడైయ ఉద్గీతైయాలే మోహిత్తోమ్ - ఎన్గిఱార్గళెన్టవుమామ్.

(కితవ) మాయియానవనే ! ఉన్నుడైయ మాయై విరోధిగళై మాయమ్ శెయ్గైక్కాగాదే, ఆశ్రితర్గళై బాధిక్కైక్కుఱుప్పాప్పడి ఎన్? ఎన్టు విద్దరాగిఱార్. అన్టిక్కే, "అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ" (రామా-యుద్ధ-18-32) ఎన్టు శొల్లివైత్తు అప్పడి శెయ్యప్పెఱామైయాలే శొల్లుమ్ శెయలుమ్ శేరాదపడి అழగా యిరున్దదు. మాయియా యిరున్దాయే! ఎన్గిఱార్గళెన్టవుమామ్.

(యోషితః) పురుషరాయ్, "త్వం మే" (భట్టర్ముక్తకమ్) ఎన్టాల్, "అహం మే" (భట్టర్ముక్తకమ్) ఎన్టుకొణ్డు విశ్లేషత్తిల్ ధరిత్తిరుక్కవల్లరెన్టు నినైత్తు విశ్లేషిత్తాయో? ఎప్పోదుమ్ ఉన్నుడైయ సంశ్లేషత్తైయే వాంఛిత్తుక్కొణ్డు, ఉన్ విశ్లేషత్తిల్ ధరిత్తిరుక్క మాట్టాదే అత్యంతసుకుమారరాయ్, అబలలాన స్త్రీజనఙ్గళై ఇప్పడి విట్టాయే ! ఎన్గిఱార్గళ్. "యౌతి పుంసా ఇతి యోషిత్. యు- మిశ్రణే ఎన్టితే ధాతు." (పాణినిధాతుపాఠమ్). "న చ సీతా త్వయా హీనా న చాహ మపి రాఘవ!,

---

విషయచపలధీ శ్చే చ్చతుర్థీం ప్రపన్నః" (ప్రపన్నుడు దేహమే ఆత్మ అనే భ్రాంతిని కలవాడైతే మూడవపదం అయిన మకారాన్ని బాగా తెలిసికోవాలి. స్వాతంత్ర్యబుద్ధిచేత అంధుడైతే మొదటి పదమైన అకారాన్ని తెలిసికోవాలి. తాను ఇతరులకు శేషభూతుడని తలిస్తే రెండవ పదమైన ఉకారాన్ని తెలిసికోవాలి. తనను తాను రక్షించుకోవడంలో ఉన్ముఖుడైతే నమశ్శబ్దాన్ని తెలిసకోవాలి. ఆభాసబంధువులను బంధువులుగా తలిస్తే నారాయణశబ్దాన్ని తెలిసికోవాలి. విషయచాపల్యం కల్గినవాడైతే చతుర్థీవిభక్తిని తెలియాలి.) అనే రీతిలో దీనియొక్క జ్ఞానంవల్లనేకదా ప్రకృతివ్యామోహం పోయి, భగవద్విషయవ్యామోహం అభివృద్ధి అవుతుంది. "నిన్ ఎట్టెழుత్తు మోదువార్కళ్ వల్లర్ వాన మాళవే" (నీ అష్టాక్షరిని అభ్యసించే వారు పరమపదాన్ని ఏలగలరు) అని తిరుమழிశై ఆழ்వార్లు అన్నారుకదా!

(గతివిద స్తవోద్గీతమోహితాః)- మా గతిని తెలిసికొన్నాము. నీ ఉద్గీతవల్ల మోహించాము- అని అంటున్నారని కూడా భావం.

(కితవ)- మోసగాడా! నీ మాయ విరోధులను మాయం చేయడానికి కాకుండా, ఆశ్రితులను బాధించడానికి ఉపయోగపడుతున్న తీరేమి? అని విద్ధులవుతున్నారు. లేక "అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ" (సమస్తప్రాణులకు అభయాన్ని ఇస్తాను. ఇది నా వ్రతం) అని పల్కి ఆ విధంగా చేయలేకపోవడంవల్ల నీ మాటకు పనికి పొందిక లేకుండా అందంగా ఉన్నది. మాయావిగా ఉన్నావే! అని అంటున్నారనికూడా భావం.

(యోషితః)- పురుషులై, "త్వం మే" అని అంటే, "అహం మే" అని అంటూ విశ్లేషంలో ధరించగల్గినవారని తలచి విశ్లేషించావా! ఎల్లప్పుడూ నీ సంశ్లేషాన్నే వాంఛిస్తూ, నీ విశ్లేషంలో తాళలేకుండా చాలా సుకుమారులై, అబలలైన స్త్రీజనాలను ఈవిధంగా విడిచిపెట్టావే ! అని అంటున్నారు. "యౌతి- పుంసా యోషిత్, "యు- మిశ్రణే" అని కదా ధాతువు. పురుషుని విశ్లేషంలో "కఙ్గులుమ్ పకలుమ్ కణ్డుయిలఱియాళ్ కణ్ణనీర్ కై కళాలిఱైక్కుమ్" (నాకుమార్తె రాత్రి పగలు నిద్రించి తెలియదు. కన్నీళ్ళను చేతితో జల్లుతున్నది) అనికదా వీరి

ముహూర్త మపి జీవావో జలా న్మత్స్యా వివోద్ధృతౌ" (రామా-అయో-53.-31) ఎన్ఱారితే ఇవనుడైయ విశ్లేషత్తై ఒరు క్షణముమ్ సహియాదార్.

**(క స్త్యజే న్నిశి)** ఇప్పడి ఇరున్ద స్త్రీజనఙ్గళై అరుకే ఇరున్దు రక్షియాదే క్రూరరాన అసురరాక్షసర్గళ్ వర్త్తిక్కుమ్ భయంకరమాన నిశీథత్తిలే యవన్ విడుమ్? దేవరీర్ ఇప్పడి విడత్తగుమో? ఎన్గిఱార్గళ్.

**(యోషితః క స్త్యజే న్నిశి)** ఎప్పోదుమ్ పురుషనోడు సంశ్లేషిత్తిరుక్కైయే స్వభావమాగ ఉడైయరాన యోషిజ్జనఙ్గళై అనుభవకాలమాన అర్ధరాత్రియిల్ అనుభవియాదే పురుషనాన ఎవన్ విడుమ్? ఇప్పడి విట్టపడియాలే దేవరీర్ పురుషరన్ఱిక్కేయొళిగివదే ! "స్త్రియం పురుషవిగ్రహమ్" (రామా-అయో-30-3) ఎన్గిఱార్గళ్. అన్ఱిక్కే, సర్వేశ్వరనోడు కూడియిరుక్కైయే స్వభావమాగవుడైయరాయ్, విశ్లేషత్తిల్, "న దేహం న ప్రాణాన్" (స్తోత్రరత్నమ్-57) ఎన్ఱుమ్, "అకలగిల్లేన్ ఇఱైయుమ్" (తిరువాయ్-6-10-10) ఎన్ఱుమ్ శొన్నపడి ధరిక్కప్పెఱాదవరాయ్, శేషత్వ పారతంత్ర్య విశిష్టరాన ప్రపన్నజనఙ్గళై అనుభవకాలత్తిల్ "తనక్కేయాగ వెనై కొళ్ళు మీదే" (తిరువాయ్-2-9-4) ఎన్గిఱపడియే అనుభవియాదే విడుగై స్వామియాన దేవరీరుక్కు తగుమో? ఎన్గిఱార్గళెన్ఱవుమామ్.

**(ఉద్గీతమోహితాః యోషితః క స్త్యజే న్నిశి)** "శ్రుత్వా వేణురవం రాజన్ ! సర్వభూతమనోహరమ్" (భాగవతమ్-10-21-6) ఎన్గిఱపడియే సకలచరాచర చేతనజాతత్తుక్కు ఉన్మస్తకమోహజనకమాన దేవరీరుడైయ బ్రహ్మగాంధర్వగానత్తాలే మోహిత్తు వన్దు సంశ్లేషిత్తు విశ్లేషిక్క క్షమరన్ఱిక్కే ఇరున్ద అబలలాన స్త్రీజనఙ్గళై దేవరీరన్ఱి ఎవన్ విడుమ్ ? ఇప్పడి విడత్తగుమో?

---

స్థితి. "న చ సీతా త్వయా హీనా న చాహ మపి రాఘవ! ముహూర్త మపి జీవావో జలా న్మత్స్యావివోద్ధృతౌ" (రాఘవా! సీత అయినా, నేను అయినా, నీటినుండి తీయబడ్డ మత్స్యాల వలె, నిన్ను విడచి జీవించలేము) అని అన్నారుకదా వీరి విశ్లేషాన్ని క్షణకాలంకూడా సహించలేనివారు. (లక్ష్మణుడు)

**(కస్త్యజే న్నిశి)-** ఈ విధంగా ఉన్న స్త్రీజనాలను దగ్గరగా ఉండి రక్షించకుండా, క్రూరులైన అసురరాక్షసులు వర్తించే భయంకరమైన నిశీథిలో ఎవడు విడచిపెడతాడు? నీవు ఈ విధంగా విడువవచ్చునా? అని అంటున్నారు.

**(యోషితః క స్త్యజే న్నిశి)-** ఎల్లప్పుడూ పురుషునితో సంశ్లేషించి ఉండడమే స్వభావంగా కల్గినవారైన స్త్రీజనాలను అనుభవకాలం అయిన అర్ధరాత్రిలో అనుభవించకుండా, పురుషుడైనవాడెవడు విడుస్తాడు ? ఈ విధంగా విడచినందువల్ల నీవు పురుషుడవే కాకుండాపోతావే ! "స్త్రియం పురుషవిగ్రహమ్" (పురుషరూపంలోని స్త్రీ) అని అంటున్నారు. లేక, సర్వేశ్వరునితో కలసి ఉండడమే స్వభావంగా కలవారై, విశ్లేషంలో - "న దేహం న ప్రాణాన్" (ప్రాణాలను కాని, దేహాన్ని కాని కోరను) అని, "అకలకిల్లేన్ ఇఱైయుమ్" (క్షణం కూడా విశ్లేషించలేను) అని చెప్పిన రీతిలో తాళలేనివారై, శేషత్వపారతంత్ర్య విశిష్టులైన ప్రపన్నులను అనుభవకాలంలో -"తనక్కేయాక ఎన్నై క్కొళ్ళుమీదే" (నీకొఱకే నన్ను పరిగ్రహించు) అనే రీతిలో అనుభవించకుండా విడువడం స్వామివి అయిన నీకు తగునా? అని అంటున్నారనికూడా చెప్పవచ్చు.

**(ఉద్గీతమోహితాః యోషితః క స్త్యజే న్నిశి)-** "శృత్వా వేణురవం రాజన్ ! సర్వభూతమనోహరమ్" (ఓ రాజా! సమస్తప్రాణుల మనస్సును హరించే వేణుధ్వనిని విని) అనే రీతిలో సకలచరాచరచేతనసమూహానికి ఉన్మస్తకంగా (తల మునకలుగా) మోహాన్ని కల్గించే నీ బ్రహ్మగాంధర్వగానంతో మోహించి వచ్చి, సంశ్లేషించి, (నిన్ను) విడువడానికి శక్తి లేనివారై ఉన్న అబలలైన స్త్రీజనాలను నీవు తప్ప ఎవడు విడచిపెడతాడు? ఈ విధంగా విడువడం తగునా?

(తవోద్గీతమోహితాః యోషితః క స్త్యజే న్నిశి) విడప్పార్త్తాలుమ్ విడ అరిదాన సర్వవిధసంబన్ధముడైయ దేవరీరుడైయ గానత్తాలే మోహిత్తు వన్దున్ తిరువడి అడైన్ద ఎఙ్గళై ఇప్పడి విడత్తగుమో ? ఎన్గిఱార్గళ్.

(గతివిదః యోషితః క స్త్యజే న్నిశి) ఎఙ్గళుక్కు సర్వవిధత్తాలుమ్ దేవరీరే గతి ఎన్ఱఱిన్దు వన్దు నిన్ఱ స్త్రీజనఙ్గళుమాన ఎఙ్గళై దేవరన్ఱి ఎవన్ విడుమ్ ?

(ఆగతాః యోషితః క స్త్యజే న్నిశి) స్వయమాగ సన్నిధి అడైన్ద యోషిజ్జనఙ్గళై దేవరీరన్ఱి ఎవన్ విడుమ్ ?

(పతిసుతాన్వయభ్రాతృబాంధవా నతివిలంఘ్య ఆగతాః యోషితః క స్త్యజే న్నిశి) ప్రకృతిబాంధవర్గళెల్లారైయుమ్ సవాసనమాగ విట్టు, మోహత్తాలే స్వయమాగ వన్దు సన్నిధి అడైన్ద స్త్రీజనఙ్గళై దేవరీరన్ఱి ఎవన్ విడుమ్ ? ఇత్తాల్, సర్వవిధప్రకృతిబంధుక్కళై విట్టు, దేవరీరే సర్వవిధబంధు ఎన్ఱధ్యవసిత్తు, దేవరీరుడైయ సర్వశేషిత్వప్రతిపాదకమాన శ్రీసూక్తియాలే మోహిత్తు వన్దు ఎఙ్గళుడైయ గతియై అఱిన్దోమాయ్, సంశ్లేషిత్తిల్ ధరిత్తు, విశ్లేషత్తిల్ ధరిక్కమాట్టాదే శేషత్వపారతంత్ర్యజ్ఞానవిశిష్టరాన ప్రపన్నజనఙ్గళై ఇప్పడి విడత్తగుమో? "సుగాఢం పరిషస్వజే" (విష్ణు.పు-5-18-2) ఎన్గిఱపడియే సంశ్లేషిత్తు ఉన్ సత్తైయై లభిక్కవేణ్డావో ? ఇన్నముమ్ విశ్లేషిత్తు నిఱ్కైయన్ఱిక్కే ఎఙ్గళ్ మున్నే సాక్షాత్కరిత్తు, ఎఙ్గళుడైయ కైంకర్యత్తై స్వీకరిత్తరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్గళ్.

పదినాఱామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

---

(తవోద్గీతమోహితాః యోషితః క స్త్యజే న్నిశి)- విడవాలని చూచినా, విడువడానికి అరుదైన సర్వవిధ సంబంధాన్ని కల నీ గానంతో మోహించి, వచ్చి నీ శ్రీపాదాలను ఆశ్రయించిన మమ్ములను ఈ విధంగా విడవడం తగునా? అని అంటున్నారు.

(గతివిదః యోషితః క స్త్యజే న్నిశి)- మాకు అన్నివిధాలుగా నీవే గతి అని తెలిసి వచ్చి నిలచిన, స్త్రీలమైన మమ్ములను నీవు తప్ప ఎవడు విడుస్తాడు ?

(ఆగతాః యోషితః క స్త్యజే న్నిశి)- స్వయంగా సన్నిధిని చేరిన స్త్రీజనాలను నీవు తప్ప ఎవడు విడుస్తాడు?

(పతిసుతాన్వయభాతృబాంధవా నతివిలంఘ్య ఆగతాః యోషితః క స్త్యజే న్నిశి)- ప్రకృతి బంధువులను అందఱినీ సవాసనగా విడచి, మోహంచేత స్వయంగా వచ్చి (నీ) సన్నిధిని చేరిన స్త్రీజనాలను నీవు తప్ప ఎవడు విడుస్తాడు? ఇందువల్ల సకలవిధప్రకృతిబంధువులను విడచి, నీవే సర్వవిధబంధువని నిశ్చయించుకొని, నీ సర్వశేషిత్వప్రతిపాదకం అయిన శ్రీసూక్తిచేత మోహించి వచ్చి, మా గతిని తెలిసినవారమై, సంశ్లేషంలో నిలచి, విశ్లేషంలో నిలువలేకుండా, శేషత్వ- పారతంత్ర్యజ్ఞానవిశిష్టులైన ప్రపన్నజనులను ఈ విధంగా విడువవచ్చునా? "సుగాఢం పరిషస్వజే" (చాలా గాఢంగా కౌగలించుకొన్నాడు) అనే రీతిలో (మాతో) సంశ్లేషించి, (నీవు) నీ సత్తను పొందవద్దా! ఇంకా విశ్లేషించి ఉండడం కాకుండా మాముందే సాక్షాత్కరించి, మా కైంకర్యాన్ని స్వీకరించి, అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారు.

పదహారవ శ్లోకం ముగిసింది

## పతినేழாమ్ శ్లోకమ్

అవ :- అழగిదు. నమక్కాగ ఇత్తనై శ్రమత్తోడే కానగజ్గళిలే ఉలావుగిఱదు ఎదుక్కాగ? ఉజ్గళుడైయ అకజ్గళిలే పోయ్ సుఖిక్కలాగాదో? ఎన్ఱు నినైన్దాయో? దేవరీరుడైయ దివ్యమజ్గళవిగ్రహసంస్థానత్తై కణ్డ నెఞ్జానదు "తుఞ్జుమ్పోదుమ్ విడాదు తొడర్ కణ్డాయ్" (తిరువాయ్-1-10-5), యామ్ ఎన్ శెయ్యక్కడవోమ్ ? ఎన్గిఱార్గళ్ ఇన్ద శ్లోకత్తాలే. అన్ఱిక్కే, దేవరీర్ ఆధ్యాత్మికాది తాపత్రయత్తాలే కమర్ పిళన్ద నెఞ్జు పతన్ శెయ్యుమ్పడి తేనుమ్ పాలు మముదమ్ పోన్ఱ శ్రీసూక్తిగళై కేట్పిత్తు "తిరువిరున్దమార్వో"డుమ్ (మూన్ఱామ్ తిరు-57), "ముఱువల్ శెయ్దు కొణ్డు" (పెరియతిరు-8-8-5) నిన్ఱ ముగత్తోడుమ్, చేతనరిడత్తిల్ ప్రేమరసత్తై స్రవిక్కిఱ వీక్షణఙ్గళుడైయ తిరుక్కణ్గళోడుమ్ ప్రకాశిక్కిఱ దివ్యమజ్గళవిగ్రహసంస్థానత్తై ముற్றుாట్టాక అనుభవిప్పిత్తు, ఇన్ఱు విశ్లేషిత్తవాఴే, ఎజ్గళుడైయ నెఞ్జానదు ఆఱియిరుక్కుమో? ఎప్పోదు మవైగళైయే నినైత్తు, మికవు మభినివేశిత్తాలే మోహియానిన్ఱదుకాణ్. ఆగ, అదు నిలైనిఱ్కుమ్పడి మున్నే తోற்றి యరుళవేణుమెన్ఱు ప్రార్థిక్కిఱారెన్ఱవుమామ్. "ఎన్నెఞ్జినారు మజ్గే యొழிన్దార్" (తిరువాయ్-) ఎన్ఱుమ్, "తుఞ్జుమ్పోదుమ్ విడాదు తొడర్ కణ్డాయ్" (తిరువాయ్-1-10-5) ఎన్ఱుమ్, "కోల్ తేడి యోడుమ్ కొழுన్దదే పోన్ఱదే మాల్ తేడి యోడుమ్ మనమ్" (ఇరణ్డామ్- 27) ఎన్ఱుమ్, "పుళ్ళూర్కొడియానే! యెన్ఱు కిడక్కు మెన్ నెఞ్జమే" (తిరువాయ్-3-8-1) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియేయిఱే ఇదిన్ పడి. అవను మాశ్రితరుడైయ "మనక్కడలిల్ వాழவల్ల"నిఱే. "పనిక్కడలిల్ పళ్లికోళై పழகవిట్టోడివన్దెన్

---

## పదిహేడవ శ్లోకం

అవ :- బాగున్నది. మాకోసం ఇంత శ్రమతో అరణ్యంలో తిరగడం ఎందుకోసం? మీ ఇంట్లోకి పోయి సుఖపడకూడదా? అని తలచావా! నీ దివ్యమంగళవిగ్రహ సన్నివేశవిశేషాన్ని దర్శించిన మనస్సు "తుఞ్జుమ్పోదుమ్ విడాదు తొడర్ కణ్డాయ్". (నిద్రించేటపుడుకూడా విడువకుండా అనుసరిస్తుంది సుమా!) మేము ఏమి చేయగలము? అంటున్నారు ఈశ్లోకంతో. లేక, నీవు ఆధ్యాత్మికాది తాపత్రయంతో బీటలు వారిన మనస్సు పదునుకు వచ్చేటట్లు తేనె, పాలు, అమృతంవంటి శ్రీసూక్తులను విన్పించి, "తిరువిరున్ద మార్వు" (లక్ష్మి నివసించే వక్షఃస్థలం)తో "ముఱువల్ శెయ్తు" చిఱునవ్వు నవ్వుతూ నిలచిన ముఖంతో, చేతనుల విషయంలో ప్రేమరసాన్ని స్రవించే కటాక్షాలు కల్గిన తిరునేత్రాలతో ప్రకాశించే దివ్యమంగళవిగ్రహసన్నివేశాన్ని పూర్ణభోజనంగా అనుభవింపజేసి, ఇపుడు విశ్లేషించగానే, మా మనస్సు సహించగలదా? ఎపుడూ వాటినే తలచి, మిక్కిలి అభినివేశంలో మోహిస్తూ ఉన్నదిసుమా! అందువల్ల, అది నిలచి ఉండేటట్లు ఎదుట తోచి అనుగ్రహించాలని పార్థిస్తున్నారని కూడా చెప్పవచ్చు. "ఎన్నెఞ్జినారు మజ్గే యొழிన్దార్" (నా మనస్సు అనే పెద్దమనిషికూడా అక్కడికే పోయింది) అని, "తుఞ్జుమ్పోదుమ్ విడాదుతొడర్ కణ్డాయ్" (నిద్రించేటపుడుకూడా విడువకుండా అనుసరించు) అని, "కోల్ తేడియోడుమ్ కొழுన్దదే పోన్ఱదే మాల్ తేడియోడుమ్ మనమ్" (ఆశ్రితవ్యాముగ్ధుడైన స్వామిని వెదకిపోయే నా మనస్సు, ఆలంబనాన్ని వెదకుతూ సాగే తీగవలె ఉన్నది) అని, "పుళ్ళూర్ కొడియానే ! యెన్ఱు కిడక్కుమ్ ఎన్ నెఞ్జమే" (గరుడుని ధ్వజంగా వాహనంగా కలవాడా !) అని చెప్పే తీరు కదా దీని తీరు. అతడుకూడా ఆశ్రితుల "మనక్కడలిల్ వాழவల్లవన్" (మనస్సు అనే సముద్రంలో ఉండగలవాడుకదా) కదా! "పనిక్కడలిల్ పళ్ళికోళై పழகవిట్టోడి వన్దెన్ మనక్కడలిల్ వాழவల్ల మాయమణాళనమ్బీ!" (చల్లని సముద్రంలోని పడుకను విడచివచ్చి నా మనస్సు అనే సముద్రంలో నివసించగల్గిన ఆశ్చర్యభూతుడవైన ఓ అందమైన వరుడా! గుణపూర్ణా !) అని అనబడుతున్నదికదా! అందువల్ల, ఈ రీతిలో నీ

మనక్కడలిల్ వాழ்வల్ల మాయమణాళ నమ్బీ!" (పెరియాழ்వార్-5-4-9) ఎన్గానిన్దదిఱే. ఆగైయాలే, ఇప్పడి దేవరీరిడత్తిల్ అతిమాత్రమాన స్పృహైయోడే మోహిత్తు నిన్ఱ నెఞ్జు నిలై నిఱ్కుమ్బడి మున్నే సాక్షాత్కరిత్తు అదిన్ మేలే శాయ్న్దు సుఖిత్తరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్కెన్ఱవుమామ్. అన్ఱిక్కే, సర్వేంద్రియఙ్గళుక్కుమ్ నిర్వాహకమాన మనస్సానదు దేవరీరిడత్తిల్ అత్యంతాభినివేశత్తోడే మోహిత్తు నిన్ఱపడియాలే ఇతరేంద్రియఙ్గళ్ మోహిత్తునిన్ఱపడి శొల్లవేణ్డావిఱే. దేవరీర్ హృషీకేశరిఱే. ఈశితవ్యఙ్గళై విసవుమ్బడి పణ్ణి ఆనందిక్కైయో, ఈశనానవనుక్కు స్వరూపమ్? ఆక, ఎఙ్గళుడైయ సర్వేంద్రియఙ్గళుక్కు ఆనన్దావహమాగ, పిరాట్టిక్కిరుప్పిడమాన దేవరీరుడైయ దివ్యమఙ్గళవిగ్రహసంస్థానత్తై సాక్షాత్కరిప్పిత్తు, నిదాఘతప్తనాన వనుక్కు వర్షధారాపాతమ్బోలే అత్యంతశీతలమాన శ్రీసూక్తిగళై సాయిత్తు, ప్రేమపూర్వకమాగ కటాక్షిత్తు, ముఱువల్ శెయ్దు కొణ్డు సంశ్లేషిత్తరుళవేణు మెన్ఱు ప్రార్థిక్కిఱార్కెన్ఱవుమామ్.

రహసి సంవిదం హృచ్ఛయోదయం ప్రహసితాననం ప్రేమవీక్షణమ్ ।
బృహదుర శ్శ్రియో ధామ వీక్ష్య తే ముహు రతిస్పృహా ముహ్యతే మనః ॥

(రహసి సంవిదం హృచ్ఛయోదయమ్) హృదయత్తిలే కామత్తై ఉదయిక్కప్పణ్ణుగిఱ నర్మాలాపత్తైయుమ్. ప్రియజనఙ్గళుడైయ నర్మాలాపఙ్గళ్ ఎల్లావఱ్ఱిలుమ్ మేలాయ్, సదానుభవయోగ్యమాగైయాలే మున్ మున్నే అనుసన్ధిక్కిఱార్గళ్. "మధురా మధురాలాపా కి మాహ మమ భామినీ, మద్విహీనా వరారోహా హనుమన్ ! కథయస్వ మే" (రామా.సుందర-66-15) ఎన్ఱు ఇవళుడైయ పేచ్చిలినిమైక్కు మోహప్పట్టిరున్దాప్పోలే, ఇప్పోదివర్ అనుడైయ పేచ్చిల్ ఇనిమైక్కు మోహప్పడుకిఱార్గళ్. "వార్తై యఱిబవర్ మాయావఱ్కాళన్ఱియావరో !" (తిరువాయ్-7-5-10)

---

విషయంలో అత్యంతమైన స్పృహతో మోహించి ఉన్న మనస్సు స్థిరంగా ఉండేటట్లుగా ఎదుట సాక్షాత్కరించడానికి మించి శయనించి సుఖించాని ప్రార్థిస్తున్నారనికూడా చెప్పవచ్చు. లేక, అన్ని ఇంద్రియాలకు నిర్వాహకం అయిన మనస్సు నీపట్ల చాలా అభినివేశంతో మోహించీ ఉన్నందువల్ల ఇతర ఇంద్రియాలు మోహించి ఉన్న తీరును చెప్పనక్కఱలేదుకదా! నీవు హృషీకేశుడవు కదా! ఈశితవ్యాలను (పాలింపబడేవాటిని) బాధపడేటట్లు చేసి ఆనందించడమా ఈశ్వరుడైనవానికి స్వరూపం! అందువల్ల, మా సర్వేంద్రియాలకు ఆనందం కల్గించేటట్లు, లక్ష్మీనివాసస్థానం అయిన నీ దివ్యమంగళవిగ్రహసన్నివేశాన్ని సాక్షాత్కరింపజేసి, మండు వేసవిలో తపింపబడ్డవానికి వర్షధారాపాతంవలె, చాలా చల్లని శ్రీసూక్తులను అనుప్రేమపూర్వకంగా కటాక్షించి, చిఱునవ్వు నవ్వుతూ సంశ్లేషించాలని ప్రార్థిస్తున్నారనికూడా చెప్పవచ్చు.

రహసి సంవిదం హృచ్ఛయోదయం ప్రహసితాననం ప్రేమవీక్షణమ్ ।
బృహదుర శ్శ్రియో ధామ వీక్ష్య తే ముహు రతిస్పృహా ముహ్యతే మనః ॥

(రహసి సంవిదం హృచ్ఛయోదయమ్)- హృదయంలో కామాన్ని ఉదయింపజేసే నర్మాలాపాన్ని - అని అర్థం ప్రియజనాల నర్మాలాపాలు అన్నిటికంటె గొప్పవై, సదానుభవయోగ్యాలు కాబట్టి వాటిని మునుముందుగా అనుసంధిస్తున్నారు. "మధురా మధురాలాపా కి మాహ మమ భామినీ, మద్విహీనా వరారోహా హనుమన్! కథయస్వ మే" (ఓ హనుమా! నానుండి దూరమైనది మధురమైనది, మధురంగా పలికేది అయిన నా సీత ఏమని అన్నది? చెప్పు) అని వీరి మాటలోని మాధుర్యానికి మోహించి ఉన్నట్లు, ఇపుడు వీరు అతని వాఙ్మాధుర్యానికి మోహపడు తున్నారు. "వార్త్తై యఱిబవర్ మాయవర్ క్కాళన్ఱియావరో?" (చరమశ్లోకాన్ని తెలిసినవారు ఆశ్చర్యభూతుడైన భగవానునకు దాసులు కాకుండా ఉంటారా?) అనే రీతిలో అతని వాక్కులోని తీయదనం అతని విషయంలో

ఎన్గిఱపడియే అవనుడైయ పేచ్చిలినిపై అవనిడత్తిల్ మయఙ్గప్పణ్ణుమన్ఱి పుఱమ్బు పోకవొట్టుమో ? ఇఙ్గు రహస్యవాక్యమాగ చ్చొల్లప్పట్టదు చరమశ్లోకమ్. ఇదు పరమరహస్యార్థప్రతిపాదకమాగైయాలే "రహసి సంవిద" మెన్ల త్తగుమిఱే. ఇతినుడైయ రహస్యత్తై ప్పఱ్ఱియిఱే తిరుక్కోట్టియూర్‌నమ్బి ఎమ్బెరుమానారై పతినెట్టు పర్యాయమ్ తమ్ తిరువడియై సేవిప్పిత్తుక్కొణ్డు ఇతినర్థత్తై సాయిత్తరుళిఱ్ఱు. ఇదువుమ్ భగవద్విషయవ్యామోహత్తై ఉదయిక్కప్పణ్ణుమ్బడియాలే "హృచ్ఛయోదయమ్" ఎన్ల త్తట్టిల్లైయే.

(ప్రహసితాననం ప్రేమవీక్షణమ్) ఆశ్రితరిడత్తిల్ ప్రేమరసత్తై ఒరుపడియాలే ప్రవిక్కిఱ వీక్షణఙ్గళోడే కూడియిరున్న, "ముఱువల్ శెయ్‌దు నిన్ల" తిరుముఖమణ్డలత్తైయుమ్. "ఎన్ ముఱ్ఱమ్ పుగున్దు ముఱువల్ శెయ్‌దు నిన్లాయే" (పెరియతిరు-8-8-5) ఎన్గిఱపడియే అవరుడైయ సన్నిధియై అడైన్దపోదు ముఱువల్ శెయ్‌దుకొణ్డు నిఱ్కైయే అదుక్కు స్వభావమా ఇరున్దపడియాలే యఱ్ఱైయే అనుసంధిక్కిఱార్‌గళ్. అన్ఱిక్కే, ఇవరుడైయ హృదయతాపమ్ పోగైక్కుపాయమాన తిరుముఖమణ్డలమాగైయాలే అఱ్ఱై అనుసన్ధిక్కిఱార్‌గళ్- ఎన్లవుమామ్. "ఐశ్వర్యం చ శుభాశ్రయత్వ మఖిలోపాస్యత్వ మానందితా సాతంత్ర్యం నిజవైశ్వరూప మఖిలాంతర్యామితా శ్రీరపి" ఎన్గిఱపడియే అకవాయిలిరుక్కిఱ సకలకల్యాణగుణఙ్గళై ప్రకాశిప్పిక్కుమిఱే. "మైయలేఱ్ఱి మయక్క ఉన్ ముగమ్ మాయమన్దిరన్దాన్‌కొలో !" (నాచ్చియార్ తిరు-2-4) ఎన్లుమ్, "చంద్రకాన్తాననం రామ మతీవ ప్రియదర్శనమ్" (రామా.అయో- 3-28) ఎన్లుమ్ శొల్లుగిఱపడియే ఆశ్రితరై మోహత్తిలే మయఙ్గప్పణ్ణుమదాగైయాలే అనుసన్ధిక్కిఱార్‌గళ్.

---

మోహింపజేస్తుందే తప్ప, బయటకు పోనిస్తుందా! ఇచట రహస్యవాక్యంగా చెప్పబడినది చరమశ్లోకం. ఇది పరమరహస్యార్థ ప్రతిపాదకం కాబట్టి "రహసి సంవిదమ్" అనడం తగునుకదా! దీని రహస్యాన్నిబట్టికదా తిరుక్కోట్టియూర్ నమ్బి భగవద్రామానుజులను పదునెనిమిదిమార్లు తమ శ్రీపాదాలను సేవింపజేసి, దీని అర్థాన్ని అనుగ్రహించారు. ఇదికూడా భగవద్విషయవ్యామోహాన్ని ఉదయించేటట్లు చేయడంవల్ల "హృచ్ఛయోదయమ్" అనడంలో అడ్డులేదే!

(ప్రహసితాననం ప్రేమవీక్షణమ్)- ఆశ్రితుల విషయంలో ప్రేమరసాన్ని ఒకే రీతిలో స్రవించే కన్నులతో కూడిఉండి, చిఱునవ్వు నవ్వుతున్న తిరుముఖమండలాన్ని - అని అర్థం. "ఎన్ ముఱ్ఱమ్ పుకున్దు ముఱువల్ శెయ్‌దు నిన్లాయే" (నాముంగిట ప్రవేశించి మందహాసం చేస్తూ నిలిచావే !) అనే రీతిలో వారి సన్నిధిని పొందినపుడు చిఱునవ్వు నవ్వుతూ ఉండడమే దీనికి (ముఖానికి) స్వభావంగా ఉన్నందున దాన్నే అనుసంధిస్తున్నారు. లేక, వీరి హృదయతాపం తీరడానికి ఉపాయం అయిన తిరుముఖమండలం కాబట్టి దాన్ని అనుసంధిస్తున్నారనికూడా అనవచ్చు. "ఐశ్వర్యం చ శుభాశ్రయత్వ మఖిలోపాస్యత్వ మానందితా, స్వాతంత్ర్యం నిజవైశ్వరూప్య మఖిలాంతర్యామితా శ్రీ రపి" (ఐశ్వర్యాన్ని, శుభాశ్రయత్వాన్ని, అందఱిచే ఉపాసింపబడే స్వభావాన్ని, ఆనందిత్వాన్ని తన విశ్వరూపత్వాన్ని, అంతర్యామిత్వాన్ని సంపదను) అనే రీతిలో బయట ఉండే సకలకల్యాణగుణాలను ప్రకాశింప జేస్తుందికదా! "మైయలేఱ్ఱి మయక్క ఉన్ముకమ్ మాయమన్దిరన్దాన్‌కొలో!" (పిచ్చెక్కించి వ్యామోహాన్ని పొందించడానికి నీ ముఖం మాయచూర్ణమా! ఏమి !) అని, "చంద్రకాంతాననం రామ మతీవప్రియదర్శనమ్" (చంద్రునికంటె ఆకర్షణీయమైన ముఖాన్ని కల మిక్కిలి ప్రియమైన రూపాన్ని కలవానిని) అనీ చెప్పే రీతిలో ఆశ్రితులను మోహింపసజేసేది కాబట్టి (తిరుముఖాన్ని) అనుసంధిస్తున్నారు. ఇందువల్ల - ఈశ్వరుని సర్వశేషిత్వ- సర్వశరణ్యత్వ- సర్వభోగ్యత్వాలను ప్రకాశింపజేసే తిరుముఖమనికూడా చెప్పవచ్చు. "సుస్మితశ్రీముఖేన,

ఇత్తాల్- ఈశ్వరనుడైయ సర్వశేషిత్వ-సర్వశరణ్యత్వ- సర్వభోగ్యత్వఙ్గళై ప్రకాశిప్పిక్కిఱ తిరుముఖ మెన్టవుమామ్. "సుస్మితశ్రీముఖేన వ్రజపురవనితానాం వర్ధయన్ కామదేవమ్" (భాగవతమ్) ఎన్ఱు అతివుడైయరాన ఋషిగళాలే కొణ్డాడప్పట్ట తిరుముఖమణ్డలమిఱే.

(తే బృహదురః) సర్వశేషియాన దేవరీరుడైయ విశాలమాన తిరుమార్పైయుమ్. "వక్షో మంత్రమయం ప్రధానసుమనఃసంయుక్తహారాన్వితమ్" (వైజయంతీస్తవం) ఎన్ఱుమ్, "ఉదగ్రవిశాలవక్షః" (శ్రీరంగరాజస్తవం-పూర్వశతకమ్) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే దేవరీరుక్కు పరత్వత్తై స్థాపిక్కిఱ శ్రీవత్సకౌస్తుభవనమాలికాది గళుక్కు ఇడమ్ కొడుత్తుక్కొణ్డు అత్యున్నతమాయ్, విశాలమాయ్, సర్వసేవ్యమాయ్ విళఙ్గుకిన్ఱ తిరుమార్పై. "అంభోజాసన భారతీజలధిజాదేవేంద్రమాయాశివగ్లౌ కామార్క ధరాఖశక్తిపవనక్ష్మాభూతిభి స్సేవితమ్, వక్షః ప్రాప్య సభూరమం మురరిపో శ్రీవైజయంతీలతే ! సాక్షాన్మానసగోచరాఽన్యవిషయాసక్తిం హరస్యద్య నః" (వైజయంతీస్తవమ్) ఎన్ఱు అస్మత్పరమా చార్యర్ అరుళిచ్చెయ్దార్.

(శ్రియో ధామ) పిరాట్టిక్కిరుప్పిడమాయిరున్దవ<u>ఱ్ఱై</u>. "పూమన్ను మాదు పొరున్దియ మార్బన్" (ఇరామానుశ-1) ఎన్గిఱపడియే పుష్పహాససుకుమారమాయ్, సకలసౌభాగ్యనిలయమాన పిరాట్టిక్కిరుప్పిడమాయ్ నిన్ఱవ<u>ఱ్ఱై</u>. ఇదు లక్ష్మీలలితగృహమిఱే. "మలయజశశిలిప్తం మాలతీదామతల్పం సుమణిసరవితానం కౌస్తుభస్వస్తిదీపమ్, దనుజవృషవిషాణోల్లేఖ చిత్రం చ లక్ష్మీలలితగృహ ముపాసే రంగసర్వంసహోరః" (శ్రీరంగరాజస్తవ-పూర్వశతకమ్) ఎన్ఱు పెరియభట్టరనుసంధిత్తార్.

---

వ్రజపురవనితానాం వర్ధయన్ కామదేవమ్" (చిఱునవ్వుతో ప్రకాశించే ముఖంతో రేపల్లెలోని స్త్రీల కామాన్ని వృద్ధిచేస్తూ) అని జ్ఞానులైన ఋషులచేత కీర్తింపబడ్డ తిరుముఖమండలంకదా!

(తే బృహదురః)- సర్వశేషి అయిన నీ విశాలమైన వక్షఃస్థలాన్ని అని భావం. "వక్షో మంత్రమయం ప్రధానసుమనఃసంయుక్తహారాన్వితమ్" (భగవానుని వక్షస్సు ప్రధానం అంటే ప్రకృతి అనే పూలతో చేయబడ్డ హారంతో కూడినది) అని, "ఉదగ్రవిశాలవక్షః" (విశాలమైన వక్షస్సును కలవాడు) అని చెప్పే రీతిలో నీకు పరత్వాన్ని స్థాపించే శ్రీవత్సకౌస్తుభవనమాలాదులకు చోటు ఇస్తూ, అత్యున్నతమై, విశాలమై, అందటికీ సేవ్యమై ప్రకాశిస్తున్న వక్షఃస్థలాన్ని అని అర్థం. "అంభోజాసనభారతీజలధిజాదేవేంద్రమాయాశివగ్లౌ కామార్క ధరాఖశక్తిపవనక్ష్మాభూతిభి స్సేవితమ్, వక్షః ప్రాప్య సభూరమం మురరిపోః శ్రీవైజయంతీలతే! సాక్ష్మాన్మానసగోచరాఽన్యవిషయాసక్తిం హరస్యద్య నః" అని అస్మత్పరమాచార్యులుకూడా (శ్రీవైజయంతీ స్తవంలో) అనుగ్రహించారు.

(శ్రియో ధామ)- లక్ష్మీదేవికి వాసస్థలంగా ఉన్నదానిని. "పూమన్ను మాతు పొరున్దియ మార్బన్" అనేరీతిలో పుష్పహాస సుకుమారరమై, సకలసౌభాగ్యాలకు నిలయం అయిన లక్ష్మీదేవికి నివాసస్థానమై ఉన్నదానిని. ఇది లక్ష్మీలలితగృహంకదా! "మలయజశశిలిప్తం మాలతీదామతల్పం సుమణిసరవితానం కౌస్తుభస్వస్తిదీపమ్, దనుజవృషవృషాణోల్లేఖచిత్రం చ లక్ష్మీలలితగృహ ముపాసే రంగసర్వంసహోరః" (చందనం, పచ్చకర్పూరాలతో అలదబడినది, సన్నజాజి పూలదండ అనే శయ్యను కల్గినది, చక్కని మణులతో పేర్చిన హారాలనే చాందినిని కల్గినది, కౌస్తుభమనే మంగళదీపాన్ని కల్గినది, వృషభాసురుని కొమ్ముగీట్లు అనే చిత్తరువులను కల్గినది, లక్ష్మీదేవికి సుందరమైన అంతఃపురం అయిన శ్రీరంగనాథుని వక్షఃస్థలాన్ని సేవిస్తున్నాను.) అని పరాశరభట్టర్ అనుసంధించారుకదా!

**(బృహదురః శ్రియో ధామ)** "వక్షఃపీఠీం మధువిజయినో భూషయంతీం స్వకాన్త్యా" (శ్రీస్తుతి-1) ఎన్గిఱపడియే వక్షఃప్రదేశత్తుక్కనర్ఘాలంకారమితే. ఇవళ్. శ్రీవత్సకౌస్తుభవనమాలికావిరాజితమాన వక్షఃస్థలత్తినుడైయ సౌందర్యత్తై విళాక్కొలైక్కొణ్డ సౌందర్యముడైయవళితే ఇవళ్. ఇవనుక్కు పరత్వస్థాపకమానవఱ్ఱిలే ఇదు ప్రధానమితే.

**(బృహదురః శ్రియో ధామ)** తన్నుడైయ వైశాల్యత్తాలు మఴగాలుమ్ పిరాట్టియుడైయ మనస్సై హరిత్తు, అవళై నివసిక్కపణ్ణిన తిరుమార్పై- ఎన్నవుమామ్. "అకలకిల్లే నిఱైయుమ్మెలర్మేల్ మఙ్గై యుఱైమార్పా !" (తిరువాయ్-6-10-10) ఎన్నానిన్నదితే. "ఎన్ తిరుమగళ్ శేర్ మార్పనే !" (తిరువాయ్-7-2-9) ఎన్నుమ్, "ఉదగ్రవిశాలవక్షో లక్ష్మీధరః" (శ్రీవైకుంఠస్తవమ్-5) ఎన్నుమభియుక్తరు మనుసన్దిత్తార్. **(బృహదుర శ్రియో ధామ)** "శ్రితాస్యన్యై స్సర్వై శ్శ్రయసి రమణం సంశ్రితగిరః, శ్రుణోషి ప్రేయాసం శ్రితజనవచః శ్రావయసి చ , శృణాస్యేతద్దోషాన్ జనని ! నిఖిలాం సర్వజగతీం గుణై శ్శ్రీణాసి త్వం తదిహ భవతీం శ్రీ రితి విదుః" ఎన్ఱు శొల్లుగిఱపడియే పురుషకారోపయోగిగళాన సకలకల్యాణగుణఙ్గళోడే కూడి, ఆశ్రితర్క్కు సకలసౌఖ్యాపాదకమానవళాయ్, ఎఙ్గళుక్కు మాతావానవళుక్కు నివాసమాయ్ విళఙ్గుగిన్ఱ తిరుమార్పై- ఎన్నవుమామ్.

**(వీక్ష్య)** కేట్టుపోగై యన్ఱిక్కే ఇమ్మూన్ఱినుడైయ వైభవత్తైయుమ్ ప్రత్యక్షమాగ కణ్డ ఎఙ్గళుక్కు. తిరుముఖమణ్డలత్తైయుమ్, తిరుమార్పైయుమ్ కణ్ణాలే కాణ్గై శేరుమ్. నర్మాలాపఙ్గళై క్కేట్కైయన్ఱి కాణ్గై శేరుమో ? ఎన్ఱ,

---

**(బృహదురః శ్రియో ధామ)-** "వక్షఃపీఠీం మధువిజయినో భూషయంతీం స్వకాంత్యా" (మధుసూదనుని వక్షఃస్థలాన్ని తన కాంతితో అలంకరిస్తున్నదై) అనే రీతిలో వక్షఃప్రదేశానికి అమూల్యాలంకారం కదా!-ఈమె. శ్రీవత్సకౌస్తుభ వనమాలికావిరాజితం అయిన వక్షఃస్థలంయొక్క సౌందర్యాన్ని కబళీకరించిన సౌందర్యాన్ని కల్గినదికదా ఈమె. ఇతనికి (స్వామికి) పరత్వాపరత్వ నిరూపకాలైనవాటిలో ఇది ప్రధానంకదా!

**(బహదురః శ్రియో ధామ)-** తన వైశాల్యంతోను, అందంతోను లక్ష్మియొక్క మనస్సును హరించి, ఆమెను నివసించేటట్లు చేసిన వక్షస్థలాన్ని- అనికూడాచెప్పవచ్చు. "అకలకిల్లే నిఱైయు మెన్ఱు అలర్మేల్ మఙ్గై యుఱైమార్పా!" (క్షణం అయినా విడచి ఉండలేనని అంటూ నిత్యనివాసం చేసే అలర్మేల్మంగైను వక్షఃస్థలంలో కలవాడా!) అని చెప్పబడుతున్నదికదా! "తిరుమకళ్ శేర్ మార్పనే !" (లక్ష్మీదేవి చేరిన వక్షఃస్థలాన్ని కలవాడా!) అని, "ఉదగ్రవిశాలవక్షో లక్ష్మీధరః" (దృఢమైన, విశాలమైన వక్షస్సును కలవాడు) అని అభియుక్తులుకూడా అనుసంధించారు.

**(బృహదురశ్శ్రియో ధామ) -** "శ్రితాస్యన్యైః సర్వైః శ్రయసి రమణం సంశ్రితగిరః శ్రుణోషి ప్రేయాంసం శ్రితజనవచః శ్రావయసి చ, శృణాస్యేతద్దోషాన్ జనని నిఖిలాం సర్వజగతీం గుణైః శ్రీణాసి త్వం తదిహ భవతీం శ్రీ రితి విదుః" (నీకంటే వేఱయిన అందరిచే ఆశ్రయింపబడుతున్నావు, నీ ప్రియుడైన భగవానుని ఆశ్రయిస్తున్నావు. ఆశ్రితుల మాటలను వింటున్నావు, నీ ప్రియునకు ఆ మాటలను వినిపిస్తున్నావు. ఓతల్లీ! వీరి దోషాలను నశింపజేస్తున్నావు. నీ కల్యాణగుణాలతో లోకం అంతా వ్యాపిస్తున్నావు. అందువల్ల నిన్ను శ్రీ అని విజ్ఞులు తెలిసికొంటున్నారు.) అని చెప్పే రీతిలో పురుషకారానికి ఉపయోగపడే సకలకల్యాణగుణాలతో కూడినదై, ఆశ్రితులకు సకలసౌఖ్యాలను కల్గించేదై, మాకు తల్లి అయిన ఆమెకు నివాసమై వెలిగే వక్షస్థలం-అనికూడా చెప్పవచ్చు.

**(వీక్ష్య)-** విని పోవడమే కాకుండా, ఈ మూడింటియొక్క వైభవాన్ని ప్రత్యక్షంగా చూచిన మాకు అనిభావం. తిరుముఖమండలాన్ని, వక్షఃస్థలాన్ని కంటితో దర్శించడం తగును. నర్మాలాపాలను వినడం తప్ప చూడడం అన్నది తగునా? అని అంటే, అత్యంతవ్యామోహంతో చెప్పే పాశురం కాబట్టి తగును. "పత్రం పుష్పం ఫలా తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి, త దహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః" (లక్ష్మీ ! పత్రాన్ని

అత్యంతవ్యామోహత్తాలే శొల్లుగిఱ పాశురమాగైయాలే శేరుమ్. "పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి, తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః" (భగ-9-26) ఎన్గిఱపడియే "భక్తర్‌విషయత్తిల్ వ్యామోహత్తాలే నీరైయుమ్ భక్తన్ సమర్పిక్క భుజిక్కిఱేన్" ఎన్డానిఱే యవన్. అప్పడియే ఇవరుమ్ స్వామియినిడత్తిలుణ్డాన అత్యంతవ్యామోహత్తాలే శొల్లుగిఱార్‌గళ్.

(ముహు రతిస్పృహా) క్షణన్దోఱుమ్ దేవరీరిడత్తి లతిమాత్రమాన స్పృహై జనియానిన్గదుకాణ్.

(ముహుః ముహ్యతే మనః) అత్తాలే నెఞ్జు క్షణన్దోఱుమ్ మోహియానిన్గదు. ఇవఱ్ఱై ఉళ్లపడి కణ్డ ఎఙ్గళుడైయ నెఞ్జు ఉఙ్గళుక్కు వశమాయ్ ఉన్నిడత్తిల్ ఎప్పోదుమ్ మోహియానిన్గదు- ఎన్గిఱార్‌గళ్. ఆగ, ఇప్పడియాన ఎఙ్గళుడైయ నెఞ్జు కుళిర్‌న్దు ఆనందిక్కుమ్బడి మున్నే తోఱ్ఱి, వాత్సల్యప్రకాశమాన దివ్యతిరుముఖమణ్డలత్తైయుమ్, శ్రీవత్సకౌస్తుభ వనమాలికావిరాజితమాయ్, సర్వశోభాస్పదరాన పిరాట్టిమార్‌కళుక్కు ఇరుప్పిడమాన తిరుమార్పైయుమ్ సేవిప్పిత్తు, ఘర్మాభితప్తనానవన్‌మేల్ ఒరు పాట్టమ్ మఴైప్పోలే ఒరు శ్రీసూక్తియై తన్దు, దేవరీరుడైయ విశ్లేషవ్యసన మాఱుమ్బడి పణ్ణి అరుళవేణు మెన్గిఱార్‌గళ్ - ఎన్దవుమామ్.

పదినేఴామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

## పతినెట్టామ్ శ్లోకమ్

అవ :- "దేవరీరుడైయ నర్మాలాపఙ్గళోడుమ్, ప్రియవీక్షణఙ్గళోడుమ్, ముఱువలోడుమ్ విళఙ్గుగిన్ద తిరుముఖ మణ్డలముమ్, సర్వసౌభాగ్యకన్దమాయ్, పిరాట్టిక్కు ఇరుప్పిడమాన తిరుమార్బుమ్, ఎఙ్గళుడైయ నెఞ్జై నఞ్జూట్టువారైప్పోలే మోహత్తిలే మూట్టిన"- ఎన్డార్ కీఴ్. ఆగ, వ్రజజనఙ్గళుడైయ దుఃఖత్తై ప్పోక్కి, ఆనందత్తిలే

---

అయినా, పుష్పాన్ని అయినా, నీటిని అయినా భక్తితో ఎవడు నాకు సమర్పిస్తాడో, భక్తిపూర్వకంగా ఇచ్చిన దానిని నేను భుజిస్తాను) అనే రీతిలో భక్తుల విషయంలోని వ్యామోహంతో నీటినికూడా భక్తుడు సమర్పిస్తే భుజిస్తాను; అని అన్నాడుకదా అతడు. ఆ రీతిలోనే వీరుకూడా స్వామిపట్ల ఉన్న అత్యంతవ్యామోహంచేత చెబుతున్నారు.

(ముహు రతిస్పృహా)- ప్రతిక్షణం నీ విషయంలోని అత్యంతమైన ఆశ పుడుతున్నదిసుమా!

(ముహుః ముహ్యతే మనః)- అందువల్ల మనస్సు ప్రతిక్షణం మోహిస్తున్నది. వీటిని యథాతథంగా చూచి మా మనస్సు మీకు వశమై, నీ విషయంలో ఎల్లప్పుడూ మోహిస్తున్నది- అని అంటున్నారు. కాబట్టి ఈ రీతిగా, మా మనస్సు చల్లబడి, ఆనందించేటట్లు ఎదుట ఆవిర్భవించి, వాత్సల్యప్రకాశకం అయిన దివ్యతిరుముఖమండలాన్ని, శ్రీవత్సకౌస్తుభవనమాలికలచేత ప్రకాశించేదై, సర్వశోభాస్పదలైన దివ్యదేవేరులకు నివాసభూమి అయిన వక్షః స్థలాన్ని సేవింపజేసి, ఎండ వేడిమిచేత తపింపబడ్డవానిపైన ఒక దిక్కు వాన కురిసినట్లు ఒక శ్రీసూక్తిని అనుగ్రహించి, నీ విశ్లేషవ్యసనం తీరేటట్లు చేసి అనుగ్రహించాలి- అని అంటున్నారనికూడా చెప్పవచ్చు.

పదిహేడవ శ్లోకం ముగిసింది

## పదునెనిమిదవ శ్లోకం

అవ:- నీ నర్మాలాపాలతోను, ప్రియవీక్షణాలతోను, చిఱునవ్వుతోను ప్రకాశించే తిరుముఖమండలం, సర్వసౌభాగ్యమూలమై, లక్ష్మికినివాసస్థానం అయిన వక్షఃస్థలం మా మనస్సును విషం త్రాగించేవారివలె, మోహంలో మగ్నం చేశాయి. అని అన్నారు పూర్వం. ఈవిధంగా రేపల్లెలోని జనాల దుఃఖాన్ని పోగొట్టి, ఆనందంలో

మయక్కప్పణ్ణుగ్గైయే స్వభావమాన దేవరీర్, ఇప్పడి మోహిత్తు నిన్ఱ ఎఙ్గళుడైయ హృదయతాప మాఱుమ్బడి పణ్ణి యరుళవేణుమెన్గిఱార్ -ఇన్ద శ్లోకత్తాలే.

వ్రజవనౌకసాం వ్యక్తి రంగ తే వృజినహన్త్ర్యలం విశ్వమంగళమ్ ।
త్యజమనాక్చ న స్త్వత్స్పృహాత్మనాం స్వజనహృద్రుజాం యన్నిషూదనమ్ ॥

(వ్రజవనౌకసాం వ్యక్తి రంగ తే వృజినహన్త్ర్యలమ్) దేవరీరుడైయ దివ్యమఙ్గళవిగ్రహస్వరూపమ్, గోపజనఙ్గళెల్లారు డైయ దుఃఖత్తైయుమ్ పోక్కవల్లైయాయ్ విళఙ్గానిన్ఱదే ! అన్ఱిక్కే, దేవరీరుడైయ దివ్యమఙ్గళవిగ్రహస్వరూపమ్, ఛండాలవసిష్ఠభాగమిన్ఱిక్కే, ఆశ్రయిత్త చేతనసముదాయత్తుక్కెల్లామ్ దుఃఖత్తై పోక్కవల్లై - ఎన్ఱవుమామ్. "శరణ మాగుమ్ తనతాళడైన్దార్క్కెల్లామ్" (తిరువాయ్-9-10-5) ఎన్ఱు శొల్లానిన్ఱదిఱే.

(విశ్వమంగళమ్) సర్వమఙ్గళరూపమాయిరుక్కిఱదు. "యన్మఙ్గళాయ మహతే జగతా ముశన్తి" (వైకుంఠ-40) ఎన్గిఱపడియే సర్వజగత్తుక్కుమ్ మఙ్గళప్రదమాయిరుక్కుమ్ స్వరూప మెన్ఱవుమామ్.

(వృజినహన్త్ర్యల్యం విశ్వమంగళమ్) దుఃఖత్తై పోక్కైయన్ఱిక్కే, సర్వమఙ్గళఙ్గళైయుమ్ మేన్మేలన ఉణ్డాక్కవల్ల వ్యక్తియిఱే ఇదు. "తదైవ ముష్ణాత్యశుభాన్యశేషతః శుభాని పుష్ణాతి న జాతు హీయతే" (స్తోత్రరత్నమ్-28) ఎన్ఱు అభియుక్తరనుసంధిత్తార్.

(వ్రజవనౌకసాం వ్యక్తి రంగ తే వృజినహన్త్ర్యలం విశ్వమఙ్గళమ్) వ్రజజనఙ్గళుడైయ దుఃఖత్తై పోక్కి ఆనందిప్పిక్కైయే స్వరూపమాన వ్యక్తియా యిరున్దు వైత్తుమ్ ఇప్పడి దుఃఖిప్పిక్కై తగుమో ? ఎన్గిఱార్గళ్. "అహం

---

మోహింపజేయడమే స్వభావం అయిన నీవు ఈ విధంగా మోహించిన మా హృదయతాపం తీరేటట్లు చేసి అనుగ్రహించాలి- అంటున్నారు ఈ శ్లోకంలో

వ్రజవనౌకసాం వ్యక్తి రంగ తే వృజినహంత్ర్యలం విశ్వమంగళమ్ ।
త్యజ మనాక్చ నస్త్వత్స్పృహాత్మనామ్ స్వజనహృద్రుజాం యన్నిషూదనమ్ ॥

(వ్రజవనౌకసాం వ్యక్తిరంగ తే వృజినహంత్ర్యలమ్)- నీ దివ్యమంగళవిగ్రహస్వరూపం రేపల్లెలోని జనాలు అందఱియొక్క దుఃఖాన్ని పోగొట్టగలిగేదై వెలుగుతున్నదే! అని అర్థం. లేక, నీ దివ్యమంగళవిగ్రహస్వరూపం ఛండాల-వశిష్ఠతారతమ్యం లేకుండా ఆశ్రయించిన చేతనసముదాయానికి అంతటికీ దుఃఖాన్ని పోగొట్టగల్గినది- అనికూడా చెప్పవచ్చు. "శరణ మాకుమ్ తనతాళడైన్దార్క్కెల్లామ్" (తన శ్రీచరణాలను చేరినవారికి అందఱికి శరణం కాగలదు) అని చెప్పబడుతున్నది కదా!

(విశ్వమంగళమ్)- సర్వమంగళరూపంగా ఉన్నది. "యన్మంగళాయ మహతే జగతా ముశంతి" అనే రీతిలో సకలజగత్తుకు మంగళాన్ని కల్గించేదిగా ఉండే స్వరూపం - అనికూడా చెప్పవచ్చు.

(వృజినహంత్ర్యలం విశ్వమంగళమ్)- దుఃఖాన్ని పోగొట్టడమే కాకుండా, అన్ని మంగళాలను మరింతగా కల్గించగల వ్యక్తికదా ఇది. "తదైవ ముష్ణాత్యశుభాన్యశేషతః శుభాని పుష్ణాతి న జాతు హీయతే" (అపుడే అన్ని అశుభాలను తొలగిస్తుంది, శుభాలను వృద్ధి చేస్తుంది. ఎప్పటికీ నశించదు) అని అభియుక్తులు అనుసంధించారు.

(వ్రజవనౌకసాం వ్యక్తి రంగ తే వృజిన హంత్ర్యం విశ్వమంగళమ్)- రేపల్లెలోని జనాల దుఃఖాన్ని పోగొట్టి, ఆనందింపజేయడమే స్వరూపం అయిన వ్యక్తియై ఉండికూడా ఈ విధంగా దుఃఖింపజేయడం తగునా?

త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" (భాగ-18-66) ఎన్గిఱపడియే ఆశ్రయిత్త చేతనరుడైయ సర్వవిధమాన పాతకజ్ఞళైయుమ్ వేరోడే పోమ్బుడిపణ్ణి రక్షిక్కిఱేన్- ఎన్ఱు అవన్దానే శొన్నానిఱే

(త్యజమనాక్చ న స్త్వత్స్పృహాత్మనామ్ స్వజనహృద్రుజాం యన్నిషూదనమ్) ఇప్పడియాన దేవరీర్, దేవరీర్ విషయత్తిల్ మిగవుమ్ పరివుడైయ నెఞ్జగళుడైయోమాన ఎజ్ఞళుక్కు స్వజనహృద్రోగవినాశకరమాన ఔషధత్తై అత్యల్పమాగవుమ్ ప్రసాదిత్తరుళవేణుమ్. ఇవర్కళుక్కు హృదయరోగమావదు- అవనుడైయ విశ్లేషవ్యసనమ్. "పిరానార్ పునై పూన్దుழாయ్‌మలర్క్కే మెలియు మడనెఞ్జినార్ తన్దు పోయిన వేతనైయే" (తిరువిరు-78) ఎన్ఱానిఱ్ఱదిఱే. ఇతుక్కు నివర్తకమాన ఔషధమ్, అవనుడైయ దివ్యతిరుమేనియిల్ శాற்றின నవ్యవనమాలికాగంధమ్. అత్తై క్కొడుత్తరుళవేణు మెన్గిఱార్గళెన్ఱవుమామ్. "వారాయిన ములైయాళివళ్ వానోర్‌తలైమకనామ్, శీరాయిన తెయ్‌వ నన్నోయితు, తెయ్‌వ త్తణ్ణన్దుழாయ్ త్తారాయినుమ్ తழைయాయినుమ్ తణ్ కొమ్బతాయినుమ్ కీழ் వేరాయినుమ్, నిన్ఱ మణ్ణాయినుమ్ కొణ్డు వీశుమినే (తిరువిరు-53) ఎన్ఱనుసంధిత్తారిఱే ఆழ்వార్. అన్ఱిక్కే,

(స్వజనహృద్రుజాం యన్నిషూదనమ్) స్వజనజ్ఞళుక్కు హృదయవ్యాధియై నివర్త్తిప్పిక్కక్కడవ ఔషధత్తై. ప్రపన్నజనజ్ఞళుక్కు హృదయరోగమావదు- "పొయ్ న్నిన్ఱ ఞానముమ్ పొల్లా వొழுక్కు మழுక్కుడమ్బుమ్. ఇన్నిన్న నీర్మై యిని యా ముఱామై" (తిరువిరు-1) ఎన్గిఱపడియే, ఇవ్వుడమ్బోడే ఇవ్విభూతియిలిరుక్కై.

---

అంటున్నారు. "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" (నేను నిన్ను అన్ని పాపాలనుండి విడిపిస్తాను. శోకించకు.) అనేటట్లు ఆశ్రయించిన చేతనుల సర్వవిధమైన పాతకాలను సమూలంగా పోయేటట్లుచేసి రక్షిస్తాను- అని అతడే చెప్పాడుకదా!

(త్యజ మనాక్చ న స్త్వత్ స్పృహాత్మనామ్ స్వజనహృద్రుజాం యన్నిషూదనమ్)- ఈవిధమైన నీవు, నీ విషయంలో చాలా ప్రేమను కల మనస్సులను కల్గినవారం అయిన మాకు స్వజనహృద్రోగాన్ని నాశం చేసే ఔషధాన్ని అత్యల్పంగా అయినా ప్రసాదించాలి. వీరికి హృదయరోగం అన్నది అతని విశ్లేషదుఃఖమేకదా! "పిరానార్ పునై పూన్దుழாయ్ మలర్క్కే మెలియు మడనెఞ్జినార్ తన్దుపోయిన వేదనైయే" (ఉపకారకుడైన స్వామి ధరించిన అందమైన తులసీ పుష్పం కోసం బాధపడే మొండి పట్టుదల గల ఈ మనస్సు అనే పెద్దమనిషి మిగిల్చి పోయినది వేదననే) అని అనబడుతున్నదికదా! దీనికి నివర్తకమైన ఔషధం అతని దివ్యతిరుమేనిలో అలంకరించుకొన్న నవ్యవనమాలికాగంధం. దాన్ని అనుగ్రహించాలి - అని అంటున్నారనికూడా భావం. "వారాయిన ములైయాళివళ్ వానోర్ తలైమకనామ్ శీరాయిన తెయ్‌వ నన్నోయిదు, తెయ్‌వత్తణ్ణన్తుழாయ్ త్తారాయినుమ్ తழைయాయినుమ్ తణ్‌కొమ్బుదాయినుమ్ కీழ் వేరాయినుమ్ కొణ్డు వీశుమినే" (ఈ పరాంకుశ నాయిక కంచుకాన్ని తొడిగిన స్తనాలను కల్గినది. నిత్యసూరులకు నాథుడైనవాని కల్యాణగుణాలను విని కల్గిన గొప్ప మన్మథబాధ ఈమెది. సర్వేశ్వరునకు సమర్పించిన శీతలమైన, అందమైన తులసిపూలను అయినా, దాని దళాలను అయినా, ఆ చెట్టుచల్లని కొమ్మలను అయినా, కింద ఉండే వేరును అయినా, ఆతులసి మొలిచిన మన్నును అయినా తీసికొనివచ్చి ఈమెపై చల్లండి.) అని అనుసంధించారుకదా నమ్మాழ்వార్లు. లేక,

(స్వజనహృద్రుజాం య న్నిషూదనమ్)- స్వజనాలకు హృదయవ్యాధిని నివర్తింపగల ఔషధాన్ని (అని భావం) ప్రపన్నజనాలకు హృదయరోగం అంటే- "పొయ్‌న్నిన్ఱ ఞానముమ్ పొల్లా వొழுక్కుమ్ అழுక్కుడమ్బుమ్ ఇన్నిన్ఱ

**(త్యజమానా క్చ న స్పృత్స్పృహాత్మనామ్)** అదుక్కు నివర్తకమ్ అవన్ సన్నిధియిల్ పణ్ణుమ్ సర్వదేశ-సర్వకాల-సర్వావస్థోచిత ప్రీతికారితకైంకర్యమ్. అత్తై తన్దరుళవేణు మెన్గిఱార్గళెన్ఱవుమామ్. **"కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే, కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే" (రామా-అయో-31-24)** ఎన్గిఱపడియే ఇవ్విభూతియిలే ఇరున్ద కాలత్తిల్ అవనుడైయ కైఙ్కర్యత్తాలే ప్రపన్ననుక్కు దేహయాత్రైయిఱే. అతిల్లాదపోదు **"ఉయిరినాల్ కుఱైవిలమే" (తిరువాయ్-4-8-10)** ఎన్నుమ్, **"ఉడమ్బినాల్ కుఱైవిలమే" (తిరువాయ్-4-8-9)** ఎన్నుమ్, **"న హి మే జీవితేనార్థః" (రామా-సుందర-26-5)** ఎన్నుమ్, **"తవ శేషత్వవిభవా త్బహిర్భూతం నాథ! క్షణ మపి సహే యాతు శతథా వినాశనం తత్సత్యం మధుమథన! విజ్ఞాపన మిదమ్" (స్తోత్రరత్నమ్-57)** ఎన్నుమ్ శొల్లుగిఱపడియే అదువే నోయాయ్, ప్రపన్నజనఙ్గళుక్కు మిగవుమ్ బాధకమాయిఱే ఇరుప్పదు. ఇతుక్కు నివర్తకమ్- **"మదువార్ తుழாయ్ముడి మాయప్పిరాన్ కழల్ వాழ్త్తినాల్, అదువే యివళుఱ్ఱ నోయ్ క్కరుమరున్దాగుమే" (తిరువాయ్-4-6-3)** ఎన్గిఱపడియే ప్రాప్తశేషియానవనుడైయ తిరువడిసేవైయుమ్, అతినిడత్తిల్ పణ్ణుమ్ సర్వవిధప్రీతికారిత కైంకర్యఙ్గళ్. అత్తై త్తన్దరుళవేణు మెన్గిఱార్గళెన్ఱవుమామ్.

పదినెట్టామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

---

నీర్మై ఇనియా ముఱామై" (అయథార్థజ్ఞానం, దానివల్ల కలిగే తగని ప్రవర్తన, అందువల్ల ఏర్పడే ప్రాకృతిక శరీరం) అన్నట్లు ఈ శరీరంతోనే ఈ విభూతిలో ఉండడం.

**(త్యజ మనాక్చ న స్తత్ స్పృహాత్మనామ్)**- దానికి నివర్తకం అని భావం. అతని సన్నిధిలో చేసే సర్వదేశ-సర్వకాల- సర్వావస్థోచిత మైన ప్రీతికారితకైంకర్యం. దాన్ని అనుగ్రహించాలని అంటున్నారనికూడా భావం. **"కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే, కృతార్థోఽహంభవిష్యామి తవ చార్థః ప్రకల్పతే"** (శ్రీరామా! నన్ను అనుచరునిగా చేసికో. ఇందులో అధర్మం ఏమీ లేదు. దీనివల్ల నేను కృతార్థుడను కాగలను. నీ ప్రయోజనం కూడా సమకూరుతుంది) అనే రీతిలో ఈ విభూతిలో ఉన్నకాలంలో అతని కైంకర్యంతోకదా ప్రపన్నునకు దేహయాత్ర జరుగుతుంది. అది లేనపుడు **"ఉయిరినాల్ కుఱైవిలమే"** (భగవానునకు ఉపయోగపడని ప్రాణంతో పనిలేదు) అని, **"ఉడమ్బినాల్ కుఱైవిలమే"** (శరీరంతో పనిలేదు) అని, **"న హి మే జీవితేనార్థః"** (నాకు నా జీవితంతో ప్రయోజనం లేదు.) అని, **"తవ శేషత్వవిభవా ర్బహిర్భూతం నాథ! క్షణ మపి సహేయాతు శతథా వినాశం తత్సత్యం మధుమథన! విజ్ఞాపన మిదమ్"** (ఓ నాథా! నీ శేషత్వానికి దూరమైన ఒక్క క్షణాన్ని అయినా నేను సహించను. నూఱు రీతులలో నాకు వినాశం కల్గనీ! ఓ మధుసూదనా! అది సత్యం. నా విన్నపం ఇది) అని చెప్పే రీతిలో అదే వ్యాధియై, ప్రపన్నజనాలకు మిక్కిలి బాధకంగాకదా ఉన్నది. దీనికి నివర్తకం - **"మదువార్ తుழாయ్ముడి మాయప్పిరాన్కழల్ వాழ్త్తినాల్ అదువే ఇవళుఱ్ఱ నోయ్క్కు అరుమరున్దాకుమే"** (తేనె స్రవించే తులసిని కిరీటంలో అలంకరించుకొన్నవాడు, ఆశ్చర్య చేష్టితుడైన స్వామి శ్రీచరణాలకు మంగళాశాసనం చేస్తే అదే ఈమెకు అరుదైన మందు కాగలదు) అనే రీతిలో ప్రాప్తశేషి అయిన వాని శ్రీపాదసేవ, అతని విషయంలో చేసే సర్వవిధమైన ప్రీతికారిత కైంకర్యాలునూ. వానిని ఇచ్చి అనుగ్రహించాలని అంటున్నారనికూడా అనవచ్చు.

పద్దెనిమిద శ్లోకం ముగిసింది

## పత్తొన్బదామ్ శ్లోకమ్

అవ :- ఇన్దళవుమ్ ప్రార్థిత్తవిడత్తిలుమ్ అవనుడైయ కృపై ఫలియామైయాలే, "నిరాసకస్యాపి న తావ దుత్సహే మహేశ! హాతుం తవ పాదపంకజమ్, రుషా నిరస్తోఽపి శిశుః స్తనంధయో న జాతు మాతు శ్చరణౌ జిహాసతి" (స్తోత్రరత్నమ్-26) ఎన్గిఱపడియే స్తనంధయప్రజై మాతావానవళ్ తళ్ళినాలుమ్, అవళుడైయ తిరువడిగళ్ విడాదే పఱ్ఱిక్కొణ్డిరున్దు కూప్పిడుమాప్పోలే, ఇవరుమ్ తఙ్గళుక్కు సిద్ధోపాయభూతమాగైయాలుమ్, సకలేతరవిలక్షణమాయ్, సౌందర్యసౌకుమార్యాదిగళాలే పరమభోగ్యమాయిరున్దపడియాలుమ్, స్వరూపోచితమాన కైంకర్యప్రతిసంబన్ధియాగైయాలుమ్ తిరువడిగళై స్మరిత్తు, అన్ద సౌన్దర్యత్తిలే మయఙ్గి యా మెల్లామ్ కూశి "ప్పిడిక్కుమ్ మెల్లడియై" (తిరువాయ్-9-2-10) కానగసంచారత్తాలే నలియుమ్బడి పణ్ణి, ఎఙ్గళుక్కు మనోవ్యథైయై యుణ్డాక్కుగిఱాయే! ఎఙ్గళుక్కు జీవనమానవఱ్ఱై ఎఙ్గళ్ మున్నే సాక్షాత్కరిప్పిత్తరుళవేణు మెన్గిఱార్. అన్ఱిక్కే, అన్ద తిరువడి ఒరు తీఙ్గిన్ఱిక్కే విళఙ్గవేణు మెన్ఱు మఙ్గళాశాసనమ్ పణ్ణుగిఱార్- ఎన్ఱు శొల్లవుమామ్.

యత్తే సుజాత ! చరణాంబురుహం స్తనేషు భీతా శ్శనైః ప్రియ ! దధీమహి కర్కశేషు ।
తేనాటవీ మటసి తద్వ్యథతే న కిం స్విత్ కూర్పాదిభి ర్భ్రమతి ధీర్భవదాయుషాం నః ॥

(సుజాత) "స ఉ శ్రేయాన్ భవతి జాయమానః" (యజు. అష్టక-3-6-3-9) ఎన్గిఱపడియే ఇన్ద "ఇరుళ్ తరు మాఞాల" (తిరువాయ్-10-6-1)త్తిలే పిఱన్దువైత్తుమ్, బద్ధరైప్పోలన్ఱిక్కే, అజహత్ స్వభావనాయ్ క్కొణ్డు పిఱన్దపడియాలే, అత్యంతవిలక్షణమాగ పిఱన్దవనే ! కర్మపరతంత్రరాయ్క్కొణ్డు అత్తై అనుభవిక్క పిఱన్దు సంసారత్తిలే ఉరుమాయ్న్దు

---

## పందొమ్మిదవ శ్లోకం

అవ:- ఇంతవరకు ప్రార్థించినా, అతని కృప ఫలించక పోవడంచేత, "నిరాకస్యాపి న తావ దుత్సహే మహేశ! హాతుం తవ పాదపంకజమ్, రుషా నిరస్తోఽపి శిశుః స్తనంధయో న జాతు మాతు శ్చరణౌ జిహాసతి" (ఓమహేశా! నీవు నన్ను కాదన్నా, నేను మాత్రం నీ శ్రీచరణారవిందాలను విడువడానికి ఇష్టపడను. తల్లి కోపంతో బిడ్డను గెంటివేసినా, ఆబిడ్డ ఏ నాటికీ తన తల్లిపాదాలను విడువదుకదా!) అనే రీతిలో చంటిబిడ్డను తల్లి గెంటివేసినా, ఆ బిడ్డ ఆమె పాదాలను విడువకుండా, ఆశ్రయించి ఉండి, ఎలుగెత్తి పిలచేటట్లే, వీరుకూడా తమకు సిద్ధోపాయం కావడంచేత, సకలేతరవిలక్షణమై, సౌందర్యసౌకుమార్యాలతో మిక్కిలి భోగ్యమై ఉన్నందున, స్వరూపోచితమైన కైంకర్యానికి ప్రతిసంబంధికావడంచేత శ్రీపాదాలను స్మరించి, ఆ సౌందర్యంలో మోహించి, "మేమంతా జంకి "పిడిక్కుమ్ మెల్లడియై" (సంవాహనం చేసే మృదుపాదాలను) అరణ్యసంచారంలో బాధపడేటట్లుచేసి మాకు మనోవ్యథను కల్గిస్తున్నావే! మాకు జీవనమైన దానికి మా ఎదుటనే సాక్షాత్కరింపజేయాలి" అని అంటున్నారు. లేక, ఆ శ్రీపాదాకు ఏ చెడ్డలేకుండా ప్రకాశించాలని మంగళాశాసనాన్ని చేస్తున్నారని కూడాచెప్పవచ్చు.

య త్తే సుజాత! చరణాంబురుహం స్తనేషు భీతా శ్శనైః ప్రియ! దధీమహి కర్కశేషు ।
తేనాటవీ మటసి తద్వ్యథతే న కిం స్విత్ కూర్పాదిభి ర్భ్రమతి ధీ ర్భవదాయుషాం నః ॥

(సుజాత)- "స ఉ శ్రేయాన్ భవతి జాయమానః" (అతడు కృపామూలకంగా జన్మిస్తూ మిక్కిలిగా ప్రకాశిస్తున్నాడు) అనే రీతిలో "ఇరుళ్ తరు మాఞాలమ్" (ఈ అజ్ఞానాన్ని కల్గించే విశాలభూమి)లో పుట్టినా, బద్ధులవలె కాకుండా, అజహత్స్వభావుడవై (తన దివ్యస్వభావాన్ని విడువనివాడవై) పుట్టినందువల్ల అత్యంత

కిడన్దపడియాలే బద్ధర్ దుర్జాతరితే. అప్పడి యన్ఱిక్కే, కేవలకృపైయాలే, "అఖిలజగత్పద్మబోధాయాచ్యుతభానునా" (విష్ణు.పు. 5-3-1) ఎన్గిఱపడియే సకలజగదవనత్తుక్కు పిఱన్దు, కల్లుమ్ కానగ మెన్ఱఱియాదే తిఱిన్దు సకలచేతనరై రక్షిత్తు, తన్నుడైయ కల్యాణగుణఙ్గళై వెళిచ్చెఱిప్పిత్తపడియాలే ఇవన్ సుజాత నెన్ఱ తట్టిల్లైయే. "జన్మ కర్మ చ మే దివ్యమ్. ఏవం యో వేత్తి తత్వతః, త్యక్త్వా దేహం పున ర్జన్మ నైతి మా మేతి సోఽర్జున!" (భగ-4-9) ఎన్గిఱపడియే అవనుడైయ జన్మకర్మఙ్గళ్ స్మరిత్తవర్గళుక్కెల్లామ్ పరమపదప్రాప్తియై ఉణ్డాక్కుమ్బడియాలే అవన్ సుజాతనితే. "దివ్యమ్" (భగ-4-9) ఎన్గైయాలే తన్నైయుమ్, పిఱరైయుమ్ ప్రకాశిప్పిక్కుమ్ జన్మమితే. "కట్కిలీ !" (తిరువాయ్-7-2-3) ఎన్నుమ్, "న మాంసచక్షుభి రభివీక్షతే తమ్" (తిరుమాలైవ్యాఖ్య- 44వపా) ఎన్గిఱపడియే యార్క్కుమ్ మఱియ దుర్లభమాన తన్ స్వరూపత్తై ఎల్లార్క్కుమ్ చక్షుర్విషయమాక్కి ప్రకాశిప్పిత్తాన్. "దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే" (భగ-10-10) ఎన్గిఱపడియే తన్నై ఆశ్రయిత్త చేతనర్క్కు స్వరూపజ్ఞానత్తై యుణ్డాక్కి, అవర్కళై ప్రకాశిప్పిత్తాన్. తన్నుడైయ జన్మమ్ పిఱరుడైయ దుఃఖత్తై నీక్కి నోక్కుగైక్కాక్కినపడియాలే ఇవన్ సుజాత నెన్ఱ తట్టిల్లై. ఇదు తనక్కెన్ఱుమవనితే దుర్జాతన్. ఆగైయాలేయితే- "ఈదృశా స్త్వదవతారసత్తమాః సర్వ ఏవ భవదాశ్రితాన్ జనాన్, త్రాతు మేవ న కదాచి దన్యథా తేన సుందర ! భవన్త మాశ్రయే" (సుందరబాహు-121) ఎన్ఱు శ్రీకూరత్తాழ్వాన్ అరుళిచ్చెయ్దార్.

(తే) సర్వశేషియాయ్, సర్వవిధబంధువాన దేవరీరుడైయ.

---

విలక్షణంగా పుట్టినవాడా! కర్మపరతంత్రులై ఉండి, దానిని అనుభవించడంకోసం పుట్టి, సంసారంలో రూపు నశించి, పడి ఉన్నందున బద్ధులు దుర్జాతులు కదా! ఆ విధంగా కాకుండా, కేవలకృపతో "**తతోఽఖిలజగత్పద్మ-బోధాయాచ్యుతభానునా**" (సమస్త జగత్తు అనే పద్మం యొక్క వికాసం కోసం అచ్యుతుడనే సూర్యుడు అవతరించాడు) అనే రీతిలో సకలజగద్రక్షణకోసం జన్మించి, రాళ్ళు-అరణ్యం అని తెలియకుండా తిరిగి, సకలచేతనులను రక్షించి, తన కల్యాణగుణాలను ప్రకాశింపజేసినందువల్ల ఇతడు సుజాతడంటే అడ్డులేదుకదా! "**జన్మ కర్మ చ మే దివ్యమ్ ఏవం యో వేత్తి తత్త్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున**" (అర్జునా! నా జన్మలు, లీలలు దివ్యాలు. వీటిని ఈ విధంగా యథార్థంగా ఎవడు తెలిసికొంటాడో అతడు ప్రకృత శరీరాన్ని విడచిన తరువాత పునర్జన్మను పొందడు. నన్ను చేరుకొంటాడు) అనే రీతిలో అతని జన్మకర్మలు స్మరించిన వారికందఱికీ పరమపదప్రాప్తిని కల్గించడంవల్ల అతడు సుజాతుడుకదా! "**దివ్యమ్**" అని అనడంవల్ల తనను, ఇతరులను ప్రకాశింపజేసే జన్మకదా! (భగవానుని జన్మ) "**కట్కిలీ!**" (మాంసచక్షువుకు గోచరం కానివాడా!) అని, "**న మాంసచక్షుభి రభివీక్షతే తమ్**" (మాంసచక్షువులతో ఎవడూ భగవానుని దర్శించలేదు) అనే రీతిలో ఎవరికీ తెలియడానికి దుర్లభం అయిన తన స్వరూపాన్ని అందఱికీ కంటికి కన్పించేటట్లు చేసి ప్రకాశింపజేశాడు. "**దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే**" (నన్ను ఆశ్రయించడానికి సాధనమైన బుద్ధియోగాన్ని అతనికి ప్రసాదిస్తాను) అనే రీతిలో తనను ఆశ్రయించిన చేతనులకు స్వరూపజ్ఞానాన్ని కల్గించి, వారిని ప్రకాశింపజేశాడు. తన జన్మ ఇతరుల దుఃఖాన్ని తీర్చి రక్షించడానికి ఎత్తినందువల్ల ఇతడు సుజాతుడనడంలో అడ్డు లేదే! ఇది (జన్మ) తనకోసం ఎపుడవుతుందో అపుడేకదా దుర్జాతుడు. అందువల్లనేకదా "**ఈదృశా స్త్వదవతారసత్తమాః సర్వ ఏవ భవదాశ్రితాన్ జనాన్, త్రాతు మేవ న కదాచి దన్యథా తేన సుందర! భవంత మాశ్రయే**" (ఇటువంటివి అయిన నీ గొప్ప అవతారాలు అన్నీ నిన్ను ఆశ్రయించినవారిని రక్షించడం కోసమే తప్ప ఇంకొకదానికి కాదు. అందువల్ల ఓ సుందరబాహుస్వామీ!, నిన్నే ఆశ్రయిస్తున్నాను) అని కూరేశులు అనుగ్రహించారు.

**(తే)**- సర్వశేషివి అయిన, సర్వవిధబంధువైన నీయొక్క (అనిభావం)

**(యచ్చరణాంబురుహమ్)** ఎన్ద చరణారవిన్దత్తై. ఇవనుక్కు ముఖారవిన్దముమ్, నేత్రారవిన్దముమ్, అధరారవిన్దముమ్, హృదయారవిన్దముమ్, కరారవిన్దముమ్, చరణారవిన్దముమాయ్- అవయవఙ్గళెల్లామ్ అరవిన్దఙ్గళాయిఱే యిరుప్పదు. తన్నుడైయ ఉడమ్బై అరవిన్దాలయైయాన పిరాట్టిక్కిరుప్పిడమాక్కిన పడియాలే. "కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతమ్" (శ్రీకృష్ణకర్ణామృతమ్) ఎన్హానిఱ్ఱదిఱే.

**(చరణాంబురుహమ్)** సౌందర్యసౌకుమార్యాదిగళాలే ఒరు తామరైపోన్ఱ తిరువడియాగైయాలే చరణాంబురుహ మెన్గిఱార్. "సౌందర్యమార్దవసుగన్ధరస ప్రవాహై రేతే హి సుందరభుజస్య పదారవిందే, అమ్భోజడమ్భపరిరమ్భణ మభ్యజైష్టాం తద్వై పరాజిత మిమే శిరసా బిభర్తి" (సుందరబాహు-63) ఎన్హానిఱ్ఱదిఱే.

**(చరణాంబురుహమ్)** సంబంధ మిల్లై యాకిలుమ్ విడవొణ్ణాదే, వైత్త కణ్ వాఙ్గాదపడియాన వడివழగు ఉడైత్తాకైయాలుమ్, సంసారతాపతప్తరాన ఇవరుడైయ తాపత్తై శమిప్పిక్కుమ్బడియాలుమ్, పావనత్వ-భోగ్యత్వఙ్గళాకిఱ ఇరణ్డాకారఙ్గళొత్తిరుక్కైయాలుమ్ అమ్బురుహ మెన్గిఱారెన్ఱవుమామ్.

**(తే సుజాత ! చరణాంబురుహమ్)** దేవరీరుడైయ, అతివిలక్షణమాగ జనిత్త చరణారవిన్దత్తై. చరణారవిన్దత్తుక్కు సుజాతత్వమాకిఱదు- ఉపనిషత్తుక్కళిలుద్భూతమాగైయిఱే. "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" (పురుషసూక్తం) ఎన్ఱుమ్, "చరణం పవిత్రమ్" (యజుర్వేదమ్-కాఠకమ్) ఎన్ఱుమ్, "చరణం నో లోకే సుధితాం దదాతు" ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే శ్రుతియిల్ కొణ్డాప్పడుగై. "ఆమ్నాయకల్పలతికోత్థసుగంధిపుష్పం యోగీన్ద్రహార్దసరసీరుహ

---

**(యచ్చరణాంబురుహమ్)-** ఏ చరణారవిందాన్ని అని అర్థం. ఇతనికి ముఖారవిందమూ, నేత్రారవిందమూ, హృదయారవిందమూ, కరారవిందమూ, చరణారవిందమై- అవయవాలన్నీ అరవిందాలుగానే కదా ఉంటాయి- తన దేహాన్ని అరవిందాలయ అయిన లక్ష్మీదేవికి స్థానం అయినందువల్ల "కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతమ్" (కరారవిందంతో పాదారవిందాన్ని ముఖారవిందంలో పెట్టుకొనేవానిని) అని అనబడుతున్నది కదా!

**(చరణాంబురుహమ్)-** సౌందర్యసౌకుమార్యాదులలో ఒక తామరవంటి శ్రీపాదం కాబట్టి **"చరణాంబురుహమ్"** అని అంటున్నారు. "సౌందర్యమార్దవసుగంధరస ప్రవాహై రేతే హి సుందరభుజస్య పదారవిందే, అంభోజ డంభరపరిరంభణ మభ్యజైష్టాం తద్వై పరాజిత మిమే శిరసా బిభర్తి" (సౌందర్యం, మృదుత్వం, సుగంధం అనే గుణాలు రస ప్రవాహాలతో ఈ సుందరబాహుస్వామియొక్క పాదారవిందాలు లోకంలోని పద్మంయొక్క, గర్వాన్ని అణచి దానిని జయించాయి. అందువల్లనే ఆ పద్మం ఈ సుందరబాహుస్వామి పాదాలను తన శిరస్సుతో మోస్తున్నది) అని అనబడుతున్నదికదా!

**(చరణాంబురుహమ్)-** సంబంధం లేకపోయినా విడువలేకుండా, చూసిన చూపును తిప్పుకోలేనట్లుండే రూపసౌందర్యాన్ని కల్గి ఉండడంవల్లనూ, పావనత్వ- భోగ్యత్వాలనే రెండు ఆకారాలలో పోలి ఉండడంవల్లనూ, (శ్రీచరణాన్ని) అంబురుహమని అంటున్నారని కూడా చెప్పవచ్చు.

**(తే సుజాత! చరణాంబురుహమ్)-** నీ, అతివిలక్షణంగా పుట్టిన చరణారవిందానికి- అని భావం. చరణారవిందానికి సుజాతత్వం అన్నది ఉపనిషత్తులలోనూ ఉద్భూతం కావడమేకదా! **"విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః"** (మధువును స్రవించే విష్ణువుయొక్క గొప్పపాదంలో) అని, **"చరణం పవిత్రమ్"** (పవిత్రమైన శ్రీపాదం) అని, **"చరణం నో లోకే సుధితాం దదాతు"** (శ్రీచరణం మనకు లోకంలో ఆధ్యాత్మిక సుఖాలను ఇచ్చుగాక) అని చెప్పే రీతిలో శ్రుతిలో కీర్తింపబడడం. **"ఆమ్నాయకల్పలతికోత్థసుగంధిపుష్పం యోగీంద్రహార్దసరసీరుహ-**

రాజహంసమ్, ఉత్పక్వధర్మసహకారఫలప్రకాణ్డం వందే సుసుందరభుజస్య పదారవిందమ్" (సుందరబాహు-65) ఎన్ఱు శ్రీకూరత్తాழ్వాననుసంధిత్తరుళినారిఱే.

(సుజాతచరణాంబురుహమ్) అన్ఱిక్కే, అఖిలాణ్డకోటిబ్రహ్మాణ్డనాయకత్వత్తై ఉణ్డాక్కుగిఱ "శఙ్ఖరథాఙ్గకల్పక ధ్వజారవిన్దాంకుశవజ్రలాంఛన"(స్తోత్రరత్నమ్-31)ఙ్గళోడే సకలేతరవిలక్షణమాగ జాతమాన చరణారవిన్దత్తై-ఎన్నవుమామ్. అన్ఱిక్కే, తన్నై సేవిత్తవర్గళుక్కు పరమపదత్తై ఉణ్డాక్కుగైక్కాగ జాతమాన చరణారవిన్దత్తై- ఎన్ఱు శొల్లవుమామ్. "ఉదీర్ణసంసారదవాశుశుక్షణిం క్షణేన నిర్వాప్య పరాం చ నిర్వృతిమ్, ప్రయచ్ఛతి త్వచ్చరణారుణామ్బుజద్వయాను రాగామృతసిన్ధుశీకరః" (స్తోత్రరత్నమ్-29) ఎన్ఱు ఆళవన్దారనుసంధిత్తార్.

(య త్తే సుజాత! చరణాంబురుహం స్తనేషు భీతా శ్శనైః ప్రియ దధీమహి కర్కశేషు) ప్రియనానవనే! ఉన్నై విశ్లేషిత్తు నిఱ్క శక్తి యిల్లామైయాలే ప్రియవిశ్లేషత్తై ఆఱ్ఱవఱ్ఱ పరికరమాన దేవరీరుడైయ పుష్పహాససుకుమారమాన ఇన్ద తిరువడియై కఠినఙ్గళాన ఎఙ్గళుడైయ స్తనఙ్గళిలే వైక్క నలియుమో? ఎన్ఱు మిగవుమ్ భయప్పట్టు మెల్ల మెల్ల ధరిక్కిఱోమో! భయవిషయమామ్బోదు ధరిక్కై ఎదుక్కు? ఎన్నిల్, తఙ్గళుక్కు జీవధారణమాగైయాలుమ్, సుమఙ్గళీజనఙ్గళుక్కు కుంకుమైపోలే ఇతు తఙ్గళుడైయ స్తనఙ్గళుక్కు అనర్ఘాలంకారమా యిరున్దపడియాలుమ్, తఙ్గళుడైయ హృదయతాపోపశమనత్తుక్కాగవుమ్, ధరిత్తిక్కిరుక్కిఱార్గళన్ఱి, అతినుడైయ మృదుత్వత్తై క్కణ్డాల్ పరియవేణ్డుమ్బడియిఱే ఇరుప్పదు.

---

రాజహంజమ్, ఉత్పక్వధర్మసహకారఫలప్రకాండం వందే సుసుందరభుజస్య పదారవిందమ్" (వేదాలనే కల్పలత నుండి పుట్టిన సుగంధిపుష్పం, యోగీంద్రుల హృదయకమలంలో విహరించే రాజహంసం, బాగా పరిణతి చెందిన ధర్మమనే తీయమామిడి పండు ఫలించిన గొప్పకాండం అయిన శ్రీసుందరబాహుస్వామియొక్క పాదారవిందాన్ని నమస్కరిస్తున్నాను) అని కూరేశులు (భగవానుని శ్రీచరణాన్ని) అనుసంధించారుకదా!

(సుజాత చరణాంబురుహమ్)- లేక, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకత్వాన్ని కల్గించే "శంఖరథాంగ కల్పకధ్వజారవిందాకుంశ వజ్రలాంఛనమ్" (శంఖ, చక్ర, కల్పక, ధ్వజారవిందాంకుశ వజ్రలాంఛనాలతో), మిగిలిన అన్నిటికంటే విలక్షణంగా పుట్టిన చరణారవిందాన్ని- అని అనవచ్చు. లేక, తనను సేవించినవారికి పరమపదాన్ని పొందించడంకోసం పుట్టిన చరణారవిందాన్ని- అని అనవచ్చు. "ఉదీర్ణసంసార దవాశుశుక్షణిం క్షణేన నిర్వాప్య పరాం చ నిర్వృతిమ్, ప్రయచ్ఛతి త్వచ్చరణారుణాంబుజద్వయానురాగామృతసింధుశీకరః" (భయంకరమైన సంసారమనే దావాగ్నిని వెంటనే ఆర్పి, గొప్పదైన ఆనందాన్ని ఇవ్వగల్గినది- నీ శ్రీచరణాలు అనే ఎఱ్ఱ తామరల జంట పట్ల కల భక్తి అనే అమృతసింధువులోని చిన్న కణం) అని ఆళవందార్ అనుసంధించారు.

(య త్తే సుజాత! చరణాంబురుహం స్తనేషు భీతా శ్శనైః ప్రియ! దధీమహి)- ప్రియుడైనవాడా! నిన్ను విశ్లేషించి నిలిచే శక్తి లేనందువల్ల ప్రియవిశ్లేషాన్ని తీర్చగల పరికరం అయిన నీయొక్క పుష్పహాససుకుమారం అయిన ఏ శ్రీపాదాన్ని కఠినాలైన "మా స్తనాలలో పెడితే బాధపడుతుందో! ఏమో!" అని చాలా భయపడి, మెల్లమెల్లగా ధరిస్తున్నామో - అని భావం. భయవిషయం అయితే ధరించడం ఎందుకు! అని అంటే, తమకు జీవనాధారం అయినందువల్లనూ, సుమంగళజనానికి కుంకుమవలె ఇది తమ స్తనాలకు విలువకట్టలేని అలంకారంగా ఉన్నందువల్లనూ, మీ హృదయతాపం తీరడం కోసమూ, ధరిస్తునారే తప్ప, దాని మార్దవాన్ని గమనిస్తే అభినివేశాన్ని పొందవలసికదా ఉంటుంది.

(తేనాటవీ మటసి) ఇప్పడి ఎజ్గళుడైయ కుచకుట్మలసంస్పర్శత్తాలే నలియుమో ? ఎన్ఱు భయప్పడుగిఱ అత్యంతసుకుమారమాన తిరువడియాలే కాడు మోడైయుమాన కానగత్తిలే ఉలావుగిఱాయే !

(తద్వ్యథతే న కింస్విత్కూర్పాదిభి ర్భ్రమతి ధీ ర్భవదాయుషాం నః) ఆగ, అన్ద తిరువడి కానగత్తిలే ఇరుక్కిఱ సూక్ష్మపాషాణాదిగళాలే నలియాదే యిరుక్కుమో ? ఎన్ఱు దేవరైయే జీవనమాగ ఉడైత్తోమాన ఎజ్గళుడైయ బుద్ధియానదు భ్రమియానిన్ఱదుకాణ్- ఎన్ఱు ఉచ్చైఃశ్రవమాగ కూప్పిడుగిఱార్- తజ్గళుడైయ ప్రేమపారవశ్యత్తాలే. "అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్" (రామా-అయో-27-7) ఎన్ఱితే పరివుడైయార్ వార్తై.

(యది త్వం ప్రస్థితో దుర్గం వన మద్యైవ రాఘవ !) రఘువంశత్తిలే జ్యేష్ఠరాయ్ పిఱన్దు వైత్తుమ్, అభిషేకోత్సవత్తై తిరువుళ్ళమ్బర్రి సింహాసనగతరాయ్, ప్రజాపరిపాలనమ్ పణ్ణవేణ్డి యిరుక్క, అదెల్లామ్ వితథమాయ్, ఇప్పోదే దుర్గమమాన కానగత్తై క్కుఱిత్తు దేవరీర్ ప్రస్థితరాగిల్, ప్రాణనాయకరాన దేవరీరై విట్టు మిగవు మసహ్యకరమాన ఇన్ద పడైవీట్టిల్ ఒరు క్షణముమ్ ఎనక్కు నిల్లప్పోమో! (అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్) అత్యంతసుకుమారమాన దేవరీరుడైయ తిరువడి, కానగజ్గళిలే ఇరున్ద కుశకణ్టకజ్గళాల్ మిగవుమ్ నొన్దు బాధప్పడాదో? దేవరీరే జీవనమాన ఎనక్కిదు ప్రాణవ్యథై పణ్ణాదో? దేవరీర్ పడైవీట్టిలే ఇరుక్కవుమామ్; కానగత్తిలిరుక్కవుమామ్. దేవరీరై ఒరు క్షణముమ్ పిరియాదే అనుగమిత్తు, ఉన్ తిరువడిక్కొరు తీఙ్గు వారాదపడి రక్షిత్తుక్కొణ్డిరుక్కై ఎనక్కు స్వరూపజ్కాణ్. "ఛాయా వా సత్వ మనుగచ్ఛేత్" (భగవచ్ఛాస్త్రే) ఎన్ఱుమ్, "యేన యేన ధాతా గచ్ఛతి తేన తేన సహ గచ్ఛతి" (పరమసంహితా) (ఈడు-10-8-7) ఎన్ఱుమ్ శ్రుతియిల్ శొల్లప్పట్టదిఱే. ఇప్పడి దేవరీర్ కానగత్తుక్కు పోమ్బోదు యాన్ మున్నే నడత్తుక్కొణ్డు ఉన్ తిరువడి క్కొరు తీఙ్గు వారాదపడి మార్గత్తిలే ఇరున్దుళ్ళ కుశకంటకజ్గళై నశిప్పిత్తు, మార్గత్తై మృదులమాక్కిక్కొణ్డు వరుకిఱేన్. ఆగ, దేవరీరై యాననుగమిక్కుమ్బడి అరుళవేణు మెన్ఱు

---

(తేనాటవీ మటసి)- ఇందువల్లనూ, మా కుచకుట్మలసంస్పర్శచేత బాధపడుతుందో! ఏమో! అని భయపడే చాలా సుకుమారం అయిన శ్రీపాదంచేత చెట్లతో, మడుగులతో నిండిన అరణ్యంలో సంచరిస్తున్నావే!

(తద్వ్యథతే న కింస్విత్కూర్పాదిభిః భ్రమతి ధీ ర్భవదాయుషాం నః)- అందువల్ల ఆ శ్రీపాదం అరణ్యంలో ఉండే సూక్ష్మపాషాణాదులతో బాధపడకుండా ఉంటుందా! అని నిన్నే జీవనంగా కల మా బుద్ధి అనేది భ్రమిస్తున్నదిసుమా !- అని ఉచ్చైఃస్వరంతో పిలుస్తున్నారు. తమయొక్క ప్రేమపారవశ్యంచేత. "అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్" (దర్భలను, ముళ్ళను అణచివేస్తూ నీకు ముందుగా వెళ్ళగలను) అని కదా ప్రేమకలవారి (సీతాదేవి) మాట.

(యది త్వం ప్రస్థితో దుర్గం వన మద్యైవ రాఘవ!) రఘువంశంలో జేష్ఠుడవై జన్మించి పట్టాభిషేకోత్సవాన్ని అంగీకరించి సింహాసనంలో కూర్చుని, ప్రజాపరిపాలనాన్ని చేయవలసి ఉండగా, అది అంతా వ్యర్థమై, ఇపుడే దుర్గమం అయిన అరణ్యానికి నీవు బయలుదేరితే, ప్రాణనాయకుడవైన నిన్ను విడచి చాలా అసహ్యాకరం అయిన ఈ అంతఃపురంలో ఒక క్షణంకూడా నాకు నిలువడానికి సాధ్యమా! "అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్" (దర్భలను, ముళ్ళను అణచివేస్తూ దారిలో నీకంటే ముందు వెళ్ళగలను) చాలా సుకుమారం అయిన నీ శ్రీపాదాలు అరణ్యాలలో ఉన్న దర్భలతో, ముళ్ళలో చాలా బాధపడవా! నీవు అంతఃపురంలో ఉండవచ్చు; లేక, అరణ్యంలో ఉండవచ్చు. నిన్ను ఒక్కక్షణం అయినా విశ్లేషించకుండా అనుసరించి, నీ శ్రీపాదానికి ఏచెడ్డ రాకుండా రక్షిస్తూ ఉండడం నాకు స్వరూపంసుమా! "ఛాయా వా సత్వ మనుగచ్ఛేత్" (సత్వాన్ని ఛాయ అనుసరించినట్లు జీవుడు

కూప్పిట్టుక్కొణ్డు ప్రార్థిత్తాళితే పిరాట్టి. అప్పడియే ఇవ్వ గోపిమార్‌గళుమ్ అవ్వ తిరువడియై ప్రత్యక్షమాక్కి స్వరూపోచితమాన కైంకర్యత్తై ప్రసాదిత్తరుళవేణు మెన్ఱు ప్రార్థిత్తార్‌గళెన్ఱవుమామ్.

(తే చరణాంబురుహం స్తనేషు భీతాశ్శనైః ప్రియ! దధీమహి కర్కశేషు, తేనాటవీ మటసి తద్వ్యథతే న కింస్విత్కూర్పాదిభి ర్భ్రమతి ధీ ర్భవదాయుషాం నః) ఇఙ్గు స్తనఙ్గళాగ చ్చొన్నదు జ్ఞానాభక్తిగళై. "ప్రథమ ముదితా కించిత్ పశ్చా ద్విపృద్ధి ముపేయుషీ, హరతి హృదయం పుంసః, కాఠిన్యభాగపి భోగదా, యదియ మనఘా భక్తిః కా న యాత్యపి మార్దవమ్, తదగణి బుధైః గౌణ్యా వృత్త్యా కుచాదిపదైః ధ్రువమ్" ఎన్ఱు శొల్లానిఱ్కదితే. ఆగ, దేవరీరుడైయ తిరువడియై, దేవతాన్తర- మంత్రాన్తర- సాధనాన్తరఙ్గళిల్ చలియాదే, దేవరీరిడత్తిలత్యంత దృఢాధ్యవసాయత్తోడే నిఱ్కిఱ ఎఙ్గళుడైయ జ్ఞానభక్తిగళుక్కు విషయమాక్కి అనుభవిక్కుమ్బోదుమ్, అతినుడైయ సౌకుమార్యాదిగళుక్కు కణ్ణెచ్చిలియాలే ఎన్న తీఙ్గు వరుమో ? ఎన్ఱు అస్థానే భయశఙ్కై పణ్ణి మంగళఙ్గళాశాసిత్తుక్కొణ్డునిఱ్క, అవర్గళై క్కొణ్డు భగవద్విషయత్తై సహియాతే దుర్విషయప్రవణరాయ్, ప్రపన్నజనబాధకరాన సంసారిగళిడత్తిలే వర్త్తిత్తునిన్ఱాయే! అతుక్కు తీఙ్గు వారాదొழிవదో? ఎన్ఱు భయప్పట్టు మఙ్గళాశాసనపరరాగిఱార్- ఎన్ఱు శొల్లవుమామ్. "తే తం సోమ మివోద్యంతం దృష్ట్వా వై ధర్మచారిణః, మంగళాని ప్రయుంజానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః" (రామా-ఆర-1-11) ఎన్గిఱపడియే మిగవుమ్ పరివుడైయరాన పరిజనఙ్గళ్ వర్త్తిక్కిఱ పడైవీట్టిలిరుక్కక్కడవ వస్తు, అత్యంతసౌశీల్యత్తాలే

---

భగవానుని అనుసరించాలి) అని, "యేన యేన ధాతా గచ్ఛతి తేన తేన సహ గచ్ఛతి" (ఏఏ దారిలో రీతిలో భగవానుడు సంచరిస్తాడో ఆయా దారిలో రీతిలో జీవుడు అతనిని అనుసరించాలి.) అని శ్రుతిలో చెప్పబడిందికదా! ఈ విధంగా నీవు అరణ్యానికి పోయేటపుడు నేను ముందుగా నడుస్తూ నీ శ్రీపాదాలకు ఏ హాని రాకుండేటట్లు మార్గంలో ఉన్న కుశకంటకాలను నశింపజేసి, మార్గాన్ని మెత్తగా చేస్తూ వస్తాను. కాబట్టి, నిన్ను నేను అనుసరించేటట్లు అనుగ్రహించాలి- అని ఆర్తితో అంటూ ప్రార్థించిందికదా సీతాదేవి! ఆ రీతిలోనే ఈ గోపికలుకూడా ఆ శ్రీపాదాన్ని ప్రత్యక్షం చేసి, స్వరూపానికి తగిన కైంకర్యాన్ని ప్రసాదించాలని ప్రార్థిస్తున్నారనికూడా అనవచ్చు.

(తే చరణాంబురుహం స్తనేషు భీతా శ్శనైః ప్రియ ! దధీమహి కర్కశేషు, తేనాటవీ మటసి తద్వ్యథతే న కింస్విత్, కూర్పాదిభిః భ్రమతి ధీ ర్భవదాయుషాం నః)- ఇచట స్తనాలని చెప్పినవి జ్ఞానభక్తులను. "ప్రథమ ముదితా కించిత్ పశ్చా ద్విపృద్ధి ముపేయుషీ, హరతి హృదయం పుంసః కాఠిన్యభాగపి భోగదా, యదియ మనఘా భక్తిః కా న యాత్యపి మార్దవమ్, తదగణి బుధైః గౌణ్యా వృత్త్యా కుచాదిపదైః ధ్రువమ్" (మొదట కొద్దిగా ఉదయించినది, ఆ తరువాత వృద్ధిని పొందినదై పురుషుని హృదయాన్ని ఆకర్షించేది, కాఠిన్యాన్ని కల్గినది అయిన స్త్రీల కుచాతో పరమపురుషునిపట్ల మొదట కొద్దిగా కల్గినది, ఆ తరువాత వృద్ధిని పొందినది, ఆ పరమపురుషుని మనస్సును హరించేది అయిన భక్తి గౌణవృత్తితో నిర్దేశింపబడుతున్నది) అని చెప్పబడుతున్నదికదా! శ్రీపాదాన్ని, దేవతాంతర- మంత్రాంతర- సాధనాంతరాలవల్ల చలించకుండా నీ విషయంలో మిక్కిలి దృఢాధ్యవసాయంలో నిలిచే మా జ్ఞానభక్తులకు విషయం చేసి, అనుభవించేటపుడు దాని సౌకుమార్యాదులకు దృష్టిదోషంవల్ల ఏం దోషం వస్తుందో! ఏమో! అనే అస్థానే భయశంకను కల్గి, మంగళాలను ఆశాసిస్తూ ఉండగా వాటితో, భగవద్విషయాన్ని సహించకుండా, దుర్విషయాలలో ప్రావణ్యాన్ని కలవారై, ప్రపన్నజనులను బాధించేవారైన సంసారులవద్ద వర్తిస్తున్నావే! దానికి హాని రాకుండా పోతుందా! అని భయపడి మంగళాశాసనపరులవుతున్నారు- అనికూడా చెప్పవచ్చు. "తే తం సోమ మివోద్యంతం దృష్ట్వా వైధర్మచారిణః, మంగళాని ప్రయుంజానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః" (ఉదయించే చంద్రునివలె ఉన్న ఆ శ్రీరామచంద్రుని చూచి ధర్మాన్ని ఆచరించేవారు, దృఢమైన వ్రతాన్ని కలవారైన ఋషులు

కానగత్తిలే ప్రత్యక్షమాయిఱ్ఱే! ఇదుక్కు అసురరాక్షసర్గళా ఎన్న తీఙ్గు వరుమో? ఎన్ఱు భయప్పట్టు మఙ్గళఙ్గళా శాసిత్తారిఱే, దండకారణ్యవాసిగళాన ఋషిగళ్. ఇత్తాల్ - "చరణౌ శరణం ప్రపద్యే" (ద్వయమ్) ఎన్గిఱ వాక్యార్థమ్ పూర్ణమాయిఱ్ఱు.

పత్తొన్బదామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

## ఇరుపదామ్ శ్లోకమ్

అవ :- ఇన్ద శ్లోకత్తాలే గోపిమార్గళ్, తఙ్గళుక్కు ప్రాప్యభూతనాన సర్వేశ్వరనుడైయ విశ్లేషత్తై సహియాతే, ప్రాప్యరుచియాలే ఇప్పడి బహువిధమాగ కృష్ణగుణచేష్టితఙ్గళై ప్రలపిత్తుక్కొణ్డు కూప్పిట్టు పూర్ణప్రపదనమ్ పణ్ణినపడి శొల్లిఱ్ఱాయిఱ్ఱు. ఇన్ద శ్లోకమ్ "ప్రపద్యే" (ద్వయమ్) ఎన్గిఱ పదత్తినుడైయ పూర్ణార్థ ప్రతిపాదకమెన్ఱు నమ్మాచార్యర్ అరుళిచ్చెయ్వర్. ఆళ్వార్, "శూళ్ విశుమ్బి"లే ముక్త నిరుక్కు మిరుప్పై పరజ్ఞానత్తాలే సాక్షాత్కరిత్తు అనుభవిత్తు, అన్ద సమాధి కులైన్దవాఱే సర్వేశ్వరనుడైయ సన్నిధియిలే తమ్ముడైయ ఆర్తియుమ్, అభినివేశాతిశయముమ్ తోఱ్ఱుమ్బడి "మునియే నాన్ముగనే" (తిరువాయ్-10-10-1) ఎన్గిఱ తిరువాయ్మొழியిలే బహువిధమాగ అవనుడైయ ఉపకారకత్వాదికళై చ్చొల్లి, "సర్వప్రకారరక్షకనాన నీ ఎముక్కు పూర్ణానుభవత్తై త్తరవేణ్డుమ్" ఎన్ఱు పెరు మిడఱు శెయ్దు కూప్పిట్టాప్పోలే కాణుమ్, ఇవర్గళ్ కూప్పీడుమ్.

ఇతి గోప్యః ప్రగాయంత్యః ప్రలపంత శ్చ చిత్రథా ।
రురుదుః సుస్వరం రాజన్! కృష్ణదర్శనలాలసాః ॥

---

మంగళాశాసనాలను చేస్తూ స్వాగతం చెప్పారు) అనే రీతిలో మిక్కిలి అభినివేశాన్ని కల పరిజనాలు తిరిగే అంతః పురంలో ఉండతగిన వస్తువు, అత్యంతసౌకుమార్యంతో అరణ్యంలో ప్రత్యక్షం అయిందే ! దీనికి అసురరాక్షసులవల్ల ఏమి హాని వస్తుందో ! అని భయపడి మంగళాలను ఆశాసించారుకదా, దండకారణ్యవాసులైన ఋషులే! ఇందువల్ల "చరణౌ శరణం ప్రపద్యే" (రెండు చరణాలను శరణు పొందుతున్నాను) అనే వాక్యార్థం పూర్ణం అయింది.

పందొమ్మిదవ శ్లోకం ముగిసింది

## ఇరవైయవ శ్లోకం

అవ :- ఈ శ్లోకంలో గోపికలు తమకు ప్రాప్యభూతుడైన సర్వేశ్వరుని వియోగాన్ని సహించలేక, ప్రాప్యంలోని ఆసక్తివల్ల ఈ విధంగా బహువిధంగా శ్రీకృష్ణుని గుణాలను, లీలలను ప్రలపిస్తూ ఆక్రందించి, పూర్ణప్రపత్తిని చేసిన తీరు చెప్పినట్లయింది. ఈ శ్లోకం (ద్వయంలోని) "ప్రపద్యే" అనే పదంయొక్క పూర్ణార్థప్రతిపాదకం అని అస్మదాచార్యులు అనుగ్రహించేవారు. ఆళ్వార్లు "శూళ్ విశుమ్బు" అనే దశకంలో ముక్తుడుండే స్థితిని పరజ్ఞానంతో దర్శించి, అనుభవించి,ఆ సమాధి తొలగగానే, సర్వేశ్వరుని సన్నిధిలో తమ ఆర్తి, అభినివేశాతిశయం స్ఫురించేటట్లు "మునియే! నాన్ముకనే!" అనే తిరువాయ్మొழிలో బహువిధంగా అతని ఉపకారత్వాదులనుగూర్చి పల్కి "అన్ని విధాలుగా రక్షకుడవైన నీవు నాకు పరిపూర్ణానుభవాన్ని అనుగ్రహించాలి'' అని పెద్దగా గొంతెత్తి ఆక్రోశించినట్లే సుమా వీరి ఆక్రందనకూడా.

ఇతి గోప్యః ప్రగాయంత్యః ప్రలంపత శ్చ చిత్రదా ।
రురుదుః సుస్వరం రాజన్! కృష్ణదర్శనలాలసాః ॥

**(ఇతి)** ఇన్ద ప్రకారత్తాలే తజ్గళుక్కు పురుషకారభూతైయాన లక్ష్మీసంబన్ధత్తై అనుసంధిత్తార్. గుణవిగ్రహ విభూతియోగత్తై ప్పేశినార్. దేవరీరుడైయ తిరువడియే ఎజ్గళుక్కు స్వరూపసిద్ధమాన ఉపాయమెన్టు పఱ్ఱినార్. ఇప్పడిగళాలే.

**(గోప్యః)** ప్రపన్నరాన గోపిమార్గళ్.

**(గోప్యః)** ఇవర్గళ్ గోపీజనజ్గళితే. సర్వేశ్వరనై స్వరూపరూపగుణవిభూతిమహదైశ్వర్యజ్గళోడు ఎప్పోదు మనుభవిక్కుమవర్గళితే ఇవర్గళ్. సర్వేశ్వరనుడైయ విశ్లేషత్తై ఒరు క్షణముమ్ సహిక్కవల్లరల్లతే. ఆగైయాలే, **(ప్రగాయంత్యః ప్రలపంత శ్చ)** ఎన్గిఱార్.

**(ప్రగాయంత్యః)** తామ్ ధరిక్కైక్కాగవుమ్, స్వయంపురుషార్థమాగవుమ్ కృష్ణగుణచేష్టితజ్గళై బహువిధమాగ గానమ్ పణ్ణినవరాయ్.

**(ప్రలపంత శ్చ)** గానమ్ పణ్ణినమాత్రమన్టిక్కే, భగవద్విషత్తిల్ అత్యంత ప్రేమపారవశ్యత్తాలే అవనుడైయ గుణచేష్టితజ్గళైయుమ్, తజ్గళుడైయ ఆఱ్ఱామైయైయుమ్ బహువిధమాగ ప్రలపిత్తవరాయ్. **"ఎమ్మానై చ్చొల్లి ప్పాడి యెழுన్దుమ్ పఱన్దుమ్ తుళ్లుగై" (తిరువాయ్- 3-5-1)** యితే ప్రపన్ననానవనక్కు స్వరూపమ్. **"సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః, నమస్యంత శ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే" (భగ-9-14)** ఎన్టుమ్, **"తుష్యంతి చ రమంతి చ" (భగ-10-9)** ఎన్టుమ్ శొల్లానిన్టదితే.

---

**(ఇతి)-** ఈ రీతిలో తమకు పురుషకారభూత అయిన లక్ష్మియొక్క సంబంధాన్ని అనుసంధించారు. గుణవిగ్రహవిభూతుల యోగాన్ని చెప్పారు. నీ శ్రీపాదాలే మాకు స్వరూపసిద్ధం అయిన ఉపాయం- అని ఆశ్రయించారు. ఈ రీతులలో

**(గోప్యః)-** ప్రపన్నలైన గోపికలు.

**(గోప్యః)-** వీరు గోపీజనాలు కదా. సర్వేశ్వరుని స్వరూప రూప-గుణ-విభూతి- మహదైశ్వర్యాలను ఎప్పుడూ అనుభవించేవారుకదా వీరు. సర్వేశ్వరుని విశ్లేషాన్ని ఒక క్షణంకూడా సహించగలవారు కారుకదా! అందువల్ల. **(ప్రగాయంత్యః ప్రలపంత శ్చ)-** అని అంటున్నారు.

**(ప్రగాయంత్యః)-** తాము తాళడంకోసం, స్వయంపురుషార్థంగానూ కృష్ణగుణ చేష్టితాలను బహువిధంగాను గానం చేసినవారై.

**(ప్రలపంత శ్చ)-** గానం చేయడం మాత్రమేకాక, భగవద్విషయంలో అత్యంతమైన ప్రేమపారవశ్యంవల్ల అతని గుణలీలలను, తమ ఆర్తిని బహువిధంగా ప్రలపించినవారై అని అర్థం. **"ఎమ్మానై చ్చొల్లిప్పాడి యెழுన్దుమ్ పఱన్దుమ్ తుళ్ళుమ్"** (స్వామిని కీర్తించి, పాడి లేచి అంతటా తిరిగి తుళ్ళడం)కదా ప్రపన్నుడైనవానికి స్వరూపం. **"సతతం కీర్తయంతో మాం యతంత శ్చ దృఢవ్రతాః, నమస్యంత శ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే"** (నన్ను ఎల్లప్పుడూ కీర్తిస్తూ, నా సేవలలో ప్రయత్నిస్తూ, దృఢమైన సంకల్పాన్ని కలవారై నన్ను నమస్కరిస్తూ, నాతో నిత్యసంబంధాన్ని కలవారై నన్ను ఉపాసిస్తున్నారు) అని, **"తుష్యంతి చ రమంతి చ"** అని చెప్పబడుతున్నదికదా!

**(చిత్రథా)-** వీరి గానం, ప్రలాపం విచిత్రంగాకదా ఉంటుంది. ఇది ప్రకృతివిలక్షణం అయిన గానం, ప్రలాపం కాబట్టి **"చిత్రథా"** అని అంటున్నారు.

(చిత్రథా) ఇవనుడైయ గానముమ్, ప్రలాపము విచిత్రమాయితే యిరుప్పతు. ఇతు ప్రకృతి విలక్షణమాన గానముమ్, ప్రలాపముమా గైయాలే "చిత్రథా" ఎన్ఱు శొల్లుగిఱార్.

(రురుదుః సుస్వరమ్) ఇప్పడిగళాల్ ఎత్త నైకాలమ్ పార్క్కిలుమ్ అవన్ వారామైయాలే అవన్ శడక్కెన వరుగైక్కు సుస్వరమాగ రోదనమ్ పణ్ణినార్గళ్.

(రురుదు స్సుస్వరమ్) భర్తావినుడైయ హృదయమ్ ద్రవీభూతమామ్బడి రోదనమ్ పణ్ణినార్గళ్ ఎన్ఱపడి. ప్రాప్తిక్కు శక్తియిల్లాతవర్క్కు రోదనమితే ప్రాప్తమ్. "న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ న భక్తిమాం స్త్వచ్చరణావిందే, అకించనోఽనన్యగతి శ్శరణ్య! త్వత్పాదమూలం శరణం ప్రపద్యే" (స్తోత్రరత్నమ్-24) ఎన్గిఱపడియే శేషియై ప్రాప్తిక్కైక్కు ఒరు శక్తి యిల్లామైయాలే అవనుడైయ తిరువడిగళిలే విழுన్దు తన్నుడైయ శక్తియై విణ్ణప్పమ్ శెయ్దుకొణ్డు కూప్పిడుగైయితే ప్రాప్తమ్. అతువితే శరణాగతియాగ శాస్త్రఙ్గళిలే శొల్లప్పట్టదు. ఆழ்வార్, సర్వేశ్వరనుడైయ గుణానుభవమ్ పణ్ణి, అప్పడిప్పట్ట ఈశ్వరనై ప్రత్యక్షీకరిక్కవేణుమెన్ఱు ఆశైప్పట్టు లభియామైయాల్ మిగవుమ్ నొన్దు, అవనై ప్పెఱుకైక్కు మఱ్ఱొరు ఉపాయ మిల్లామైయాలే, "పామరు మూవులగుమ్ పడైత పఱ్పనాబా! వో! పాముఱు మూవులకు మళైన్ద పఱ్పపాదా వో! తామారైక్కణ్ణా వో! తనియేన్ తనియాళా వో! తామరైక్కైయ్యా వో! ఉన్నై యెన్ఱుకొల్ శేర్వదువే!" (తిరువాయ్-7-6-1) ఎన్ఱు పెరియ ఆక్రందనమ్ పణ్ణినారితే.

(పామరు మూవులకుమ్ పడైత్త పఱ్పనాబా! వో!) ప్రళయత్తిలే మూలప్రకృతియోడే శేరి, అసత్కల్పరాయ్ కిడక్కిఱ చేతనర్గళై పార్త్తు ఇవర్గళ్ ఇప్పడి ఇழுక్కవొణ్ణాదెన్గిఱ పరమకృపైయోడే, భోక్తృ- భోగ్య- భోగస్థానఙ్గళిలే

---

(రురుదుః సుస్వరమ్)- ఈ రీతుల్లో ఎంతకాలం చూచినా అతడు రాకపోవడంచేత అతడు చటుక్కున రావడంకోసం సుస్వరంగా రోదించారు.

(రురుదుః సుస్వరమ్)- భర్తయొక్క హృదయం ద్రవించేటట్లు రోదనం చేశారని భావం. ప్రాప్తికి శక్తి లేనివారికి ఏడుపేకదా వస్తుంది. "న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మావేదీ న భక్తిమాన్ త్వచ్చరణారవిందే, అకించనోఽనన్యగతిః శరణ్య! త్వత్పాదమూలం శరణం ప్రపద్యే" (కర్మయోగానుష్ఠానాన్ని చేసినవాడను కాను. జ్ఞానయోగాన్ని చేసినవాడను కాను; నీ పాదపద్మాలలో భక్తియోగాన్ని ఆచరించలేదు, అకించనుడను. నీవు తప్ప ఇంకొక శరణం లేనివాడను. ఓ శరణ్యా ! నీ పాదమూలాన్ని శరణు పొందుతున్నాను) అనే రీతిలో శేషిని పొందడానికి ఏ శక్తి లేనందువ్ల అతని శ్రీపాదాలలో పడి, తన అశక్తిని విన్నపిస్తూ ఆక్రందించిడమేకదా ప్రాప్తం. అదే కదా శరణాగతిగా శాస్త్రాల్లో చెప్పబడింది. ఆழ்వార్లు సర్వేశ్వరుని గుణానుభవాన్ని చేసి, అటువంటి ఈశ్వరుని ప్రత్యక్షం చేసికోవాలని ఆశపడి, లభించకపోవడంచేత చాలా బాధపడి, అతనిని పొందడానికి వేఱొక ఉపాయం లేనందువల్ల "పామరు మూవులకమ్ పడైత్త పఱ్పనాబావో! పామరుమూవులకు మళన్ద పఱ్పపాదా వో!, తామరై కణ్ణా వో! తనియేన్ తనియాళా వో! తామరైక్కైయా! వో! ఉన్నై యెన్ఱు కొల్ శేర్వదువే!" (వివిధవస్తువులతో నిండి ఉండే ముల్లోకాలను సృష్టించిన ఓపద్మనాభా! స్థావరజంగమాదులతో నిండిన ముల్లోకాలను కొలిచిన పద్మపాదా! తామరసనేత్రుడా! పద్మహస్తుడా! బద్ధులలో, ముక్తులలో చేరక ప్రత్యేకంగా ఉండే నన్ను విలక్షణంగా పరిపాలించేవాడా! నిన్ను నేను ఏ విధంగా చేరగలను? అయ్యో!) అని పెద్ద ఆక్రందనను చేశారుకదా!

(పామరు మూవులకుమ్ పడైత్త పఱ్పనాబా వో !)- ప్రళయంతో మూలప్రకృతిలో చేరి, అసత్కల్పులై (అసత్తుతో సమానులై) పడి ఉండే చేతనులను చూచి, "వీరు ఈ విధంగా ఉండకూడదు'' అనే పరమకృపతో భోక్తృ-భోగ్య- భోగస్థానాలలో ప్రకాశించే ముల్లోకాలను సృష్టించి, సాగరంలో ఆదిశేషునిపైన శయనించి ఉండి,

ప్రకాశిక్కిఅ మూవులకజ్గళైయుమ్ సృష్టిత్తు, సాగరత్తిలే తిరువనన్దాழ்వాన్ మేలే శాయ్న్దరుళి, ముదలిలే, తన్నుడైయ తిరునాభియిల్ నిన్రు కమలత్తై ఉదయిక్కప్పణ్ణి, అతినాలే వ్యష్టిసృష్టిక్కు కారణభూతనాన బ్రహ్మావై సృష్టిత్తు, అవన్ మున్నాగ సకలచేతనర్గళైయుమ్ సృష్టిత్తవనే! 'ఓ' ఎన్రదు ఆక్రందనధ్వని. ఇప్పడిగళాల్ వన్ద శ్రమత్తై ఎల్లామ్ సహిత్తు, ఎన్నై రక్షిప్పతర్కే ఇన్ద జగత్తెల్లా ముణ్డాక్కిన దేవరీర్ ఇన్రు అడియేనై, దేవరీర్ సన్నిధిక్కు వన్దు కిట్టాదపడి సంసారత్తిలే తళ్ళి పోగడుగై సర్వవిధబంధువాన దేవరీరుక్కు తగుమో? ఎన్ శెయ్వేన్? ఎన్రు ఉచ్చైఃశ్రవమాగ ఆక్రందనమ్ పణ్ణుగిఱార్. అవన్ పఱ్బనాబనాయ్ జగత్తై పడైత్తతుమ్ తమక్కాగవెన్రు నినైక్కిఱారితే ఇవర్!

**(పామఱు మూవులగు మళన్ద పఱ్బపాదా వో!)** ఇప్పడి సృష్టిత్తు విడుగైయన్రిక్కే, దేవరీరుక్కు శేషమాన జగత్తై మహాబలి అహంకారత్తాలే తనక్కెన్రు అభిమానిత్తవాఱే, శడక్కెన కుఱళురువాయ్ వన్దు తోన్రి నిన్రు, "విచక్రమే పృథివీ మేష ఏతామ్" (విష్ణుసూక్తమ్) ఎన్గిఱపడియే అవనిడత్తిల్ మూన్రడిగళై అర్థిత్తు, లోకజ్గళెల్లామ్ దేవరీరుడైయ చరణకమలజ్గళ్ కీழ்ఏ శేర్త్తుకొణ్డు రక్షిత్తవనే! "లోకవిక్రాన్తచరణౌ శరణం తే వ్రజం విభో!" (శరణాగతిగద్య) ఎన్గిఱపడియే ఇచ్చెయిలుక్కిఱే ఎల్లారుమ్ తోఱ్ఱు తజ్గళై అవనుక్కాక్కిఱ్ఱదు. ఇవరుమ్, "కుఱై కழల్గళ్ నీట్టి మణ్కొణ్డ కోల వామనా!" (తిరువాయ్-4-3-7) ఎన్రనుసంధిత్తారితే.

**(ఓ !)** ఇప్పడి సకలచేతనాచేతనజ్గళ్మేల్, అవరుక్కొరు అభినివేశమిన్రిక్కే యిరుక్కచ్చెయ్దేయుమ్ ఊరెణ్ణెయ్ వైత్తాప్పోలే తిరువడిగళై వైత్తు శేషమాక్కిక్కొణ్డు. ఇప్పడి అనన్యార్హనాన ఎన్నై విడుగై తగుమో ? ఎన్రు కూప్పిడుగిఱార్. ఎనక్కాగ సకలలోకజ్గళైయుమ్ వన్దళైన్దు, ఇప్పడి విడుగై ఉనక్కు తగుమో? ఎన్రు కూప్పిడుగిఱారెన్రు శొల్లవుమామ్.

---

మొదట తన తిరునాభిలోనుండి కమలాన్ని ఉదయించేటట్లు చేసి, అందులో వ్యష్టిసృష్టికి కారణభూతుడైన బ్రహ్మను సృష్టించి, అతనిద్వారా సకలచేతనులను సృష్టించినవాడా! "ఓ" అనేది ఆక్రందన ధ్వని. ఈ రీతుల్లో కల్గిన శ్రమను అంతటిని సహించి, నన్ను రక్షించడంకోసమే ఈ జగత్తును అంతటినీ సృష్టించిన నీవు ఇపుడు దాసుడవైన నన్ను నీ సన్నిధికి వచ్చి, చేరలేకుండేటట్లు సంసారంలోకి గెంటివేయడం సర్వవిధబంధువైన నీకు తగునా ? ఏం చేయను ?అని ఎలుగెత్తి ఆక్రందనను చేస్తున్నారు. అతడు పద్మనాభుడై, జగత్తును సృష్టించడంకూడా తమకోసం- అని తలుస్తున్నారుకదా వీరు.

**(పామఱు మూవులకుమ్ అళన్ద పఱ్బపాదా వో!)**- ఈ విధంగా సృష్టించి, విడువడం కాకుండా, నీకు శేషమైన జగత్తును మహాబలి అహంకారంలో తనది అని అభిమానించగానే, చటుక్కున వామనవేషంతో వచ్చి అవతరించి, "విచక్రమే పృథివీ మేష ఏతామ్" (ఇతడు -త్రివిక్రముడు ఈ పృథివిని విక్రమించాడు) అనే రీతిలో అతనివద్ద మూడడుగులను యాచించి, లోకాలు అన్నిటినీ నీ చరణకమలాల క్రింద చేర్చుకొని రక్షించినవాడా! "లోకవిక్రాంతచరణౌ శరణం తే వ్రజం విభో!" (లోకాలలో విక్రమించిన నీ చరణాలను ఓ ప్రభూ! నేను శరణు పొందుతున్నాను) అని చెప్పే రీతిలో ఈ లీలకుకదా అందఱూ జితులై తమను అతనికి వశం చేసికొన్నది. వీరుకూడా "కుఱైకழల్కళ్ నీట్టి మణ్ కొణ్డ కోల వామనా!" (శబ్దించే శ్రీచరణాలను చాచి భూమిని కొలిచిన అందమైన వామనా!) అని అనుసంధించారుకదా!

**(ఓ!)**- ఈవిధంగా సకలచేతనాచేతనాలపైన వాటికి ఏ అభినివేశం లేకుండా ఉన్నా. "ఊరెణ్ణెయ్ వైత్తాప్పోలే"లోని (ఊరిలోని జనాలను లెక్కవేసినట్లు) శ్రీపాదాలను పెట్టి, శేషంగా చేసికొని, ఈవిధంగా అనన్యార్హుడనైన నన్ను విడువడం తగునా? అని ఆక్రందిస్తున్నారు. నాకోసం సకలలోకాలను కొలిచి, ఇపుడు విడవడం నీకు తగునా? అని ఆక్రందిస్తున్నారనికూడా చెప్పవచ్చు.

**(తామరైకణ్ణా !)** సౌందర్యాదిగళాలే ఒరు తామరైపోలే ఇరున్దు, ఆశ్రితరుడైయ దుఃఖత్తై కణ్డు, **"భృశం భవతి దుఃఖితః" (రామా-అయో-2-41)** ఎన్గిఱపడియే దుఃఖిక్కప్పణ్ణుగిఱ దయాప్రవంతియై ప్రవిక్కిఱ తిరునేత్రఙ్గళై యుడైయవనే! కణ్డ కాట్చియిలే శ్రమహరమాన తామరైమలర్పోలే, ఆశ్రితరుడైయ దుఃఖత్తై శమిప్పిక్కుమ్ దయారసపూరితమాన తిరునేత్రఙ్గళై యుడైయవనే - ఎన్ఱు శొల్లవుమామ్. అన్ఱిక్కే, ఉన్నుడైయ నేత్రసౌందర్యత్తాలే ఎన్నై వశీకరిత్తు ఇప్పడి విడుగై తగుమో? ఎన్గిఱారెన్ఱవుమామ్.

**(ఓ!)** ఇప్పడి యిరున్ద తిరునేత్రఙ్గళై యుడైయనాయిరున్దువైత్తు మెన్నై కటాక్షియాదే, **"ఇరుళ్ తరుమాఞాల" (తిరువాయ్ -10-6-1)**మాన ఇన్ద విభూతియిలే తళ్ళివిడుగై ఉచితమో? ఎన్ఱు కూప్పిడుగిఱార్.

**(తామరైక్కణ్ణా వో!) "పుండరీకాక్ష! రక్ష మాం శరణాగతామ్" (భారతే. సభా. 90-43)** ఎన్గిఱపడియేయిఱే ఇన్ద శ్రీసూక్తియుమ్. **"గంభీరాంభస్సముద్భూతసుమృష్టనాళ రవికరవికసితమాన"** తామరైమలర్పోలే అతివిశాలమాయ్, దయామృతత్తోడే విళఙ్గుగిన్ఱ తిరునేత్రఙ్గళై యుడైయనాయిరున్దదు, వినవుగిఱ ఎఙ్గళై మిగవుమ్ వినవుమ్బడి పణ్ణుగైక్కో?

**(తనియేన్)** దేవరీర్ కైవిట్ట వన్ఱు మఱ్ఱొరు గతి యుడైయేనల్లేన్.

**(తనియేన్)** అన్ఱిక్కే, నిత్యముక్తరిలుమ్, సంసారిగళిలు మొరు అన్వయమిన్ఱిక్కే తనియనాయ్ ఇరుప్పేన్ నాన్-ఎన్ఱు శొల్లవుమామ్. **"ఇరుళ్ తరుమాఞాల"(తిరువాయ్ -10-6-1)**త్తిలే ఇరుక్కైయాలే, నిత్యముక్తరిలే ఒరువనెన్ఱు శొల్లప్పోగాదిఱే. సంసారిగళ్పడి ఒన్ఱు మిన్ఱిక్కే దేవరీర్ తిరువడియే ధారకపోషకభోగ్యఙ్గళాగ నినైత్తిరున్దపడియాలే అవర్గళిలే అన్వయ మిల్లై. ఇప్పడియాన ఎన్నై విడుగై దేవరీరుక్కు తగుమో? ఎన్గిఱార్.

---

**(తామరైక్కణ్ణా !)** సౌందర్యాది గుణాలతో తామరపూవు వలె ఉండి ఆశ్రితుల దుఃఖాన్ని చూచి, 'భృశంభవతి దుఃఖితః'' (మిక్కిలి దుఃఖాన్ని పొందుతున్నాడు) అనే రీతిలో దుఃఖాన్ని కల్గించే దయాప్రవాహాన్ని ప్రవహించే నేత్రాలను కలవాడా ! చూచిన చూపుతో శ్రమను తీర్చే తామరపూవువలె ఆశ్రితుల దుఃఖాన్ని తీర్చే తామరపూవువలె ఆశ్రితుల దుఃఖాన్ని తీర్చే దయారసంతో నిండిన తిరునేత్రాలను కలవాడా ! అనికూడా చెప్పవచ్చు. లేక, నీ నేత్రసౌందర్యంతో నన్ను వశీకరించుకొని ఈ విధంగా విడువడం తగునా ? అని అంటున్నారని అనవచ్చు.

**(ఓ!)-** ఈ విధంగా ఉన్న తిరునేత్రాలను కలవాడవై ఉండికూడా నన్ను కటాక్షించకుండా **"ఇరుళ్ తరు మాఞాలమ్"** (అజ్ఞానప్రదం అయిన విశాలభూమి) అయిన విభూతిలోనికి గెంటివేయడం ఉచితమా!- అని ఆక్రోశిస్తున్నారు.

**(తామరైకణ్ణా ! వో !)-"పుండరీకాక్ష ! రక్ష మాం శరణాగతామ్"** (ఓ పుండరీక్షా ! శరణాగతురాలైన నన్ను రక్షించు) అనే రీతిలోనే ఈ సూక్తికూడా. **"గంభీరాంభఃసముద్భూతసుమృష్టనాళరవికరవికసిత"** (నిండైన నీటిలో పుట్టినది, బలమైన కాడను కల్గిన, సూర్యుని కిరణాలతో వికసించినది) మైన తామరపూవువలె అతివిశాలమై, దయ అనే అమృతంతో వెలుగుతున్న తిరునేత్రాలను కలవాడై ఉండడం, బాధపడే మమ్మల్ని ఇంకా బాధపడేటట్లు చేయడంకోసమా?

**(తనియేన్)-** నీవు చేయి విడచినపుడు వేఱొక గతిని ఉన్నవాడను కాను.

**(తనియేన్)-** లేక, నిత్యముక్తులలోను, సంసారులలోను ఏ సంబంధం లేకుండా ప్రత్యేకంగా ఉన్నాను- అని చెప్పవచ్చు. అజ్ఞానప్రదం అయిన విశాలభూమిలో ఉండడంవల్ల నిత్యముక్తులలో ఒకరు అని చెప్ప వీలు కాదుకదా! సంసారుల రీతి ఏమీ లేకుండా, నీ శ్రీపాదాలే ధారక-పోషక- భోగ్యాలుగా తలచిన రీతిచేత వారితో ఏ అన్వయం లేదు. ఇట్లున్న నన్ను విడవడం నీకు తగునా?- అని అంటున్నారు.

(తనియాళా! వో !) అడియేనై రక్షిప్పతఱ్కు దేవరీరుక్కొరు సహాయాంతరమ్ వేణుమో? దేవరీర్ అద్వితీయరితే. "న తత్సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే" (శ్వేత-6-8) ఎన్గిఱదితే శ్రుతియుమ్. "బ్రహ్మా మా మాశ్రితో రాజన్! నాహం కంచి దుపాశ్రితః" ఎన్గిఱపడియే దేవరీరుక్కొరు ఆశ్రయమ్ తేడవేణ్డావితే.

(తామరైక్కైయు! వో!) "భవదుర్దినత్తిలే పథస్ఖలిత" (స్తోత్రరత్నమ్-49) నాన ఎన్నై విడువిత్తుగైక్కు తక్క పరికరమాన శ్రీహస్తత్తై యుడైయరాయిరున్దుమ్ ఇప్పడి విడుగై తగుమో? అయ్యో? ఎన్ఱు కూప్పిడుగిఱార్. అన్ఱిక్కే,

(తామరైక్కైయా! వో!) "భవేయం శరణం హి వః" (రామా. సుందర-27-63) ఎన్ఱవళుడైయ తిరుహస్తత్తై ప్పఱ్ఱి సౌందర్యాదిగళాలే ఒరు తామరైపోన్ఱ శ్రీహస్తత్తైయుడైయనా యిరున్దువైత్తు, అడియేనాన ఎన్నై ఇప్పడి విడుగై తగుమో? ఎన్ఱు కూప్పిడుగిఱార్ - ఎన్ఱు శొల్లవుమామ్.

(ఉన్నై యెన్ఱుకొల్ శేర్వదువే) దేవరీరై యాన్ శేర్వదెన్నాళ్ ? ఇదుక్కడియేన్ శక్తనల్లన్. పిఱర్గళ్ శక్తిరల్లర్. దేవరీరే, అడియేనై దేవరీర్ సన్నిధిక్కు వన్దడైయుమ్బడి కటాక్షిత్తరుళవేణుమ్ -ఎన్ఱు కూప్పిడుగిఱార్. అప్పడియే ఇన్ద గోపిమార్గళుమ్ కూప్పిడుగిఱార్గళ్.

(రురుదు స్సుస్వరమ్) స్వరయుక్తమాగ ప్రపత్తిపణ్ణినార్గళ్ -ఎన్ఱపడి. స్వర మావదు వేదస్వరమ్. అదావదు-ప్రణవస్వరమ్. అత్తాలే శరణాగతరానార్ ఎన్ఱపడి. ఇవర్ వేదమార్గప్రవర్తకరితే. "ఓ మిత్యాత్మానం యుంజీత", "ఓమితి ధ్యాయీథ" (ముండక-2-2-6) ఎన్ఱు శ్రుతియిల్ శొల్లిఱ్ఱాయ్ఱ్ఱు. అన్ఱిక్కే, ప్రణవవివరణమ్

---

(తనియాళా వో!)- దాసుణ్ణి రక్షించడానికి నీకొక సహాయాంతరం కావాలా? నీవు అద్వితీయుడవుకదా! "తత్సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే" (అతనితో సమానుడు, అధికుడు కన్పించడం లేదు) అని అంటున్నదికదా శ్రుతికూడా. "బ్రహ్మా మమాశ్రితో రాజన్! నాహం కంచి దుపాశ్రితః" (ఓరాజా! బ్రహ్మ నన్ను ఆశ్రయించాడు, నేనయితే ఎవరినీ ఆశ్రయించలేదు) అన్నట్లు నీకొక ఆశ్రయాన్ని వెదుకవలసిన అవసరం లేదు కదా!

(తామరైక్కైయా వో !)- భవదుర్దినంలో పథస్ఖలితుణ్ణి (సంసారమనే ముసురుపట్టిన దినంలో దారి తెలియక తొట్రుపాటుపడినవాడను) అయిన నన్ను లేవనెత్తడానికి తగిన పరికరమైన శ్రీహస్తాన్ని కలవాడవై ఉండికూడా ఈ విధంగా విడవడం తగునా? అయ్యో!- అని ఆక్రందిస్తున్నారు. లేక,

(తామరైక్కైయా వో!)- "భవేయం శరణం హి వః" (మీకు నేను శరణం కాగలను) అన్న ఆమెయొక్క శ్రీహస్తాన్ని ఆశ్రయించి, సౌందర్యాలలో ఒక తామరపూవువంటి శ్రీహస్తాన్ని కలవాడవై ఉండి, దాసుడనైన నన్ను ఈవిధంగా విడవడం తగునా? అని ఆక్రందిస్తున్నారు- అనికూడా చెప్పవచ్చు.

(ఉన్నై యెన్ఱుకొల్ శేర్వదువే)- నిన్ను నేను చేరడం ఏనాడు! దీనికి దాసుడను సమర్థుడను కాను. ఇతరులు సమర్థులు కారు. నీవే, నన్ను నీ సన్నిధికి వచ్చి, ఆశ్రయించేటట్లు కటాక్షించాలి- అని ఆక్రందిస్తున్నారు. ఆ విధంగానే ఈ గోపికలు కూడా ఆక్రందిస్తున్నారు.

(రురుదుః సుస్వరమ్)- స్వరయుక్తంగా ప్రపత్తిని చేశారు- అని భావం. స్వరమంటే వేదస్వరం. అనగా- ప్రణవస్వరం. దానిచేత శరణాగతులయ్యారని భావం. వీరు వేదమార్గప్రవర్తకులుకదా! "ఓ మిత్యాత్మానం యుంజీత", "ఓ మితి ధ్యాయథ" (ప్రణవంతో ఆత్మను సమర్పించండి, ప్రణవంతో ధ్యానించండి) అని శ్రుతిలో చెప్పబడింది. లేక, ప్రణవవివరణం ద్వయమంత్రం కాబట్టి, మంత్రరత్నం, "మంత్రరత్నం ద్వయం న్యాసం ప్రపత్తిః శరణాగతిః", "ద్వయం, న్యాసం, ప్రపత్తి, శరణాగతి"అనే రీతిలో శరణాగతి అని దీనికి పేరున్నందున, షడ్విధమైన శరణాగతిని

ద్వయమంత్రమాగైయాలుమ్ "మంత్రరత్నం ద్వయం న్యాసం ప్రపత్తి శ్శరణాగతిః" ఎన్గిఱపడియే శరణాగతి ఎన్ఱిదుక్కు పేరుణ్డాగైయాలుమ్, షడ్విధమాన శరణాగతియై సుస్పష్టమాగ వెళియిట్టుక్కొణ్డు ద్వయత్తాలే శరణాగతరానార్- ఎన్ఱు శొల్లవుమామ్. ఎజ్గనే? ఎన్ఱిల్- "విధికరీ రిమాః వీర! ముహ్యతీః అధరశీధునాఽప్యాయ-యస్వ నః" (భాగవతమ్) ఎన్గిఱ వాక్యత్తాలే అనుకూల్య సంకల్పమ్ శొల్లిఱ్ఱాయ్ఱ్ఱు. "పతిసుతాన్వయభ్రాతృబాంధవా నతివిలంఘ్య" (భాగవతమ్) ఎన్ఱ వాక్యత్తాలే ప్రాతికూల్యస్య వర్జనమ్ శొల్లప్పట్టదు. "విషజలాశయాత్" ఎన్గిఱ శ్లోకత్తాలే రక్షణవిషయవిశ్వాసమ్ శొల్లిఱ్ఱాయ్ఱ్ఱు. "విశ్వగుప్తయే సఖ! ఉదేయివాన్ సాత్వతాం కులే" ఎన్గిఱ వాక్యత్తాలే గోప్తృత్వవరణమ్ శొల్లప్పట్టదు. "త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే" ఎన్గిఱ వాక్యత్తాలే ఆత్మనిక్షేపమ్ శొల్లప్పట్టదు. "యోషితః క స్త్యజే న్నిశి" ఎన్ఱుమ్, "అశుల్కదాసికాః" ఎన్ఱుమ్ కృపాజనకకృపణవృత్తినిరతత్వమ్ శొల్లప్పట్టదు. ఇప్పడి "ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్, రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వ వరణం తథా, ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతిః" (అహిర్బుధ్న్యసంహిత) ఎన్ఱు శొల్లప్పడుగిఱ షడ్విధమాన శరణాగతియై పణ్ణినపడి శొల్లిఱ్ఱాయ్ఱ్ఱు, "రురుదు స్సుస్వరమ్" ఎన్గిఱ పదజ్గళాలే".

(రాజన్) పరీక్షితనే!

(కృష్ణదర్శనలాలసాః) ఇప్పడి శెయ్యవేణ్డిఱ్ఱు ఆశ్రితపాపనివర్తకనాన సర్వేశ్వరవిషయమాన, భగవదను భవజనితసర్వదేశ-సర్వకాల-సర్వావస్థోచిత ప్రీతికారిత కైంకర్యాభినివేశప్రేరితరాయాయ్ఱ్ఱు. ఆగ, "రురుదు స్సుస్వరమ్" ఎన్ఱు ద్వయపూర్వవాక్యార్థముమ్, "కృష్ణదర్శనలాలసాః" ఎన్ఱు ద్వయోత్తరవాక్యార్థ మనుసంధిత్తు, ఇన్ద శ్లోకత్తాలే పూర్ణమాగ ద్వయమంత్రార్థత్తై అనుసంధిత్తారాయ్ఱ్ఱు. ఇజ్గు దర్శనశబ్దమ్ కణ్ణాలే కాణ్గై యన్ఱి కైంకర్యత్తై

---

సుస్పష్టంగా ప్రకటిస్తూ ద్వయంతో శరణాగతిని చేశారు - అని కూడా చెప్పవచ్చు. ఏవిధంగా అంటే -"విధికరీ రిమాః వీర! ముహ్యతీః అధరశీధునాఽప్యాయయస్వ నః" అనే వాక్యంతో ఆనుకూల్యసంకల్పం చెప్పబడింది. "పతిసుతాన్వయభాతృబాంధవా నతివిలంఘ్య" అనే వాక్యంతో ప్రాతికూల్యవర్జనం చెప్పబడింది. "విషజలాశయాత్" అనే శ్లోకంలో రక్షణవిశ్వాసం చెప్పబడింది. "విశ్వగుప్తయే సఖ! ఉదేయివాన్ సాత్వతాం కులే" అనే వాక్యంతో గోప్తృత్వవరణం చెప్పబడింది. "త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే" అనే వాక్యంతో ఆత్మనిక్షేపం చెప్పబడింది. "యోషితః క స్త్యజే న్నిశి ?" అని, "అశుల్కదాసికాః" అని కృపాజనక కృపణవృత్తినిరతత్వం చెప్పబడింది. ఈ విధంగా "ఆనుకూల్యస్యసంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్, రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వవరణం తథా, ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః" (ఆభగవానుని రక్షణ ప్రయత్నానికి అనుకూలించాలనే సంకల్పం, ప్రాతికూల్యాన్ని విడువం, భగవానుడు రక్షిస్తాడనే విశ్వాసం, భగవానుని రక్షకునిగా వరించడం, ఆత్మనిక్షేపం, కృపణత్వం- అనేవి శరణాగతియొక్క ఆఱు అంగాలు) అని చెప్పబడుతున్న షడ్విధమైన శరణాగతిని చేసిన తీరు "రురుదః సుస్వరమ్" అనే పదాలతో చెప్పబడింది.

(రాజన్)- పరీక్షిత్తూ!

(కృష్ణదర్శనలాలసాః)- ఈ విధంగా చేయవలసివచ్చినది (ఎందుకంటే)-ఆశ్రితపాపనివర్తకుడైన సర్వేశ్వరుని విషయంలోని, భగవదనుభవంవల్ల కల్గిన సర్వదేశ-సర్వకాల- సర్వావస్థలకు తగిన ప్రీతికారితకైంకర్యాభినివేశం చేత ప్రేరింపబడినవారు కావడంవల్ల. కాబట్టి "రురుదుః సుస్వరమ్" (సుస్వరంగా రోదించారు) అని ద్వయపూర్వ వాక్యార్థాన్ని, "కృష్ణదర్శనలాలసాః" (శ్రీకృష్ణదర్శనంలో ఆసక్తిని కలవారు) అని ద్వయోత్తరవాక్యార్థాన్ని అనుసంధించి, ఈశ్లోకంలో పూర్ణంగా ద్వయార్థాన్ని అనుసంధించినవారయ్యారు. ఇచట దర్శనశబ్దం కన్నుతో దర్శించడాన్ని తప్ప కైంకర్యాన్ని తెలుపుతుందా ? అంటే, కైంకర్యం ప్రధానమైన ప్రాప్యం కనుక, శేషభూతలైన వీరి స్వరూపసిద్ధి

కాట్టుమో? ఎన్నిల్, కైంకర్యమ్ ప్రధానప్రాప్యమాగైయాలుమ్, శేషభూతరాన ఇవర్గళుడైయ స్వరూపసిద్ధి శేషవృత్తియాలే యాగైయాలుమ్, దర్శనముమ్, "ఉన్ పవళవాయ్ కాణ్బేనే" (పెరుమాళ్- 4-9) ఎన్గిఱపడియే ఒరు కైంకర్యమే యాగైయాలుమ్, దర్శనత్తిలే ఇఴిగిఱదుమ్ ప్రధానప్రాప్యమాన కైంకర్యత్తుక్కు హేతువాగైయాలుమ్, కైంకర్యత్తై కాట్టుమ్. "సాయుజ్యం ప్రతిపన్నా యే తీవ్రభక్తా స్తపస్వినః, కింకరా మమ తే నిత్యం భవంతి నిరుపద్రవాః" (పరమసంహిత-చరమపటలం) ఎన్గిఱపడియే సాయుజ్యత్తై ప్రధానమాగ శొల్లుగిఱదు కైంకర్యమాగైయాలే. సాయుజ్యమావదు- కూట్టరవు. కూడినాలల్లదు కైంకర్యమ్ సిద్ధియాదిఱే.

(కృష్ణదర్శనలాలసాః రురుదు స్సుస్వరమ్) ఇవ్వవతారమ్ సర్వావతారఙ్గళిలుమ్ పూర్ణమాయిరున్ద పడియాలే, ఇత్తై దర్శిత్తు కైంకర్యమ్ పణ్ణవేణు మెన్ఱ అభినివేశత్తోడే ప్రపత్తి పణ్ణినార్గళ్ ఎన్ఱు శొన్నపడి. ఇతు కృష్ణావతారమిఱే. "కకారః కమలాకాన్తిః ఋకారో రామ ఇత్యపి, షకార ష్షడ్గుణపతి శ్వేతద్వీపనివాసకృత్, ణకారో నారసింహోఽయమకారో హ్యక్షరోఽగ్నిభుక్, విసర్గ శ్చ తథా హ్యేతౌ నరనారాయణా వృషీ, సంప్రలీనా శ్చ షట్పూర్ణాః యస్మిన్ శబ్దే మహామునే! పరిపూర్ణతమే సాక్షా త్తేన కృష్ణః ప్రకీర్తితః" ఎన్ఱు శొల్లానిన్ఱదిఱే. "సర్వదేవమయో గురుః" ఎన్గిఱ న్యాయత్తాలే సర్వదేవాత్మకమాన ఆచార్యావతారమాగైయాలే, అవనిడత్తిలే శరణమ్ పుకుగిఱార్. శరణాగతిక్కు పూర్ణవిషయమిదువిఱే. గోగోపగోపికాముక్తిప్రదమాన అవతారమాగైయాలే ఇవ్వవతారత్తోడొత్త అవతార మిల్లైయే. "అవతారాస్సంత్వన్యే సరసిజనయనస్య సర్వతో భద్రాః, కృష్ణా దన్యత్ర కో వా ప్రభవతి గోగోపగోపికాముక్త్యై" ఎన్ఱు శొల్లప్పట్టదిఱే.

ఇరుపదామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

---

శేషవృత్తివల్ల కాబట్టి, దర్శనంకూడా "ఉన్ పవళవాయ్ కాణ్బేనే" (నీపగడపు మోవిని దర్శిస్తాను) అనే రీతిలో ఒక కైంకర్యమే కాబట్టి, దర్శనంలో ప్రయత్నించడంకూడా ప్రధానప్రాప్యమైన కైంకర్యానికి హేతువు కనుక, కైంకర్యాన్నే తెలుపుతుంది- "సాయుజ్యం ప్రతిపన్నా యే తీవ్రభక్తా స్తపస్వినః, కింకరా మమ తే నిత్యం భవంతి నిరుపద్రవాః" (తీవ్రభక్తిని కలవారు, తపస్సును- అంటే- న్యాసాన్ని అనుష్ఠించినవారై సాయుజ్యాన్ని పొందిన వారై, నాకు సేవను చేసేవారు ఎవరున్నారో వారికి ఏ ఉపద్రవం లేదు) అనే రీతిలో సాయుజ్యాన్ని ప్రధానంగా చెప్పేది కైంకర్యం కాబట్టి. సాయుజ్యం అంటే - కలయిక. కలిస్తే తప్ప కైంకర్యం సిద్ధించదుకదా !

(కృష్ణదర్శన లాలసాః రురుదుః సుస్వరమ్)- ఈ అవతారం అన్ని అవతారాలకంటే పూర్ణంగా ఉన్నందున, దీనిని దర్శించి కైంకర్యాన్ని చేయాలనే అభినివేశంలో ప్రపత్తిని చేశారు- అని చెప్పినట్లయింది. ఇది కృష్ణావతారంకదా! "కకారః కమలాకాంతః ఋకారో రామ ఇత్యపి, షకార ష్షడ్గుణపతిః శ్వేతద్వీపనివాసకృత్, ణకారో నారసింహోఽయమ్ అకారో హ్యక్షరోఽగ్నిభుక్, విసర్గ శ్చ తథా హ్యేతౌ నరనారాయణా వృషీ, సంప్రలీనా శ్చ షట్పూర్ణాః యస్మిన్ శబ్దే మహామునే! పరిపూర్ణతమే సాక్షా త్తేన కృష్ణః ప్రకీర్తితః" (కకారం కమలాకాంతుడు, ఋకారం రాముడు, షకారం శ్వేతద్వీపనివాసి అయిన షడ్గుణపతి, ణకారం నరసింహుడు, అకారం అగ్నిభుక్కు, ఈ విసర్గలు రెండు నరనారాయణులనే ఋషులు, ఈ ఆఱు ఏ శబ్దంలో పూర్ణమై లీనమయ్యాయో ఆశబ్దం కృష్ణశబ్దమని చెప్పబడుతున్నది) అని చెప్పబడుతున్నదికదా! "సర్వదేవమయో గురుః" (గురువు సర్వదేవస్వరూపుడు) అనే న్యాయం వల్ల సర్వదేవాత్మకం అయిన ఆచార్యావతారం అయినందున అతని విషయంలో శరణు పొందుతున్నారు. శరణాగతికి పూర్ణవిషయం ఇదేకదా! గో-గోప-గోపికలకు ముక్తిని ఇచ్చే అవతారం కాబట్టి ఈ అవతారంతో పోలిన అవతారం లేదే! "అవతారా స్సంత్వన్యే సరసిజనయనస్య సర్వతోభద్రాః, కృష్ణా దన్యత్ర కో వా ప్రభవతి గోగోపగోపికాముక్త్యై ?" (పుండరీకాక్షుని సర్వతోభద్రాలైన మిగిలిన అవతారాలు ఎన్నో ఉండనీ. వాటిలో గోవుల, గోపజనుల, గోపికల ముక్తికి అనుగ్రహించడంలో శ్రీకృష్ణావతారం తప్ప ఇంకొక అవతారం ఏది సమర్థమైనది?) అని చెప్పబడిందికదా!

ఇరవైయవ శ్లోకం ముగిసింది

## ఇరుపత్తొన్టామ్ శ్లోకమ్

అవ :- ముదల్ శ్లోకత్తాలే "ఎజ్గళ్ ప్రాణజ్గళెల్లామున్మేలే ఇరుక్క దేవరీరిప్పడి ఒళిక్కై తగుమో? ఎజ్గళ్ మున్నే తోన్ఱవేణు" మెన్ఱు ప్రార్థిత్తార్. ఇరణ్డామ్ శ్లోకత్తాలే, గంభీరాంభస్సముద్భూత- సుమృష్టనాళ- రవికరవికసిత పుండరీకదళామలాయతేక్షణత్తాలే ఎజ్గళై యశుల్కదాసికరామ్బడి పణ్ణివైత్తు, ఇప్పడి అన్ద సౌందర్యత్తై సేవియాతపడి మఱైత్తు వధిక్కై తగాదుకాణ్ ఎన్టార్. మున్టామ్ శ్లోకత్తాలే, సర్వవిధాపత్తుక్కళ్ నిన్ఱుమ్ నలియాదే రక్షిత్తు, ఇన్ఱు ఇన్ద కానగత్తిలే విట్టు రక్షియాదే బాధిత్తునిన్టాయే ! ఎన్ఱు ఆశ్చర్యప్పట్టార్. నాలామ్ శ్లోకత్తాలే, విశ్వరక్షణత్తుక్కాగ వన్దరుళిన దేవరీర్ ఇప్పడి దాసభూతరాన ఎజ్గళై విడుగై తగుమో? ఎన్టార్. అఞ్జామ్ శ్లోకత్తిలే, ఇజ్గేరున్దనాళ్ భయమ్ కెట్టు సుఖిక్కైక్కాగవుమ్ దేవరీరుడైయ సకలాభయప్రదమాన శ్రీహస్తత్తై ఎజ్గళ్ శిరస్సిల్ వైక్కవేణు మెన్ఱు ప్రార్థిత్తార్. ఆఱామ్ శ్లోకత్తాలే, ఆశ్రితరుడైయ అజ్ఞానత్తై నశిప్పిక్కవల్ల ముఱువలోడే విళఙ్గుగిన్ఱ తిరుముఖమణ్డలత్తై కాట్టవేణు మెన్ఱు వేణ్డిక్కొణ్డార్. ఏఴామ్ శ్లోకత్తాలే, ఇవ్వళవే పోరాదుకాణ్. ఆశ్రితరుడైయ పాపత్తై నశిప్పిక్కత్తక్కవైయాయ్, సౌలభ్యగుణప్రకాశకజ్గళాయ్, సకలకల్యాణనిలయజ్గళాయ్, కామక్రోధనివర్తకజ్గళాయ్, సకలజగత్తుక్కు ముపాయోపేయజ్గళాయ్, వేదాన్తజ్గళాయ్, విహరిక్కిఱ దేవరీరుడైయ తిరువడిత్తామరైగళై ఎజ్గళుడైయ హృదయజ్గళిలే నిత్యవాసమామ్బడి పణ్ణి యరుళవేణు మెన్ఱు ప్రార్థిత్తార్. ఎట్టామ్ శ్లోకత్తాలే, ఎజ్గళుక్కు ధారకమాగ సకలజగన్మోహనమాన శ్రీసూక్తిగళాలే ప్రకాశిక్కిఱ దేవరీరుడైయ తిరువధరామృతపానత్తై పణ్ణువిత్తు, ఎజ్గళై ఉజ్జీవిప్పిత్తవేణు మెన్ఱు ప్రార్థిత్తార్. ఒన్బతామ్ శ్లోకత్తాలే, సకలేతరవిలక్షణమాన దేవరీరుడైయ దివ్యకథామృతత్తై పానమ్ పణ్ణుగిఱవర్ అతిధన్యరెన్ఱు తత్కథామృతవైభవపూర్వకమాగ భాగవతవైభవత్తై కొణ్డాడినార్. పత్తామ్ శ్లోకత్తాలే,

---

## ఇరవై ఒకటవశ్లోకం

అవ :- మొదటి శ్లోకంతో- మా ప్రాణాలు అన్నీ నీపైన ఉండగా నీవు ఈ విధంగా అంతర్హితుడవై (దాగి) ఉండడం తగునా? మా ఎదుట సాక్షాత్కరించాలని ప్రార్థించారు. రెండవ శ్లోకంలో- "గంభీరాంభఃసముద్భూత సుమృష్టనాళ - రవికరవికసిత - పుండరీక దళామలాయతేక్షణాలతో" (లోతైన నీటిలో పుట్టినది, బలంగా ఉన్న నాళాన్ని కల్గినది, సూర్యుని కిరణాలతో వికసించినదైన పుండరీకంయొక్క దళాలవలె విస్తృతమైన, నిర్మలమైన కన్నులను కలవాడు) మమ్మల్ని శుల్కం లేని దాసురాండ్రు అయేటట్లుచేసి, ఈ విధంగా ఆ సౌందర్యాన్ని దర్శించలేనట్లు దాచి, వధించడం తగదుసుమా! అన్నారు. మూడవ శ్లోకంతో - అన్నివిధాలైన ఆపదలనుండి బాధపడకుండా రక్షించి, ఇపుడు ఈ అరణ్యంలో విడచి రక్షించకుండా బాధిస్తున్నావే!- అని ఆశ్చర్యపడ్డారు. నాల్గవ శ్లోకంతో -విశ్వరక్షణకోసం వచ్చిన నీవు ఈ విధంగా దాసభూతలం అయిన మమ్మల్ని విడవడం తగునా? అన్నారు. అయిదవ శ్లోకంలో- ఇక్కడ ఉన్న నాడు భయంపోయి సుఖించడంకోసం, నీయొక్క, సకలాభయప్రదం అయిన శ్రీహస్తాన్ని మా శిరస్సులలో పెట్టాలి- అని ప్రార్థించారు. ఆఱవ శ్లోకంలో- ఆశ్రితుల అజ్ఞానాన్ని నశింపజేయగల చిఱునవ్వుతో వెలుగుతున్న తిరుముఖమండలాన్ని చూపాలి- అని వేడారు. ఏడవ శ్లోకంలో - ఇంతమాత్రం చాలదు సుమా! ఆశ్రితుల పాపాన్ని నశింపజేయగలవై, సౌలభ్యగుణాన్ని ప్రకాశింపజేసేవై, సకలకల్యాణనిలయాలై, కామక్రోధాలను నివర్తింపజేసేవై, సకలజగత్తుకు ఉపాయోపేయాలై, వేదాంతాలలో విహరించే నీ శ్రీపాదపద్మాలను మా హృదయాలలో నిత్యవాసం చేసేటట్లుగా చేసి అనుగ్రహించాలి-అని ప్రార్థించారు. ఎనిమిదివ శ్లోకంలో- మాకు ధారకంగా, సకలజగన్మోహనం అయిన శ్రీసూక్తులతో ప్రకాశించే నీ తిరువధరామృత పానాన్ని చేయించి, మమ్మల్ని ఉజ్జీవింపజేయాలి- అని ప్రార్థించారు. తొమ్మిదవ శ్లోకంలో -సకలేతరవిలక్షణం

దేవరీరుడైయ ముఱువలుమ్, ప్రేమప్రవాహత్తై ప్రవహిక్కిఱ తిరునేత్రఙ్గళుమ్, అతిమానుషగుణచేష్టితఙ్గళుమ్, నర్మాలాపఙ్గళుమ్, ఎఙ్గళుడైయ నెఞ్జుగళై క్షుభితమామ్బడి పణ్ణిన ఎన్నార్. పత్తొన్ఱామ్ శ్లోకత్తిలే, నళినసుందరమాయ్, కోమలమాన తిరువడియైక్కొణ్డు కానగఙ్గళిలే ఉలావుగిఱాయే- ఎన్ఱు కూప్పిట్టార్. పన్నిరణ్డామ్ శ్లోకత్తిలే, సాయన్తనసమయత్తిలే పశుక్కళై మీట్టుక్కొణ్డు వరుకిఱపోతు ధూళిధూసరితమాన నీలకున్తలఙ్గళోడే ప్రకాశిక్కిఱ తిరుముఖమణ్డలశోభైయై స్మరిత్తు అత్తై తఙ్గళుక్కు ప్రత్యక్షమాక్కి యరుళవేణు మెన్ఱు ప్రార్థిత్తార్. పతిన్ మూన్ఱామ్ శ్లోకత్తాలే, ఇరువర్గళుడైయ వైభవత్తై స్మరిత్తు, అవై తఙ్గళుడైయ హృదయఙ్గళిలే ఎప్పోదుమ్ వైత్తు విరహతాపమ్ తీరుమ్బడి పణ్ణి యరుళవేణుమెన్నార్. పతినాలామ్ శ్లోకత్తిలే, అపునరావృత్తిలక్షణమాన మోక్షత్తై త్తరవల్ల తిరువధరామృతత్తై యాచిత్తార్. పతినఞ్జామ్ శ్లోకత్తిలే, తఙ్గళుక్కుణ్డాన విరహాసహిష్ణుత్తైయై ప్పేశినార్. పతినాఱామ్ శ్లోకత్తిలే, చరమశ్లోకత్తిన్ పడియే పుఱమ్బుణ్డాన పఱ్ఱుక్కళైయడైయ సవాసనమాగ విట్టు దేవరీరుడైయ శ్రీసూక్తియాలే మోహిత్తు దేవరీరే గతి ఎన్ఱఱిన్దు వన్ద అబలలాన ఎఙ్గళై ఇప్పడి విడత్తగుమో? ఎన్నార్. పతినేழామ్ శ్లోకత్తిలే, ఆశ్రితరుడైయ ఆర్త్తియై నశిప్పిక్కవల్ల దేవరీరుడైయ దివ్యమఙ్గళవిగ్రహత్తై ఇప్పోదే ఎఙ్గళుక్కు ప్రత్యక్షమాక్కవేణు మెన్ఱు ప్రార్థిత్తార్. పత్తొన్బదామ్ శ్లోకత్తాలే, తిరియవుమ్ తిరువడియుడైయ సౌందర్యత్తై స్మరిత్తు, అతియిలే ఈడుపట్టు అతిన్ సన్నిధియిల్ కైంకర్యఙ్గళై అర్థిత్తార్. ఇరుపదామ్ శ్లోకత్తిల్, ఇప్పడి ప్రార్థిత్తవిడత్తిలుమ్ కాణాదపడియాలే, తఙ్గళుడైయ ప్రార్థనముమ్ ఉపాయ మన్ఱెన్ఱు విట్టు, ఇన్నాప్పాలే అవనుడైయ హృదయమ్ ద్రవీభూతమామ్బడి తన్నుడైయ స్వరూపత్తై సాక్షాత్కరిక్కవేణు మెన్ఱు అఞ్జలిట్టుక్కొణ్డు రోదనమ్ పణ్ణినార్. నిగమత్తిల్, ఇప్పడి తన్నై క్కుఱిత్తు విరహాతిశయత్తాలే వినవుగిఱ అవర్గళుడైయ గోష్ఠియిలే అవర్గళుడైయ ఆర్తి ఎల్లామ్ తీరుమ్బడి అవర్గళ్ ప్రార్థిత్తపడియే

అయిన నీ దివ్యకథామృతాన్ని పానం చేసేవారు చాలా ధన్యులు అని, ఆ కథామృతవైభవంతో పాటుగా భాగవతవైభవాన్ని కీర్తించారు. పదవ శ్లోకంలో- నీ చిఱునవ్వు, ప్రేమప్రవాహాన్ని ప్రవహించే తిరునేత్రాలు, అతిమానుష గుణచేష్టితాలూ, నర్మాలాపాలూ- మా మనస్సులను క్షోభిల్లేటట్లు చేశాయి- అని అన్నారు. పదకొండవ శ్లోకంలో -నళినసుందరమై, కోమలం అయిన శ్రీపాదంతో అరణ్యంలో సంచరిస్తున్నావే !- అని ఆక్రందించారు. పన్నెండవ శ్లోకంలో -సాయంకాల సమయంలో పశువులను తిరిగి తీసికొనివచ్చేటపుడు ధూళిధూసరితం అయిన నీలకేశాలలో ప్రకాశించే తిరుముఖమండలశోభను స్మరించి, దానిని తమకు ప్రత్యక్షం కావించి అనుగ్రహించాలి- అని ప్రార్థించారు. పదమూడవ శ్లోకంలో- శ్రీపాదాల వైభవాన్ని స్మరించి, వాటిని తమ హృదయాలలో ఎప్పుడూ ఉంచి, విరహతాపం తీరేటట్లు చేసి అనుగ్రహించాలి అన్నారు. పధ్నాల్గవశ్లోకంలో -అపునరావృత్తిలక్షణం అయిన మోక్షాన్ని ఇవ్వగల అధరామృతాన్ని యాచించారు. పదిహేనవ శ్లోకంలో- తమకున్న విరహాసహిష్ణుతనుగూర్చి పలికారు. పదహారవ శ్లోకంలో చరమశ్లోకంలోవలె బయట ఉన్న బంధాలను సవాసనగా విడచి, నీ శ్రీసూక్తిచేత మోహించి, నీవే గతి అని తెలిసి వచ్చిన అబలలం అయిన మమ్మల్ని ఈ రీతిలో విడవడం తగునా? అన్నారు. పదిహేడవ శ్లోకంలో - నీ నర్మాలాపాలను విడచి, లక్ష్మికి ఆశ్రయం అయిన వక్షఃస్థలాన్ని సేవించిన మా మనస్సు మోహించి ఉన్నది సుమా! అన్నారు. పదునెనిమిదవ శ్లోకంలో- ఆశ్రితుల ఆర్తిని నశింపజేయగల నీ దివ్యమంగళ విగ్రహాన్ని ఇపుడే మాకు ప్రత్యక్షం కావించాలి- అని ప్రార్థించారు. పందొమ్మిదవ శ్లోకంలో - తిరిగి శ్రీపాదాల సౌందర్యాన్ని స్మరించి, వానిలో అభినివేశాన్ని పొంది, వాని సన్నిధిలో కైంకర్యాన్ని అర్థించారు. ఇరవైయవ శ్లోకంలో- ఈ విధంగా ప్రార్థించినా కన్పించనందున తమప్రార్థన కూడా ఉపాయం కాదని విడచి, ఆర్తితో అతని హృదయం నీరయ్యేటట్లు తన స్వరూపాన్ని సాక్షాత్కరింపజేయాలి- అని అంజలిని చేస్తూ రోదించారు. చివరిగా,- ఈవిధంగా తననుగూర్చి విరహాతిశయంతో బాధపడేవారి గోష్ఠిలో వారి ఆర్తి అంతా తీరేటట్లు వారు ప్రార్థించిన రీతిలోనే

తన్నుడైయ దివ్యమఙ్గళవిగ్రహసంస్థానత్తై ప్రదర్శిత్తుక్కొణ్డు సర్వేశ్వరన్ వన్దు ముకమ్ కాట్టినపడియై శొల్లిఱ్ఱాయ్ఱ్ఱు. ఇత్తాల్- "నాయ మాత్మా" (కఠ-2-23) ఎన్గిఱ శ్రుత్యర్థమ్ ప్రకాశితమ్. అన్జిక్కే, ముదల్ శ్లోకత్తిలే శ్రీమత్పదార్థత్తై అనుసన్ధిత్తు, ఇరణ్డామ్ శ్లోకమ్ మున్నాగ నాలామ్ శ్లోకత్తళవుమ్ నారాయణపదార్థత్తై అనుసంధిత్తు, అఞ్జామ్ శ్లోకమ్ మున్నాగ ఇరుపదామ్ శ్లోకత్తళవుమ్ "చరణౌ శరణం ప్రపద్యే" (ద్వయమ్) ఎన్గిఱ వాక్యశేషత్తుక్కర్థమనుసంధిత్తు, నిగమత్తిల్ ఉత్తరవాక్యార్థ మనుసన్ధిత్తరుళిచ్చెయ్‌గిఱార్- ఎన్దవుమామ్. ముదల్ శ్లోకమ్ మున్నాగ ఇరుపదామ్ శ్లోకత్తళవుమ్ ఉపాసకకృత్యత్తై అనుసంధిత్తు, నిగమత్తిల్ ఉపేయకృత్యత్తై అరుళిచ్చెయ్‌గిఱారెన్దవుమామ్. ఉపాసకకృత్యమ్ శరణాగతి. ఉపేయకృత్యమ్ ఆశ్రితర్క్కు తన్నుడైయ సన్నిధియై కటాక్షిత్తుకైంకర్యఙ్గళై ప్రసాదిక్కై. "తాసా మా విరభూత్" (భాగవతే-10-32-2) ఎన్గిఱపడియే అవర్‌కళ్ మున్నే ఆవిర్భవిత్తు, "సర్వా స్తాః కేశవాలోకపరమోత్సవనిర్వృతాః, జహు ర్విరహజం తాపం ప్రాజ్ఞం ప్రాప్య యథా జనాః" (భాగవతమ్-10-32-10) ఎన్గిఱపడియే అవరుడైయ విశ్లేషవ్యసనత్తై తీర్‌త్తు, "స్వై రుత్తరీయైః కుచకుంకుమాంకితై రచిక్లిప న్నాసన మాత్మబంధవే" (భాగవతమ్-10-32-14) ఎన్గిఱపడియే అవరిట్ట ఆసనత్తిలే ఇరున్దు, "తత్రోఽపవిష్టో భగవాన్ స ఈశో యోగీశ్వరాంతర్హృది కల్పితాసనః, చకాస గోపీపరిషద్గతోఽర్చిత స్త్రైలోక్యలక్ష్మ్యైకపదం వపు ర్దధత్" (భాగవతమ్-10-32-15) ఎన్గిఱపడియే అవర్గళాలే అర్చిక్కపట్టు ప్రకాశిత్తానిఱే ॥

తాసా మావిరభూ చ్ఛౌరిః స్మయమానముఖాంబుజః ।
పీతాంబరధర ప్స్రగ్వీ సాక్షా న్మన్మథమన్మథః ॥

---

తన దివ్యమంగళవిగ్రహసంస్థానాన్ని ప్రదర్శింప జేసి, సర్వేశ్వరుడు వచ్చి ప్రత్యక్షం అయిన రీతిని చెప్పినట్లయింది. ఇందువల్ల "నాయ మాత్మా" అనే శ్రుత్యర్థం ప్రకాశితం. లేక, మొదటి శ్లోకంలో "శ్రీమత్ప"దార్థాన్ని అనుసంధించి, రెండవ శ్లోకంమొదలుగా నాల్గవశ్లోకంవరకు "నారాయణ"పదార్థాన్ని అనుసంధించి, అయిదవశ్లోకం మొదలుగా ఇరువదవ శ్లోకంవరకు "చరణౌ శరణం ప్రపద్యే" అనే వాక్యవిశేషానికి గల అర్థాన్ని అనుసంధించి, చివరలో ఉత్తరవాక్యార్థాన్ని అనుసంధిస్తున్నారు- అని కూడా అనవచ్చు. మొదటి శ్లోకం మొదలుగా ఇరవైయవ శ్లోకంవరకు ఉపాసకుని కృత్యాన్ని అనుసంధించి, చివరగా ఉపేయకృత్యాన్ని అనుగ్రహిస్తున్నారనికూడా కావచ్చు. ఉపాసకకృత్యం శరణాగతి. ఉపేయకృత్యం ఆశ్రితులకు తన సన్నిధిని కటాక్షించి, కైంకర్యాలను ప్రసాదించడం. "తా సా మావిరభూత్" (వారికి శౌరి సాక్షాత్కరించాడు) అనేటట్లు వారి ఎదుటనే సాక్షాత్కరించి,"సర్వా స్తాః కేశవాలోకపరమోత్సవనిర్వృతాః, జహు ర్విరహజం తాపం ప్రాజ్ఞం ప్రాప్య యథా జనాః" (ఆ గోపికలు అందఱు కేశవుని దర్శనమనే గొప్ప ఉత్సవం చేత పరమానందాన్ని పొందినవారై, ప్రాజ్ఞుని చేరిన జనులవలె, తాపాన్ని విడిచారు) అనే రీతిలో వారి విశ్లేషదుఃఖాన్ని తీర్చి, "స్వై రుత్తరీయైః కుచకుంకుమాంకితైః, అచిక్లిప న్నాసన మాత్మబంధవే" (ఆత్మబంధువు అయిన శ్రీకృష్ణునికోసం ఆ గోపికలు తమ కుచాలపై అలదుకొన్న కుంకుమంచేత అంకితమైన ఉత్తరీయాలను ఆసనంగా పఱిచారు.) అన్నట్లు వారిచ్చిన ఆసనంలో కూర్చుండి, "తత్రోపవిష్టో భగవాన్ స ఈశో యోగీశ్వరాంతర్హృదికల్పితాసనః, చకాస గోపీపరిషద్గతోఽర్చితః త్రైలోక్యలక్ష్మ్యైకపదం వపుర్దధత్" (యోగీశ్వరుల హృదయంలో పల నివసించేవాడు, భగవానుడైన ఆ ప్రభువు అక్కడ కూర్చున్నవాడై, గోపీబృందాల చేత అర్చింపబడినవాడై, ముల్లోకాలలోని సంపదకు అద్వితీయ స్థానమైన రూపాన్ని ధరిస్తూ ప్రకాశించాడు.) అనే రీతిలో వారిచే అర్చింపబడి ప్రకాశించాడుకదా!

తాసా మావిరభూ చ్ఛౌరిః స్మయమానముఖాంబుజః ।
పీతాంబరధరః ప్స్రగ్వీ సాక్షా న్మన్మథమన్మథః ॥

(తాసా మావిరభూ చ్చౌరిః) "ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే" (శ్వేత-6-18) ఎన్గిఱ పడియే సర్వత్తైయుమ్ విట్టు తన్నై శరణమ్ పుగున్ద గోపిమార్కళుక్కు తన్నుడైయ దివ్యమఙ్గళవిగ్రహసంస్థానత్తై కాట్టినాన్. "ప*ఱ్ఱి*లార్ ప*ఱ్ఱి* నిన్గానే" (తిరువాయ్-) ఎన్ఱనుసంధిత్తారిఱే ఆ*ళ్వా*ర్.

(తాసా మావిరభూత్) "న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్" (తైత్తి.నారా-1-3) ఎన్ఱుమ్, "న మాంసచక్షుభి రభివీక్షతే తమ్" (తిరుమాలైవ్యాఖ్య-**44** వపా) ఎన్ఱుమ్, "కణ్గళ్ కాణ్డఱ్కరియనాయ్" (తిరువాయ్-**3-6-11**) ఎన్ఱుమ్, "కట్కిలీ !" (తిరువాయ్- **7-2-4**) ఎన్ఱుమ్, "యాను మోర్ నిలమయ నెన వఱి వరియ వెమ్బెరుమాన్" (తిరువాయ్-**1-3-4**) ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే యార్క్కుమ్ స్వయత్నత్తాలే కణ్ణాలే కాణ్బతఱ్కు దుర్లభమానవన్, దేవతాన్తర-మంత్రాన్తర- సాధనాన్తరఙ్గళై సవాసనమాగ విట్టు తన్నై శరణమ్ పుగున్ద ఇవర్గళుక్కు మున్నే ఆవిర్భవిత్తాన్. "భక్త్యా త్వనన్యయా శక్యః. అహ మేవంవిధోర్జున ! జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప !" (భగ-**11-54**) ఎన్గానిన్ఱదిఱే.

(ఏవంవిధోఽహమ్) అవాఙ్మనసగోచరవైభవయుక్తనాయ్, అపరిచ్ఛేద్యస్వరూపస్వభావనాన నాన్.

(భక్త్యా త్వనన్యయా శక్యః) అనన్యయాన భక్తి ఒన్ఱాలే శక్యన్. ఇఙ్గు "తు" ఎన్గిఱ శబ్దమ్ ఏవకారార్థత్తై చ్చొల్లుకిఱదు. ఇన్ద ఏవకారమ్ ఇతరోపాయఙ్గళిల్ ఉపాయత్వమ్ తవిర్త్తు ఇదొన్ఱుమే ఉపాయ మెన్ఱు సిద్ధాన్తీకరిక్కిఱదు. "నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా, శక్య ఏవం విధో ద్రష్టుమ్ దృష్టవానసి మాం యథా" (భగ-**11-53**) ఎన్ఱు

---

(తాసా మావిరభూ చ్చౌరిః)- "ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే" (ముముక్షువునై భగవానుని నేను శరణు పొందుతున్నాను) అనే రీతిలో సర్వస్వాన్ని విడచి, తనను శరణం పొందిన గోపికలకు తన దివ్యమంగళవిగ్రహసంస్థానాన్ని దర్శింపజేశాడు. "ప*ఱ్ఱి*లార్ ప*ఱ్ఱి* నిన్గానే!" (అకించన్యులను ఆశ్రయించుకొని ఉన్నవాడా !) అని అనుసంధించారుకదా ఆ*ళ్వా*ర్లు.

(తాసా మావిరభూత్)- "న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్" (ఎవడూ ఇతనిని భౌతికనేత్రంతో చూడలేడు) అని, "న మాంసచక్షుభి రభివీక్షతే తమ్" (భౌతిక నేత్రానికి గోచరం కానివాడా !) అని, "కణ్గళ్ కాణ్డఱ్కరియనామ్" (మాంసచక్షువులతో ఎవరూ అతనిని చూడలేరు) అనీ, "కట్కిలీ!" (కన్నులతో చూడడానికి అరుదైనవాడా!) అని, "యారుమోర్ నిలమయనెన వఱివఱియ వెమ్బెరుమాన్" (ఎంతటి జ్ఞానాన్ని కలవారైనా ఇటువంటి స్వభావాన్ని కలవాడని తెలిసికోవడానికి సాధ్యంకాని భగవానుడు) అని చెప్పే రీతిలో ఎవరికీ తన ప్రయత్నంలో కంటితో చూడడానికి దుర్లభం అయినవాడు దేవతాంతర-మంత్రాంతర-సాధనాంతరాలను సవాసనగా విడచి, తనను శరణు పొందిన వీరికి ఎదుటగా ఆవిర్భవించాడు. "భక్త్యా త్వనన్యయా శక్యః, అహ మేవం విధోఽర్జున!, జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!" అని అనబడుతున్నది కదా!

(ఏవంవిధోఽహమ్) - మాటలకు, మనస్సుకు అందని వైభవాన్ని కలివాడనై పరిచ్ఛేదించడానికి సాధ్యంకాని స్వరూపస్వభావాలను కల నేను.

(భక్త్యా త్వనన్యయా శక్యః)- అనన్యమైన భక్తి ఒక్కటిచేతనే శక్యుడు. ఇచట "తు"అనే శబ్దం ఏవకారార్థాన్ని చెబుతున్నది. ఈ ఏవకారం ఇతరోపాయాలలోని ఉపాయత్వాన్ని నిషేధించి, ఇది ఒక్కటే ఉపాయం అని సిద్ధాంతీకరిస్తున్నది. "నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా, శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా" (నన్ను నీవు ఏవిధంగా చూచావో ఈ విధమైన రూపాన్ని కల్గినవాడనని వేదాధ్యయనాదులతో చూడడానికి

తానే అరుళిచ్చెయ్‌దానితే. అనన్యభక్తి యావదు- శరణాగతియితే. ఇదుదాన్ ప్రారబ్ధత్తైయుమ్ పోక్కి, సర్వేశ్వరనై త్తరవల్ల అవ్యవహిత సాధనమాగైయాలే శొల్లుగిఱార్. "సాధనం భగవత్ప్రాప్తౌ స ఏవేతి స్థిరా మతిః, సాధ్యభక్తి స్మృతా సైవ ప్రపత్తి రితి గీయతే, సాధ్యభక్తి స్తు సా హన్త్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ" (తత్త్వశేఖరమ్) ఎన్గక్కడవదితే.

(జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప) ఎన్నై యథావస్థితమాగ అఱిగైక్కుమ్, కాణ్గైక్కుమ్, ఎన్నుడైయ సన్నిధి యడైన్దుగైక్కు మిదువే సాధనమితే. ఎన్నిడత్తిల్ శరణాగతనానపోదు ఎన్ ప్రాప్తిప్రతిబంధకజ్గళాన పాపజ్గళెల్లావత్తైయుమ్ యానే నశిప్పిత్తు, ఎన్నుడైయ స్వరూపరూపగుణవిభూతి-మహదైశ్వర్యజ్గళై యథావస్థితమాగ అఱిగైక్కు తక్క జ్ఞానత్తై కొడుత్తు యఱియు మ్బడిపణ్ణి, ఎన్నుడైయ సన్నిధియై యడైయుమ్బడి పణ్ణుగిఱేన్. "దదామి బుద్ధియోగం తమ్"(భగ-10-10) ఎన్హుమ్, "నయామి పరమాం గతిమ్"(వరాహచరమ్) ఎన్హుమ్ శొల్లానిన్దదితే. అవనుడైయ జ్ఞానశక్త్యాదిగళుక్కు సార్థకమ్ ఎజ్గళుడైయ పాపత్తై పోక్కి తన్నై క్కొడుక్కైయితే. 'పాపీయసోఽపి శరణాగతిశబ్దభాజో నోపేక్షణ మ్మమ తవోచిత మీశ్వరస్య, త్వద్‌జ్ఞానశక్తికరుణాసు సతీషు నేహ పాపం పరాక్రమితు మర్హతి మామకీనమ్" (అతిమానుషస్తవ-60) ఎన్హు ఆళ్వాను మనుసంధిత్తరుళినార్.

(తాసా మావిరభూత్) అవర్ ప్రపన్నరాగైయాలే అవర్క్కు తోన్ఱినాన్. పిఱక్కు అరియవల్లనల్లనితే. "పత్తుడై యడియవర్క్కెళియవన్ పిఱర్గళుక్కరియ విత్తగన్" (తిరువాయ్-1-3-1) ఎన్హారితే ఆళ్వార్. "లఘుత్వ మగమత్

---

నేను సాధ్యుడను కాను. తపస్సుచేతకాని, దానంతోకాని, యాగాలతో కాని సాధ్యం కాను) అని తానే అనుగ్రహించాడుకదా! అనన్యభక్తి అంటే శరణాగతికదా! ఇదే ప్రారబ్ధాన్ని పోగొట్టి, సర్వేశ్వరుని ఇవ్వగల అవ్యవహితమైన సాధనం కనుక చెబుతున్నారు. "సాధనం భగవత్ప్రాప్తౌ స ఏవేది స్థిరా మతిః, సాధ్యభక్తిః స్మృతా సైవ ప్రపత్తి రితి గీయతే, సాధ్యభక్తి స్తు సా హంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ" (భగవానుని పొందడంలో భగవానుడే సాధనమని స్థిరమైన నిశ్చయం. సాధ్యభక్తి అయితే ప్రపత్తి అని చెప్పబడుతున్నది. ఆసాధ్యభక్తి గొప్పదైన ప్రారబ్ధాన్ని కూడా నశింపజేస్తుంది.) (సాధనభక్తివల్ల ఇది సాధ్యంకాదు.) అని అనబడుతున్నది కదా !

(జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!)- నన్ను యథాతథంగా తెలిసికోవడానికి, దర్శించడానికి, నా సన్నిధిని పొందడానికి ఇదే సాధనంకదా! నాపట్ల శరణాగతుడైనపుడు నా ప్రాప్తికి ప్రతిబంధకాలైన పాపాలను అన్నిటిని నేనే నశింపజేసి, స్వరూపగుణవిభూతిమహదైశ్వర్యాలను యథావస్థితంగా తెలియడానికి తగిన జ్ఞానాన్ని ఇచ్చి, తెలిసేటట్లుచేసి, నా దివ్యమంగళవిగ్రహాన్ని అతడు సేవించేటట్లు అతని ఎదుట ప్రత్యక్షమై, పిమ్మట నా సన్నిధిని చేరేటట్లు చేస్తాను. "దదామి బుద్ధియోగం తమ్" (నన్ను చేరుకోడంలో ఉపాయమైన బుద్ధియోగాన్ని- అంటే- అత్యంతా విశదమైన సాక్షాత్కారాన్ని ఇస్తాను) అని, "నయామి పరమాం గతిమ్" (ఉత్తమగతికి తీసికొనిపోతాను) అని చెప్పబడుతున్నదికదా! అతని జ్ఞానశక్త్యాదులకు సార్థక్యం మా పాపాన్ని పోగొట్టి తనను అనుగ్రహించడమేకదా! "పాపీయసోఽపి శరణాగతశబ్దభాజో నోపేక్షణం మమ తవోచిత మీశ్వరస్య, త్వద్‌జ్ఞానశక్తికరుణాసు సతీషు నేహ పాపం పరాక్రమితు మర్హతి మామకీనమ్" (నేను పాపిష్ఠివాడనైనా శరణాగతుడనే పేరును కలవాడను. అందువల్ల ఈశ్వరుడవైన నీవు నన్ను ఉపేక్షించడం తగదు. నీజ్ఞానం, శక్తి, కరుణ ఉండగా నా పాపపరాక్రమవిజృంభణం యుక్తం కాదు) అని ఆళ్వాన్‌కూడా అనుసంధించారు.

(తాసా మావిరభూత్)- వారు ప్రపన్నులు కనుక వారికి ప్రత్యక్షం అయ్యాడు. "పిఱర్కు అరియవల్ల నల్లన్" (భక్తులు కానివారికి తెలియడం సాధ్యం కానివాడు) కదా! "పత్తుడై యడియవర్క్కెళియవన్ పిఱర్కళుక్కు అఱియ విత్తకన్" (భక్తిని కల దాసులకు సులభుడు, అన్యులకు తెలియడంలో దుర్లభుడు) అని అన్నారుకదా

**కపేః" (రామా.యుద్ధ) ఎన్గిఱపడియే శిఱియతిరువడిక్కు ఎళియరానవర్తామే, "న శక్యే భరతానుజః" (రామా. యుద్ధ-) ఎన్గిఱపడియే రావణనుక్కు దుర్లభరానారిఱే. అన్ఱిక్కే, "రురుదు సుస్వరమ్" (భాగవతమ్) ఎన్గిఱపడియే అవనుక్కాగ రోదనమ్ పణ్ణినవర్గళాగైయాలే అవర్గళుక్కు తోన్ఱినాన్- ఎన్ఱవుమామ్. ప్రపత్తిక్కధికారమ్ శోకమిఱే. తచ్ఛోకనివృత్తియే ఫలమాగైయాలే అన్ద శ్లోకనివృత్తిక్కాగ వన్దు సాక్షాత్కరిత్తానెన్ఱపడి. "మా శుచః" (భగ-18-66) ఎన్ఱు మవనిఱే ఇవన్. ఇప్పడి వన్దు తోన్ఱినవన్ యార్ ? ఎన్నిల్,**

**(శౌరిః) ఎన్గిఱార్.**

**(శౌరిః) శూరపుత్రనిఱే. ఆగైయాలే ఇప్పోదు ఇవర్గళ్ మున్నే తోన్ఱినానెన్ఱపడి. అహంకరిత్తవన్ఱు బాధిత్తుమ్, అహంకారమ్ పోనవాఱే కటాక్షిక్కైయుమిఱే శూరనానవనుక్కు స్వరూపమ్. (రామబాణాభిహతో భృశార్తః) (రామా-యుద్ధ-59-137) ఎన్గిఱపడియే ఎదిరిట్ట వన్ఱు బాధిత్తు కైయిలాయుధమ్ పోగట్టు అహంకారమ్ పోయ్ నిన్ఱవాఱే "గచ్ఛానుజానామి రణార్దిత స్త్వం ప్రవిశ్య రాత్రించరరాజ! లంకామ్" (రామా-యుద్ధ-59-141) ఎన్ఱు కటాక్షిత్తారిఱే శ్రీచక్రవర్తితిరుమగనార్. అప్పడియే ఇవరుమ్ శూరపుత్రరాగైయాలే, "తాసాం తత్సౌభగమదం వీక్ష్య మానం చ కేశవః, ప్రశమాయ ప్రసాదాయ తత్రైవాంతరధీయత" (భాగవతమ్-10-29-48) ఎన్గిఱపడియే అవర్గళిడత్తిలుణ్డాన స్వరూపవిరోధియాన అహంకారత్తై క్కణ్డు, అత్తై నశిప్పదఱ్కు అంతర్ధానరాయ్ నిన్ఱు, అత్తై నశిప్పిత్తు అవర్గళ్ శోకిత్తుక్కొణ్డు తన్ తిరువడిగళడైన్దవాఱే, "కృపయా పరయావిష్టనాయ్" (భగ-2-1) తోన్ఱి, దుఃఖనివృత్తియై**

---

ఆళ్వార్లు. "లఘుత్వ మగమత్ కపేః" (హనుమానునకు తేలిక అయ్యాడు) అనే రీతిలో శిఱియతిరువడికి (హనుమానునకు) తేలిక అయిన తానే, "న శక్యే భరతానుజః" అనే రీతిలో రావణునకు దుర్లభుడయ్యాడుకదా! లేక, "రురుదు సుస్వరమ్" (సుస్వరంగా రోదించారు) అనే రీతిలో అతనికోసం రోదించినవారు కాబట్టి వారికి ప్రత్యక్షం అయ్యాడు- అని కూడా భావం. ప్రపత్తికి అధికారం శోకంకదా! ఆశోకనివృత్తే ఫలం కనుక ఆ శోకనివృత్తికోసం వచ్చి సాక్షాత్కరించాడని భావం. "మా శుచః" అనేవాడేకదా ఇతడు. ఈవిధంగా వచ్చి సాక్షాత్కరించినవాడెవడు? అంటే,

**(శౌరిః)**- అని అంటున్నారు.

**(శౌరిః)**- శూరపుత్రుడుకదా! అందువల్ల ఇపుడు వీరి ముందు ఆవిర్భవించాడని భావం. అహంకరించినపుడు బాధించి, అహంకారం పోగానే కటాక్షించడమేకదా శూరుడైన వానికి స్వరూపం. **"రామబాణాభిహతో భృశార్తః"** (రాముని బాణాలచేత చాలా ఆర్తిని పొందాడు) అనే రీతిలో ఎదిరించినపుడు బాధించి, చేతిలోని ఆయుధాన్ని పారవేసి అహంకారం పోగానే, **'గచ్ఛానుజానామి రణార్దిత స్త్వమ్, ప్రవిశ్య రాత్రించరరాజ ! లంకామ్"** (రావణా ! వెళ్ళు. రణంలో అలసిన నిన్ను అనుమతిస్తున్నాను. రాక్షస రాజా ! నీవు ఇపుడు లంకను చేరి రేపు మళ్ళీరా) అని కటాక్షించాడుకదా శ్రీరాముడు (చక్రవర్తి తనయుడు). ఆ విధంగానే ఇతడుకూడా శూరపుత్రుడు కాబట్టి **"తాసాం తత్సౌభగమదం వీక్ష్య మానం చ కేశవః, ప్రశమాయ ప్రసాదాయ తత్రైవాంతరధీయత"** (ఆ గోపికల సౌందర్యగర్వాన్ని, స్త్రీత్వాభిమానాన్ని చూచి కేశవుడు వాటి ఉపశమింపజేసి, ప్రశాంతిని కల్గించడం కోసం అక్కడే అదృశ్యుడయ్యాడు) అనేరీతిలో వారి వద్దఉన్న స్వరూపవిరోధిఅయిన అహంకారాన్ని చూచి, అది నశించడానికి అంతర్ధానమై నిలచి, దానిని నశింపజేసి, వారు శోకిస్తూ తన శ్రీపాదాలను ఆశ్రయించగానే గొప్ప దయను పొందినవాడై, సాక్షాత్కరించి, దుఃఖనివృత్తిని చేశాడు- అని భావం. చేతనునివద్ద ఉన్న అహంకారాన్ని చూచి, దానిని నశింపజేసే మహాశూరుడు కాబట్టి "శౌరిః" అని అంటున్నారని భావం. ఏ విధంగా వచ్చి ప్రత్యక్షమయ్యాడు ? అని అంటే-

ప్పణ్ణినాన్- ఎన్లపడి. చేతనరిడత్తిలుణ్డాన అహంకారత్తై క్కణ్డు, అత్తై నశిప్పిక్కుమ్ మహాశూరనాగైయాలే "శౌరిః" ఎన్గిఱార్- ఎన్లపడి. ఎప్పడి వన్దు తోన్ఱినాన్? ఎన్నిల్,

(స్మయమానముఖాంబుజః పీతాంబరధరః స్రగ్వీ సాక్షాన్మన్మథమన్మథః) ఎన్గిఱార్. స్మయమానముఖాంబుజనాయ్, పీతాంబరధరనాయ్, స్రగ్వియాయ్, సాక్షాన్మన్మథమన్మథనాయ్క్కొణ్డు వన్దు తోన్రినాన్. తన్నుడైయ అఖిలకల్యాణ గుణాకరత్వముమ్, పరత్వముమ్ తోన్ఱ వన్దు సాక్షాత్కరిత్తానెన్లపడి.

(స్మయమానముఖాంబుజః) జగన్మోహనకరమాన ముఱువలోడు విళఙ్గుగిన్ఱ ముఖామ్బుజత్తోడే వన్దు సాక్షాత్కరిత్తాన్. "నిజజనస్మయధ్వంసనస్మిత.... జలరుహాననం చారు దర్శయ" (భాగవతమ్) ఎన్ఱు ఇవర్గళ్ ప్రార్థిత్తపడియేయిఱే వన్దు తోన్రినపడి. ఇవర్కళోడు కలన్ద పోదెల్లామ్ అవనుక్కు ముఱువల్ శెయ్గైయిఱే పణి. "ఎన్ ముఱ్ఱమ్ పుగున్దు ముఱువల్ శెయ్దు నిన్ఱాయే" (పెరియ తిరు-10-8-5) ఎన్ఱానిన్ఱదిఱే. అన్ఱిక్కే, పిరాట్టియుడైయ నిత్యసంశ్లేషత్తాలే ఎప్పోదుమ్ ముఖాంబుజమ్ స్మయమానమాయిరుక్కు మెన్లవుమామ్. "లక్ష్మీనేత్రోత్పలశ్రీసతత పరిచయా దేష సంవర్ధమానః" (యతిరాజవిజయనాటకమ్) ఎన్గిఱపడియే ఇవనుడైయ తిరుమేనిక్కు సౌందర్యాపాదకమాన కటాక్షముడైయవళిఱే ఇవళ్.

(ముఖామ్బుజః) వైత్త కణ్ వాఙ్గాదపడియాన సౌందర్యాతిశయత్తాలుమ్, కణ్డ కాట్చియిలే ఆశ్రిరుడైయ హృదయతాపోపశమనత్తై పణ్ణవల్ల కరుణామధుస్యందియాగైయాలుమ్ ముఖాంబుజ మెన్గిఱార్. అన్ఱిక్కే, సకలజనమనోల్లాసకరమాన సౌరభ్యాతిశయత్తాలుమ్, ముఖామ్బుజ మెన్గిఱార్. "భోగీంద్రనిఃశ్వసితసౌరభవర్ధితం శ్రీనిత్యానుషక్తపరమేశ్వరభావగన్ధి, సౌరభ్య మాప్లుతదిశావధి రంగనేతు రానందసంపది నిమజ్జయతే మనాంసి"

---

(స్మయమానముఖాంబుజః పీతాంబరధరః స్రగ్వీ సాక్షాన్మన్మథమన్మథః) - అని అంటున్నారు. చిఱునవ్వు నవ్వే ముఖారవిందాన్ని కలవాడై, పీతాంబరధారియై, వనమాలను ధరించినవాడై, సాక్షాత్తు మన్మథునకు మన్మథుడై వచ్చి, ఆవిర్భవించాడని. తనయొక్క అఖిలకల్యాణగుణాకరత్వమూ, పరత్వమూ స్ఫురించేటట్లు వచ్చి సాక్షాత్కరించాడని భావం.

(స్మయమానముఖాంబుజః)- జగత్తును మోహింపజేసే చిఱునవ్వుతో, వెలుగుతున్న ముఖాంబుజంతో వచ్చి, సాక్షాత్కరించాడు. "నిజజనస్మయధ్వంసనస్మిత జలరుహాననం చారు దర్శయ" (స్వజనం యొక్క గర్వాన్ని నీ చిఱునవ్వుతో పోగొట్టే వాడా! నీ అందమైన ముఖపద్మాన్ని చూపించు) అని వీరు ప్రార్థించిన రీతిలోనే కదా ఆవిర్భవించిన తీరు. వీరితో కలసినపుడు ఎల్లప్పుడూ అతనికి చిఱునవ్వు నవ్వడమేకదా పని. "ఎన్ ము**ఱ్ఱ**మ్ పుకున్దు ముఱువల్ శెయ్దు నిన్ఱాయే!" (నాముంగిటిని చేరి చిఱునవ్వు నవ్వుతూ నిలిచావే!) అని అనబడుతున్నదికదా! లేక, పిరాట్టియొక్క నిత్యంసంశ్లేషంతో ఎల్లప్పుడూ ముఖాంబుజం చిఱునవ్వు నవ్వుతూ ఉంటుందనికూడా చెప్పవచ్చు. "లక్ష్మీనేత్రోత్పలశ్రీసతతపరిచయా దేష సంవర్ధమానః" (లక్ష్మీదేవి నేత్రపద్మాలకాంతి యొక్క సతతసంబంధం చేత వర్ధిల్లే ఇతడు) అనే రీతిలో ఇతని తిరుమేనికి సౌందర్యాన్ని కల్గించే కటాక్షాన్ని కల్గినదికదా ఈమె!

(ముఖాంబుజః)- చూచిన చూపును తిరిగి తీసికోలేనట్లున్న (చూపును తిప్పుకోలేనట్లున్న) సౌందర్యాతిశయం చేతను, చూచిన చూపుతో ఆశ్రితుల హృదయతాపోపశమనాన్ని చేయగల కరుణ అనే మధువును స్రవించేది కాబట్టి, "ముఖాంబుజమ్" అని అంటున్నారు. లేక, సకలజనుల మనస్సుకు ఉల్లాసాన్ని కల్గించే సౌరభ్యాతిశయం చేతను "ముఖాంబుజమ్" అని అంటున్నారు. "భోగీంద్రనిఃశ్వసితసౌరభవర్ధితం శ్రీనిత్యానుషక్తపరమేశ్వరభావగంధి,

(శ్రీరంగరాజస్తవమ్-పూర్వశతకమ్) ఎన్గానిస్థతితే. "హేమసమానవర్ణం తస్యాననం పద్మసమానగంధి" (రామా-సుందర) ఎన్ఱు పిరాట్టియు మరుళిచ్చెయ్‌దాళ్. ఇవ్వ సౌందర్యసౌరభ్యఙ్గళ్ "హిరణ్యవర్ణామ్" (శ్రీసూక్తమ్) ఎన్ఱుమ్, "గంధద్వారామ్" (శ్రీసూక్తమ్) ఎన్ఱుమ్ శొల్లప్పడుగిఱ పిరాట్టియుడైయ నిత్యసంశ్లేషత్తాలేయితే ఇవనుక్కు వన్దదు. ఇవళుడైయ విశ్లేషత్తాలే ఇవై ఎల్లామ్ పోమ్పడియితే ఇరుప్పదు. "మయా వినా శుష్యతి శోకదీనం జలక్షయే పద్మ మివాతపేన" (రామా.సుందర) ఎన్గిఱపడియే జలక్షయత్తాల్ ఆతపత్తాలే పద్మమ్ వాడుమాప్పోలే, ఎన్నుడైయ విశ్లేషత్తాలే అనుడైయ ముఖాంబుజమ్ శుష్కీభూతమామితే- ఎన్ఱు ఇవళ్‌దానే అరుళిచ్చెయ్‌దాళితే.

(పీతాంబరధరః) పీతగవాడైయోడు వన్దు తోన్ఱినాన్. ఇత్తాల్ పీతామ్బరసౌన్దర్యత్తై అవర్‌కళుక్కు కాట్టి ఉపకరిత్తా నెన్ఱపడి. ఇదు పరత్వాపాదకమాయ్, ఇవనుక్కు సాధారణ చిహ్నమాగైయాలే ఇత్తై కాట్టినానెన్ఱు శొల్లవుమామ్. "తస్య మహారజనం వాసః" (బృహ- 4-3-6) ఎన్ఱుమ్, "పీతగవాడైప్పిరాన్" (పెరియాళ్వార్-5-2-8) ఎన్ఱుమ్ శొల్లానిన్ఱదితే.

(పీతాంబరధరః) "విద్యుల్లేఖావలయిత ఇవ స్నిగ్ధ పీతాంబరేణ" ఎన్గిఱపడియే తోన్ఱినపోదే సర్వరుడైయ దృష్టియు మపహరిక్కు ముత్తేజమాన పీతగవాడై యుడుత్తు వన్దు తోన్ఱినానెన్ఱపడి. "భర్మస్థలాంశుపరివేష ఇవామ్బురాశే స్సంధ్యామ్బువాహనికురుంబ మివాంబరస్య, శంపాకదంబ మివాంబుముచో మనో మే పీతాంబరం పిబతి రంగధురంధరస్య" (శ్రీరంగరాజస్తవమ్ -పూర్వశతకమ్) ఎన్ఱు శ్రీ పెరియభట్టరనుసంధిత్తపడియే భక్తజనఙ్గళుడైయ హృదయత్తై మగ్నమాక్కుమ్ సౌందర్యముడైయ వాడైయితే.

---

సౌరభ్య మాప్లుతదిశావధి రంగనేతు రానందసంపది నిమజ్జయతే మనాంసి" (ఆదిశేషుని నిఃశ్వాస పరిమళంచేత వృద్ధిపొందింప బడినది, లక్ష్మీదేవి నిత్యసంబంధంచేత పరమేశ్వరత్వం యొక్క గంధాన్ని కల్గినది, దిగంతాలవరకు వ్యాపించినది అయిన శ్రీరంగనాథుని సౌరభ్యమనే గుణం భక్తుల మనస్సులను ఆనందసమృద్ధిలో ముంచెత్తు తున్నది) అని అనబడుతున్నది కదా! "హేమసమానవర్ణం తస్యాననం పద్మసమానగంధి" (బంగారు రంగు వంటి రంగును కల్గినది, పద్మసుగంధంవంటి సుగంధాన్ని కల్గినది అయిన ఆమెముఖం) అని సీతాదేవికూడా అనుసంధించింది. ఈ సౌందర్య-సౌరభ్యాలు "హిరణ్యవర్ణామ్" (బంగారు రంగును కల్గినది) అని, "గంధద్వారామ్" అని చెప్పబడే పిరాట్టియొక్క నిత్యసంశ్లేషంతోనే కదా ఇతనికి వచ్చింది. వీరి విశ్లేషంచేత ఇవి అన్నీ పోయేటట్లుగాకదా ఉన్నది. "మయా వినా శుష్యతి శోకదీనం జలక్షయే పద్మమివాతపేన" (నావిశ్లేషం వల్ల శోకదీనమైన అతని ముఖం, జల క్షయంవల్ల పద్మంవలె, వాడిపోతుంది) అనే రీతిలో జలక్షయంచేత, ఎండవల్ల పద్మం వాడిపోయేటట్లు, నా విశ్లేషంతో అతని ముఖాంబుజం శుష్కీభూతం అవుతుందికదా అని ఈమే అనుగ్రహించిందికదా!

(పీతాంబరధరః)- పీతాంబరంతో వచ్చి ఆవిర్భవించాడు. ఇందువల్ల పీతాంబర సౌందర్యాన్ని వీరికి చూపి ఉపకరించాడని భావం. ఇది(పీతాంబరం) పరత్వాన్ని ఆపాదించేదై, ఇతనికి అసాధారణచిహ్నం కాబట్టి దీనిని చూపించాడని కూడా చెప్పవచ్చు. "తస్య మహారజనం వాసః" (అతని వస్త్రం బంగారు వన్నె కల్గినది) అని, "పీతకవాడైప్పిరానార్" (పీతాంబరధారి అయిన స్వామి) అని చెప్పబడుతున్నదికదా!

(పీతాంబరధరః)- "విద్యుల్లేఖావలయిత ఇవ స్నిగ్ధపీతాంబరేణ" (చిక్కని వర్ణాన్ని కల పీతాంబరం చేత విద్యుల్లేఖచేత చుట్టబడినట్లున్నవాడు) అనే రీతిలోఆవిర్భవించినపుడే అందఱి దృష్టిని అపహరించే గొప్ప తేజస్సును కల పీతాంబరాన్ని ధరించి వచ్చి, ఆవిర్భవించాడని భావం. 'భర్మస్థలాంశుపరివేష ఇవాంబురాశేః సంధ్యాంబువాహని కురుంబ మివాంబరస్య, శంపాకదంబుక మివాంబుముచో మనో మే పీతాంబరం పిబతి రంగధురంధరస్య" (సముద్రంయొక్క స్వర్ణభూమికిరణాల పరివేషం వలె, ఆకాశంలోని సంధ్యామేఘాల సమూహం వలె, మేఘః

(స్రగ్వీ) శ్రీవైజయంతీమాలైయై ధరిత్తుక్కొణ్డు తోన్రినాన్. ఇవన్ వనమాలియాయిఱ్ఱే ప్రకాశిక్కిఱదు. "వక్షఃస్థల్యాం తులసికమలా కౌస్తుభై ర్వైజయంతీ సర్వేశ్వరత్వం కథయతితరాం కౌస్తుభం రఙ్గధామ్నః" (శ్రీరంగరాజస్తవమ్-పూర్వశతకమ్-113) ఎన్ఱు భట్టరరుళిచ్చెయ్దార్. "ఆదిత్యం గణనాయకం పశుపతిం శక్తిం విరించిం సదా పారమ్యేణ నిషిధ్య చ శ్రుతిమయే! శ్రీవైజయంతీలతే ! విష్ణోర్నేతి పరం యదీయతులసీ సంవాసితోరఃస్థలాత్ కిం త్వం ఘోషయసి స్రవన్మధుపిబద్భృంగీనినాదచ్ఛలాత్" (వైజయంతీస్తవమ్) ఎన్ఱు నమ్ముడైయ పరమాచార్యరుమ్ శ్రీవైజయంతీస్తవత్తిలే అనుసన్దిత్తరుళినార్. ఇన్ద శ్రీవైజయంతీస్వరూపమ్ ఇవనుడైయ దివ్యమఙ్గళవిగ్రహత్తై పూర్ణమాగ వ్యాపరిత్తుక్కొణ్డు, ఇన్ద దివ్యతిరుమేనిక్కు పరభాగశోభాస్పదమాయిఱ్ఱే ప్రకాశిక్కిఱదు. "తోళినై మేలుమ్ నన్మార్బిన్ మేలుమ్ శుడర్ముడిమేలుమ్ తాళినై మేలుమ్ పునైన్ద తణ్ణమ్ తుழாయుడై యమ్మాన్" (తిరువాయ్-1-9-7) ఎన్ఱు ఆழ்వారనుసంధిత్తార్. ఇతుపత్తొన్బదాన మహారత్నఙ్గళాలే శెయ్యప్పట్టదాయ్, శ్రీనిలయమాయ్, ఐశ్వర్యాపాదకమాయ్, జగన్మోహనమాయ్, ఆనన్దకన్దమాయ్, సర్వశక్తియుక్తమాయ్, జగదాచార్యస్వరూపమాయ్ నిన్ఱు నమ్మాచార్యరై ఎల్లామ్ యుట్కొణ్డిఱ్ఱే ఇరుప్పదు. "శ్రీమన్నాథమునేః దదాసి పరమానందం మనీషాం సరోజాక్షస్యైవ యశ స్తథా రఘుపతే శ్రీవైజయంతీలతే, భూతిం యామునదేశికస్య చ మహాపూర్ణస్య పూర్ణశ్రియమ్, సర్వే తే గురవ స్తవేక్షణవశా న్మూర్ధాభిషిక్తాః స్వయమ్" (వైజయంతీస్తవమ్) ఎన్ఱు శ్రీవైజయంతీస్తవత్తిలే నమ్ముడైయ పరమాచార్యరనుసన్దిత్తార్.

---

లోని మెఱుపు తీగల సమూహం వలె ఉన్న శ్రీరంగనాథుని పీతాంబరం మా మనస్సులను ఆకర్షిస్తున్నది) అని శ్రీపెరియభట్టర్ అనుసధించినట్లే భక్తజనుల హృదయాన్ని మగ్నం చేసే సౌందర్యాన్ని కల వస్త్రం కదా!

(స్రగ్వీ)- శ్రీవైజయంతీమాలను ధరించి ఆవిర్భవించాడు. ఇతడు వనమాలికదా! ఇదికూడా పరత్వాపాదకమై, ఇతనికి అసాధారణాలంకారంగా కదా ప్రకాశిస్తున్నది! **"వక్షఃస్థల్యాం తులసికమలాకౌస్తుభై ర్వైజయంతీ సర్వేశత్వం కథయతితరాం కౌస్తుభం రంగధామ్నః"** (వక్షఃస్థలంలోని తులసి, లక్ష్మీదేవి, కౌస్తుభాలతో పాటు వైజయంతీమాల కూడా శ్రీరంగనాథుని సర్వేశ్వరత్వాన్ని మిక్కిలిగా ప్రకటిస్తున్నది) అని భట్టర్ అనుగ్రహించారు. **"ఆదిత్యం గణనాయకం పశుపతిం శక్తిం విరించిం సదా పారమ్యేణ నిషిధ్య చ శ్రుతిమయే! శ్రీవైజయంతీలతే ! విష్ణోర్నేతి పరం యదీయతులసీసంవాసితోరఃస్థలాత్ కిం త్వం ఘోషయసి స్రవన్మధు పిబద్భృంగీనినాదచ్ఛలాత్ ?"** (సూర్యుడు, గణపతి, శివుడు, శక్తి, బ్రహ్మ పరతత్త్వం కాదని నిషేధిస్తూ శ్రుతిమయమైన ఓ వైజయంతీమాలికా! విష్ణువుకంటే పరతత్త్వం ఇంకొకటి లేదనే విషయాన్ని ఆ విష్ణువు యొక్క, తులసిచేత పరిమళించే వక్షఃస్థలం నుండి, నీనుండి స్రవించే తేనెను తాగే తుమ్మెదల ఝుంకార నెపంతో ఘోషిస్తున్నవా? ఏమి?) అని అస్మత్పరమాచార్యులు సైతం శ్రీవైజయంతీస్తవంలో అనుగ్రహించారు. ఈ శ్రీవైజయంతీస్వరూపం ఇతని దివ్యమంగళవిగ్రహాన్ని పూర్తిగా వ్యాపించి, ఈ దివ్యతిరుమేనికి పరభాగశోభను కల్గించేదిగాకదా ప్రకాశిస్తున్నది. **"తోళినైమేలుమ్ నన్ మార్బిల్ మేలుమ్ శుడర్ ముడిమేలుమ్ తాళినైమేలుమ్ పునైన్ద తణ్ణన్తుழாయుడై యమ్మాన్"** (భుజద్వంద్వంపై చక్కని వక్షస్సుపై, ప్రకాశించే కిరీటంపై, శ్రీచరణద్వయం పై అలంకరింపబడ్డ చల్లని, అందమైన తులసీమాలను కల స్వామి) అని ఆழ்వార్లు అనుసంధించారు. ఇరవై తొమ్మిది అయిన మహారత్నాలచేత చేయబడినదై, శ్రీనిలయమై, ఐశ్వర్యాపాదకమై, జగన్మోహనమై, ఆనందానికి మూలమై, సర్వశక్తియుక్తమై జగదాచార్యస్వరూపమై నిలచి, మన ఆచార్యులను అందరినీ అంతర్భవింపజేసికొనికదా (వైజయంతీమాల) ఉంటుంది. **"శ్రీమన్నాథమునేః దదాసి పరమానందం మనీషాం సరోజాక్షస్యైవ యశ స్తథా రఘుపతేః శ్రీవైజయంతీలతే ! భూతిం యామునదేశికస్య చ మహాపూర్ణస్య పూర్ణశ్రియం సర్వే తే గురవ స్తవేక్షణవశా న్మూర్ధాభిషిక్తాః స్వయమ్"** (ఓ వైజయంతీమాలా! నీవు నాథమునులకు ఆనందాన్ని ఇస్తున్నావు. పుండరీకాక్షులకుశ్రీరామమిశ్రులకు బుద్ధిని ఇస్తున్నావు. యామునాచార్యుల వారికి సంపదను,

(స్రగ్వీ) సకలచేతనరిడత్తిలుణ్డాన అజ్ఞానదుర్గన్ధత్తై పోక్కవల్ల సర్వగన్ధయుక్తమాయ్, ఆశ్రితర్క్కు సౌఖ్యాపాదకమాన శ్రీవనమాలైయోడు వన్దావిర్భవిత్తాన్. "సర్వగంధ స్సర్వరసః" (ఛాందో-3-14-4) ఎన్ఱు ఓదప్పడుగిఱవనుక్కుమ్ నాఱ్ఱముమ్, రసముమ్ కొడుక్కలాయితే యిదిరుప్పదు. "వాట్టాత్తాన్ మలరడిమేల్ విరై కుழாవు నఱున్తుళపమ్ మెయ్న్నిన్ఱు కమழுమే" (తిరువాయ్-10-6-8) ఎన్ఱుమ్, "కడి వార్ తణ్ణన్తుழாయ్" (తిరువాయ్-2-3-9) ఎన్ఱుమ్, "ముడి శేర్ శెన్నియమ్మా నిన్ మొయ్పూమ్ దామత్తణ్డుழாయ్ కడిశేర్కణ్ణి ప్పెరుమానే!" (తిరువాయ్-8-5-3) ఎన్ఱుమ్, "మదువార్ తణ్ణన్తుழாయాన్" (తిరువాయ్-10-6-2) ఎన్ఱుమ్, "మదువార్ పూన్తుழாయ్ ముడి మాదవన్" (తిరువాయ్-6-8-4) ఎన్ఱుమ్ ఆழ்வార్ పలవిడఙ్గళిలే అనుసంధిత్తార్. "మాలైయొడుమ్ పొన్నార్ శార్ఙ్గముడైయ వడిగళై యిన్నారెన్ఱఱియేన్" (పెరియతిరు-10-10-9) ఎన్గిఱపడియే ఇన్ద శ్రీవనమాలికావైభవమ్ వాచామగోచరమాయిరుక్కుమితే.

(సాక్షాన్మన్మథమన్మథః) సాక్షాన్మన్మథనుక్కుమ్ మోహజనకమాన తిరుమేనియోడే వన్దావిర్భవిత్తానెన్ఱపడి. మన్మథనుక్కుత్పాదకమాన దివ్యమఙ్గళవిగ్రహమితే. అన్ఱిక్కే, లోకత్తిలుళ్ళారుడైయ నెఞ్జై కలుష మాక్కి, ప్రకృతివిషయత్తిలే మూట్టుమ్ కామనై నశిప్పిక్కవల్ల తిరుమేని యుడైయవనెన్ఱవుమామ్. "మదన ! పరిహర స్థితిం మదీయే మనసి ముకుందపదారవిందధామ్ని, హరనయనకృశానునా కృశోఽసి స్మరసి న చక్రపరాక్రమం మురారేః" (ముకుందమాల-29) ఎన్ఱక్కడవదితే. ఇత్తాల్- తన్నై సేవిత్తవర్క్కు అజ్ఞానత్తై నీక్కి, శుద్ధసాత్వికత్తై యుణ్డాక్కుగిఱ తిరుమేనియుడైయ

---

మహాపూర్ణులకు పూర్ణమైన సంపత్తును ఇస్తున్నావు, ఈ ఆచార్యులంతా నీకటాక్షవశంచేత స్వయంగా మూర్ధాభిషిక్తులయ్యారు) అని శ్రీవైజయంతీస్తవంలో అస్మత్పరమాచార్యులు అనుసంధించారు.

(స్రగ్వీ)- సకలచేతనులవద్ద గల అజ్ఞానమనే దుర్గంధాన్ని పోగొట్ట గల సర్వగంధయుక్తమై, ఆశ్రితులకు సౌఖ్యాన్ని కల్గించే శ్రీవనమాలతో ఆవిర్భవించాడు. "సర్వగంధః సర్వరసః" అని అధ్యయనం చేయబడేవానికికూడా సౌగంధ్యం, రసం ఇవ్వగల్గినదైకదా ఉన్నది. "వాట్టాఱ్ఱాన్ మలరడిమేల్ విరై కుழாవు నఱున్తుళపమ్ మెయ్ నిన్ఱు కమழுమే" (తిరువాట్టాఱు అనే దివ్యదేశంలో వేంచేసి ఉండే స్వామియొక్క పద్మాల శ్రీచరణాలపై సమర్పింపబడ్డ, మిక్కిలి పరిమళించే మంచి తులసి నా శరీరంలో పరిమళిస్తున్నది) అని, "కడివార్ తణ్ణన్తుழாయ్" (పరిమళం నిండుగా కల చల్లని అందమైన తులసి) అని, "ముడిశేర్ శెన్నియమ్మాన్ నిన్ మెయ్ పూమ్ దామ త్తణ్తుழாయ్ కడిశేర్కణ్ణి ప్పెరుమానే" (కిరీటాన్ని ధరించిన శిరస్సును కలస్వామీ! నీకు తగినదై, దట్టమైన, అందమైన, చల్లని, పరిమళాన్ని కల, కాంతిని కల తులసీ మాలను కల సర్వాధికా!) అని, "మదువార్ తణ్ణన్తుழாయాన్" (మధువు నిండుగా ఉండే చల్లని అందమైన తులసి) అని, "మదువార్ పూన్తుழாయ్ముడి మాదవన్" (తేనె నిండుగా ఉన్న పూలతో కూడిన తులసి కిరీటంలో దాల్చిన మాధవుడు) అని ఆழ்வార్లు పలు చోట్ల అనుసంధించారు. "మాలైయొడుమ్ పొన్నార్ శార్ఙ్గముడైయ వడిగళై యిన్నారెన్ఱఱియేన్" (వనమాలికతో పాటు బంగారు వలె స్పృహణీయమైన శార్ఙ్గాన్ని ధరించిన స్వామిని ఇటువంటివాడని ఇతమిత్థంగా తెలియలేను) అనే రీతిలో ఈ వనమాలికావైభవం మాటకు అందనిదై ఉంటుందికదా!

(సాక్షా న్మన్మథమన్మథః)- సాక్షాన్మన్మథునుకుకూడ మోహాన్ని కల్గించే తిరుమేనితో వచ్చి, ఆవిర్భవించాడని భావం. మన్మథునకు ఉత్పాదకం అయిన దివ్యమంగళవిగ్రహంకదా. లేక, లోకంలో ఉన్నవారందఱి మనస్సును కలుషితంగా చేసి ప్రకృతి (లౌకిక) విషయంలో లగ్నం చేసే మన్మథుని నశింపజేయగల తిరుమేనిని కలవాడనికూడా భావం. "మదన! పరిహర స్థితిం మదీయే మనసి ముకుందపదారవిందధామ్ని, హరనయనకృశానునా కృశోఽసి

వనెన్టపడి. "సా తం సమాసాద్య విశుద్ధసత్వా సుసంవృతం పార్థివలక్షణై శ్చ, అయం హి కాకుత్స్థ ఇతి ప్రజజ్ఞే" (రామా) ఎన్టుమ్ శొల్లానిన్టదిఱే.

(పీతాంబరధరః స్రగ్వీ సాక్షా న్మన్మథమన్మథః) ధరిత్త పీతాంబరత్తినుడైయవుమ్, శ్రీవైజయంతీమాలికైయిను డైయవుమ్ సౌందర్యఙ్గళ్ ఒన్నోడొన్టు శేర్న్దు దివ్యమంగళవిగ్రహత్తాలే అలై ఎఱిగిఱపడియాలే సాక్షాన్మన్మథమన్మథనాయ్ ప్రకాశిత్తా నెన్టు శొల్లవుమామ్. అవనుడైయ దివ్యమంగళవిగ్రహత్తుక్కు అనురూపమాన సౌందర్యప్రదాయకఙ్గళాన ఆభరణఙ్గళిఱే ఇవై. "అన్యోన్యరంజకరుచో౽నుపమానరూపా దివ్యస్రగమ్బర-పరిష్కరణాఙ్గరాగాః, సంస్పర్శతః పులకితా ఇవ చిన్మయత్వా ద్రంగేన్దుకాన్తి మధికా ముపబృంహయన్తి" (శ్రీరంగరాజస్తవమ్- పూర్వశతకమ్-85) ఎన్టు పెరియభట్టరనుసంధిత్తార్.

(స్మయమానముఖాంబుజః సాక్షాన్మన్మథమన్మథః) సకలజగదైశ్వర్యవైభవత్తాలే ముఱువల్ శెయ్గిన్ఱ ముఖామ్బుజత్తోడే సాక్షాన్మన్మథమన్మథరాయ్ ప్రకాశిత్తానెన్టపడి. శ్రుతిమయమాయ్, మఙ్గళాలయమాయ్, జగన్మోహనమాయ్, జ్ఞానానన్దకన్దమాయ్, మణిముకురమ్బోలే సర్వేశ్వరనుడైయ స్వరూపరూపగుణవిభూతి మహదైశ్వర్యఙ్గళై ప్రకాశిప్పిక్కుమ్ తిరుముగమిఱే.

(స్మయమానముఖాంబుజః) తిరుముగత్తై కాట్టి యుపకరిత్తాన్. పీతగవాడైయై కాట్టి యుపకరిత్తాన్. వనమాలైయై క్కాట్టి యుపకరిత్తాన్. పిన్బు పిరాట్టిక్కు నిదానమాన దివ్యమఙ్గళవిగ్రహసౌన్దర్యత్తై ముఱ్ఱుఱాట్టాక అనుభవిప్పిత్తాన్.

---

న్మరసి న చక్రపరాక్రమం మురారేః" (ఓ మన్మథా! ఇక నీవు నామనస్సులో స్థితిని మానుకో. నా మనస్సు ముకుందుని పాదారవిందాలనే ధామంలో నిలచి ఉన్నది. శివుని నేత్రాగ్నితో కృశించావు. మురారియొక్క సుదర్శన చక్రపరాక్రమాన్ని గ్రహించలేకున్నావు) అని అనబడుతున్నది కదా! ఇందువల్ల తనను సేవించినవారికి అజ్ఞానాన్ని పోగొట్టి, శుద్ధసాత్త్వికత్వాన్ని కల్గించే తిరుమేనిని కలవాడని భావం. **"సా తం సమాసాద్య విశుద్ధసత్వా సుసంవృతం పార్థివలక్షణై శ్చ, అయం హి కాకుత్థ ఇతి ప్రజజ్ఞే"** (విశుద్ధమైన ప్రకృతిని కల్గిన ఆ సీతాదేవి పార్థివ లక్షణాలతో చక్కగా కూడుకొన్న అతనిని శ్రీరాముని చేరి, ఇతడు శ్రీరాముడని బాగా గ్రహించింది) అని చెప్పడుతున్నది కదా!

**(పీతాంబరధరః స్రగ్వీ సాక్షా న్మన్మథమన్మథః)-** ధరించిన పీతాంబరంయొక్క, శ్రీవైజయంతీ మాలికయొక్క సౌందర్యాలు ఒకదానితో వేఱొకటి చేరి, దివ్యమంగళవిగ్రహంలో అలలు ఎగసి పడుతున్నందున సాక్షాత్తు మన్మథునకు మన్మథుడుగా ప్రకాశించాడనికూడా చెప్పవచ్చు. అతని దివ్యమంగళవిగ్రహానికి తగిన సౌందర్యాన్ని కల్గించేవి అయిన ఆభరణాలుకదా ఇవి. **"అన్యోన్యరంజకరుచో౽నుమాన రూపా దివ్యస్రగంబరపరిష్కరణాంగరాగాః , సంస్పర్శతః పులకితా ఇవ చిన్మయత్వాత్ రంగేందుకాంతి మధికా ముపబృంహయంతి"** (పరస్పరం రంజకాలైన కాంతులపను కల్గినవి, సాటిలేని శోభను కల్గినవి అయిన వైజయంతీమాల, పీతాంబరం, దివ్యభూషణాలు, దివ్యాంగరాగాలు - ఇవి చిన్మయాలు అయనందువల్ల శ్రీరంగనాథుని స్పర్శచే రోమాంచాన్ని కల్గినట్లున్నవై, శ్రీరంగనాథుని కాంతిని అధికంగా వృద్ధిపొందిస్తున్నది.) అని పెరియభట్టర్ అనుసంధించారు.

**(స్మయమానముఖాంబుజః)-** సకలజగత్తుయొక్క ఐశ్వర్యవైభవంతో, చిఱునవ్వు నవ్వుతున్న ముఖాంబుజంతో సాక్షాత్తు మన్మథునకే మన్మథునిగా ప్రకాశించాడని భావం. శ్రుతిమయమై, మంగళాలకు నిలయమై, జగన్మోహనమై, జ్ఞానానందరూపగుణవిభూతి మహదైశ్వర్యాలను ప్రకాశింపజేసే శ్రీముఖంకదా !

**(స్మయమానముఖాంబుజః పీతాంబరధరః స్రగ్వీ సాక్షాన్మన్మథమన్మథః)** ఇవ్వొప్పనైయోడు సాక్షాన్మన్మథమన్మథనాయ్ ప్రకాశిక్కైక్కు హేతు- పిరాట్టియుడైయ నిత్యసంశ్లేషమేయిఱే. **"అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మజా"** **(రామా-ఆర-37-18)** ఎన్నుమ్, **"అకలగిల్లే నిఱైయు మెన్నలర్మేల్మఙ్గై యుఱై మార్బా ! నికరిల్ పుగழாయ్ ! యులకుమ్ మూన్నుడైయాయ్ !4" (తిరువాయ్- 6-10-10)** ఎన్నుమ్ శొల్లానిన్ఱదిఱే. ఆగ, ఇన్ద శ్లోకత్తాలే, తన్నుడైయ తిరువడిగళిడత్తిల్ కైంకర్యాభినివేశత్తాలే తన్నే శరణ మడైన్ద ఆశ్రితర్క్కు, పిరాట్టియుడైయ నిత్యసంశ్లేషిత్తాలే ప్రకాశిక్కిఱ దివ్యమఙ్గళవిగ్రహత్తై కాట్టి, కైఙ్కర్యఙ్గళై ప్రసాదిత్తా నెన్నపడి. ఇదు ద్వయోత్తరవాక్యతాత్పర్య మిఱే.

ఇరుపత్తొన్ఱామ్ శ్లోకమ్ ముఱ్ఱిఱ్ఱు

అస్మద్గురుభ్యో నమః



---

**(స్మయమానముఖాంబుజః)**- తిరుముఖాన్ని చూపి ఉపకరించాడు. పీతాంబరాన్ని చూపి ఉపకరించాడు. వనమాలను చూపి ఉపకరించాడు. తర్వాత, లక్ష్మికి నిదానం అయిన దివ్యమంగళవిగ్రహంయొక్క సౌందర్యాన్ని పూర్ణభోజనంగా అనుభవింపజేశాడు.

**(స్మయమానముఖాంబుజః పీతాంబరధరః స్రగ్వీ సాక్షాన్మన్మథమన్మథః)**- ఈ అలంకారంతో సాక్షాన్మన్మథ వంచడానికి హేతువు - లక్ష్మియొక్క నిత్యసంబంధమేకదా! **"అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మజా"** (ఆ సీతాదేవి ఎవరికి చెందినదో ఆ శ్రీరాముని తేజసుస పరిమితి లేనిది) అని,**"అకలకిల్లేన్ ఇఱైయు మెన్ను అలర్మేల్మఙ్గై యుఱై మార్బా! నిగరిల్ పుకழாయులకమ్ మూన్నుడైయాయ్ !"** (ఒక క్షణం అయినా విశ్లేషించలేనని నిత్యనివాసం చేసే లక్ష్మీదేవిని వక్షస్థలంలో కలవాడా! సాటిలేని వాత్సల్య గుణాన్ని కలవాడా! ముల్లోకాలను కలవాడా!) అని చెప్పబడుతున్నదికదా! కాబట్టి, ఈశ్లోకంలో తన శ్రీపాదాల విషయంలోని కైంకర్యాభినివేశంలో తనను శరణు పొందిన ఆశ్రితులకు పిరాట్టియొక్క నిత్యసంశ్లేషంతో ప్రకాశించే తన దివ్యమంగళవిగ్రహాన్ని చూపి, కైంకర్యాలను ప్రసాదించాడని భావం. ఇది ద్వయంలోని ఉత్తరవాక్యంయొక్క తాత్పర్యం కదా!

ఇరవై ఒకటవ శ్లోకం ముగిసింది.

అస్మద్గురుభ్యో నమః

